# తొలిపలుకు

ప్రపంచమున మహోన్నత దశయందుండి పాడుపడిన పట్టణము లసంఖ్యాకములు. కాని, యందుఁ గొన్ని పౌరాణికముగను, మఱికొన్ని చారిత్రకముగను ప్రసిద్ధికెక్కినవి. విజయనగర మట్లుగాక, రెండింటను బేరు గాంచినది.

అనతి కాలమున దిగంతవిశ్రాంత కీర్తి నార్జించి పాడుపడిన విజయనగర పట్టణ శిథిలములను జూచు వేడ్కతో నే నొక పరి యటకేఁగి, యందలి శిథిలములను గాంచి, యాశిల్పకళానైపుణ్యమున కబ్బురపడితిని. అది మొదలా సామ్రాజ్య చరిత్రాంశములను నాయోపినకొలఁది సంతరించి గ్రంథస్థమొనర్పఁదలంపుగొంటిని. ఆమీఁద నా సామ్రాజ్యమును గూర్చి లభ్యమైన యాంగ్లాంధ్ర గ్రంథములను జదివి, వలయు సామగ్రిని సంతరించితిని. అట్లు సంతరించిన సామగ్రితో విజయనగర సామ్రాజ్య సమగ్ర చరిత్ర రచన కుపక్రమించితిని. అది కొంతవఱకు సాగిన పిమ్మట 'హంపి'కిఁ బోయి యచ్చట మన్మిత్రులగు శ్రీ జానపాటి - సీతారామశాస్త్రులవారితో నే రచించు గ్రంథమును గూర్చియు, దాని ముద్రణమును గూర్చియుఁ బ్రస్తావించితిని. అందులకు వారెంతయు హృష్టులై, విజయనగర సామ్రాజ్యమునకు మూలకందమైన యానెగొంది ప్రభువులైన యార్వీటి వంశజులగు శ్రీమంత్ 'దర్బార్' శ్రీకృష్ణదేవరాయలవారి సన్నిధికి నన్నుఁ దోడ్కొనిపోయి, వారికి మన్మనోభీష్ట మెఱిఁగించిరి. శ్రీమంతులవారు నా ప్రయత్నమునకు సంతసించి, గ్రంథ ముద్రణమున కగు ద్రవ్య మొసఁగ వాగ్దాన మొనర్చిరి. అంత గ్రంథ రచనము తీవ్రముగ సాగించి ముగించితిని.

ఈ గ్రంథ రచనకు నాకుఁ దోడ్పడిన గ్రంథము లెన్నియేని కలవు. తత్కృతికర్తల ఋణము ధన్యవాదములతోఁ దీర్చికొందును. నా కుపకరించిన గ్రంథ నామములను స్థలాంతరమునఁ బ్రకటించుటయేకాక, యధోసూచికలందు సహితము పేర్కొని నా కృతజ్ఞతను దెలిపికొంటిని. వానిలో నాంగ్లమున రచింపఁబడిన సూయల్ దొరవారి 'విస్మృత సామ్రాజ్యము'ను, హీరాస్ పండితుని 'అర్వీటివంశావళి'యు, ఆంధ్రమున వ్రాయఁబడిన యీశ్వర దత్తుగారి 'జీర్ణ విజయనగర చరిత్రము', రామారావుగారి 'కాకతీయుల చరిత్రము', వీరభద్రరావుగారి 'జీర్ణ కర్ణాటరాజ్య చరిత్రము,' వేంకట లక్ష్మణరావుగారి 'మహమ్మదీయ మహాయుగము'ను నా కత్యంతము తోడ్పడినవి. వారికిఁ గృతజ్ఞుఁడను. ఆనెగొందిరాజుల వృత్తాం

తము సేకరించుటయందు 'నరపతి విజయము'ను, శ్రీమంతులవారొస
పత్రములును నా కొనర్చిన సహాయ మనల్పము. శ్రీకృష్ణదేవరాయ
కళంకములను దొలఁగించు వ్రాఁతలయందు శ్రీ రాజా దాట్ల వేంకట సిం
రాజుగారు చేసిన సాయము చిరస్మరణీయము.

శ్రీ శివాజీమహారాజు తిరుమలరాజునకుఁ బ్రసాదించిన యానె
ప్రదేశములను సూచించు రజత ఫలకముయొక్క ఛాయాచిత్రమ
యానెగొంది సంస్థానాధీశ్వరులకును నా నమస్కృతులు.

నా యీ గ్రంథమును సమగ్రముగఁ దిలకించి, విమర్శించి, ఁ
పీఠిక వ్రాసి యిచ్చిన డాక్టరు మారేమండ - రామారావు, ఎం. ఏ
డి., బి. ఇడి. గారికిని, న న్నీ పొత్తము వ్రాయఁ బ్రోత్సహించిన వ
అభివందనములు.

ప్రప్రథమమున నీ గ్రంథము 1941-వ వత్సరమున శ్రీ దరా
రాయలవారి ద్రవ్య సాహాయ్యముచే ముద్రింపఁబడి, యనతికాలమున నే
మాయెను. ద్రవ్యాభావముచే ద్వితీయముద్రణమునకుఁ బూననైతిని.
కర్నూలునందలి శ్రీ బాలసరస్వతీ బుక్ డిపో యజమా
బాలనాగయ్య శ్రేష్ఠిగా రీ పునర్ముద్రణమునకు స
అంతట నే నీ గ్రంథము చివర భాగమునఁ గొలఁది మార్పులు చేసి స
అతో వారికొసంగితిని.

—గ్రం

# BIBLIOGRAPHY

## ENGLISH

### A. HISTORIES AND CHRONICLES

A Forgotten Empire (Vijayanagara). A contribution to the History of India. By Robert Sewell, Madras Civil Service (Retired) M. R. A. S., F. R. C. S.

The Aravidu Dynasty of Vijayanagara, By Rev. Henry Heras. S. J., M. A., Prof. of Indian History, St. Xavier's College, Bombay.

A History of Vijayanagara, the never to be forgotten empire. By B. Suryanarayana Rao, B. A., M. R. A. S.

Social and Political life in the Vijayanagara Empire, Vol. I, By Dr. B. A. Saletore, M.A., Ph. D.

Vijayanagara, Origin of the City and the Empire. By Dr. N. Venkata Ramanaiah, M. A., Ph. D.

Beginnings of Vijayanagara. By Rev. Henry Heras, S. J., M. A.

Sources of Vijayanagar History, Selected and Edited for the University, By Dr. S. Krishnaswami Aiyangar, M. A., Ph. D.

A Little Known Chapter of Vijayanagar History, By Dr. S. Krishnaswami Aiyangar, M. A., Ph. D.

The yet-remembered Ruler of a Long-forgotten Empire, Krishna Deva Raya of Vijayanagar. By S. Krishnaswami Aiyangar, M. A., M. R. A. S., F. R. Hist. S. (Madras); 1917

Hampi Ruins Described and Illustrated. By A. H. Longhurst, Calcutta, 1925

The Oxford History of India from the Earliest Times to the end of 1911, by Vincent A. Smith, C. I. E.

History of the Rise of the Mahomedan Power in India, till the year A. D. 1612, Translated from the original Persian of Mohamed Kasim Ferishta. By John Briggs, M. R. A. S.

Historical Sketches of South India. Vol. I. By Wilks.

History of India as told by Her own Historians. Vol. III. By Elliott & Dowson.

Some Contributions of South India to Indian Culture, by Dr. S. Krishnaswami Aiyangar, M.A., Ph. D., Calcutta, 1923.

The Wars of the Rajas. By Brown.

South India and her Muhammadan Invaders. By Dr. S. Krishnaswami Aiyangar, M. A., Ph. D., Oxford, 1921

A History of the Naik Kingdom of Madura, by V. Rangachari, M. A.

The Karnataka Country and Language. By R. Narasimhachari, M. A., M. R. A. S.

The Mackenzie Collection. A Descriptive Catalogue of the Oriental Manuscripts, and other articles illustratives of the Literature, History, Statistics and Antiquities of the South of India, collected by the late H. H. Wilson, Esq.

The Destruction of Vijayanagar, by K. Chandorkar.

Sankaracharya, the great and His Successors in Kanchi. By N. Venkata Raman.

Reports on Sanscrit manuscripts in Southern India, By E. Hultzchs, Ph. D. (3 Vols.) Madras; 1895-1896

Chronicle of Tirumala Deva Raju. Supplied by the Narapati Samstanam.

## B. INSCRIPTIONS

A Collection of the Inscriptions on Copper-plates and stones in the Nellore District, made by Alan Butterworth, of the Indian Civil Service (Madras).

Copper-plate Inscriptions belonging to the Sri Sankara charya of the Kama - Koti - Pitha. Edited by T. A. Gopinatha Rao, M.A., Superintendent of Archaeology, Travancore State, Madras.

Archaeological Survey of India. New Imperial Series, Vol. XXIX. South Indian Inscriptions (4 Vols.) Edited and Translated by E. Hultzsch, Ph. D., V. Venkayya, M. A. and H. Krishna Sastry, B.A., Madras, 1890-1924

Monumental Remains of the Dutch East India Company in the Presidency of Madras. By Alexer Rea. Madras. 1897

Mysore Archaeological Series. Epigraphia Carnatica. By B. Lewis Rice, C. I. E., M. R. A. S. (12 Vols.) Bangalore, 1898-1905.

Lists of Antiquarian Remains in the Presidency of Madras. Compiled under the orders of Government by Robert Sewell (2 Vols.), Madras, 1882-1884

## C. ARTICLES

T. A. Gopinatha Rao and Rao Sahib T. Raghavaiah, Krishnapuram Plates of Sadasiva Raya (Ep. Ind., IX, Pages 328-341)

C. K. Krishnamacharlu, The Penuguluru Grant of Tirumala I. Saka 1493 (Ep. Ind., XVI, Pages 241-263)

## D. GAZETTEERS AND MAGAZINES

DISTRICT GAZETTEERS :

Cuddapah - Brackenbury, I. C. S. Madras, 1915

Anantapur - W. Francis, I. C. S. Madras, 1905

Bellary - W. Francis, I. C. S. Madras, 1904

Mysore Gazetteer, Vol. I. By B. Lewis Rice, C. I. E., M. R. A. S.

Madras Christian College Magazines - December 1886 January 1930

# TELUGU

## 1. చరిత్రములు

హిందూదేశ కథాసంగ్రహము - మహమ్మదీయ మహాయుగము—కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, ఎం. ఏ.

జీర్ణకర్ణాటరాజ్య చరిత్రము—చిలుకూరి వీరభద్రరావు.

ఆంధ్రుల చరిత్రము - తృతీయ భాగము—చిలుకూరి వీరభద్రరావు.

జీర్ణ విజయనగర చరిత్రము—కుందూరు ఈశ్వరదత్తు, బి.ఏ.

విద్యానగర చరిత్రము—సాహిత్య సరస్వతి, సీరిపి ఆంజనేయులు.

కాకతీయుల చరిత్రము — డాక్టర్ యం. రామారావు, ఎం. ఏ., పి-హెచ్. డి., బి. ఇడి.

శ్రీకృష్ణదేవరాయచరిత్ర — విష్ణుభట్ల సూర్యనారాయణ, బి. ఏ., బి. ఎల్.

తిమ్మరుసుమంత్రి—చిలుకూరి వీరభద్రరావు.

రాయవాచకము—

శ్రీ వేంకటపతిదేవమహారాజు - టి. శివశంకరం.

అళియరామభూపాలుఁడు - టి. శివశంకరం.

హంపీ - విజయనగరము — వారణాసి శ్రీనివాస రావు, ఎం. ఏ., (ఆనర్సు), ఎల్. టి.

## 2. ప్రబంధములు

కృష్ణరాయ విజయము—కుమారధూర్జటి.

పారిజాతాపహరణము—నంది తిమ్మయ.

ఆముక్తమాల్యద—శ్రీకృష్ణదేవరాయలు.

వసుచరిత్రము—రామరాజభూషణుఁడు.

మనుచరిత్రము—అల్లసాని పెద్దనామాత్యుఁడు.

రామరాజీయము (నరపతి విజయము) - వెంకయ్య.

చంపూరామాయణము-పీఠిక-జయంతి రామయ్యపంతులు, బి. ఏ., బి. యల్.

జైమిని భారతము—పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు.

## పీఠిక

ఆంధ్రదేశచరిత్రమునందు విజయనగర సామ్రాజ్య చరిత్ర మొక ముఖ్యవిభాగము. ఈ సామ్రాజ్యము మహోన్నత దశయం దుండినపుడు ఆంధ్రద్రవిడ దేశములును, కర్ణాటకమునందలి పెక్కు భాగములును అందు చేరియుండి యపూర్వమగు శోభనందినవి. ఆనాడీమహాసామ్రాజ్యమును, తత్కేంద్రమగు విజయనగరపట్టణమును దర్శించిన విదేశీయు లెందరో వీని శోభ నిరుపమమని కీర్తించిరి. విమతస్థుల బారినుండి స్వమతమును, స్వదేశమును రక్షించుటకై స్థాపింపబడిన యీ మహాసామ్రాజ్యము సుమారు రెండున్నర శతాబ్దములకాలము హిందూధర్మమును, హిందూ సంస్కృతిని సంరక్షించి తుదకు విమతస్థుల చేతులలోనే పడి ధ్వంసము చేయబడెను. రెండున్నర శతాబ్దులకాలము మహావైభవము ననుభవించిన యీ సామ్రాజ్య మొక్క తృటిలో కలలోని వార్త యయ్యెను. అనంతరము కడపటిరాజులగు ఆర్వీటివంశజు లితర స్థలముల నుండి వీలగునంతవరకు నధికారమును సాగించుచు పేరునకైనను దక్షిణ దేశపాలకులుగ నుండిరి. తుద కాంగ్లేయులు సహిత మీ రాజుల వద్దనుండియే (ఉత్తర హిందూస్థానమున నామమాత్రావశిష్టుడైయుండిన మొగలు చక్రవర్తివద్దనుండి 'దివానా' యధికారమును ఖాయపరచుకొనిన విధమున) వర్తకస్థానములను నిర్మించుకొనుట కధికారమును సంపాదించిరి.

అయినను నిన్న మొన్నటివరకు నీవిజయనగరసామ్రాజ్యము 'విస్మృతసామ్రాజ్యము' గనే యుండెను. ఇటీవల నెందరో పరిశోధకు లీ సామ్రాజ్యచరిత్రమును గూర్చి కృషిచేయ నారంభించిరి. తత్ఫలితముగ నీ చరిత్రమునకు సంబంధించిన శాసనవాఙ్మయాద్యా

ధారము లెన్నియో బయలుపడినవి. పండితు లెందరో అమూల్యములగు వ్యాసములను ప్రకటించియున్నారు. అయినను పైయాధారముల సాహాయ్యమున రచింపబడిన విజయనగరసామ్రాజ్యము యొక్క సమగ్రమైన చరిత్ర మింతవరకును వెలువడలేదు. పరిశోధకుల ప్రత్యేకవ్యాసములు పరిశోధకపత్రికలలో ప్రాయికముగ నాంగ్ల భాషలో ప్రకటింపబడుటచే సామాన్యపాఠకుల కవి అందుబాటులో లేవు. ఇంతవరకును ప్రకటితములైన గ్రంథములలో సూయల్, సూర్యనారాయణరావు, హీరాస్, డా. కృష్ణస్వామిఅయ్యంగారు, డా. నేలటూరి వెంకటరమణయ్య, డా. సలెతోరె ప్రభృతు లాంగ్లమున రచించినవియు, వీరభద్రరావు, ఈశ్వరదత్తు, రామయ్య ప్రభృతు లాంధ్రమున రచించినవియు విజయనగరచరిత్ర జిజ్ఞాసువులకు ముఖ్యాధారములుగ నున్నవి.

ఈ గ్రంథము పైకొరతను కొంతవరకు దీర్చుచున్నది. ఈ గ్రంథకర్త చరిత్రపరిశోధకుడుకాడు. అయినను ఉత్తమశ్రేణికిజెందిన చరిత్రజిజ్ఞాసువు. విజయనగరశిథిలములను జూచినప్పుడు గలిగిన విస్మయ మీనగరముయొక్క చరిత్రమును దెలిసికొనవలెనను కుతూహలమును గలిగింప గ్రంథకర్త తద్విషయమై చేసిన కృషి కీగ్రంథము ఫలితము. ఇందు విజయనగరపట్టణ నిర్మాణమునుండి యార్వీటి రాజులలో కడపటివారివరకునుగల వృత్తాంతమును, అటుపై వారి శాఖీయులగు ఆనెగొంది రాజుల చరిత్రమును చేర్పబడి యున్నవి. ఇట్లొకవిధమున నీ గ్రంథము సమగ్రమనియే చెప్పవచ్చును.

ఈ గ్రంథకర్త యవలంబించిన రచనాపద్ధతి మిక్కిలి ప్రశంసనీయమైనది. అభిప్రాయభేదమున కాస్పదములగు పట్ల నేదియో యొకపక్షమును బూని, తద్విషయికములగు ప్రమాణములనే పేర్కొని, యటుపై స్వకపోలకల్పనములను జేర్చి చరిత్రమును

తారుమారొనర్చుట ఇటీవల మన దేశమునందలి గ్రంథకర్తలలో కొందరి కాచారమైనది. ఈ గ్రంథకర్త అట్లుచేయక వివాదాస్పదములగు ఘట్టములు వచ్చినప్పు డుభయపక్షముల వాదమును పేర్కొని నిర్ణయమును పాఠకులకే వదలివేయుట మిక్కిలి సమంజసముగ నున్నది. ఈ గ్రంథమున విరివిగ నొసంగబడిన సూచనల నుండి యీ గ్రంథకర్త విజయనగరచరిత్రమునకు సంబంధించిన ప్రమాణగ్రంథములను కడుజాగరూకతతో పరిశీలించినట్లు స్పష్టమగుచున్నది. గ్రంథమునందలి శైలి మృదుమధురముగ నుండుటచే గ్రంథమొక నవలవలె నడచుచున్నది. అన్నివిధములను పాఠకులకీగ్రంథము మూలమున విజయనగరసామ్రాజ్యచరిత్రము సుగమమై, వారికి దానియెడ గాఢమగు నభిరుచి గలుగునట్లున్నది.

ఏవిధముగ జూచినను ఈ గ్రంథము సామాన్యపాఠకులకును, విద్యార్థులకును మిక్కిలి ఉపయోగకరముగ నున్నది. దీనిని రచించిన గ్రంథకర్త ప్రశంసనీయుడు. ఈ గ్రంథము నాంధ్రలోకము విశేషముగ నాదరించుననియు, నీ గ్రంథకర్త యింకను అనేకములగు సద్గ్రంథములను రచించి భాషాసేవ జేయుననియు నేనాశించుచున్నాను.

వృష వైశాఖ శుద్ధ ౭<br>1-5-1941<br>గుంటూరు.

మారేమండ రామారావు.

# ప్రకాశకుల మనవి

మఱతమన్నను మఱపునకురాని జీర్ణ విజయనగర సామ్రాజ్య చరిత్రను, ఆంధ్రమహాసమ్రాట్టు శ్రీకృష్ణదేవరాయలవారి రాజ్యాంగ, సాహిత్య వైభవ సంపదలను సమగ్రముగా, పొందికగా తెలుపు ప్రామాణిక గ్రంథము లేవియు ప్రస్తుతము లభ్యము కాకపోవుట శోచనీయము. ఆ కొఱతను తీర్చుటకే మే మీగ్రంథమును ప్రచురింప బూనితిమి. పనికట్టుకొని దీని సర్వస్వామ్యములను గ్రంథకర్త శ్రీ నూతలపాటి పేరరాజుగారినుండి పొందితిమి. వలసిన సవరణలు చేయించితిమి. నేటి పాఠకుల అభిరుచుల కనుగుణముగాను, విషయ గౌరవము ననుసరించియు దీనిని మంచి మెరుగుకాగితముతో, ముచ్చటైన కూర్పు తీర్పులతో అందముగా ముద్రింపగలిగితిమి. విజయ నగర సామ్రాజ్యకాలపు కళాసంపదను, శిల్పసంపదను, సంస్కృతి సంపదను తెలుపు కొన్ని చిత్రములనుకూడ జతపరచితిమి. ముద్దు లొలుకు ముఖపత్ర త్రివర్ణ చిత్రమును, అంతస్సారమునకు సూచకముగా, సమకూర్చితిమి. మా ఈ కృషిలో మేము పడియుండు వ్యయ ప్రయాసలను విషయజ్ఞులైన పాఠక మహాశయులు అవలీలగా గ్రహింప గలరనియే మా ఆశయము.

ఆంధ్రమహాజనులును, విద్యారంగములోని పెద్దలందఱును దీనిని సముచితముగా ఆదరించి ప్రోత్సహింపవలెనని మఱిమఱి కోరుచున్నాము.

# విషయసూచిక

# చిత్రములు



"ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి కేలూఁత
యొసఁగి యెక్కించుకొనియె."

శ్రీరస్తు

# విజయనగర చరిత్రము



## ప్రస్తావన

క్రీ. శ. 1336-వ సంవత్సరమున హిందూదేశ దక్షిణ భాగమున రాజకీయ వాతావరణమునందు గొప్ప మార్పు గలిగెను. ఆ సంవత్సరమే దక్షిణ హిందూదేశ ప్రాచీన చరిత్రమున కంతమును, ఆధునిక చరిత్రమునకుఁ బ్రారంభమును నగుచున్నది.

ఈ చరిత్రాత్మక విషయమువలన విజయనగర సామ్రాజ్య స్థాపనయు, రాజధానీ నగర నిర్మాణమును నొనగూడినవి. ఆ మార్పు గలుగుటకు ముందు దక్షిణ హిందూదేశమంతయుఁ బెక్కండ్రు హిందూ రాజుల యధీనమందుండెను. వారిలో - మధురను బాలించెడి పాండ్యులును, దంజాపురినిఁ బాలించెడి చోళులును ముఖ్యులు. విజయనగర రాజ్యమభివృద్ధియగు కొలఁదిని బైనుడివిన రాజ్యములు నశింపఁ దొడఁగినవి. క్రమక్రమముగ, విజయనగర రాజులు దక్కను మొదలు సింహళద్వీపమువఱకుఁగల భూమికి నధిపతులైరి.

మహమ్మదీయులు దక్షిణ హిందూదేశముపై దాడివెడలి కృష్ణానదిని దాఁటునరికి, నామమాత్రావశిష్టములై దక్షిణమున నున్న హైందవ రాజ్యములన్నియు నేకీభవించి, యడ్డుకొనఁ బ్రయత్నించినవి. కాని, నిష్ఫలమయ్యెను. అట్టి సమయమున, విజయనగర రాజులు, తురుష్క వాహినుల నడ్డగించి, రెండువందల యేఁబది వత్సరములవఱకును దక్షిణాపథమును గాపాడిరి.

అంతటి మహోపకార మొనర్చిన రాజ్యమును నేఁడు హిందూ దేశమునఁ దలఁచువారే లేరు. 'విజయనగర' మను నామముఁ దాల్చి, మహోన్నత దశయందుండిన పట్టణ రాజమున నేఁటికి మిఁగిలి యున్నవి – కొన్ని శిథిలములును, బడిపోయిన కోట గోడలును.

పదునైదు, పదునాఱు శతాబ్దములయందు హిందూ దేశమును దర్శించిన పాశ్చాత్యపథికులు విస్తీర్ణమందును, సంపదయందును విజయనగరముతోఁ దులఁదూఁగఁగల పట్టణమొక్కటియుఁ బాశ్చాత్య దేశముల లేదని వక్కాణించిరి. విజయనగర వైభవము క్రీ. శ. 1565 తో నంతరించినది.

# ఆనెగొంది: రాయల వంశము

విజయనగర సామ్రాజ్యమునకు మూలకందమైన యానెగొంది యనేక శతాబ్దములనుండి యొక రాజాశ్రయ స్థానమై యొప్పుచుండెనని పారసీక దేశస్థుడగు ఫెరిస్తా తెలుపుచున్నాడు. ఆ రాజులచ్చట నేడువందల సంవత్సరములవఱకు రాజ్యము చేసిరట. రాయవంశావళియను గ్రంథమును జూడ, రాయల వంశ వృక్ష మీ క్రిందివిధముగ వెలయుచున్నది.




నందుడు—రాయల వంశమున కీతడు మూలపురుషుడు. క్రీ. శ. 1014 మొదలు 1076 వఱకు నలువదిమూడు వత్సరములు రాజ్యము చేసెను. రాజ్యాభివృద్ధికై పాటుపడెను. అపరిమిత ధనమార్జించెను.

---

* మహమ్మదీయ మహా యుగము, పుట, 294.
విద్యానగర చరిత్రము, పుటలు, 10, 11, 12.

చాళుక్యుఁడు—ఈతఁడు నందుని కుమారుఁడు. 1076 మొదలు 1117 వఱకు నలువదియొక్క వత్సరములు రాజ్యముచేసెను. ఈతనికి బిజ్జలుఁడు, విజయధ్వజుఁడు, విష్ణువర్ధనుఁడు నను ముగ్గురు కొడుకులు గలరు.

బిజ్జలుఁడు—ఈతఁడు చాళుక్యుని జ్యేష్ఠపుత్త్రుఁడు. 'కల్యాణబిజ్జలుఁ' డను బిరుదునంది, కల్యాణపురమును బాలించెను.

విజయధ్వజుఁడు—ఈతఁడు చాళుక్యుని ద్వితీయపుత్త్రుఁడు. 1117 మొదలు 1156 వఱకు ముప్పది తొమ్మిది వత్సరములు రాజ్యముచేసెను. ఈతని కాలమునఁ జంద్రధ్వజుల (మహమ్మదీయుల) రాపిడి యెక్కువగా నుండెను. స్వరాజ్య రక్షణార్థమై యీతఁడు తుంగభద్రానదికి దక్షిణ భాగమున నొక నగరమును నిర్మించి, దానికిఁ దనపేర [1] 'విజయనగరం' మని పేరుపెట్టె నందురు. ఈ నగర నిర్మాణము క్రీ. శ. 1150 ప్రాంతమున నై యుండనోపు.

విష్ణువర్ధనుఁడు—ఈతఁడు చాళుక్యుని తృతీయ పుత్త్రుఁడు. ఈతనిఁ గూర్చి రాయవంశావళియం దేమియుఁ జెప్పఁబడియుండలేదు.

అనమరాజు—ఈతఁడు విజయధ్వజుని కొడుకు. 1156 మొదలు 1179 [2] వఱకు నిరువది మూఁడు వత్సరములు రాజ్యమేలెను.

నరసింహదేవరాయఁడు—ఈతఁడు అనమరాజు కొడుకు. 1179 మొదలు 1246 వఱకు నలువదియేడు వత్సరములు రాజ్యము చేసెను. మిగులఁ బరాక్రమశాలి. క్షత్త్రియోచితమైన రాజ్య కాంక్ష గలిగి, రాష్ట్రమును విస్తరింపఁ జేసెను.

---

1. The Never to be Forgotten Empire, Page 15.
"Raya Vamsavali" ascribes the founding of Vizianagar to Vijayadhwaja, the second son of Chalukya Maharaja who ruled in Kiskindha.".

2. 1176 వరకనని యున్నది. చూ. ఆంధ్రుల చరిత్రము, మూ. భా. పు. 9

ఈతఁ డరిభీకరుఁడైన కారణమున నీతని రాజ్యమునకు 'నర సింగ రాష్ట్ర' మని పేరు గలిగెను. మహా వైభవముతో వెలయుచుండిన యీతని రాజ్యమును గబళింప మహమ్మ దీయులు ప్రయత్నించిరి.

రామదేవరాయఁడు—ఈతఁడు నరసింహదేవరాయని తనయుఁడు. 1246 మొదలు 1271 వఱకు నిరువదియైదు వత్సరములు పాలించెను.

ప్రతాపరాయఁడు—ఈతఁడు రామదేవరాయని పుత్త్రుఁడు. 1271 మొదలు 1297 వఱకు నిరువది యాఱేఁడులు పాలించెను.

జంబుకేశ్వరుఁడు—ఈతఁడు ప్రతాపదేవరాయల తనూజుఁడు. ఆనెగొంది రాజులలో నీతఁడు కడపటి వాఁడు. 1297 మొదలు 1334 వఱకు ముప్పది యేడు వత్సరములు రాజ్యమేలెను. ఈతనిఁ గూర్చి సమగ్రముగఁ దెలిసికొనుటకు ముందు - పదు మూఁడు, పదునాల్గు శతాబ్దముల మధ్య దినములలో దక్షిణ హిందూస్థానమునందలి పరిస్థితు లెట్లుండెనో తెలిసికొనవలసి యున్నది.

## పదునాల్గవ శతాబ్దారంభమున దక్షిణ హిందూస్థానమునందలి పరిస్థితులు

"పదుమూఁడవ శతాబ్దాంతమున నార్యావర్తమంతయుఁ గ్రమక్రమముగా మహమ్మదీయుల పాలంబడుటచే హిందూ సామ్రాజ్య రమారమణీమణి చంద్రధ్వజుల యాశ్రయము నొల్లక, నిలువ నీడలేక, చిట్టచివరకు నర్మదా నదిని దాఁటివచ్చి, శూరా గ్రేసరులగు దక్షిణ హిందూస్థానమందున్న పరిపాలకుల నాశ్రయించెను. వీరు మాత్రము తమ శౌర్య ప్రతాపములచే మహమ్మదీయుల నెవ్విధముననైనను దక్షిణా పథమునకు రానీకుండ నడ్డుపెట్టుచు వచ్చిరి.

'ఆ కాలమున దక్షిణ హిందూస్థానమున హరిపాలదేవుఁడను వాఁడు దేవగిరి పట్టణమును రాజధానిగఁ జేసికొని మహారాష్ట్రమును బాలించుచుండెను. ఏకశిలానగరమను నామాంతరముగల యోరుగల్లు పట్టణము రాజధానిగఁ బ్రతాపరుద్రదేవ చక్రవర్తి త్రిలింగ దేశము నేలుచుండెను. పాండ్యరాజులు దక్షిణ మధురాపురమును, చోళరాజులు కాంచి నగరమును, భల్లాణ రాజులు ద్వారసముద్రము రాజధానిగా హొయిసల దేశము(Mysore)ను బాలించుచుండిరి. తూర్పు తీరమున గజపతులును, రాజమహేంద్రవరము, కొండపల్లె, వినుకొండ, కొండవీడు, ఉదయగిరి మొదలుగాఁగల దుర్గములను రెడ్డి రాజులును బరిపాలించుచుండిరి.

'దక్షిణాపథమునకుఁ బాటివచ్చి, హిందూ రాజుల భుజాస్కంధముల నాశ్రయించిన రాజ్యలక్ష్మి చంద్రధ్వజుల దృష్టి నాకర్షించి, వారికి మోహావిభ్రాంతి జనకమై వెలయుచుండెను.

'ఆ కారణముచేఁ బదుమూఁడవ శతాబ్దాంతమునఁ జే మహమ్మదీయులు దక్షిణ దిగ్భాగమునకు రాఁజొచ్చిరి. క్రీ. శ. 1293 సంవత్సరమునందు 'అల్లాయుద్దీన్ ఖిల్జీ' దేవగిరినిఁ బట్టుకొనెను.[1] నాల్గు సంవత్సరములకుఁ బిదప, ఘూర్జర దేశముపై దండెత్తఁబడెను. క్రీ. శ. 1303 సంవత్సరమున నోరుగల్లు పురమును స్వాధీనము చేసికొనుటకుఁ బ్రయత్నము గావింపఁబడెను.[2] క్రీ. శ. 1306 సంవత్సరములో దేవగిరి రెండవసారి ముట్టడింపఁబడెను.[3] క్రీ. శ. 1309 సంవత్సరములో 'మల్లిక్ ఖాఫర్' భూరి సైన్యములతో వచ్చి, యోరుగల్లు పురమును బట్టుకొనెను.[4] అతఁడే ద్వారసముద్రమును గూడ స్వాధీనముఁ జేసికొని, భల్లాణ రాజులఁ బరాజితులఁ జేసి, పశ్చిమ

1. Forgotten Empire, Page 4
2. " " " 4
3. " " " 4
4. " " " 4

తీరమునందలి కేరళ దేశమునకుం బోయి, యచ్చట నొక మహమ్మ దీయ దేవాగారమును నిర్మించి,[1] హైందవుల యైశ్వర్యమునంతయుం జూఱంగొని, స్వదేశమునకు మరలిపోయెను. ఆఱు సంవత్సరములకుం బిదప, 'ముబారక్' అనునతఁడు దేవగిరిపై దండెత్తిపోయి, హరిపాల దేవునిం జెఱంబెట్టి, బ్రతికియుండఁగనే చర్మ మొలిపించి, శిరస్సు ఖండించి, దానిని దేవగిరి పట్టణ ముఖద్వారమునకు వ్రేలాడఁగట్టిం చెను.[2] తరువాత, క్రీ. శ. 1323 సంవత్సరమున నోరుగల్లు మహ మ్మదీయుల వశమయ్యెను.[3] అనఁగా – క్రీ. శ. 1323 సంవత్సరాం తమునకు దేవగిరి రాజధానిగాఁగల మహారాష్ట్ర సామ్రాజ్యమును, త్రిలింగ దేశమునందు ఏకశిలా నగరము రాజధానిగాఁగల ఆంధ్ర సామ్రాజ్యమును భగ్నములైనవి. హొయిసల రాజ్యము బల హీనమై మహమ్మదీయుల యొత్తిడికిం బాల్పడియెను. క్రీ. శ. 1327 సంవత్సరమున హొయిసల రాజ్య రాజధానియైన ద్వారసముద్రము ధ్వంసము గావింపఁబడెను.[4] ద్వార సముద్రము నేలుచుండిన మూఁడవ భల్లాలదేవుఁడు మహమ్మదీయుల ప్రతాపాగ్నికిం దాళం జాలక, క్రీ. శ. 1342 సంవత్సర ప్రాంతమునం దన రాజధానిని దక్షిణ ఆర్కాడు జిల్లాలోని తిరువన్నామలకు మార్చుకొనెను.[5] ఇతఁడు క్రీ. శ. 1343 వఱకు హొయిసల రాజ్యమును బాలించినట్లు తెలియుచున్నది.

'ఇట్లు మహమ్మదీయ విజృంభణమునకుం దాళలేక, హిందూ రాజ్యలక్ష్మి భయార్తయై, యార్యావర్తమునుండి పాఱివచ్చినను దనకుం బాట్లు తప్పలేదని యెంచి, తలదాఁచుకొనుటకుఁ జోటులేక, దక్షిణ త్రిలింగ కర్ణాట భూతలమునందుఁ దన మాన ప్రాణరక్ష ణార్థము పరువులిడుచుండెను.

1. Forgotten Empire, Page 4
2. ,, ,, ,, 4
3. ,, ,, ,, 4
4. Bombay Gazetteer, Vol. 1, Part II, P. 509-510.
5. Mysore Gazetteer, Vol. 1, P. 342.

'ఆంధ్ర సామ్రాజ్య మస్తమించిన పిమ్మట, ప్రతాపరుద్రుని కోశాగార రక్షకులగు 'హరియప్ప', 'బుక్కప్ప' అను సోదర శిఖామణులు తుంగభద్రాస్రవంతికి నుత్తర భాగమున నున్న యానెగొంది (కుంజరకోన) పురాధీశ్వరుఁడగు జంబుకేశ్వరరాయల నాశ్రయించి, యతనియొద్ద మంత్రిత్వమును సంపాదించుకొనుట సంభవించెను.

'ఆ కాలమున దక్షిణ హిందూ దేశమునకు రాజప్రతినిధిగా నియమింపఁబడిన 'బహాఉద్దీన్' అనువాడు చక్రవర్తిని (మొగలు) ధిక్కరించి, స్వతంత్రుఁడై పరిపాలనము చేయుచుండెను. అంత మొగలు చక్రవర్తియగు మహమ్మద్ తుఘ్లక్ కోపోద్దీపితుఁడై ఘూర్జర దేశపు రాజప్రతినిధియైన 'ఖాజాజెహా' అనువానిని 'బహాఉద్దీను'ను శిక్షించుటకుఁ బంపఁగా, 'బహాఉద్దీన్' చక్రవర్తి సైన్యములను గెలువలేక, పాఱివచ్చి, దురదృష్టవంతుఁడగు జంబుకేశ్వరరాయల శరణు వేఁడెను. జంబుకేశ్వరరాయ లతనికి నభయ హస్తమిచ్చెను. ఆ సమాచారము విని మొగలు చక్రవర్తి యసంఖ్యాకములగు సైన్యములంగూర్చుకొని జంబుకేశ్వరరాయలపై క్రీ. శ. 1334 సంవత్సరమున దండయాత్ర వెడలివచ్చెను.[1] అంత వీరిద్దఱకును ఆనెగొందికి సమీపమున నున్న కంపిలా నగరము (Kampli) దగ్గఱ ఘోర యుద్ధము జరిగెను. జంబుకేశ్వరరాయలు మృతుఁడయ్యెను. ఆనెగొందియుఁ దురుష్కుల వశమయ్యెను. హరియప్పయు, బుక్కప్పయుఁ దురుష్కుల వశమైరి. ఢిల్లీ చక్రవర్తి యానెగొందిని వశముచేసికొని 'మల్లిక్ సాయబు' అనువానిని బ్రతినిధిగ నేర్పఱచి, స్వదేశమునకు వెడలిపోయెను. కాని, వెంటనే ప్రజలు తిరుగఁబడుటయు, 'మల్లిక్ సాయబు'నకు స్వాతంత్ర్య ప్రియులగు ప్రజలను బరిపాలించుటకు శక్యముకాకపోవుటయుఁజూచి, ఢిల్లీచక్రవర్తి, కారా

1 ఆంధ్రుల చరిత్రము, మూ, భా. పు. 10.

గారమునందుంచఁబడిన సోదరశిఖామణుల నిరువుర వదలి, హరి హరున కారాజ్య మొసంగి, యతనిని దనకు సామంతుఁడుగ నుండున ట్లొప్పించుకొని, 'మల్లిక్ సాయబు'ను స్వదేశమునకు రప్పించుకొనె నఁట.''[1] అని కుందూరు ఈశ్వరదత్తుగారు తమ 'జీర్ణ విజయ నగర చరిత్రము'నందు వ్రాసియున్నారు. ఆ విషయములనే నేనిటఁ బొందు పఱచితిని.

నాఁటి దక్షిణ హిందూస్థాన పరిస్థితులివి.

విద్యానగరము : నగరనిర్మాణావసరము

ఢిల్లీ చక్రవర్తి బందీకృతులై యున్న హరిహరరాయని, బుక్కరాయని విముక్తులనొనర్చి, హరిహరుని నానెగొంది రాజ్య మున నిల్పెనని వ్రాసియుంటిని. నాఁటినుండియు హరిహరుఁడు రాజు గను, బుక్కరాయఁడు మంత్రిగను నుండిరి.

ఆసమయమున సామ్రాజ్యాధిపత్యమునకై యుత్తర హిందూ స్థానమున సర్దారులు మున్నగువారిలోఁ గలఁతలు బయలుదేఱెను. అది కారణముగ సైనికులు పట్టణములపైఁబడి, జనులను బాధిం చుచు, వారి ధన మానములను జూఱఁగొనుచుండిరి. ప్రజ లాబాధల కోర్వఁజాలక, గ్రామములను వీడి పలాయనమగుచుండిరి. అట్లు పలాయితులయిన జనుల కానెగొంది యాశ్రయమయ్యెను. జన బాహుళ్యము వలన నది క్రమ క్రమముగా వృద్ధియయ్యెను. దాన నూతన నగర నిర్మాణావసర మేర్పడెను.

విద్యానగర రాజ్యోత్పత్తి

'ఈ విషయమును గూర్చి చర్చించునెడ మూఁడు విశేష ములు ముఖ్యముగ గమనింపఁదగియున్నవి. కొన్ని ప్రమాణముల

1. జీర్ణ విజయనగరచరిత్రము, పు. 2-7.

నుండి తద్రాజ్య స్థాపకు లాంధ్రదేశమునుండి వలసపోయిరనియు, నాంధ్ర రాజ్యమునే వారలు తుంగభద్రా తీరమున నెలకొల్పిరనియుఁ, దుదకు వారలు గాకతీయులకు సన్నిహితబంధువులనియుఁ దెలియుచున్నది. దీని నాంధ్రోత్పత్తి వాదమని పిలువ వచ్చును. దక్షిణ దేశపుఁ బరిశోధకబంశితు లీ వాదమునకుఁగల ప్రమాణములను విశ్వసింపక, విజయనగర నిర్మాతలనఁబడు సోదరులు హొయసలరాజసామంతులనియు, హొయసల బల్లాలుని చేతనే విజయనగరము నిర్మింపఁబడెననియుఁ బేర్కొనుచున్నారు. దీనిని హొయసలోత్పత్తి వాదమని చెప్పనగును. ఇటులుండఁ గర్ణాటక పండితులు కంపిల రాజ్యము తురుష్కుల వశమయిన పిమ్మట, హతశేషులగు నిర్వురు సోదరులు తురుష్క సామంతులుగనుండి, క్రమముగ స్వతంత్రించి, విజయనగరమును నెలకొల్పిరని వాదించుచున్నారు. ఇయ్యది కర్ణాటకోత్పత్తి వాదమని పేర్కొనఁదగును. ఈ వాదములందలి వాస్తవము నెఱుంగుటకు వీని నించుక సవిమర్శముగఁ బరిశీలింపవలసియున్నది.

హొయసలోత్పత్తి

'డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు, లూయీ రైస్, కృష్ణశాస్త్రి మున్నగు పండితులు క్రీ. శ. 1327 లో, తురుష్కులు ద్వారసముద్రమును వశపఱచుకొనిన పిమ్మట, హొయసల రాజగు మూఁడవ బల్లాలుఁడు తన రాజధానిని దక్షిణ దేశమునందలి తిరువణ్ణామలై దుర్గమునకు మార్చుకొని, తన యుత్తరపు సరిహద్దును రక్షించుటకునై తుంగభద్రా తీరమున విజయనగరమును నెలకొలిపి, హరిహరుఁడను సామంతునిఁ దత్పరిపాలకునిగ నియమించెనని యభిప్రాయపడియున్నారు. [1] హీరాస్ పండితుఁడీయభిప్రాయమును విపులీ

1. EP. Carn. VI, Intr. P. 21
A. S. R. 1909 - 1910 P. 160
South India and her Mahammadan Invaders, P. 171, 181 - 182

కరించి, యీ వాదమునకుఁ బ్రత్యేక వ్యక్తిత్వము నేర్పఱచెను. వారి వాదమునందలి యీ క్రింది ముఖ్యాంశములను గమనింప నగును.[1]

(1) న్యూనిజ్ అను పోర్చుగీస్ యాత్రికుని వ్రాతలనుండి మొదటఁ దురుష్కులచే బందిగఁ గొంపోఁబడి, పిమ్మట వారిచే విడువఁబడిన యొకనిచే విజయనగరము నిర్మింపఁబడెనని తెలియుచున్నది. మూఁడవబల్లాలుని విషయమున నియ్యవి వర్ణించుచున్నవి. ఈతఁడు తన పుత్త్రుఁడగు వీరవిజయ విరూపాక్షుని పేరిట 'విరూపాక్ష పట్టణ' మను నొక నగరమును దుంగభద్రా తీరమున నిర్మించెను. ఇదియే విజయనగరము; తన్నిర్మాత మూఁడవ బల్లాలుఁడు.

(2) న్యూనిజ్ పేర్కొనిన పూర్వ విజయనగరరాజుల నామముల నీ క్రింది విధముగ సమన్వయింపవలెను.

| న్యూనిజ్. | | హీరాస్. |
|---|---|---|
| దేవరావ్ | ... | మూఁడవ బల్లాలుఁడు |
| బుకారావ్ | ... | మొదటి హరిహరుఁడు |
| పురియోరి దేవరావ్ | ... | మొదటి బుక్కరాజు |
| అజారావ్ | ... | రెండవ హరిహరుఁడు |

(3) బరకూరు మున్నగు దుర్గములలో సన్నిహిత కాలముననే బల్లాలునియొక్కయు, హరిహరునియొక్కయుఁ బ్రశంస కాననగుచుండుటచేతను, హరిహరుని వంశమునను హొయసల సామంతుఁడగు దాది కేశవనాయకుని వంశమునను మల్లికార్జునాది నామములనేకులు గన్పించుచుండుటచేత నా రెండు వంశములొక్కటియే యగుట వలనను, హరిహరాదులు హొయసలులయెడ ననేక విధములఁ దమ కృతజ్ఞతను జూపుచుండుటచేతను, హరిహరుఁడు నాతని

1. Beginnings of Vijayanagar - Rev. H. Heras.

సోదరుఁడగు బుక్కరాజును హొయసల సామంతులని చెప్పనగును.

'హొయసల బల్లాలుఁడు తిరువణ్ణామలై దుర్గమునకుఁ దన రాజధానిని మార్చియుండెననుటకు సరియగు ప్రమాణములు గాన రావనియు, క్రీ. శ. 1327 నుండియు నాతఁడు పెక్కుచోటులఁ బరి భ్రమించుచు, 1330 లో నా దుర్గమునుండి వెడలి, 1341 వఱకు నచ్చటికిఁ దిరిగివచ్చి యుండలేదనియు, ద్వారసముద్రము నాతఁడు విడనాడక, 1335-41 ల నడుమ నచ్చటనే నివసించియుండెననియు శాసన ప్రమాణముపై డాక్టరు వేంకటరమణయ్యగారు నిరూపించి యున్నారు. తురుష్కుల దాడి కోర్వఁజాలక పలాయితుఁడై యుండిన బల్లాలుఁడు, క్రీ. శ. 1327 నకుఁ బిమ్మట, తురుష్క-రాజ్యమునఁ జేరియుండిన తుంగభద్రాతీరమున విజయనగరమును నిర్మించుట యసమంజసమనికూడ వారు చూపియున్నారు.[1] హీరాస్ గారనుకొనినటుల న్యూనిజ్ వ్రాఁతలు బల్లాలునికి వర్తింపవు. ఆతఁడు తురుష్కులచే బందీకృతుఁడై, సంహరింపఁబడెను. అట్టిచో నాతని విముక్తియు, రాజ్యస్థాపనము నసంభవములు. పై పండితుని రాజనామ సమన్వయము భాషా పరిణామమునకు విరుద్ధముగ నున్నది. నిర్దుష్టమగు స్యూయల్ పండితుని సమన్వయము దీని యందలి దోషమును జూపుచున్నది.

| న్యూనిజ్. | | హీరాస్. | | స్యూయల్. |
|---|---|---|---|---|
| దేవరావ్ | ... | మూఁడవ బల్లాలుఁడు | ... | మొదటి హరిహరుఁడు |
| బుకారావ్ | ... | మొదటి హరిహరుఁడు | ... | మొదటి బుక్కరాజు |
| పురియొరి దేవరావ్ | ... | మొదటి బుక్కరాజు | ... | రెండవ హరిహరుఁడు |
| అజారావ్ | ... | రెండవ హరిహరుఁడు | | |

'అనతి కాలమున నొకే స్థలమున బల్లాల హరిహరుల ప్రశంస

1. Madras Christian College Magazine, Jan. 1930.

యుండినంత మాత్రమున వారికి స్వామిసేవక న్యాయము నాపాదింపఁ దగదు. శాసనములందెచ్చట నీ విషయము తెలుపఁబడియుండలేదు. అదియునుగాక, మల్లినాథుఁడు, బుక్కరాజు మున్నగువారలు హొయసలులతోఁ బోరియుండినటుల శాసనములనుండి తెలియుచుండుటచే, హరిహరుఁడు బరకూరు మున్నగు దుర్గములయందు బల్లాలునితోఁ బోరి, వాని నాక్రమించుకొనియెనని స్పష్టమగుచున్నది. [1] కేవల నామసామ్యముపై నాధారపడు హీరాస్‌గారి వాదముకూడఁ బ్రమాదకరమే. 11, 12, 13 శతాబ్దములలో నాంధ్రదేశమునేలిన రాజవంశములలో ననేకులు రుద్ర, గణపతి, మహాదేవ, రాజేంద్ర, భీమనామాభిధులుండిరి. అంతమాత్రమునఁ గోలనిగణపతినిఁ గాకతీయగణపతిదేవ చక్రవర్తిగను, కోలని రుద్రుఁడు, నతవాటి రుద్రుఁడు, రేచెర్ల రుద్రుఁడు మున్నగువారినిఁ గాకతిరుద్రునిఁగను సమన్వయింపనగునా? ఈ యభిప్రాయములన్నియు నిటులుండ, హొయసలోత్పత్తి వాదమునకు మూలస్తంభులగు హీరాస్‌గారొక స్వల్ప ప్రమాణమును సమన్వయింపఁజాలక, తమ యుక్తివాదమును దామే ఖండించుకొనియుండిరి. కర్ణాటకమునందలి యొక శాసనమున 'దిగ్విజయానంతరము బుక్కరాజు తుంగభద్రాతీరమున విజయనగరమును నిర్మించి, యందు భవనములు, రాజమార్గములు మున్నగువానిని నెలకొల్పె' నని చెప్పఁబడియున్నది. ఈ శాసనముపై వ్యాఖ్యానముచేయుచు హీరాస్‌గారిందలి విషయములు వాస్తవములు గావనియు, నింతకుఁ బూర్వము బల్లాలుఁడు నిర్మించియుండిన నగరమున బుక్కరాజు భవనాదికముల నిర్మించి, దానినభివృద్ధి పఱచెనని యన్వయింపవలెననియు వ్రాసియున్నారు. కాని, వారింకొకచో నీ వ్రాఁతలయందలి దోషమును గ్రహించి, యీ యభిప్రాయము సరికాదనియు, బుక్కరాజే విజయ

1. Ibid.

నగరమును నిర్మించెననియుఁ దమ యభిప్రాయమును సరిచేసికొనియున్నారు. పై విమర్శనుండి హొయసలోత్పత్తి వాదమునందలి వాస్తవ ప్రామాణ్యములు స్పష్టములగుచున్నవి.

ఆంధ్రోత్పత్తి వాదము

'ఇఁక రెండవదగు దీనిని బరిశీలింపవలసియున్నది. ఈ విషయమున నీ క్రింది పండితుల యభిప్రాయములును, నితర ప్రమాణములును ముఖ్యములు.

(1) విజయనగర చరిత్రకారులగు బి. సూర్యనారాయణరావుగారు - 'ఈ సోదరులు తమ గురువగు విద్యారణ్యుని సాహాయ్యమున క్రీ. శ. 1336 లో నీ నగరమును నిర్మించి'రని వ్రాసియున్నారు. [2]

(2) 'ఈ సోదరు లేకశిలా నగరాంధ్ర రాజ్యమునుండి పలాయితులైరని చెప్పుటకుఁ బ్రబల నిదర్శనములున్న'వని వి. ఏ. స్మిత్తు పండితుని యభిప్రాయము. [3]

(3) స్యూయల్ పండితుఁడు - 'విశేష మతావేశముగల కురుబవంశీయులగు నిర్వురు సోదరులు క్రీ. శ. 1323 వఱకు నోరుగల్లునఁ గోశాగారోద్యోగులుగనుండి, తద్రాజ్య పతనానంతర మానెగొందికిఁ జేరి, యా సంస్థానముగూడఁ దురుష్కులకు వశమగుటచేఁ దామును వారికి లోనై, పిమ్మట విజయనగరమును నిర్మించి, స్థిరపడి'రని వ్రాసియున్నాఁడు. [4]

(4) క్రీ. శ. 1807 లో రామప్ప వర్మికుఁడను బ్రాహ్మణుని యొద్దనుండి తుళువ వంశీయుల చరిత్రమును సంగ్రహించిన బచ్నక్

1. Beginnings of Vijayanagara "Conclusions."
2. Never To Be Forgotten Empire, p. 24
3. Smith - Oxford History of India (1923 Edn.) P. 201
4. Sewell - Forgotten Empire, P. 23

అను నాతఁడు - 'వార లాంధ్ర వంశయులు. ఈ బ్రాహ్మణుని యొద్దఁగల 'విద్యారణ్య శిక్ష' యను గ్రంధమున హుక్క, బుక్క యను సోదరులు ప్రతాపరుద్రుని కోశాధ్యక్షులుగనుండి, పిమ్మట విజయనగరమును నిర్మించిరని చెప్పఁబడియున్న'దని విశదపఱచి యున్నాఁడు. [1]

(5) 'ఓరుగల్లునుండి పాఱివచ్చిన యిర్వురు సోదరులు తమ గురువగు విద్యారణ్యుని సాహాయ్యమున విజయనగరమును నిర్మించి' రని కల్నల్ విల్క్సు దొర యభిప్రాయము. [2]

(6) మొదటి బుక్కరాజు కోడలగు గంగాంబ తన 'మధురా విజయ' మునఁ బ్రాచీన సంస్కృత కవులఁ బ్రస్తుతించి, పిమ్మట నగస్త్య, విశ్వనాథాది ఏకశిలా నగర కవి కుంజరులను చేర్కొనియుండెను.

(7) 17-వ శతాబ్దిలో రచింపఁబడిన 'రాజకాల నిర్ణయము' నను, కేలడి బసవకృతమగు 'శివతత్త్వ రత్నాకరము' నను గూడ నీ సోదరులు ఓరుగల్లు నివాసులనియుఁ, బ్రతాపరుద్రుని కోశాధ్యక్షు లనియుఁ చేర్కొనఁబడియున్నది. [3]

(8) కాకతీయాంధ్ర సామ్రాజ్య మంతరించిన యనతి కాలముననే యాంధ్రదేశమున కేతెంచిన జియాఉద్దీన్ బారనీ యను మహమ్మదీయ చరిత్రకారుఁడు, 'సులతాను తనకుఁ బ్రతి నిధిగఁ గంపిల రాజ్యమున కంపిన సామంతుఁడు ఓరుగల్లు రాజగు కన్నానాయకునకు సమీప బంధు' వని వ్రాసియున్నాఁడు. [4]

పై వివరింపఁబడిన (6), (8) అంశములు చాల ముఖ్యము

---

1. Never To Be Forgotten Empire, P. 25
2. Wilks - Historical Sketches of South India, Vol. I, P. 13-14
3. Mackenzie Mss No. 23-1-12, శివతత్త్వరత్నాకరము 4 కల్లోలము 12 తరంగము 30-31 శ్లోకము.
4. Elliott & Dowson - History of India as told by her own Historians. Vol. III

బయినవి. మధురా విజయమునందలి కవి ప్రశంసనుండి హరిహరాదు లోరుగల్లునఁ దమ్ముండిన కాలమునఁ గాకతీయ ప్రతాపరుద్రదేవుని గీర్వాణాంధ్ర కవితాపోషణమును సవిస్తరముగఁ గాంచియుండిరి, తాము నూతనముగ నెలకొల్పిన విజయనగర రాజ్యమునం దాంధ్రగీర్వాణ భాషల కెక్కుడు ప్రోత్సాహము నొసంగియుండిరని స్పష్టపడుచున్నది. మొదటి హరిహరరాయలు నాచన సోమనాథున కొనర్చిన గౌరవ మీ యంశమునకుఁ దార్కాణము. బారనీ పేర్కొనిన కన్హానాయకుఁడు ప్రతాపరుద్ర చక్రవర్తికిఁ బిమ్మట నోరుగల్లు నేలి మహమ్మదీయులఁ బ్రతిఘటించిన కృష్ణనాయకుఁడే యని చెప్పనగును. అతఁడు ప్రతాపరుద్రుని పుత్త్రుఁడని పేర్కొనఁబడియున్నాఁడు.[1] హరిహర సోదరుల కీతనితో సమీప బాంధవ్య ముండెననినచో, వారలు కాకతీయ రాజ బంధువులని చెప్పవలసివచ్చును. ఇట్టి నిర్ణయము విజయనగర సామ్రాజ్యమాంధ్ర సామ్రాజ్యమనియు, దానితోఁ గాకతీయులకును, విశేషించి ప్రతాపరుద్ర చక్రవర్తికి నెక్కుడు సంబంధ ముండెననియుఁ జూపి, యీ ప్రకరణారంభమునం దొనర్చిన నిర్ధారణమును బలపఱుచుచున్నది.

కర్ణాటక వాదము

'ఇఁక మిగిలినది మూఁడవదియగు కర్ణాటక వాదము. ఇందలి విషయము లెవ్వియు నాంధ్రోత్పత్తి వాదమునకుఁ బ్రతికూలములుగాక, దానిని విశదీకరించుచున్నవి. ఈ వాదమునకు 'కుమారరామన చరితె', 'పరదార సోదరరామన చరితె', 'బల్లాలరాయన యుద్ధ' యను కన్నడ లిఖిత గ్రంథములును,[2] 'రాజకాలనిర్ణయ' మను సంస్కృత లిఖిత గ్రంథమును ముఖ్యాధారములు.

1. Ibid.
2. వీని ప్రశంస Q. J. M. S. Vol XX లోఁ గాంచనగును.

వీనినుండి తెలియఁదగిన ముఖ్యాంశము క్రీ. శ. 1323 లో నేకశిలా నగర సామ్రాజ్యమంతరించిన పిమ్మటను, క్రీ. శ. 1335 లో విజయ నగరము నిర్మింపఁబడుటకు పూర్వమును గల హరిహరాది సోదరుల చరిత్రము. మహమ్మదీయు లోరుగల్లు నాక్రమించిన పిమ్మట, నా సోదరులు కురుబవంశీయుఁడును, గంపిలరాజ్యపాలకుఁడు నగు రామనాథుని యాస్థానమున కేఁగిరి. వీరి తండ్రియగు సంగముఁ డా గ్రంథములలో 'అళియ సంగమ', 'భావ సంగమ' యని పిలువఁ బడుచు, రామనాథుని యల్లుఁడుగఁ గన్పడుచున్నాఁడు. ఈ సోదరు లిచ్చటఁగూడఁ గోశాధ్యక్ష పదవులనే యుండి, యోరుగల్లున నిర్వహించిన భారమునే నిర్వహించిరని 'భాండారద హుక్క', 'భాండారద బుక్క' యను వాక్యములనుండి తెలియుచున్నది.

'క్రీ. శ. 1327 లోఁ దురుష్కులు కంపిలపై దండెత్తి, రామ నాథుని సపరివారముగఁ బరిమార్చి, హతశేషులను ఢిల్లీకి బందీ లుగఁ గొనిపోయిరి. ఈ ఖైదీలలో హరిహరుఁడు, నాతని సోదరుఁ డును గూడ నుండిరి. ఈ నూతనముగ జయించిన కంపిల రాజ్య మునకు సులతా నొక తురుష్క సేనానాయకునిఁ బ్రతినిధిగ నియ మించెను. కాని, యనతికాలముననే ప్రజ లాతని నచ్చటనుండి తరిమి వైచిరి. అంతఁ జేయునది లేక, సుల్తాను కారాగారమునందుండిన పూర్వ రాజోద్యోగులగు నా సోదరుల నిర్వురను రావించి, వారిలో నొకరిని రాజుగను, మఱియొకనిని మంత్రిగ నొనర్చి, తనకు సామం తులుగఁ గంపిల రాజ్యము నేలుఁడని పంపించెను. న్యూనిజ్ అను పోర్చుగీస్ యాత్రికుని వ్రాఁతలుగూడ నిదే విషయమును దెలుపు చున్నవి. పిమ్మట, నా సోదరులు విదేశీయులగు నాతురుష్కుల నెదిర్చి, ప్రాచీన హైందవ ప్రతిభా విశేషమును బునరుద్ధరింపఁగల యొక సామ్రాజ్యమును నెలకొల్ప సంకల్పించుకొని, విద్యారణ్యుని సాహాయ్యమునఁ దుంగభద్రా నదికి దక్షిణతీరమున విజయనగర

మును నిర్మించిరి.

'పై చర్చనుండి విజయనగర సామ్రాజ్యము కర్ణాట సామ్రాజ్య మనుటయు, హొయసల బల్లాలుఁడు దానిని స్థాపించెననుటయుఁ బ్రమాదకరములనియు, నా సామ్రాజ్య మాంధ్ర వినిర్మితము, నాంధ్రాభిపోషకము నై యొప్పెననుటయు సమంజసములని స్పష్టమగుచున్నది' అని మారేమండ రామారావుగారు తమ 'కాకతీయుల చరిత్రము' నందు నిరూపించియున్నారు.* ఆ విష యములనే నేనిచటఁ బొందుపఱచితిని.

ఇప్పటికి విజయనగర నిర్మాత లాంధ్రులని తెలిసనది. నూతన నగర నిర్మాణావసరమును గూర్చి యింతకు ముందే తెలిపియుంటిని. ఇఁక, దాని నిర్మాణక్రమమును గూర్చి వివరించెదను.

విద్యానగర నిర్మాణము

హరిహరరాయ లానెగొంది సింహాసనమెక్కిన నాఁటినుం డియు నూతన నగర నిర్మాణమున కనువగుచోటునుగూర్చి యోజించు చుండెను.

హరిహరుఁ డొకనాఁడు తమ్మునితో, మృగయార్థమై తుంగభద్రానదికి దక్షిణ భాగముననున్న యరణ్యమున కేఁగెను. ఆ కాఱడవి నాసోదరు లిరువురుఁ జనుచుండ నొక్కచో నందలి కుందేళ్లు దమవెంటఁ గొంపోయిన జాగిలములను దఱిమెను. ఆ విచిత్ర సంఘటనమునకు వారెంతయు నబ్బురపడి, యట్టి యస్వాభా విక కార్యమునకు హేతు వేమైయుండునని తలపోయుచుఁ బోవు చుండ, విరూపాక్షుని సేవించి, చక్రతీర్థముకడనున్న తన యాశ్రమ మునకుఁ జనుచున్న విద్యారణ్య మునీంద్రుఁడు వారి కగపడెను. అంత, వా రయోగిని సమీపించి, భక్తితో నమస్కరించి,

* కాకతీయుల చరిత్రము, పు. 98-102

యయ్యెదంత మెఱిఁగించి, సంశయముఁ దీర్పవేఁడిరి. అందుల కమ్ముని హర్షించి, 'ఇది వీరక్షేత్రము. ఇది యొక మహానగర నిర్మాణమున కనువగుచోటు. ఇందొక పట్టణము నిర్మింపఁబడుచో, నయ్యది సకల వైభవోపేతమై, చిరకాలము వర్ధిల్లు' నని నుడివెను. † నావుడు, సోదరులు ప్రహృష్టాంతరంగులై, 'గురూత్తమా! చిరకాలమునుండి మా మనములు నూతన నగరనిర్మాణమునే కాంక్షించుచున్నవి. తన్నిర్మాణమున కనువగుచోటు దొరకమిఁ దహతహ పడుచుంటిమి. నేఁటికి మీ దయాతిరేకమున సంశయ నివృత్తులమైతిమి. ఇఁక, నగరనిర్మాణమునకుఁ గడంగవలయును. కాని, మహమ్మదీయాక్రమణమున నానెగొంది బొక్కసములు వట్టివయినవి. మా కెట్టులేనిఁ దోడ్పడి, సంకల్పసిద్ధులమగునట్లు సేయఁ బ్రార్థింతు' మనిరి. అనవుడు, మునిచంద్రుఁడు, 'నాయనలారా! నా యోపినకొలఁది సాయమొనర్తును, మీరిఁకఁ బోయి, నగరనిర్మాణ కార్యమునం దప్రమత్తులరై మెలఁగుఁ'డని యానతిచ్చి యంపెను.

ఇప్పుడు, పట్టణ నిర్మాణమునకై వలయు ధనముఁగూర్చు భారము విద్యారణ్యులపైఁ బడినది. ఆ కారణమున నాతఁడత్యంత నిష్ఠతోఁ జింతామణి మంత్రమును బెద్దకాలము జపించెను. లక్ష్మీదేవి కరుణించి, యొక్కనాఁడు——

కలువలు వెదఁజల్లు కలికి చూపులతోడ,
 ముద్దుగుల్కు మెఱుంగు మోము తోడఁ,
గుందంబు నణఁగించు మందహాసము తోడ,
 విలసిల్లు వాలారు వేణి తోడ,
మించుల నలరించు మేల్మి సొమ్ములతోడఁ,
 దమ్మి పూ లమరు హస్తముల తోడ,
శ్రీహరి కొనగోటి చెక్కునొక్కులతోడఁ,
 దళుకు మించు కడాని వలువ తోడఁ,

---

† నెల్లూరి మండల (కాపలూరి) దాన శాసనములు, ప్ర. భా. పు. 109

గాముఁ గన్నమ్మ, నలమేని సామికొమ్మ,
కమ్మ పూరెమ్మ, యపరంజి కళుకు బొమ్మ,
కలిమి ముద్దుల గుమ్మ సత్కరుణ గ్రమ్మ
నమ్మునీంద్రుని బ్రోలఁ బ్రత్యక్షమగుచు.

—కృష్ణ. ద్వి. ఆ. ప. 21.

'మునీశ్వరా! నీ భక్తికెంతయు మెచ్చితిని. నీకుఁ గావలసిన వరము వేఁడు' మనెను. విద్యారణ్యుఁ డాపలుకులకు సంతసించి, 'యార్యాణీ! నాపేర వెలయు నొక్క పురమును గావించి, యందు నీ వనిశము నిలువవలయు' నని ప్రార్థించెను. ఇందిరారమణి 'వల్లె' యని వరము ప్రసాదించి తిరోహిత యయ్యెను.

ఏమి చిత్రము! విద్యారణ్యుని యాశ్రమోపాంత భూమిని నేఁడుగడియలు * సువర్ణవృష్టి గురిసెను. అట్లు గురిసిన ధన మొక్కచో భద్రపఱచి, యమ్మునిచంద్రుఁ డా వృత్తాంతమును హరిహరునకును, నాతని సోదరునకును దెలిపెను. అగ్గురు సత్తముని యపారకరుణ కాసోదరు లెంతయు హృష్టులైరి.

సకల శాస్త్ర వేత్తయగు విద్యారణ్యుఁడు నగర నిర్మాణము నకు ముహూర్తమును శా. శ. 1258-వ ధాతృనామ సంవత్సర వైశాఖ శుక్ల సప్తమీ తిథిని పుష్యమీ నక్షత్రమున సింహలగ్న మునందు నిశ్చయించెను. ముహూర్తకాలమును జక్కఁగ గుర్తించి, జంత్రమును దయారొనర్చి, పునాది వేయవలయును. ఇది నిర్మాణ కార్యక్రమము. కాని, యంత్రనిర్మాణమును, ముహూర్త నిర్ణయ మును నొక్కరే చేయునెడలఁ గార్యభారమున ముహూర్త సమ యము తప్పవచ్చునని యెంచి, యమ్మునిచంద్రుఁ డా కార్యమును యథావిధి జరుపఁ దనకు సహాయముగ వారణాసినుండి యొక పండి తునిఁ బిలువనంపెను. ఆ కాలమున నిప్పటివలె ఘటికా యంత్ర

* మూఁడుముక్కాలు గడియలని విద్యానగర చరిత్రమున నున్నది. చూ. పు. 45

ములు లేవు. నక్షత్రగమనమునుబట్టియే కాలనిర్దేశము జరుగుచుండెను. యంత్రనిర్మాణముహూర్తము నాఁటి వఱువాత నిర్ణయింపఁబడెను. కాశీపండితుఁ డాశ్రమప్రాంతమునఁగల పర్వతము నధిరోహించి, నక్షత్రములను బరిశోధించి, నిర్ణీతముహూర్తమునకు సరిగ శంఖారావ మొనర్చునట్లును, ఆ ధ్వానము వినినంతన విద్యారణ్యుఁడు తనచేతఁ గరఁగించియుంచిన తామ్రలోహమును జంత్రపుటచ్చులోఁ బోయునట్లును నేర్పఱుపఁబడెను. నిర్ణీతకాలమాసన్నమైనది. శంఖధ్వని వినఁబడెను. మునీంద్రుఁడు కరఁగిన లోహము నచ్చులోఁబోసెను. అత్యల్పకాలముననే వేఱొక శంఖారావము వినిపించెను. ఆ సడి వినిపించుటయె తడవుగాఁ గాశీపండితుఁడు విద్యారణ్యుని కడకు వచ్చెను. రెండవతూరి వినఁబడిన శంఖారావమే వారణాసి పండితుఁడొనర్చినదనియు, నదియే సరియైన ముహూర్తసమయమనియు విశదమయ్యెను. ప్రథమ శంఖధ్వని యొక భిక్షుకునిదఁట. అంత విద్యారణ్యాదులు గతమునకువగచి, చల్లారిన యంత్రమును బరీక్షించిరి. అది రెంకుంబాతిక బీఁటికలుగాఁ జీలియుండెను. విద్యారణ్యుఁడును, గాశీపండితుఁడును నా బీఁటికల కీలకము నెఱిఁగినవారగుట వలన 'ఈ నగరము రెండువందల యిరువదియైదు వత్సరములకంటె నెక్కుడు కాలముండ'దని నిర్ణయించిరి. అంతఁ, జేయునది లేక, యంత్రస్థాపన మొనర్చి, పురనిర్మాణమున కారంభించిరి. † యంత్రమునందలి బీఁటికల ననుసరించి, యాపట్టణము 1336 మొదలు 1565 వఱకు జగద్విఖ్యాతినంది, హిందూ ధర్మరక్షణ మొనర్చెను.

విధివిలాసము లెవ్వ రెఱుంగుదురు! విద్యారణ్యుఁడేమి తలంచెను? తుదకది యెట్లు పరిణమించెను?

---

† హంపీ - విజయనగరము, పు. 16-17

**విద్యానగర వర్ణనము (1336)**

నూతన నగరనిర్మాణమునకు నిర్ణయించిన యభేద్య స్థలమునుబట్టియే విద్యారణ్యుని బుద్ధివైశద్యము వెల్లడియగుచున్నది. రామాయణ కథాసరణిని బేర్కొనఁబడిన కిష్కింధకు దాపునఁ, దుంగభద్రానదికి దక్షిణతీరమున నీ నగరము నిర్మింపఁబడినది. ఆ ప్రదేశమిప్పుడు 'హంపీ విరూపాక్ష' మని పిలువఁబడుచున్నది.

'ఈ పట్టణమునకుఁ బూర్వపశ్చిమ ప్రదేశములందుఁ గృష్ణశిలాపర్వత పంక్తులును, దక్షిణమునందు రామదుర్గమను గుట్టలును, ఉత్తరమునఁ గొన్ని పర్వతమాలికలును దుంగభద్రానదియు నుండుట వలన నా పట్టణము నైసర్గిక పర్వతదుర్గముగానుండెను. ఈ పట్టణమునకుఁ జుట్టును నేడు ప్రాకారములు గలవు. అఱువది డెబ్బది మొదలాఱువందల మూర లెత్తుగల గుట్టలకు నడుమనున్న స్థలమును ఱాతిగోడలతోఁ బూడ్చి, యీ ప్రాకారములు నిర్మింపఁబడెను. ఈ ప్రాకారములు తుంగభద్రానది యొడ్డునంటుకొని యుండుట వలన నటువైపునుండి యది శత్రువుల కభేద్యమయ్యెను. దక్షిణ, నైరృత దిక్కులనుండి మాత్రము పట్టణములోఁ బ్రవేశించుటకు వీలుండెను. అందు నైరృత దిక్కున నొక గొప్ప చెఱువు నిర్మింపఁబడెను. చెఱువుకట్ట యొక మైలు వైశాల్యము గలదియై ఱాతితోఁ గట్టఁబడినందున నభేద్యమైన దుర్గపు గోడవలెనే యుండెను. ఈ చెఱువుయొక్క వైశాల్యము నాలుగు చదరపు మైళ్లు. అందు నెల్లప్పుడును నాలుగు నిలువుల నీరుండును. దక్షిణదిక్కున నొక కోటఁ గట్టి, దానిని బట్టణములోనున్న పర్వతములతోఁ గలిపిరి. ఆ దుర్గమున కచ్చటచ్చట బురుజులుండి, యవి రక్షకభటులచేఁ గాపాడఁబడుచుండెను. ఏడవ దుర్గపు టావరణములోఁ గాఁపులు వ్యవసాయము చేసి, ధాన్యము పండించుచుండిరి. చెఱువులో జలము సమృద్ధిగ నుండుటచే వ్యవసాయమున కెన్నఁడును భంగము వచ్చినది కాదు.

సప్తమప్రాకారమునకు లోపల నొకచోట నొక గుట్టమీఁద రాజమందిరమును, సేనాధిప నివాసమును, టంకసాలయుఁ గట్టఁబడెను. మొత్తముమీఁద నీయద్వితీయ పట్టణము పదునాలుగు మైళ్ళ పొడవును, బదిమైళ్ళ వెడల్పును, నూట నలువది చదరపు మైళ్లు వైశాల్యమును గలిగి యుండెను.' †

విద్యానగర నామోత్పత్తి

బుక్కరాయల కాలమునందలి యొక శాసనమున

'విద్యాభిధాన నగరీ విజయోన్నతి శాలినీ'
విద్యారణ్య కృతాతస్యాం రత్నసింహాసనే స్థితః'

అను వాక్యములు గన్పట్టుచున్నవి. [1]

'కుంతలదేశాధి పత్యకె సలువతుంగ భద్రాతీరదిం
పంపావిరూపాక్ష లింగ ననిరూపదిం విద్యారణ్య
శ్రీపదంగల నామధేయదిం శ్రీహరిహరరాయ కట్టిసి...'

అని మఱియొక కన్నడ శాసనము చూపట్టుచున్నది. [2]

'అమ్మహాదేవితోడ నిట్లనియె నతఁడు
వేడ్కమీఱంగ నాపేర వెలయునట్టి
పురము గావింపవలయుఁ; దత్పురమునందుఁ
జెలఁగి సంతతమును నీవు నిలువఁదగును.'

అని తన మ్రోలఁ బ్రత్యక్షమయిన లక్ష్మీదేవినిఁ గాంచి విద్యారణ్యుఁడు వరమడిగినట్లు 'కృష్ణరాయ విజయము' నుండి తెలియుచున్నది. [3]

మఱియు నదే గ్రంథమున—

'కోటలా తెలుగంటి పాటలాధర లెల్ల
నాటలాడఁ దలంచ హసాసు మించ

† మహమ్మదీయ మహాయుగము, పు. 300-301
1. ఆంధ్రుల చరిత్రము, మూ. భా. పు. 325
2. Epigraphia Carnatica, Vol. XI, CI. No. 54
3. కృష్ణరాయ విజయము, ద్వి. ఆ. ప. 23

మేడలా మిన్నేటి జాడ లానిన యంచ
జోడులాడటఁ గాంచు సొబ గెసంగ
శాలలా నవరత్న జాలలాలిత కాంతి
లీలరాగిన వింత మేలుఁజూప
బాలలా మరుని బాబాల లాగునఁబల్కు
హేలలోఁ గొనఁజాలు నితవుమీఱ

నవుర నిర్మించెఁ దన పేర నఖిలలోక
పాలక పురాధిక ప్రభాబంధురముగ
గరిమ దనరంగ విద్యానగరమనంగ
మెఱయు పురరత్న మాధరామరవరుండు'

అను పద్యము పొడకట్టుచున్నది. [1]

కృష్ణరాయ విజయమునందలి గాధను, శాసనములందలి విషయమునకును నించుక భేదము గన్పట్టుచున్నను, విద్యారణ్యుఁడే పట్టణ నిర్మాణమునకుఁ గారణభూతుఁడను విషయమును మాత్రము రెండును (గ్రంథమును, శాసనములును) నొక్కి వక్కాణించుచు న్నవి. కావున, నా యతీంద్రుని పేరిట నా పట్టణమునకు 'విద్యా నగర' మను పేరు గలిగెనని నిరూపించవలసి యున్నది.

**విజయనగర నిర్మాత విజయధ్వజుఁడా? బుక్కరాయలా? (ఇమ్మడి) హరిహర రాయలా?**

'హరిహర రాయలచే విద్యానగరమునకుఁ బ్రప్రథమమున శంకుస్థాపనము గావింపఁబడినను నిజముగా నగరనిర్మాణము హరి హరరాయల తరువాత నతని సోదరుఁడగు బుక్కరాయల కాల మున జరిగియుండి, విద్యానగరమునకు విజయనగర మను నామము కూడ వచ్చియుండవచ్చును.' [2] 'బుక్కరాయని శాసనములలో నొకదానియందు బుక్కమహీపతి ప్రపంచమునంతయు జయించిన

1. కృష్ణరాయ విజయము, ద్వి. ఆ. ప. ౩౪
2. Rice, Mysore and Coorg, from Inscriptions, Page 113

తరువాత విజయనగరమును నిర్మించి, క్షోణీజన రక్షణార్థము విరూపాక్షునివలెఁ దుంగాభద్రానది పాదపీఠముగను, హేమకూటము సింహాసనముగను జేసికొని యాసీనుఁడై యుండెనని తెలుపఁబడినది.' [1] 'విద్యారణ్య శిక్ష యను నొక సంస్కృత గ్రంథములో, హక్క, బుక్క యను నిరువురు సోదరులు ప్రతాపరుద్రుని ధనాగార రక్షకులుగానుండి, పాఱిపోయి, విద్యారణ్యులనాశ్రయించి, యాతని సాహాయ్యమున నూత్న సామ్రాజ్యమును, విజయనగర పట్టణమును నిర్మాణముచేసిరి.' [2] 'హరిహరుఁడు ముందు కాలధర్మమునొందఁగా, బుక్కరాజు రాజ్యభారము వహించి, 1380-వ సంవత్సరమువఱకు రాజ్యముచేసెను. తదనంతర మాతనికొడుకు ఇమ్మడి-హరిహరరాజు రాజయ్యెను. ఈతని రాజ్యకాలమందే విజయనగర పట్టణము కట్టినట్లు కనుపట్టుచున్నది.' [3]

పై విషయములనుజూడ, విజయనగరమును బుక్కరాయలు గట్టించెనని కొందఱును, హక్క, బుక్కయను సోదరులు నిర్మించిరని మఱికొందఱును, ఇమ్మడి-హరిహరరాయలు స్థాపించెనని వేఱొక కొందఱును దెలుపుచున్నారు. వీరి యభిప్రాయములు గూడ భిన్నములై యున్నవి. కావున, వీరిలో విజయనగర నిర్మాత యాతఁడే యని నిరూపింపఁదగిన యవకాశము లేకయున్నది.

ఇఁకఁ గ్రింది విషయములఁగూర్చి యించుక యోచింతము -

రాయవంశావళియను గ్రంథమున నానెగొందిని 1117 మొదలు 1156 వఱకుఁ బాలించిన విజయధ్వజుఁడు, తుంగభద్రానదికి దక్షిణభాగమున నొక నగరమును నిర్మించి, దానికిఁ దనపేర

1. Epigraphia Carnatica, Vol. V. No. 256, P. 520
2. Buchanan in his 'Travels in Southern India'-Mysore III, P. 110
3. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, 4-వ సంపు. 6-వ సంచి. (కర్ణాట రాజ్య కథాసారము)

విజయనగరమని పేరుపెట్టెనని తెలుపఁబడియున్నది.[1] 'ఓరుగల్లు పడిపోయినది. ఆంధ్రుల ప్రాగ్దేశము కలుపుకోఁబడినది. కాని, యీ (యాంధ్ర) కుటుంబములో నొక శాఖవారు తుంగభద్రాతీరమున నున్న విజయనగరమునకుఁ బోయి, దక్కనులోఁ జాలకాలము మహమ్మదీయుల నెదుర్కొనుచుండి, బలాఢ్యమై, యుచ్ఛస్థితికి రాఁగలిగినట్టి సామ్రాజ్యము నొకదానిని స్థాపించినట్లు 'ఫెరిస్తా' వ్రాయుచున్నాఁడు.'[2]

పై రెండు విషయములఁగూర్చి యిటఁ జర్చింపవలసి యున్నది. ఆనెగొంది రాజుల చరిత్రము రాయవంశావళియను గ్రంథమునఁదప్ప మఱెచ్చటను గనఁబడదు. అందలి విషయములు చరిత్రకారులు విశ్వసించినవియేయనుటకు వారి గ్రంథములే ప్రబల సాక్ష్యములు. ఆ గ్రంథమున విజయధ్వజుఁడే విజయనగరమును నిర్మించెనని స్పష్టమగుచున్నది. మఱియు, నామసామ్యమునుబట్టి చూచినను నా పట్టణ మాతని నిర్మితమనియే తేలుచున్నది. ఇఁక, రెండవ విషయమునకు వత్తము. ఓరుగల్లు పతనమైనపిదప, నచ్చటి యాంధ్రకుటుంబములో నొక శాఖవారు తుంగభద్రా తీరమునందున్న విజయనగరమునకుఁ బోయి, యుచ్ఛస్థితికి రాఁగలిగిన సామ్రాజ్యము నొకదానిని స్థాపించినట్లు స్పష్టమగుచున్నది. ఓరుగల్లునుండి తుంగభద్రా నదీతీరమునకేఁగి, సామ్రాజ్యమును స్థాపించినవారు హరిహర రాయలును, బుక్కరాయలునని బహు గ్రంథములనుండి తెలియుచున్నది. కావున, నప్పటికే విజయనగరము తుంగభద్రా తీరమున వెలయుచుండెనని విశదమగుచున్నది. ఈ కారణమువలన విజయనగర నిర్మాత బుక్కరాయలుగాని, ఇమ్మడి - హరిహర

1. The Never To Be Forgotten Empire, Page, 15
2. ఆంధ్రుల చరిత్రము, మూ. భా. పుట. 315

"But a branch of his family appears to have removed to Bijanagar, on the Tungabhadra and founded a Kingdom there."

రాయలుగాని కారనియు, విజయధ్వజుఁడే యనియు నమ్మ
యున్నది. ఈ నిర్ధారణ మనుసరించి విజయధ్వజునిచే నిర్మిత
విజయనగరమే కాలక్రమమున హరిహరునివలన విస్తృతమై, వి
నగరముగా మారెనని తోఁచుచున్నది.

## మాధవ విద్యారణ్యుఁడు

ఏమహనీయుని జన్మమువలనఁ దుంగభద్రా తీరస్థప్ర
ములు పావనములయ్యెనో, యేపుణ్యపురుషుని యపారకరుణా
ణమున హైందవ ధర్మరక్షణము గావింపఁబడెనో, యేఘనుని ధీవి
మున విజయనగర సామ్రాజ్యరమాయశోలతలు కకుబంతముఁ
బ్రాఁకెనో యట్టి మాధవవిద్యారణ్యుల పవిత్ర చరిత్రమునుగు
కొన్ని మాటలు వ్రాయుట నా విధియైయున్నది.

పదునాల్గవ శతాబ్దారంభమునఁ జంద్రధ్వజుల దండ
త్రల మూలమున దక్షిణ హిందూదేశమునకు వచ్చిన విపత్తు
చిన పిమ్మట, విజయనగర సామ్రాజ్యము జీర్ణసనాతన మత
నుద్ధరించినపిదప నొప్పిన దార్శనికులలో విద్యారణ్యుఁడు ప్రథ
డని చెప్పవలసి యున్నది.

ఇమ్మహనీయుని పవిత్రకథా సందర్భమున సంశయాస్పద
లగు విషయములు మూఁడు గన్పట్టుచున్నవి. అందు మొదటి
సాయణ మాధవు లిద్దఱు వ్యక్తులా, కాదా? రెండవది - మాధ
చార్య విద్యారణ్యనామములఁ బరఁగినవాఁ డొక్క వ్యక్తియ
కాదా? మూఁడవది - మాధవాచార్యుఁడెప్పుడు సన్న్యసించె
ఈ సంశయ నివృత్తికై నా యోపినకొలఁది నీతని కథాకథనమ
బ్రయత్నింతును.

**మొదటి విషయము**

మాధవాచార్య కృత పరాశర మాధవీయమునఁ దన

దంద్రులనుగూర్చి యాతఁడిట్లు చెప్పుకొనెను.

> "శ్రీమతీ జననీ యస్య సుకీర్తిర్మాయణః పితా,
> సాయణో [1] భోగనాథశ్చ మనోబుద్ధి సహోదరౌ.
> [2] బోధాయనం యస్య సూత్రం శాఖా యస్యచ యాజుషీ,
> భారద్వాజ కులం యస్య సర్వజ్ఞః సహి మాధవః"

ఈ శ్లోకమును బట్టిచూడ, మాధవాచార్యుఁడు భారద్వాజ గోత్రుఁడు. బోధాయన సూత్రుఁడు. యజుశ్శాఖీయుఁడు. తండ్రి మాయణుఁడు; తల్లి శ్రీమతి. సాయణుఁడును, భోగనాథుఁడును సోదరులు నని తెలియుచున్నది. మఱియు, మాధవుఁడు జ్యేష్ఠుఁడు; ద్వితీయుఁడు సాయణుఁడు; తృతీయుఁడు భోగనాథుఁడు నని విశద మయ్యెను.

పెద్దవాఁడగు మాధవాచార్యుఁడు విజయనగర సామ్రాజ్య మును క్రీ. శ. 1350-1377 వఱకుఁ బాలించిన బుక్కరాయలకడ మంత్రిగను, గురువుగను నుండెను. సంగమునకు మేళాంబికయందు జనించిన కొడుకులైదుగురు. వారిలో మూఁడవవాఁడు బుక్కమహీ పతి. సోదరులందఱిలో నీతఁడే ప్రతిభాశాలి. అది కారణముగ నీతఁడు కేంద్రమగు విజయనగరమున నియమింపఁబడి, దానిని బాలించుచుండెను. బుక్కరాయల యన్నయగు కంపరాయ లుద యగిరి రాజధానిగాఁ దూర్పు పరగణా నేలుచుండెను. ఈ కంప రాయలు బుక్కమహీపతి కుమారుఁడగు కుమార కంపరాయలు కాఁడు. మాధవాచార్యుని సోదరుఁడగు సాయణాచార్యుఁడుదయ గిరి నేలుచుండిన కంపరాయలయొద్ద మంత్రిగానుండెను. సాయణుఁడు వేదభాష్యకర్త. కంపరాయలు మరణింపఁగా నాతని తనయుఁడగు సంగమునకు సాయణాచార్యుఁడు గురువై విద్యాబుద్ధులు గఱపి, యాకాలమునందలి సామ్రాజ్య శత్రువులతోఁ బోరి, యాతఁడు

---

1. యోగనాథశ్చ - అని పాఠాంతరము.
2. 'యస్యబౌధాయనం సూత్రం శాఖా యస్యచ యాజుషీ' - అని పాఠాంతరము.

జయించెనని తెలియుచున్నది. ఆ సంగముఁడు బాల్యమునందే మరణించెనఁట.

సాయణరచిత మాధవీయ ధాతువృత్తియందు -

"శ్రీ పూర్వదక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర శ్రీ కంపరాజ సుత శ్రీ
సంగమ మహారాజ మహా మంత్రిణా మాయణసుతేన
మాధవ సహోదరేణ సాయణాచార్యేణ విరచితాయాం
మాధవీయాయాం ధాతు వృత్తౌ..."

అని యున్నది. [3]

ఈ సాక్ష్యములఁబట్టి పరాశర మాధవీయమునకుఁ గర్త మాధవాచార్యుఁడనియు, ధాతువృత్తిని సాయణుఁడే రచించి, తన యన్నయగు మాధవుని పేర మాధవీయ ధాతువృత్తియని పేరు పెట్టెననియుఁ దెలియుచున్నది. ఈసమాధానమువలన మాయణ సాయణులిద్దఱును భిన్నులని తేలినది.

రెండవ విషయము.

మాధవాచార్యుఁడే సన్న్యసించిన పిదప, విద్యారణ్యుఁడను నామమును ధరించెననుట కనేకాధారములున్నవి.

జీవన్ముక్తి వివేక మను గ్రంథమునందలి—

"ఏతేషాంతు సమాచారాః ప్రోక్తాః పారాశరస్మృతౌ,
వ్యాఖ్యానేఽస్మాభిరత్రాయం పరహంసో వివిచ్యతే"

అను శ్లోకమునుబట్టి పరాశరమాధవీయకర్తయు, జీవన్ముక్తి వివేక గ్రంథకర్తయు నొక్కరే యని స్పష్టమగుచున్నది. మఱియు—

"ఇతిశ్రీ పరమహంస పరివ్రాజకాచార్య వేదార్థ మహేశ్వర
విరచిత జీవన్ముక్తి ప్రకరణం సంపూర్ణమ్."

3. Some contributions of South India to Indian Culture-by S. K. Iyengar, pp. 309-310

అను వచనమువలన గార్హస్థ్యమున నున్నప్పుడు పరాశర మాధవీయమును, ఆశ్రమ స్వీకారానంతరము జీవన్ముక్తివివేకమును రచించెనని తెలియుచున్నది. ఈతఁడు, సన్న్యసించినపిదప, జీవన్ముక్తి వివేకమను గ్రంథమునుగాక, వేదాంత పంచదశియను గ్రంథమును సహితము రచించినట్లు—

"ఇతి శ్రీమత్పరమ హంస విద్యారణ్యముని కృతే"

అను ప్రకరణాంత వచనమునుబట్టి తెలియుచున్నది.

విద్యారణ్యునకు శంకరానందుఁడు, భారతీతీర్థుఁడు, విద్యాతీర్థుఁడు నను ముప్వురు గురువులుండినట్లు తోఁచుచున్నది. విద్యారణ్యుఁడు తన గ్రంథములయందిట్లు చెప్పియున్నాఁడు—

" నమః శ్రీశంకరానంద గురు పాదాంబుజన్మనే,
సవిలాస మహామోహ గ్రాహగ్రాసైక కర్మణే.
తత్పాదాంబురుహ ద్వంద్వ సేవా నిర్మల చేతసామ్,
సుఖ బోధాయ తత్త్వస్య వివేకోఽయం విధీయతే.''

—వేదాంతపంచదశి.

"స్వమాత్ర యానందయదత్ర జంతూన్
సర్వాత్మ భావేన తథా పరత్ర,
యచ్ఛంకరానందపదం హృదబ్జే
విభ్రాజతే తద్యతయో విశంతి.''

—వివరణప్రమేయ సంగ్రహము.

"పారంగతం సకలదర్శన సాగరాణాం
ఆత్మోచితార్థ చరితార్థిత సర్వలోకః,
శ్రీ శార్ఙ్గపాణి తనయం నిఖిలాగమజ్ఞం
సర్వజ్ఞ విష్ణుగురు మన్వహ మానతోఽస్మి.''

—సర్వదర్శన సంగ్రహము.

సర్వజ్ఞవిష్ణు వనువాతఁ డాశ్రమ స్వీకారానంతరము విద్యాతీర్థుఁడను యోగపట్టమునుబొంది, కామకోటి పీఠాధిపతియయ్యెను. ఈతనికి శంకరానందుఁడు, భారతీతీర్థుఁడు, వేదాంత దేశికుఁడు,

మాధవాచార్యుఁడు, సాయణుఁడు ననువారు శిష్యులుగనుండిరి.[4] ఈశిష్యగణమున వేదాంతదేశికుఁడును, శంకరానందుఁడును, భారతీతీర్థుఁడును బెద్దవారు. వారికంటె మాధవాచార్యుఁడు చిన్నవాఁడు. మాధవుఁడు సన్న్యసించుటకుఁ బూర్వమే వేదాంతదేశికుఁడు ప్రసిద్ధ గ్రంథకర్తయయ్యెను. విద్యాతీర్థునితరువాతఁ గామకోటి పీఠమునకు శంకరానందుఁడు నియమింపఁబడెను. మాధవాచార్యుని ప్రోత్సాహమున బుక్కరాయలవలనఁ బునః ప్రతిష్ఠితమైన శృంగేరీ పీఠమునకు విద్యాతీర్థుఁడు భారతీతీర్థుని నధిష్ఠింపఁజేసెను. కావున, నీ ముగ్వురును మాధవునికంటెఁ బెద్దవారనుట నిజము. శంకరానందుఁడు విద్యాతీర్థుని కడఁగాక, భారతీతీర్థునికడ నాశ్రమ స్వీకారము పొందినట్లు తెలియుచున్నది. విద్యారణ్యుఁడు విద్యాతీర్థునికడ విద్యలనభ్యసించినను, దత్త్వోపదేశము మాత్రము శంకరానందుని యొద్దఁ బొందెను. 'కావున విద్యారణ్యునకు శంకరానందుఁడు గురువును, భారతీతీర్థుఁడు పరమగురువును, విద్యాతీర్థుఁడు పరమేష్ఠి గురువును నయిరి.'† పైనిదర్శనములవలన మాధవాచార్యుఁడే విద్యారణ్యుఁడయ్యెనని దృఢపడుచున్నది.

మూఁడవ విషయము.

విద్యారణ్యకృత దేవ్యపరాధ స్తోత్రమను గ్రంథములోని -

"పరిత్యక్తా దేవా వివిధపరిసేవాకులతయా
మయా పంచాశీతే రధిక ముపనీతేతు వయసి,
ఇదానీం చేన్మాత! స్తవ యది కృపా నాపి భవితా
నిరాలంబో లంబోదరజనని! కే యామి శరణమ్."

4.a 'Snkaracharya, the great and his successors in Kanchi,' by N. Venkataraman. p. 93

† ఈ విషయములను నిర్ణయించుటలో శ్రీ కనుగంటి - సీతారామయ్యగారి 'మాధవవిద్యారణ్యుఁడు' అను వ్యాసము తోడ్పడినది. - అంగీరస సంవత్సరాది సంచిక, పుటలు, 153-156

అను శ్లోకమునుబట్టి విద్యారణ్యుఁడెనుబదియైదేఁడులు జీవించి యుండెనని తెలియుచున్నది.[5] మఱియు నీతఁడు తన యెనుబది యవయేట శృంగేరీపీఠము నధిష్ఠించి, క్రీ. శ. 1387 ప్రాంతమున బ్రహ్మైక్యముఁ గాంచినట్లు విశదమగుచున్నది.[6] కావున, నీతని జననము క్రీ. శ. 1302 ప్రాంతముననై యుండవలయును.

జీర్ణవిజయనగరచరిత్రమున, 'మాధవాచార్యులవారు క్రీ. శ. 1377 లేక 1378 సంవత్సర ప్రాంతమువఱకు హరిహర బుక్కరాయాదులకడ మంత్రిగనుండి, తరువాత సన్న్యసించియుండవచ్చు' నని నిరూపించఁబడియున్నది.[7] 'క్రీ. శ. 1378 సంవత్సరమునాఁటి యొకశాసనములో విద్యారణ్యుఁ డా సంవత్సరముననే సన్న్యసించినట్లున్న' దనియు వ్రాయఁబడియున్నది.[8]

మాధవాచార్యుఁడు సన్న్యసించిన వత్సరము 1377 కాని, 1378 కాని కాదని నిరూపించుటకుఁ దగిన యవకాశమున్నది. హరిహరరాయలు తుంగభద్రాతీరమున నూతననగరనిర్మాణమును క్రీ. శ. 1336 లోఁ గావించి, యేతన్నగరమునకుఁ దన గురువైన విద్యారణ్యుని పేర 'విద్యానగర' మని పేరుపెట్టెనని చరిత్రలు చాటుచున్నవి. ఆధారములనుబట్టి మాధవాచార్యుఁడే యాశ్రమ స్వీకారానంతరము విద్యారణ్య నామమును బొందెనని యింతకుమున్నె నిరూపించియుంటిని. కావున, నగరనిర్మాణమునకు ముందే మాధవాచార్యుఁడు సన్న్యసించియుండవలెను. లేనిచోఁ దన్నగరమునకు విద్యానగరమను నామము సిద్ధించదు. నగరనిర్మాణము క్రీ. శ. 1336 సంవత్సరమని దృఢపడినది. కావున మాధవాచార్యులా

5. Sources of Vijayanagar History, Page, 50
6. Sources of Vijayanagar History, Page, 3
7. జీర్ణ విజయనగర చరిత్రము, పుట, 39
8. Epigraphia Carnatica, Vol. VI Koppa 30

వత్సరమునకుఁ బూర్వమే యాశ్రమమును స్వీకరించియుండవలెనని నిర్ణయింపవలసియున్నది.

'నగరనిర్మాణకాలము నాఁటికే యీ మహాపురుషుఁడు సన్న్యాసాశ్రమము స్వీకరించి పదునేనేండ్లయియుండె' నని విద్యానగరచరిత్రము నుడువుచున్నది.[9] దీనిని బట్టిచూడ సన్న్యసించు నప్పటికి మాధవాచార్యునకుఁ బందొమ్మిది వత్సరము లుండి యుండవలెను. అంతటి బాల్యముననే సన్న్యసించియుండునా యను సంశయము కలుగకపోదు. ఏది యెట్లున్నను నూతననగరనిర్మాణమునకుఁ బూర్వమే సన్న్యసించియుండవలెనని మాత్రము నిర్ణయింపనగును.

విద్యారణ్యుని ప్రభావము : పాండిత్యము

కృష్ణరాయ విజయమునందలి —

"నరు లజ్ఞాన విమోహితాత్ములగుటన్ రక్షింపఁగా నెంచి శం
కరుఁడే శంకరుఁడై విభేదమతముల్ ఖండించి వేదాంత శా
స్త్రరహస్యస్థితిఁ దెల్పఁగా నతఁడె విద్యారణ్యమూర్తిన్ జగ
ద్గురుఁడై తోఁచెఁ దదీయవైభవము లెందున్మెచ్చఁగా శక్యమే."[10]

అను పద్యభావమును జూడఁ జార్వాకాది మతప్రాబల్యమున నరు లజ్ఞానాంధులై యున్న తఱి నీశ్వరుఁడే శంకరాచార్యుఁడుగ నుద్భవించి, యా విభేదమతములను ఖండించెననియు, నాతఁడే వేదాంత శాస్త్రరహస్యస్థితినిఁ దెలుప విద్యారణ్యుఁడుగ నవతరించెననియుఁ దెలియుచున్నది. శంకరాంశ సంభూతుఁడగు విద్యారణ్యుని ప్రభావమును గూర్చి నుడువ నేనెంతటివాఁడను!

ఇఁక, విద్యారణ్యుని పాండిత్యమునుగూర్చి చర్చింతము. ఈతఁడు, సకల విద్యాపారంగతుఁడు. తర్కవ్యాకరణ వేదాంతాది

9. విద్యానగరచరిత్రము, పుట 44

10. కృష్ణరాయ విజయము, ద్వి. ఆ. పద్య. 18

శాస్త్రార్థవేది. కవిసత్తముఁడు.

1. వేదార్థ ప్రకాశిక, టీక - విద్యారణ్య భాష్యము
2. జైమినీయ న్యాయమాల
3. పరాశర మాధవీయము
4. కాలమాధవీయము
5. సర్వదర్శన సంగ్రహము
6. వైయాసిక న్యాయమాల, టీక - యధికరణరత్నమాల
7. మాధవీయధాతువృత్తి
8. జీవన్ముక్తి వివేకము
9. వేదాంత పంచదశి
10. వాక్యసుధా ప్రకరణము
11. అనుభూతి ప్రకాశిక
12. శంకరవిజయ కావ్యము
13. అలంకార సుధానిధి
14. దేవ్యపరాధ క్షమాపణ స్తోత్రము.

పై వివరింపఁబడిన గ్రంథములన్నియు నీమహనీయుని నామమున నే వెలయుచుఁ బ్రచారముననున్నవి. వీనిలోఁ బరాశర మాధవీయాది గ్రంథరాజములు విద్వన్మాన్యవిలసితములై యొప్పుచున్నవి. ఈ మహనీయుని సర్వతోముఖ పాండిత్య మబ్బురముఁగొల్పును.

విద్యారణ్యుఁ డొకవంక జగద్విఖ్యాతినందిన విజయనగర సామ్రాజ్య స్థాపకుఁడై, మంత్రిసత్తముఁడై వెలసెను; మఱియొక వంక సర్వశాస్త్రవేత్తయై విలసిల్లెను; వేఱొకవంక పండితకవియై పేరొందెను.

# సంగమ వంశము

పాలకులు

| | | |
|---|---|---|
| మొదటి హరిహరరాయలు | క్రీ. శ. | 1336–1355 |
| మొదటి (వీర) బుక్కరాయలు | ,, | 1355–1377 |
| రెండవ హరిహరరాయలు | ,, | 1377–1404 |
| మొదటి దేవరాయలు | ,, | 1406–1422 |
| రెండవ (విజయ) బుక్కరాయలు | ,, | 1422–1423 |
| రెండవ (ప్రౌఢ) దేవరాయలు | ,, | 1423–1447 |
| మల్లికార్జునరాయలు | ,, | 1447–1465 |
| విరూపాక్షరాయలు | ,, | 1465–148 |




విద్యార
సామ్రాజ్య స్థా
పంకి సర్వశాస్త్ర
పేరొందెను. శ్రీవన్న

# మొదటి హరిహర రాయలు

సంగముఁడు యదువంశ సంజాతుఁడు. అతనికి మేళాంబిక వలన హరిహరరాయలు, కంపరాయలు, బుక్కరాయలు, మారప్ప, ముద్దప్ప యను నైదుగురు కొడుకులు పుట్టిరి.

"ఉదభూ దస్వయేతస్య యదుర్నామ మహీపతిః
...... ... ...... ... ... ... ...
అపాత్త దురితాసంగః సంగమో నామ భూపతిః
మాలాంబికాఽభవద్రాజ్ఞీ తస్యరాజ్ఞః శచిస్మితా,
...... ... ... ... ... ... ... ...
ఆసన్ హరిహరః కంపో బుక్కరాయ మహీపతిః
మారపో ముద్దపశ్చేతి కుమారా స్తస్యభూపతేః"

ఒక తామ్ర శాసనమునందలి పై శ్లోకపాదములు సంగముని సంతతిని నిర్ణయించుచున్నవి.[1]

ఈ సోదరు లయిదుగురును బంచపాండవులవలె విక్రమోపేతులై, ధైర్యవిలసితులై, యన్యోన్యప్రేమాన్వితులై వెలయుచుండిరి. సోదరులు నలుగురును జ్యేష్ఠభ్రాతయగు హరిహరుని మాటను జవదాఁటనివారు. అందుఁ ద్వితీయుఁడగు బుక్కభూపతి పాండవ మధ్యమునిఁ బోలిన విక్రమశాలి.

హరిహరరాయలు పట్టాభిషిక్తుఁడగుట

ఆనెగొంది రాజులలోఁ గడపటివాఁడగు జంబుకేశ్వరుఁడు [illegible] నెను. [illegible] మొందిన పిదప, మహమ్మదీయ ప్రతినిధి పరిపాలనమున [illegible] ప్రగాఢ [illegible] మునఁ గలఁతలుపుట్టెను. కాని, యవి యెంతోకాలవు [illegible] రాజవతం కొనియుండలేదు. యదువంశసంభవుఁడగు హరిహరు [illegible]లఁ దోలఁ సింహాసన మధిష్ఠించుటచే రాష్ట్రమునఁ గొంత శాంతి [illegible]డు సింహాస[illegible] అతఁడు తన సోదరుఁడైన బుక్కమహీపతి సాయమునఁ [illegible]

1. Epigraphia Carnatica, G. D. 46.

రాజ్యములను గ్రమక్రమముగ స్వాధీనపఱచుకొని, తన రాజధాని నానెగొందినుండి విద్యానగరమునకు మార్చి, క్రీ. శ. 1336-వ వత్సరమున నందుఁ బట్టాభిషిక్తుఁడయ్యెను.[1] ఆతఁడనన్య సామాన్య శౌర్యోపేతుఁడగుటవలన ఢిల్లీశ్వరున కంకితుఁడుగా నుండుటకిష్ట పడక, యనతికాలముననే స్వతంత్రుఁడయ్యెను.

సోదరుల దండయాత్ర.

హరిహరుని పరిపాలనారంభమున నాతని సోదరులు విద్యానగర సామ్రాజ్యమునకుఁ గోశాధిపతులుగను, దండనాయకులుగను, మంత్రులుగను నుండిరి. కొంతకాలమైన పిదప, సోదరులు భ్రాతృనాతిఁదలఁదాల్చి, విజయేచ్ఛఁగలవారై, సైన్యముల వెంటఁగొని, నలుగడల కేఁగిరి.

ప్రథమ సోదరుఁడగు కంపరాయలు తూర్పు భాగములఁ గ్రమక్రమముగ జయించి, యా భాగములకు నుదయగిరిని రాజధానిగఁ జేసికొని, మాధవాచార్యుల సోదరుఁడగు సాయణుని మంత్రిత్వమున రాజ్యమును బాలించుచుండెను.[2] ద్వితీయుఁడగు బుక్కరాయలు పెనుగొండ, చంద్రగిరి, గుత్తి రాజ్యభాగములకుఁ బ్రతినిధియై యుండెను. అతఁడే విద్యానగరసామ్రాజ్యమునకుఁ బ్రధానసేనానాయకుఁడుగను, మంత్రిగను నుండెను. కాని, బుక్కరా[illegible]ద్వారసముద్రమును రాజధానిగఁ జేసికొని, హొయసల వంశ సర్వ[illegible]బాలించుచుండెనని వేఱొక శాసనమువలనఁ దెలియు [illegible]పేరొందెనుమారప్ప యను సోదరుఁడు మైసూరు ప్రాంతములకుఁ [illegible]గ్గ, ఉత్తర కన్నడము మొదలగు మండలములను [illegible]కి 'ఆరగమలై (అరహామలె) రాష్ట్ర'మని నామ కదంబరాజ్యమునకు రాజధానియగు వనవాసిని,

[illegible] Inscriptions, Vol. 15,
[illegible]ia Indica. Vol III, Page, 114.
[illegible]ical Collection, 1906 - No. 522.

చంద్రగుత్తి గోవాలను దన రాష్ట్ర దిరుగఁబడిరి. అది కారణముగ రాజధానిగ, మాధవ మంత్రిసాయముఁ తెను. ఉత్తర హిందూస్థాన ముద్దప్ప యను సోదరుఁడు తెక్కలినాడునుంచి, ఢిల్లీని ముట్టడింపఁ మును బాలించుచుండెను.[2] సోదరుల పాలనభాగములులతోఁ దాను నాలుగు రాజ్యభాగములుగాక, విద్యానగర సామ్రాజ్యపు ధనవ్యయ రెండు భాగములు సేరియుండెను. అందొకటి తుళువ రాష్ట్ర జను రెండవది మంగళూరు రాజ్యము. తుళువరాజ్యమును హరిహరుని సామంతులలో నొక్కఁడు పాలించుచుండెను.[3] మంగళూరు రాజ్యమును హరిహరుని మిత్రులలో నొక్కరుఁడగు హడపాద గౌతరాజు (హరిపాద గౌడరాజు) పాలించుచుండెను.[4]

## రాజ్యాభివృద్ధి

హరిహరరాయలు దూరదృష్టిగలవాఁడు. శత్రురాజులనుండి తన రాష్ట్రమును సంరక్షించుకొనునిమిత్తము సైన్యమును వృద్ధిచేయఁదొడఁగెను. ఆ కాలమున నుత్తర హిందూస్థానమున నవాబు లెట్లొండొరులు గలహించుకొనుచుండిరో, యట్టులే దక్షిణ హిందూస్థానమున హిందూరాజులును నన్యోన్య ద్వేషభావములు గలిగి వర్తించుచుండిరి. దానఁ గలఁతలు మెండై, జనులకు శాంతిలేకయుండెను. ఢిల్లీ చక్రవర్తి దక్షిణాపథమునందలి రాజులలోని యంతః కలహముల గుర్తించి, రాజ్యములను గబళింపఁబూనెను. కాని, యప్పటికే విద్యానగర సామ్రాజ్యమూలములు ప్రగాఢముగ నాటుకొని, బలవత్తరముగ నుండెను. హరిహరుఁడా రాజవతంసుల హృదంతరాళముల నాటుకొనియున్న ద్వేషబీజములఁ దొలఁచివైచి, వారిలో నైకమత్యభావము నెలకొల్పెను. ఆతఁడు సింహాస

1. Nellore Inscriptions, Page 789, No. 28
2. Epigraphia Carnatica, Vol- VIII, Sh. 375
3. South Canara Manual, Vol. II, Page 264
4. Epigraphical Collection for 1901, No. 57

రాజ్యములను క్రమక్రమముగ సానే పశ్చిమ సముద్రతీరమువఱకు నానెగొందినుండి విద్యానగరము తీరమందలి బైరసు ఒడయర్లు హరి వత్సరమున నందుఁ బా నుండిరి. [1] కర్ణాటక రాష్ట్రమందలి జైన శౌర్యోపేతుఁడగు నాతనికి లోఁబడియుండిరి. హరిహరుని సామంతు పడక, యనశారుఁడగు చామేయనాయకుఁడు రాజు నాజ్ఞ మెయి సోదరుల కోటను గట్టించెను. అతని కాలమునందలి యొక శాసన మున నాతఁడు, 'పూర్వ పశ్చిమ సముద్రాధీశ్వరుఁ' డని యభివర్ణింపఁబడియున్నది. [3] దీనికి నిదర్శనముగా నాతని తమ్ముఁడగు కంప భూపతి పూర్వ సముద్రతీరమునందలి యుదయగిరినిఁ బాలించుచుండెనని యింతకుమున్నె చెప్పియుంటిని.

మహమ్మద్ తుఘ్లఖ్ దురాగతము

హరిహరరాయల కాలమున గ్యాస్ ఉద్దీనుని పెద్దకొమారుఁడైన అలఫ్‌ఖానుఁడు, 'మహమ్మ' దని పేరుపెట్టుకొని, సింహాసనాసీనుఁడై, ఢిల్లీ రాజ్యము పాలించుచుండెను. ఈతఁడు మేటి విద్వాంసుఁడు; బహు భాషావేది. కాని, ముంగోపి, క్రూరుఁడు; దూరదృష్టి లేనివాఁడు.

ఈతఁడు దక్షిణ హిందూస్థానమును జయించినది మొదలు రాజ్య వైశాల్యము విరివియై, పరిపాలనా భార మధికమయ్యెను. దక్షిణాపథమునుండి రాబడి తక్కువయగుటవలనఁ దానార్జించిన ధనములోఁ జాలభాగ మీ ప్రాంతముననే వినియోగింపవలసి వచ్చెను. ఆ కారణమున దాఁచియుంచిన ధనము చాలదయ్యెను. అప్పుడప్పుడు సంభవించిన దోఁపిళ్ళవలన జనులు దరిద్రులైరి. దుర్వ్యాపేక్షచే మహమ్మదు ప్రజల నధికముగాఁ బీడించుటవలన

1. Epigraphia Carnatica, Vol. IX, Page 39.
2. Indian Antiquary Vol. X, Page 63
3. A.S.R. 1908 - 1909, Page, 236.

గత్యంతరములేక వారు రాజుపైఁ దిరుగఁబడిరి. అది కారణముగ నాతఁడు దక్షిణ దేశమునకు దండు వెడలెను. ఉత్తర హిందూస్థానమునందలి మోగలు లాసమయమును గుర్తించి, ఢిల్లీని ముట్టడింపఁగడంగిరి. తుఘ్లక్ ఆ వర్తమాన మెఱిఁగి, మోగలులతోఁ దాను బోరలేక, కొంత ధన మొసఁగి, వారితో సంధి చేసికొనెను. ధనవ్యయ మెక్కుడగుటచేఁ బాదుషా మిగుల బీదవాఁడై, పన్నులువైచి జనులను బాధించెను. అంత బీదలు నశించిరి; ధనవంతులు తిరుగఁబడిరి; కర్షకులు సేద్యము మానిరి; భూములు బీళ్లయ్యెను.

రాజధానిని మార్చుట

తుఘ్లక్ ఇఁక ఢిల్లీలోనుండుట పాడిగాదని తలఁచి, తన రాజధానిని దక్షిణ దేశముననున్న దేవగిరికి మార్చుకొని, దానికి 'దౌలతాబాద్' అని పేరుపెట్టెను. ఢిల్లీకి నేడువందల మైళ్ల దూరముననున్న తన నూతన రాజధానియగు దౌలతాబాదునకుఁ దన వెంటఁ బ్రజలు సహితము రా నాజ్ఞయొసఁగెను. పాపము! జనులెట్లు రాజునాజ్ఞ మీఱఁగలరు! ఎల్లవారును బయనమైరి. బహుదూర గమనాయాసమున మార్గమధ్యమునఁ బెక్కురు మడిసిరి. రాజధానియందు నందఱును వసించుటకుఁజాలినంత చోటులేక, కొందఱు చనిపోయిరి. సకలవైభవోపేతమై వెలుఁగొందిన ఢిల్లీ నగరము శ్మశానవాటికగా మాఱెను. పాదుషా యీ చిక్కులను గమనించి, మరల రాజధానిని ఢిల్లీకి మార్చుకొనెను. తిరిగి ప్రాప్తించిన ఢిల్లీ ప్రయాణమున హతశేషులలో నధిక సంఖ్యాకులు హతమయిరి.

ప్రజలు వలసపోవుట

చావఁగా మిగిలినవారు తమ యేలికయైన తుఘ్లక్‌యొక్క యున్మత్త చేష్టలను బరికించి, యీ సామ్రాజ్యము మృత్యుతుల్యమని భావించి, దక్షిణాపథమునకుఁ బరుగులిడి, యాంధ్ర కర్ణాట విద్యా

నగర రాజ్యములఁ దలలు దాఁచుకొనుచుండిరి. తన రాజ్యము నుండి పాఱిపోయినవారికి నాంధ్ర కర్ణాట విద్యానగరరాజ్యము లాశ్రయస్థానములైనవని యెఱిఁగి, పాదుషా, యా రాజులపైఁ గారాలు మిరియాలునూరి, వారి రాజ్యముల నిర్మూలింపఁదలపెట్టి, తొలుదొల్త నోరుగంటిని దాఁక క్రీ.శ. 1344 వత్సరమున నసంఖ్యాకమగు సేనతో బయలుదేరెను.

**తురుష్కులతోఁ బ్రతాపరుద్రుని పుత్త్రుఁడు యుద్ధము సేయుట**

రెండవ ప్రతాపరుద్రుని పిమ్మట నాతని తనయుఁడోరుగంటి సింహాసనాధ్యాసియై, శేషించిన రాజ్యభాగములను బాలించుచుండెను.† పితృపాలిత సామ్రాజ్యమంతయు బహుభాగములుగ విడిపోయి, పలువురచేఁ బాలింపఁబడుచుండుటనుఁ గూర్చి యాతఁడు చింతించుచుఁ దనకు మిత్రులైన యాంధ్రనాయకుల సాహాయ్యమున మహమ్మదీయులఁ దఱిమివేయ యోజించుచుండెను. యోజించుచుండుటయెగాక, తన నిశ్చితాభిప్రాయమును విద్యానగరాధీశ్వరుఁడగు హరిహరరాయలకును, కర్ణాట దేశాధీశ్వరుఁడగు బల్లాల దేవునకును, కేరళ దేశాధీశ్వరునకును నెఱిఁగించి, వారిసాయమును గోరెను. వారును దలలూఁచిరి.

ఢిల్లీ పాదుషా తనపైకి నెత్తివచ్చుచున్నాఁడను వార్త విని, ప్రతాపరుద్రుని తనయుఁడావృత్తాంతము హరిహరునకుఁ దెలియఁజేసెను. హరిహరరాయలు వెంటనే ప్రబల సైన్యమును గూర్చుకొని, సోదరుఁడగు బుక్కభూపతిని వెంటఁగొని ప్రతాపరుద్రుని తనయునకు బాసటగాఁ బోయెను. కర్ణాట కేరళాధీశ్వరులును గాకతీయ సామ్రాజ్యాధిపతివలన సాహాయ్యవంతులై, బహుళదళములతో

† రెండవ ప్రతాపరుద్రుని కొడుకు పేరు చక్కఁగాఁదెలియదు. అతనికి వీరభద్రరాజు, వినాయకదేవుఁడు, కృష్ణనాయకుఁడు, నాగదేవుఁడు - అను నాలుగు పేర్లు గన్పట్టుచున్నవి. యథార్థనామమెద్దియో నిర్ణయింపఁజాలము.

నటకుఁదరలిపోయిరి. రెడ్డినాయకులకుఁ బ్రతినిధియైన మాచా రెడ్డియుఁ, బద్మనాయక వెలమలకుఁ బ్రతినిధియైన సింగమనాయఁడును దమ వైషమ్యములను మాని, యెంతయుఁ దోడ్పడిరి. ఇరువాఁగులకును బోరు ఘోరముగ జరిగెను. బుక్కరాయలు దన యద్వితీయ శౌర్యమును జూపి, శత్రుసేనను నుఱుమాడెను. మహమ్మదీయులు చేయునదిలేక, తమ పరాజయమునకుఁ జింతించుచుఁ బాఱిపోయిరి. దక్షిణాపథమున దేవగిరి తప్ప మిగిలిన భాగము లన్నియు హైందవ పరిపాలనమునకు వచ్చెను.

హాసన్ గంగూ అల్లాఉద్దీన్ షాహ

మహమ్మద్ తుఘ్లఖ్ ఢిల్లీ రాజ్యమును బాలించు కాలమున దక్షిణ దేశమున నాతని దళవాయియగు హాసన్ గంగూ యనువాఁడు దిరుగఁబడి, స్వతంత్రుఁడయ్యెను. ఈతఁడు మొట్టమొదట ఢిల్లీ పట్టణవాసియగు గంగూయను బ్రాహ్మణుని కడ బానిసగా నుండెను. నవాబు కొలువున నా భూసురుఁడొక జోస్యుఁడుగా నుండెను. ఒకనాఁ డా విప్రుని సేవకుఁడగు హాసను భూమిని దున్నుచుండ నిక్షేపము దొరకెను. దానినాతఁడు భద్రముగఁ గొనిపోయి, యజమానునకు ముట్టఁజెప్పెను. గంగూ తన సేవకుని న్యాయమార్గమునకెంతయు సంతసించి, యాతని నవాబుకడకుఁ బిలిచికొనిపోయి, పదివేల గుఱ్ఱముల కాధిపత్యమిప్పించెను. తొలుత నాతఁడు రాజభక్తిగలిగి, చక్రవర్తికనేక విధములఁదోడ్పడి, యాతని మన్ననలనంది, 'జాఫర్ ఖాన్' అని బిరుదు వడసెను. ఆతఁడు క్రీ. శ. 1347 వత్సరమున 'అల్లాఉద్దీన్ షాహ' అను నామము ధరించి, స్వతంత్రుఁడయ్యెను.

తాను రాజైన పిమ్మటఁ దన యున్నతపదవికిఁగారణభూతుఁడైన గంగూ యను బ్రాహ్మణుని విస్మరింపక, యాతనిఁ దన రాజ

మునకుఁ గోశాధ్యక్షునిఁగ నియమించి, యాతని జ్ఞాపకార్థమై తనకు హసన్ గంగూయనియుఁ, దన వంశమునకు బహామనవంశమనియుఁ, దన రాజ్యమునకు బహామనీ రాజ్యమనియుఁ బేళ్లుపెట్టెను. కలబరగి (గుల్బర్గా) పట్టణమునకు హసనాబాదని పేరుపెట్టి, దానిని దనకు రాజధానిగఁ జేసికొనెను.

కలబరగిలో బహామనీ రాజ్యము స్థాపింపఁబడుటకుఁ బదునొకండు వత్సరములకుఁ బూర్వమే విద్యానగర సామ్రాజ్యము స్థాపింపఁబడి, సకల విధములఁ బెంపొందుచుండెను. అల్లాఉద్దీన్ షాహ క్రమక్రమముగాఁ దన రాజ్యమును గృష్ణానదీతటమునకు విస్తరింపఁజేసి, విజయనగర సామ్రాజ్యమును గబళింప నుంకించుచుండెను. కాని, హరిహరుఁడును నాతని సోదరులును నైకమత్యభావముతో వర్తించుచుండిరి. దీనికి పీ రేవురును, అళియ బల్లప్పదండనాయకుఁడును, కుమార శ్యామన్న యొడయరును గలిసి, తమ దిగ్విజయ జ్ఞాపకార్థము శా. శ. 1268 (క్రీ. శ. 1346) పార్థివ సంవత్సర ఫాల్గున బహుళ పాడ్యమినాఁడు శృంగేరి పీఠాధిపతులగు భారతీతీర్థ శ్రీపాదులకును, వారి శిష్యులకును, నఱువండ్రు బ్రాహ్మణులకును దొమ్మిది గ్రామములు దానము చేసిరను విషయమే నిదర్శనముగా నున్నది.[1] అన్నదమ్ములలోని యొద్దికవలన షాహ యాటలు సాగవయ్యెను. సాగకపోయినను నెడపదడప యుద్ధములు మాత్రము జరుగుచుండెను.

హరిహరాదులొకవంక ఢిల్లీ సుల్తానును గనిపెట్టుచు, వేఱొకవంక సామ్రాజ్యాభివృద్ధికై పాటుపడుచుండిరి. నానాఁటికి రాజ్యము వృద్ధికాఁజొచ్చెను. హరిహరరాయలు క్రీ. శ. 1343 వ వత్సరమున మరణించినట్లు స్యూయల్ పండితుఁడు వ్రాసెను. కాని, హరిహరుని శాసనములు క్రీ. శ. 1354 వఱకుఁ గన్పట్టుచున్నవి. కావున,

1. Epigraphia Carnatica, Vol. III, Page 21 (Introduction)

నాతఁడు క్రీ. శ. 1354 ప్రాంతమున మృతినొందినట్లూహింపవలసి యున్నది.[1]

హరిహరరాయల మరణానంతర మాతని ప్రథమ సోదరుఁడగు కంపభూపతి పట్టముఁగట్టుకొనక, తన తమ్ముఁడును, నద్వితీయ శౌర్యోపేతుఁడునైన బుక్కభూపతిని రాజ్యమున నిలిపి, తానెప్పటియట్టుల నుదయగిరినిఁ బాలించుచుండెను.

# మొదటి (వీర) బుక్కరాయలు

హరిహరరాయలకు సంతానము లేని కారణమున నాతని ప్రథమ సోదరుఁడగు కంపరాయల యనుమతిని ద్వితీయుఁడగు బుక్కరాయలు క్రీ. శ. 1355-వ సంవత్సరమున విద్యానగర సింహాసన మధిష్ఠించెనని వ్రాసియుంటిని. విద్యానగరనిర్మాత హరిహరరాయలే యైనను బుక్కరాయల ప్రతిభావిశేషమున నాతఁడు రాజ్యాభిషిక్తుఁడగునప్పటికే విద్యానగరసామ్రాజ్యము విస్తృతమై, యన్ని దిక్కులకు వ్యాపించెను. బుక్కరాయ లాంధ్ర కర్ణాట రాజులకుఁ దోడునీడయై, వారి గౌరవమునకు భంగము వాటిల్లకుండఁ గాపాడుచుండెను. దక్షిణాపథమునందలి హిందూరాజుల కీతఁడు చేదోడువాదోడుగ వర్తించుచుండెను. దాన నెల్లరాజులు బుక్కరాయల యభ్యుదయమునే యనిశము గోరుచుండిరి.

బుక్కరాయలు రాజ్యాధిపతియైన కొలఁదికాలమునకే యాతని యన్నయు, నుదయగిరి పాలకుఁడును నైన కంపరాయలు మృతిఁజెందినట్లు దెలియుచున్నది. ఏలయన - ఆతని తనయులలో మొదటివాఁడైన శ్యావన్న యొడయరు క్రీ. శ. 1356-వ వత్సరమునకే యుదయగిరిపట్టణమును రాజధానిగా, నుదయగిరిప్రాంత

1. Epigraphia Carnatica, Vol. VIII, Sh. 104

మును పాలించుచున్నట్లును, [1] ద్వితీయుఁడైన సంగముఁడు విక్రమ సింహాపురమును రాజధానిగ నుదయగిరి రాజ్యములోని ములికి నాటినిఁ, పాకనాటినిఁ బాలించుచున్నట్లును నొక శాసనమువలనఁ దెలియుచున్నది. [2] ఈ శాసనమును బట్టిచూడఁ దండ్రి గతించిన పిదప, సోదరు లిద్దఱును పైతృకరాజ్యమును విభజించుకొని పాలించుచుండినట్లు తోఁచుచున్నది. కావున, కంపరాయలు, బుక్కరాయలు రాజ్యమునకు వచ్చిన కొలఁది దినములకే మరణించెనని నిర్ణయింపవచ్చును.

**కుమార కంపరాయలు : దక్షిణ దిగ్విజయ యాత్ర**

బుక్కరాయల కేడుగురు కొడుకులున్నట్లు దెలియుచున్నది. వారిలోఁ గుమారకంపరాయలు ప్రసిద్ధిఁగన్నవాఁడు. ఈతని పరాక్రమాతిశయమునుగూర్చి శాసనములును, గ్రంథములును దెలుపుచున్నవి. కంపరాయల యర్థాంగియైన గంగాదేవి రచించిన 'కంపరాయచరిత్రము' నం దీతని దక్షిణ దిగ్విజయయాత్రయు, నీతని యద్వితీయ పరాక్రమమును జక్కఁగా వర్ణింపఁబడియున్నవి.

కంపరాయలు మొట్టమొదట 'ములువాయి' రాజ్యమునకు రాజ ప్రతినిధిగా నున్నట్లు దెలియుచున్నది.[3] పిదప నాతఁడు బుక్కరాయల వలన ననుజ్ఞాతుఁడై దక్షిణ దిగ్విజయయాత్రకు బయలువెడలెను. ఆ యాత్రాసమయమున నాతనికి గోపన్న మంత్రియు, సాళువ మంగరాజును సైన్యాధ్యక్షులుగ నుండిరి. తొలుఁదొల్త నాతఁడు క్రీ. శ. 1361-వ సంవత్సరమున ద్రావిడ దేశాధిపతియైన సాంపరాయలను జయించుటకై బయలుదేరి,[4]

1. Epigraphical Collections for 1906, No. 510
2. Epigraphia Indica, Vol. III, Page 24
3. Epigraphia Carnatica, Vol. X, KL. 203
4. Sewell's Lists of Antiquities, Vol. II, Page, 223

పాలేఱు నదీతీరముననున్న విరించిపురమునకుఁ బోయి దండు విడిసెను. ఆ సమాచారము సాంపరాయలు విని, సైన్యసమేతుఁడై వచ్చి, కంపరాయల డీకొనెను. ద్రావిడ సైన్యము లాంధ్ర కర్ణాటకులతోఁ బోరాడఁజాలక, యుద్ధభూమినిఁ గుప్పతెప్పలుగఁ గూలుటఁ గని, సాంపరాయలు చేయునది లేక, కొలఁది సైన్యముతోఁ బాఱిపోయి, రాజగంభీర పర్వతముఁ జేరెను. విద్యానగర సైనికులాతని వెన్నంటి చని, యాపర్వతమును సహితము ముట్టడించిరి. మరల నుభయులకును ఘోర యుద్ధము జరిగెను. సాంపరాయలు హతుఁడయ్యెను. ఈతని మరణవార్త కంపరాయచరిత్రము దెలుపుచున్నది. కాని, సంస్కృతాంధ్ర కావ్యములగు సాళువాభ్యుదయ, జైమిని భారతాదులను దిలకించిచూడ, సాంపరాయ లపజయము నొంది శరణువేఁడ, విజయనగర సైన్యాధ్యక్షుఁడైన సాళువ మంగరాజు మరల నారాజును రాజ్యమున నిలిపి, తాను 'సాంపరాయ స్థాపనాచార్య' బిరుదముఁగాంచెనని తెలియుచున్నది.[1] కంపరాయలు సాంపరాయలూను సామంతునిగఁ జేసికొనినపిదప, కాంచీపురమును జయించి, మరకతనగరమును రాజధానిగఁ జేసికొని, కొంత కాల మట నిలిచెను. ఆమీఁదఁ దురుష్కులను జయింప మధురాపురముపై దాడివెడలి, మధుర సుల్తానును సంహరించి, యాదేశమును స్వాధీనముచేసికొని, కంపరాయలు, తాను జయించిన దక్షిణదేశమునంతయుఁ బాలించుచుఁ, క్రీ. శ. 1375 ప్రాంతమున మరణించెను.

విద్యానగరసామ్రాజ్యము నత్యంతాభివృద్ధికిఁ దెచ్చుటలో బుక్కరాయల తనయుఁడైన కుమార కంపరాయ లెంతయుఁ దండ్రికి

1. 'దురములో దక్షిణసురతాను నెదిరించికొని వచ్చి సాంపరాయనికి నిచ్చె సామ్రాజ్యమున నిల్పి సాంపరాయ స్థాపనాచార్య బిరుద విఖ్యాతిఁ గాంచె' జై. భా. ప్ర. ప. 34

సాయపడెనని పై వివరింపఁబడిన చారిత్రక విషయములనుండి తెలియుచున్నది.

**సైన్యము : దండనాయకులు**

శాసనాధారములను బట్టి బుక్కరాయలకడ ననేక సైన్యములును, ప్రసిద్ధిఁగన్న సైన్యాధిపతులును నుండినట్లు గోచరించుచున్నది. దళాధిపతులలోఁ బేరుగన్నవాఁడు మల్లినాథుఁడు. ఈతఁడళియసాయన్న తనూభవుఁడు. 'అళియ' శబ్దమునుబట్టిచూడ నీతఁడు విద్యానగరరాజుల కల్లుఁడని తోఁచుచున్నది. మహమ్మదీయచరిత్రకారు లీతని నామమును దమ గ్రంథములయందు 'భోజమల్లుఁ' డని వ్రాసియున్నారు.

## మంత్రులు

బుక్కరాయలకడఁ బ్రజ్ఞాశాలురగు మంత్రులు పెక్కురుండిరి. విద్యారణ్యులుగాక, వారిలోఁ బ్రసిద్ధిఁగన్నవారు మాధవమంత్రి, అనంతసాగరుఁడు, బచ్చరాజును నని తెలియుచున్నది. స్థలాంతరమున విద్యారణ్యుల పవిత్ర చరిత్రమును సమగ్రముగ వ్రాసియుంటిని. తక్కుంగల మువ్వుర చరిత్రములను సంగ్రహముగ వివరించెదను.

**మాధవ మంత్రి**

సరియైన శాసనాధారములు దొరకనికాలమున మాధవాచార్యులును, మాధవమంత్రియు నొక్కఁడే యని చరిత్రకారులు నమ్మియుండిరి. ప్రకృతము గన్పట్టిన శాసనములనుబట్టి మాధవాచార్యులు వేఱు, మాధవమంత్రి వేఱు అని తేలినది. విద్యారణ్యుని చరిత్రసందర్భమున మాధవాచార్యులే సన్యసించి, విద్యారణ్యులయ్యెనని సకారణముగ నిరూపించియుంటిని.

మాధవమంత్రి గౌడబ్రాహ్మణుఁడు. ఆంగీరసగోత్రుఁడు. తండ్రి చౌండప్ప. గురువు కాశీవిలాసక్రియాశక్తి పండితుఁడు. శివభక్తియుతుఁడు. నాస్తికమతవాదుల నిర్మూలించిన దిట్టరి. ఉపనిషన్మార్గప్రవర్తకుఁడు. యోగాభ్యాసపరత నిహపరములు సాధించినవాఁడు. ఈతనికి వీరవసంతమాధవుఁడు, మాధవాంకుఁడు, మాదిరాజు అను నామాంతరములు గలవు.

మాధవమంత్రి బుక్కరాయలకాలమునఁ బ్రసిద్ధిగన్న మంత్రిగను, దండనాయకుఁడుగను నుండి, పశ్చిమఖండమును బాలించుచుండెనని యొక శాసనము దెలుపుచున్నది.[1] మఱియొక శాసనమున నీతఁడు బుక్కరాయలకుఁ బ్రతినిధిగ వనవాసినిఁ (జయంతిపురమును) బాలించుచుండెనని తెలుపఁబడియున్నది.[2] ఈతఁడు జయంతిపురాధిపతియైన పిమ్మట, మహమ్మదీయులను బాఱఁదోలి, కొంకణదేశమునకు రాజధానియగు గోవాపట్టణమును జయించి, తనకు గ్రంథరచనమునఁ దోడ్పడిన యిరువది నలుగురు బ్రాహ్మణ పండితులకు భూదానమొనర్చెను. రాయలయాజ్ఞానుసార మీతఁడు నాగరఖండములోని ముచ్చుండి గ్రామమును, దానికిఁ జేరిన రెండు శివారులను గాశ్మీర బ్రాహ్మణులకు దానమొసఁగెను. ఈతనికి, 'ఉపనిషన్మార్గ ప్రవర్తకాచార్య' 'భువనైకవీర' యను బిరుదద్వయ ముండినట్లొక శాసనమువలనఁ దెలియుచున్నది.[3]

ఈతఁడు సూతసంహితకుఁ దాత్పర్యదీపికయను వ్యాఖ్యానమును, శైవామ్నాయసారమును, మాధవనిదానము మొదలగు సద్గ్రంథముల రచించి, దిగంత విశ్రాంత కీర్తి నార్జించెను.

**అనంతసాగరుఁడు**

ఈతఁడు బుక్కరాయనికడ మంత్రిగనుండి పెనుగొండకు

1. Epigraphia Carnatica, Vol. VII, Shikanpur No. 281
2. Indian Antiquary, Vol. IV, Page 206
3. Epigraphia Carnatica, Vol. VIII, Tirthahalli, No. 46

దిట్టమైన కోటఁ గట్టించెను. [1] బుక్కరాయని కేడ్గురు కొడుకులు గలరని చెప్పియుంటిని. అందు నాఱవవాఁడగు భాస్కరరాయలు మంత్రిసత్తముఁడగు ననంతసాగరుని పేర నొక తటాకమును ద్రవ్వించి, దానికి 'అనంతసాగర' మని పేరిడెను.

బచ్చరాజు

రాజభక్తియం దీతఁడగ్రగణ్యుఁడు; దైవభక్తిపరుఁడు. దేశ సేవారతుఁడు. బుక్కరాయసముద్రము, కీర్తిసముద్రము, నాగవ్వ చెఱువు, బచ్చప్పచెఱువు, చౌడప్పకాలువ మొదలగువానిని ద్రవ్వించి, దేశమునుండి క్షామదేవతను బాఱఁదోలి, కీర్తిఁగాంచెను.

మంత్రులెల్లరును సకలాగమవేదియు, రాజనీతివిశారదుఁడును, విద్యానగరసామ్రాజ్య స్థాపనాచార్యుఁడును నగు మాధవ విద్యారణ్యుల యభిప్రాయానువర్తులై మెలఁగుచుండిరి. బుక్కరాయలును నామహనీయుని వాక్యమును వేదవాక్యముగ నెంచి, యాతనియం దఖండ గౌరవవిశ్వాసములుంచి, ప్రాజ్యసామ్రాజ్యమును బాలించుచుండెను.

తురుష్కులతోడి యుద్ధములు

మొదటి హరిహరరాయల కథాకథనమున బహమనీరాజ్య స్థాపకుఁడైన హసన్ గంగూ అల్లా ఉద్దీన్ షా హ చరిత్రమును వ్రాయుచు, విద్యానగరరాజులకును, బహమనీరాజ్యాధిపతులకును దఱచు యుద్ధములు జరుగుచుండెనని సూచించియుంటిని. బుక్కరాయలు బహమనీరాజులతో రెండుసారులు పోరవలసివచ్చెను. ఇందు మొదటి యుద్ధము క్రీ. శ. 1366-వ సంవత్సరమున నల్లా ఉద్దీన్ ద్వితీయ పుత్త్రుఁడైన మహమ్మద్ షాహతోడను, రెండవ

1. Epigraphia Indica, Vol. III, Page 238
2. Epigraphical Collections for 1903, No. 91

యుద్ధము క్రీ.శ. 1375-వ సంవత్సరమున మహమ్మద్ షాహ కొమారుండైన ముజాహిద్ షాహతోడను జరిగెను. మహమ్మదీయ చరిత్రకారుండైన ఫెరిస్తా యీ యుద్ధములను గూర్చి వ్రాసిన తెఱంగును, అందలి సత్యాసత్యములనుగూర్చి విచారింతము.

† మహమ్మద్ షాహతో యుద్ధము : 1366

"ఒకనాఁటి సాయంకాలమున మహమ్మద్ షాహ ప్రమోదసాగరనిమగ్నుండై నిండు పేరోలగంబున్న వేళ కొందఱు సంగీతపాఠకులు వచ్చి 'అమీరుఖుస్రూ' అనువానిచే రచియింపంబడిన రెండు గీతములను శ్రవణానందకరంబుగా వినిపింపంగాఁ బరవశుండై మధుపానము చేసి యొడలెఱుంగని చిత్తముతో విజయనగరధనాగారమునుండి ద్రవ్యమును గొని వారలకు బహుమానము చేయవలసినదని ముఖ్యమంత్రికి నాజ్ఞ చేసెను. సారాయిమత్తువలనఁ గలిగిన యుద్రేకముతోఁ జెప్పిన మాటగదాయని గ్రహించి యాజ్ఞాపత్రికను వ్రాసెను. కాని, విజయనగర రాజునకుఁ బంపలేదు. అయినను మహమ్మదుషాహ యా రాత్రి యా విషయమును గుఱించి యాలోచించుచుండెను. మఱునాఁడు మంత్రినిఁ బిలిపించి, 'యాజ్ఞాపత్రికను బంపితివా?' యని యడుగఁగానే, యాతఁడు, 'లే'దని ప్రత్యుత్తరమిచ్చెను. అంతట సుల్తాను, "ఏమీ! నా పెదవులనుండి యర్థములేని వ్యర్థపు మాట జాఱఁగలదా? సురాపానప్రమత్తుఁడనై నేనాజ్ఞ యిచ్చియుండలేదు. నాకట్టి సంకల్పము కలదు" అని హెచ్చరించెను. అంతట 'మల్లెక్ సయఫ్ఉద్దీన్' అను నతని మంత్రి యాజ్ఞాపత్రికపై రాజముద్రికను ముద్రించి శీఘ్రగామియగు నొక దూత

† ఈ యుద్ధమును గుఱించి ఫెరిస్తా ననుసరించి 'జీర్ణకర్ణాటక రాజ్యచరిత్ర' మను గ్రంథములో వర్ణించిన యంశములే యిందు బొందుపఱుపఁబడినవి.

చూ. ఆంధ్రుల చరిత్రము, మూ. భా. పు. 354-361

చేతికిచ్చి విజయనగరమునకుఁ బంపెను. కృష్ణరాయ లాపత్త్రికను వీక్షించి కోపోద్దీపితుఁడై, యా పత్త్రికందెచ్చిన దూతను నొక గార్దభముపై నెక్కించి, విజయనగర వీథులందూరేగించి, పేఁడనీళ్లు గొట్టించి, యవమానపఱిచి, యాతనిం బంపించుటయేకాక, భామినీ రాజ్యముపై దండెత్తుటకై సంసిద్ధులరై యుండవలసినదని తన దండనాయకుల కెల్లరకు సమాచారములు పంపి, యుద్ధమునకై యెదురుచూచుచుండెను. తన దండనాయకులెల్లరును స్వసైన్యములతో విజయనగరమునకు వచ్చిన తరువాత, కృష్ణరాయలు ముప్పది వేల గుఱ్ఱపు దళమును, మూఁడు వేల యేనుఁగులును, లక్షకాల్బలమునుగల సైన్యముతోడ 'ఆదవాని' దుర్గము చెంతకుఁ బోయి, యచటినుండి కొంత సైన్యమును సుల్తాను దేశమును బాడుచేయుటకై భామినీ రాష్ట్రమునకుఁ బంపెను. వర్షాకాలమాసన్నమగుట చేత రాయలు కృష్ణవేణీ తుంగభద్రానదుల సంగమస్థానమునకుఁ బడమట త్రికోణాకారముగానుండి హిందూ మహమ్మదీయులకు వివాద భూమియైయుండి, తరువాత, రెండు వందల సంవత్సరముల వఱకు యుద్ధరంగముగానున్న రాయచూరు మండలములోని ముఖ్య నగరమగు 'ముద్దకల్లు'నకుఁబోయి, యా పట్టణము పట్టుకొని, స్త్రీపురుష లను భేదములేకుండ నెల్లరను గ్రూరఖడ్గాహతిపాలుఁజేసి, విజృంభింపఁగా నొక్కఁడు మాత్రము ప్రాణమెట్లో తప్పించుకొని పోయి, కలుబర్గకేఁగి, సుల్తానునకీ సమాచారమంతయుఁ దెలియఁ జేసెను......ఈ మారణ కర్మవృత్తాంతమును మహమ్మదుషాహా విని దుఃఖాక్రాంతచిత్తుఁడయ్యెను, కోపోద్రేక మడంచుకొనలేక, యాదుఃఖసమాచారమును దెచ్చిన నిరపరాధియగు దౌర్భాగ్యునిఁ దత్క్షణమే చంపించెనఁట. మహమ్మద్ షాహా దర్బారులో నిలువం బడి, "మహమ్మదీయ మతావలంబకుల సంహారించినందుకుఁ బరిహారముగా పాషండమతాభిమానులగు విగ్రహారాధనపరులను

లకు హిందువులను మట్టుపెట్టినంగాని మతయుద్ధమును ప్రకటించు చంద్రాయుధమును మరల నొరలోనికిఁ జేర్ప''ననియు, ''హత్యనుండి వెనుదీయ''ననియుఁ బ్రతిజ్ఞపట్టి, యా దినముననే రణభేరి మ్రోఁగించి, దండయాత్రకు బయలు వెడలెను.

'మతయుద్ధమును ప్రకటించుచు మహమ్మదుషాహా కృష్ణా నదీతటముఁ జేరి, శత్రువుల రక్తముతో ముద్దకల్లు పురమునందలి రాయల ఖడ్గము పాలఁబడిన వారి యాత్మలకుఁ దర్పణమువిడిచి, సంతోషపెట్టుటకై శత్రువుల కభిముఖముగా నా నదిని దాఁటినం గాని భుజించుటయు, నిద్రించుటయు నశాస్త్రీయములని నిశ్చయించి, నిద్రాహారములు మానెదనని ప్రమాణము చేసెనఁట! పిమ్మట, తన కొడుకగు ముజాహీదుషాకుఁ బట్టముఁగట్టి, మంత్రియగు 'మల్లెక్ సయఫ్ ఉద్దీను'ని పాలకునిగా నియమించి, యిరువది యేనుఁగులను మాత్రముంచుకొని, తక్కిన యేనుఁగులనన్నింటిని నతనికిచ్చి, బుద్ధులు చెప్పి, కలుబర్గనగరమునకుఁ బంపివేసెనఁట! కాలవిలంబము చేయక, తరువాత, మహమ్మదుషాహా తొమ్మిది వేల గుఱ్ఱపుదళముతో నదిని దాఁటెనఁట! రాయలీవార్తవిని, దిగులుపడి, ధనకనక వస్తువాహనాదులను విజయనగరమునకుఁబంపివేసి, మఱునాఁడు వీలుగానున్న యుద్ధము చేయుటయో, లేనియెడల వెనుదీయుటయో జరిగింపవచ్చునని నిశ్చయించెనఁట! ఆ రాత్రి భయంకరమగు గాలి వీఁచుచుఁ గుంభవృష్టిగా వర్షము గురియుచున్నందున నేనుఁగులు మొదలగు భారవాహకములగు జంతువులు బురదలోఁజిక్కుకొని శ్రమపడుచు, సేనానివాసస్థానమును విడిచి నాలుగుమైళ్ల దూరమునకైన నడువ శక్తి కలవి కాకపోయినవి. మహమ్మదుషాహా యా వృత్తాంతమును విని, తన స్థానమును విడిచి, తానే వారల కభిముఖుఁడై నడువ నారంభించెను. మఱునాఁడుదయమునకు రాయల సైన్యమును సంధింపఁగానే వారలు సామగ్రినంతయు వెనుక దిగ

విడిచి, భయంపడి, యాదవాని దుర్గమునకుఁ బాఱిపోయిరఁట! మహమ్మద్ షాహ సామగ్రినంతయుఁ గొల్లవెట్టి శిశుసహితముగా స్త్రీపురుషుల డెబ్బదివేల జనులను సంహరించెనఁట! సుల్తాను వేసవికాలము గడచుపర్యంతము ముద్గల్లు పట్టణముననుండి, తరువాత సేనలంగూర్చుకొని, ఆదవాని దుర్గము ముట్టడించెను. రాయలు తన మేనల్లుని దుర్గసంరక్షణార్థము కొంత సైన్యముతో నిలిపి, తాను తుంగభద్రా నదికి దక్షిణ భాగమునందు నిలిచి విజయనగరమునుండి యింకను సేనలను రప్పించుకొని, యుద్ధసన్నద్ధుఁడై నిలిచియుండెను. మహమ్మదుషాహ శీఘ్రకాలములోనే తుంగభద్రా నదిని దాఁటి, విజయనగర రాజ్య భూములలోఁ బ్రవేశించెను. విజయనగరముపయి మహమ్మదీయులు దండెత్తివచ్చినవానిలో నిదియే ప్రథమ దండయాత్ర యని చెప్పవలసియున్నది. ఎందుకనిన నిదివఱకు ఢిల్లీ సుల్తాను తుంగభద్రానదికి నుత్తరముననున్న యానెగొందిని ముట్టడించెనేకాని, తుంగభద్రా నదిని దాఁటి యీవలకు వచ్చినవాఁడు కాఁడు. మహమ్మదుషాహ సిరుగుప్పను గ్రామసమీపమున నదిని దాఁటి, కౌతాళమునొద్దనున్న బయలులో రాయల సైన్యమును దాఁకెను. మహమ్మదుషాహ నదిని దాఁటి వచ్చుచున్నాఁడని చారులవలన విని, కృష్ణరాయలు తన మంత్రులను సేనాధిపతులను రప్పించి, సుల్తాను నేప్రకార మెదుర్కొనవలసియుండునో యోజింపసాగెను.

'అప్పుడందఱును జేరి రాయల ముఖ్య సేనాధిపతియగు భోజమల్లున కాధిపత్యము నిచ్చిరి. అతఁడు సంతసించి, తురుష్క రాజకుమారుని జీవముతో ఖైదీగాఁబట్టుకొని తీసికొని రావలసియుండునో, యతని శిరస్సు బల్లెమునకు గ్రుచ్చి చూపింపవలసియుండునో, రాయల చిత్తమును వినఁగోరుచున్నానని మహాగర్వముతోఁ బలికెనఁట! బ్రతికియున్న శత్రు వే యవస్థలోనున్నను నిష్టుఁడు

కాఁడు గనుకఁ, జేతి కందివచ్చినపుడు చెక్కాడుటయే యుచిత మార్గమని రాయలు ప్రత్యుత్తర మిచ్చెనఁట! రాయల యనుజ్ఞను బొంది మల్లయదండనాథుఁడు నలువదివేల గుఱ్ఱపుదళముతోడను, లక్ష కాల్బలముతోడను మహమ్మద్ షాహ నెదుర్కొని, హిందువులచేఁ బరమ పవిత్రములుగాఁ జూడఁబడు గోవులను మహమ్మదీయులు చంపుటను గూర్చియు, వారి దేవాలయములను నిర్మూలము చేయుటను గూర్చియు ననుదినమును వర్ణించుచు సైనికుల కుపన్యాసములిచ్చి చంద్రధ్వజులఁ జంపుటయే పరమార్థమని తోఁచునట్లుగాఁ బౌరుష మెక్కింపవలసినదిగా బ్రాహ్మణోత్తములకెల్లరకు నానతి యిచ్చెను. మహమ్మద్ షాహ భోజమల్లుని రాక విని, తన సైన్యమున కంతకు ఖాను మహమ్మదుని నధ్యక్షునిగా నేర్పఱచి, పదునైదువేల గుఱ్ఱపు దళమును, ఏఁబదివేల కాల్బలమునిచ్చి, తాను, పదివేల గుఱ్ఱపుదళముతోను, ముప్పదివేల కాల్బలముతోను సమరసన్నద్ధుఁడయి యుండెను. 1366 వ సంవత్సరము జూలై 23-వ తేది గురువారమునాఁడు సూర్యోదయ సమయమున నుభయసైన్యములునుగలసికొని సంకుల సమరంబుసకుఁ గడంగెను. ఉభయ సైన్యములును సముద్రతరంగములవలె నిటునటు నూఁగులాడుచు, నొండొరులతో డీకొని, సాయంకాలము నాలుగు గంటలవఱకు ఘోరయుద్ధము చేయఁగా, నిరుప్రక్కలను వేలకొలఁది జనులు మృతినొందిరని చెప్పుట యతిశయోక్తిగాదు. ఖాన్ మహమ్మదు సేనయొక్క కుడి యెడమ భాగములకు రక్షకులుగానున్న శూరాగ్రేసరులగు మూసిఖానుఁడును, ఏసీఖానుఁడును వీరమరణము నొందఁగా, వారి సేనలు హిందువుల ప్రతాపమునకుఁ దాళఁజాలక పలాయనములయ్యెను. ఈ దురవస్థనంతను జూచి, తురుష్క సైన్యములు దిగులుపడి, ధైర్యమును వదలి, చెల్లాచెదరగుచుండ, మహమ్మదుషాహ మూఁడువేల గుఱ్ఱపుదళముతో వచ్చి, మల్లయదండనాథునిఁ దాఁకి

నఁగానే, పాఱిపోవుచున్న తురుష్కసైన్యములు వెనుకకు మరలి వచ్చుచుండెను. మక్రీబుఖానుఁడు ఫిరంగులనుగాల్చుచు, శత్రుసైన్యమును జీకాకు నొందించుచు, ముందుకు సాగివచ్చి, శత్రువులను బాఱఁదోలుట కనుజ్ఞ యిమ్మని ఖానుమహమ్మదును నడిగెను. అతనికి మూలబలము కొంతయిచ్చి సాగుమని యుత్తర్వుచేసెను. ఫిరంగులను గాల్చుటకు హిందువులకుఁ గాలము చాలకపోయినందున, వీరావేశముతోఁ గత్తులుఁ గటారులుదూసి, తురుష్కులకభిముఖులై పిఱికితనమావంతయులేక, శత్రువులు సహితము మెచ్చునట్లుగాఁ బోరాడుచుండిరి. ఇట్లు ఖానుమహమ్మదునియొక్క 'పులి వేఁటకాఁ' డను పేరుగల యేనుఁగొకటి మావటీని యాజ్ఞకు లోఁబడక, శత్రుసేనా మధ్యభాగమునఁ జొఱంబడఁగా, మల్లయదండనాథుని యేనుఁగులడ్డపడి నిలుపఁగా, నాసందడి సమయములోఁ బులి వేఁటకాని మావటీఁడు ప్రాణములను గోలుపోయెను. తదనంతరము, ఖానుమహమ్మదయిదువందల గుఱ్ఱపుదళమును దీసికొని, సమరగజమును వెంబడించి పురికొల్పుచుండె. హిందూసేనలు క్రమము తప్పి చెల్లాచెదరగునట్లుగా నా యేనుఁగు ఘీంకృతులు వెట్టుచు ధ్వంసము చేయుచుండఁగా, భోజమల్లుఁడు దెబ్బతిని గాయమును బొంది, రణరంగమున నిలువలేక, పరాఙ్ముఖుఁడయ్యెను. తదనుచరులు సయితము నిలిచి యడ్డుపడలేక పోయిరి. హిందువులు తమ మధ్యభాగ మిట్లల్లకల్లోలమగుటఁజూచి యధైర్యపడి, నలుదిక్కులకుఁ బాఱిపోయిరి. ఇఁకఁ జెప్పవలసినదేమున్నది? తురుష్కులు చెలరేఁగి తారసించిన యెల్లరను నఱికివైచుచుండిరి. గర్భిణీ స్త్రీలను సయితము వదలిపెట్టక హతముచేయుచుండిరి. బిడ్డల రొమ్ములమీఁద నుంచుకొని పెనఁగులాడుచున్న తల్లులనుండి బిడ్డలను లాఁగి, బిడ్డలను దల్లులనుగూడ నఱకుచుండిరి. మహమ్మదు షాహా యిట్టి విజయవార్తలను దనరాజ్యమునకుఁ బంపి(యుఁ దృప్తి

నొందనివాఁడయి, తన ప్రతిజ్ఞఁ దీర్చుకొనుటకయి రాయలను వెంబడించి, మహారణ్యముల మధ్యఁ దఱుముచుండెను. కృష్ణరాయలు వానికిఁ జిక్కక హతశేషులను గూర్చుకొని, సురక్షితముగా వచ్చి విజయనగరముఁ బ్రవేశించెను. మూఁడు నెలలు మహమ్మదు షాహా రాయలను వెదకి నగరమును ముట్టడించెను. కాని, ముప్పది దినము లెంత ప్రయత్నముచేసినను రాయలు లోఁబడలేదు. పట్టణమును స్వాధీనము కాలేదు. తన ప్రయత్నము వ్యర్థముకాఁగా, నతఁడు పట్టణమును విడిచి తుంగభద్రానది మీఁదుగాఁ బాఱిపోవుచు, నడుగడుగునకు హిందువులచే నడ్డగింపఁబడుచుండియుఁ బోయిపోయి, యొక మైదానమున దండు విడిసియుండెను. రాయలును వారిని వెంబడించివచ్చి, సమీపముననే దండు విడిసియుండెను. మహమ్మదుషాహ పాఱిపోయిన విధముఁ జూడఁ దురుష్కులికఁ దమ్ముఁ దలపడఁ జాలరనియు, దేఱిపాఱఁ జూడనైనఁ జాలరనియు హిందువులకు దృఢవిశ్వాసమును గలిగించుచుండెను. ఆ హేతువుచేత హిందువులు జాగ్రత్త లేనివారలై పరాకుగలిగి, యలక్ష్యస్వభావముతో నుండిరి. రాయలొకనాఁటి రాత్రి మధురపదార్థములను సేవించి, వారకాంతావినోద గోష్ఠిలోనుండి, యానందాబ్ధి నోలలాడుచుండఁగా, నకస్మాత్తుగాఁ దురుష్కులు పైఁబడి, తమ కపట తంత్రమును బయల్పఱుపఁగాఁ, గృష్ణరాయలు పశ్చాత్తాపము నొందుచు, విజయనగరమునకు మఱలఁ బాఱిపోయెనఁట! పది వేల హిందువుల నుఱుమాడి, మహమ్మదుషాహా, తిరిగి విజయనగరమును ముట్టడించెను. రాయలు సమాధాన పఱచుటకై, రాయబారులను సుల్తానుకడకుఁ బంపెనుగాని, యాతఁడంగీకరింపకుండెనఁట! అదిచూచి వాని మిత్రుఁ డొకఁడు, 'మీరు లక్ష హిందువులను మాత్రమే సంహరించెదమని ప్రతిజ్ఞ పట్టినారుకాని, హిందూజాతినంతను జంపెదమని ప్రతిజ్ఞ పట్టలేదే' యని మందలించె

నఁట! అందుకు సుల్తాను తాను ప్రతిజ్ఞపట్టిన మొత్తముకన్న నిను మడిగా హిందువులను జంపినను రాయలు లోఁబడి తానాజ్ఞ చేసిన మొత్తమును సంగీత పాఠకులకు సమర్పించినఁగాని, రాయలయెడలను, నాతని ప్రజలయెడలను గరుణఁ జూపఁజాలనని బింకములు వలుకుచుండఁగా, రాయల రాయబారులు, సర్వస్వాతంత్ర్యమును బొంది వచ్చినవారు గావున, నా మొత్తము నాతనికిఁ దక్షణమే చెల్లించిరి. 'రాయలయందుఁ దప్పిదమున్నయెడల నిరాధారులు నిరపరాధులు నగు ప్రజలును, స్త్రీలును, బిడ్డలునుగూడ దండనార్హులగుదురా' యని రాయబారులు మందలింపఁగా, సుల్తాను, భగవదనుజ్ఞ యట్లుండెననియు, నద్దానిని మార్పఁ దనకు శక్తిలేదనియు నుడివెనఁట! హిందూమహమ్మదీయు లిరుగుపొరుగువారగుటవలన ననవసరములగు క్రూరకృత్యములు మానుట యుచితమనియు, లేనియెడలఁ బరస్పర ద్వేషములు ప్రబలములగుననియు రాయబారులు వాదింపఁగా, మహమ్మదుషాహ వారి వాదములు సహేతుకముగా నుండుటచేతఁ దా నోడంబడితిననియు, నిఁక నెన్నఁడును దనకు జయము లభించిన తరువాత శత్రువుని నొక్కనినైన నిష్కారణముగాఁ జంపింపననియు, నెదుటివారుగూడ నట్లేచేయ బద్ధులనియుఁ బలికి, ప్రమాణము చేసెనఁట! ఆ పద్ధతి కొంతకాలమువఱకు నవలంబింపఁబడెను. కాని, తరువాతి ప్రభువులామార్గమును మఱచి, యథేచ్ఛగాఁ గ్రూరకృత్యములు చేయుచునేయుండిరి. ఈ మహాయుద్ధమునందు నైదులక్షల హిందువులను జంపి, కర్ణాటక భూములను నిర్జన ప్రదేశములుగాఁ జేసెనని మహమ్మదుషాహను ఫెరిస్తా శ్లాఘించుచు నతిశయోక్తిగాఁ జెప్పుచున్నాఁడు. తరువాతఁ గొన్ని సంవత్సరములవఱకుఁ బోరులేకుండ రెండు రాజ్యములవారికి సఖ్యతగలిగి యుండెను."

పై వర్ణింపఁబడిన యుద్ధవిషయములయందలి సత్యాసత్య

ములనుగూర్చి యించుక చర్చింతము. బహమనీరాజ్యపు సుల్తాన
మహమ్మదుషాహాతో యుద్ధమొనర్చినరాజు విద్యానగరాధీశ్వర
డగు కృష్ణరాయఁడని ఫెరిస్తా వ్రాసెను. మహమ్మదుషాహా క్రీ. శ
1358 మొదలు 1375 వఱకు బహమనీరాజ్య పాలకుఁడుగానుం
నట్లు చరిత్రలవలనఁ దెలియుచున్నది. తుళువ వంశోద్భవుఁడ
శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1509 మొదలు 1529 వఱకు విద్యా
నగరమును బాలించెను. పదునాల్గవ శతాబ్దముననుండిన మహమ
దుషాహా, పదునాఱవ శతాబ్దముననుండిన శ్రీకృష్ణదేవరాయలతో
యుద్ధమొనర్చెనని వ్రాయుట యేటిమాట! అది తర్కవిరుద్ధము
కావున నీ గాథ ఫెరిస్తా కల్పితమనుట కెట్టి సందియమును లేద
ఇంకొక విషయము సహిత మాలోచించవలసియున్నది. ఈ యుద్ధమ
పదునాల్గవ శతాబ్ది మధ్యమున జరిగెను. ఫెరిస్తా పదునేడవ శత
బ్దారంభమున జనించినవాఁడు. కావున, నతఁడు ప్రత్యక్షము
జూచి వ్రాసిన కథగాదిది. నిరాధారమైన జనశ్రుతినిఁబట్టి యా చ
త్రకారుఁడు తన ప్రభువులగు సుల్తానుల చెవులకింపుగా నల్లినగాథ
యుండనోపును. బుక్కరాయల కాలమునకును, కృష్ణరాయల కా
మునకును గల యంతర మెఱుంగని చరిత్రకారుని వ్రాఁత లెట్లు విశ్వ
సనీయములగును?

మఱియు, వర్ణనాంశములందు సహితము గొన్ని విపరీ
ములు గన్పట్టుచున్నవి. ఐదు లక్షల హిందువులను దుదముట్టించి
కృష్ణరాయలను నాజినిర్జించిన మహమ్మదుషాహా, సంగీత పాఠకులక
బారితోషికముగ నీయవలసిన కొలఁది పైకమునుమాత్రము కృ
రాయల ధనాగారమునుండి గ్రహించి, రాజ్యమును గొల్లగొనక
సంధిగొడఁబడియుండునా? సిరిరా మోఁకాలొడ్డువారుందురా
చేజిక్కిన రాజ్యమును జాఱవిడుచు వెడఁగు లుందురా? గాం
కుల కీయవలసిన ధనము నొసఁగుటతోడనే సుల్తాను తృప్తిఁజెం

నని ఫెరిస్తా వ్రాసిన వాక్యమే మహమ్మదుషాహాకు సంపూర్ణ విజయ మా యుద్ధమునఁ గలుగ లేదనుటకు నిదర్శనమైయున్నది. మఱియు, సుల్తాను కతిపయపరివారముతో వచ్చెననియుఁ, గృష్ణరాయ లసంఖ్యాకసైన్యములతో వచ్చి, మహమ్మదుషాహాతోఁ బోరలేక పాఱిపోయెననియు ఫెరిస్తా వ్రాసియున్నాఁడు. జగద్విఖ్యాత పరాక్రమోపేతుఁడై, వీరపురుషసూచక బిరుదావళీ విరాజమానుఁడై వెలుఁగొందిన కృష్ణరాయ లేమి, యల్పసైన్యసమేతుఁడైన మహమ్మదుషాహాతోఁ బోరలేక పాఱిపోవుటేమి? ఈ విషయ మవిశ్వాసనీయము.

మహమ్మదుషాహ యంపిన రాయశారినిఁ గృష్ణరాయ లవమానించెనని ఫెరిస్తా వ్రాసెను. ఇది నిజమగుచో, రాయశారి నవమానించిన రాయలపైఁ గసిఁ దీర్చుకొనక, గాయకుల కీయవలసిన స్వల్ప ద్రవ్యముతో మహమ్మదుషాహ తృప్తిఁజెందెనని వ్రాయుట యెంతయు హాస్యాస్పదముగా నున్నది. ఇది వీర పురుషోచిత లక్షణముగాదు. కావున, నీ యుద్ధవిషయమే యసత్యమై యుండనోపు!

**ముజాహీద్ షాహాతో యుద్ధము: 1375**

బహామనీరాజ్య పాలకుఁడగు మహమ్మదుషాహ క్రీ. శ. 1375 సంవత్సరమునఁ బరలోకగతుఁడయ్యెను. ఆతనికి ముజాహీద్ షాహాయను కుమారుఁడుండెను. పితృమరణానంతర మాతఁడుసింహాసనమెక్కెను. సింహాసనాసీనుఁడగునప్పటి కాతనికిఁ బందొమ్మిదియేండ్ల ప్రాయము. రాజ్యమునకు వచ్చియు రాకమునుపే, యాతఁడు విజయనగరాధీశ్వరునితో యుద్ధమునకుఁ బ్రారంభించెను. ఆ యుద్ధము మూఁడు వత్సరములు జరిగెనఁట.

† "మహమ్మదుషాహ మరణానంతర మాతని కుమారుఁడు ముజాహిదుషాహ సింహాసనమునకు వచ్చెను. ఇతఁడు సింహాసన మెక్కినతోడనే కృష్ణా తుంగభద్రానదులకు మధ్యనుండు దుర్గములును, మండలములును దమకుఁ జెందియున్నవనియు, వానిని గుఱించి యప్పుడప్పుడు తగవులాట గలుగుచున్నదనియు, నట్లు కలుగకుండఁ దుంగభద్రానది సరిహద్దుగాఁ జేసికొని, దానికిఁ దూర్పున నుండు దేశమును వెంగాపుర (బంకాపురము) దుర్గమునుగూడ విడిచి పెట్ట వలసినదనియుఁ గృష్ణరాయలకు వ్రాసెను. ఈ వెంగాపురము ధార్వాడకు దక్షిణముననున్నది. సముద్రతీరమునకును, విజయనగరమునకును మధ్య నుండుటచేతఁ దురుష్కులు చిరకాలము నుండి యా కోటను స్వాధీనముఁ జేసికోవలెనని తలంచి, మోహదృష్టితోఁ జూచుచుండిరి. అందుకుఁ గృష్ణరాయలు 'రాయచూరు ముద్దకల్లు దుర్గము లానెగొంది సంస్థానమునకుఁ జెందినవగుటచేత రాయచూరు మండలమంతయు వదలిపెట్టవలసినదనియుఁ, గృష్ణానదియే సరియైన సరిహద్దనియు, మహమ్మదుషాహ తన యొద్దనుండి కైకొన్న యేనుఁగులను మఱలఁ దనకిచ్చివేయ వలసినదనియుఁ' బ్రత్యుత్తరమంపెను. సుల్తాను యుద్ధమును బ్రకటించెను. సుల్తాను రెండునదులను దాఁటి ఆదవాని దుర్గముకడకు వచ్చిచేరెను. కృష్ణరాయలు తుంగభద్రానదీతటమున దండు దిగియున్నాఁడని విని, ముజాహిదుషాహ తనసైన్యమును రెండు భాగములుగా భాగించి, యొక బలము కోట ముట్టడించుటకును, రెండవబలముతోఁ దాను బోయి విజయనగరమును బట్టుకొనుటకును నిశ్చయించి, వాయవ్యమూలమార్గమున జాగరూకతగలిగి సేనలను నడిపించుకొని పోవు

---

† ఈ యుద్ధమును గుఱించి ఫెరిస్తా ననుసరించి, 'జీర్ణ కర్ణాటక రాజ్యచరిత్ర' మను గ్రంథములో వర్ణించిన యంశములే యిందుఁ బొందుపఱుపఁ బడినవి.

చూ. ఆంధ్రులచరిత్రము, మూ. భా. పు.364-368)

చుండెను. కృష్ణరాయలు మొట్టమొదట సుల్తానును సంధించి, సమరము చేయుటయే యుక్తమని యోజించెనుగాని, తరువాత నది మంచిపద్ధతి కాదని తలఁచి, తనరాజధానికి దక్షిణముననున్న సొండూరు కొండలలోని యడవుల లోనికిఁ బోయియుండెను. మజాహీదుషాహా వానిని వెంబడింపక, విజయనగరము సొగసైన నగరమని బహుజనులు శ్లాఘించుచుండుటచేత నచటికిఁ బోవఁజూచెను. కాని, యది సుసాధ్యముకాని హేతువుచేతఁ, దిన్నఁగాఁ గృష్ణరాయలున్న యరణ్యమునకు దారితీసెను. సుల్తాను వచ్చుచున్నాఁడను సమాచారము విని, రాయ లాయరణ్యమార్గములు తురుష్కులకుఁ గ్రొత్తవి యగుటఁ దలపోసి, యాతని నా కాఱడవులలో నాయాసపెట్టఁ దలంచియుండ, సుల్తాను మహారణ్యమును భేదించుకొని దారు లేర్పఱచుకొనుచు రాయల సైన్యమును వెంబడించుచుండ, నా రాయ లా స్థానమును విడిచి, మఱియొకస్థానమునకుఁ బోవుచు, నీరీతిగా నాఱుమాసములు సుల్తానున కందకయే చిక్కులు పెట్టుచుండెను. సుల్తాను వజీరులిది ప్రయాససాధ్యమనియు, లాభము లేని త్రిప్పటయనియు, సైన్యమునకు నధిక కష్టము సంభవించుననియు బహువిధముల బోధించి, యతనిని మరలింపఁ జూచుచుండిరి. కాని, వారి యదృష్టవశమున రాయల కారోగ్యభంగము కలిగి, యా యడవులలోని విషవాయువుల నాఘ్రాణించుటవలనఁ బ్రాణాపాయము కలుగవచ్చును గావున, నాతని వైద్యులడవిని విడిచి, స్వరాజధానికి విజయం చేయవలసినదని వేఁడుకొనుట తటస్థించెను. కృష్ణరాయలు చేయునదిలేక, వారి యుపదేశమును విశ్వసించి, చాటుదారులను దప్పించుకొనిపోయి, విజయనగరముఁ బ్రవేశించెను. సుల్తానాతనివెనుకఁ గొంతసైన్యమును బంపి, తాను 'అమీరాలత్రమా బహదూరుఖాను'తో నైదువేల సైనికులను దీసికొని, సేతుబంధరామేశ్వరమను ప్రదేశము సందర్శించుటకై పోయెను.

ఈతఁడా ప్రదేశమున సుల్తాను 'అల్లాఉద్దీనుకిల్జీ' కట్టించిన మసీదును బాగుచేయించుటయే గాక, హిందూదేవాలయములను బెక్కింటిని గూలఁద్రోయించి, దేశమునంత పాడుచేసి, విజయనగరమునకుఁదిరిగి వచ్చెను. ముజాహీదుషాహా, తరువాత, నెట్లో కృష్ణరాయలకుఁ దెలియకుండఁ జాటుదారులగుండవచ్చి, విజయనగరముపైఁ బడె'' నని ఫెరిస్తా యసందర్భపు వ్రాఁతలను వ్రాయుచున్నాఁడు.

''తురుష్కులు విజయనగరమును బ్రవేశించుటకు నద్భుత పడి, కృష్ణరాయలు వీథులను గాపాడుటకుఁ బెక్కండ్ర సైనికులను బంపెనఁట! కాని, తురకలు హిందువులను దఱిమి, మెట్టకేలకుఁ గోటకును బట్టణమునకు నడుమనున్న చెఱువుకట్ట నాక్రమించుకొనిరఁట! ఆ సమీపముననున్న కొండపై నెక్కి యచటి హిందూదేవాలయ మిడియఁగొట్టి, యమూల్యములగు రత్నాభరణములతోడ నలంకరింపఁబడిన సువర్ణమయములగు విగ్రహములను జూఱఁగొనిరఁట!'' పరుల కవిలంఘ్యములగునట్టి సప్తప్రాకారములుగలిగి, విజయనగరము లక్షలకొలఁది శూరాగ్రేసరులచేఁ బరిరక్షితమై యున్న మహానగరమని కన్నులారఁజూచిన విదేశీయచరిత్రకారులు పెక్కండ్రు వర్ణించియున్నారు. అట్టి సురక్షితస్థానముల నన్నింటిని దాఁటి యొడలుదుమ్ముగాకుండ, ననాయాసముగా సుల్తానెట్లు రాఁగలిగెనో వింతగానున్నయది. ఈ వృత్తాంతము జరిగిన రెండు శతాబ్దముల కావలనున్న యీ చరిత్రకారుఁడు ఫెరిస్తా స్వజాతి వారిలోఁ జెప్పుకొనెడు కల్పనాకథలనుబట్టి యీ చరిత్ర మల్లెను గాఁబోలు! ''కట్టకడ ముజాహీదునకుఁ 'జావుతప్పి కన్ను లొట్టపోయె' నను సామ్యముననుసరించి, ప్రాణగండము గలిగియుఁ దప్పించుకొనిపోవుట తటస్థించెను. అత్యంత చింతాస్పదంబగు తురుష్కుల దౌర్జన్యమునకు నోర్వంజాలక, హిందువులెల్లరు లోని రోషానలంబు ప్రజ్వలింప, శత్రువినాశనమునకై కృష్ణరాయలను బ్రోత్సా

హూంపటచి, లక్షలకొలఁది హిందూశూరాగ్రేసరులు ధ్వజమెత్తి వచ్చుచుండుటను జూచి, ముజాహీదుషాహా తన ఛత్రము నావలఁ బాఱవైచి, తనకై దండ యొసఁగువానిఁ గపిలదేశపుఁ దురుష్కుని మూమూదనువానిని వెంటఁదీసికొని, శత్రువుల సంఖ్యను గనుఁగొనుటకై చిన్న సెలయేటిని దాఁటి, యావలియొడ్డున నిలువంబడి యుండెను.''

'అప్పుడు పరాక్రమవంతుఁడగు నొక్క హిందువు సుల్తాను స్వారివెడలు గుఱ్ఱమును గుర్తుపట్టి, తనదేవతాస్థానముల నిర్మూలించిన పగఁదీర్చుకొని ప్రఖ్యాతినొందుటకై సుల్తాను వంకకు నశ్వారూఢుఁడై యతివేగమున వచ్చుచుండెను. అతఁడు పొదలచాటున నుండియు, నొడ్డువిఱిగి పల్లముగానున్న సెలయేటి యొడ్డు వెంబడి నేరికిఁ గానరాకుండవచ్చి, బయలుపడి, తనవంక నతివేగమున వచ్చుచుండుట నదృష్టవశమున సుల్తాను వీక్షించి, మూమూదునకు సైగచేయఁగా నాతఁడు వెంటనే గుఱిపెట్టి కాల్చెను. కాని, తన గుఱ్ఱము బెదరినందున నతఁడు క్రిందఁబడెను. ఇంతలో శత్రువు మూమూదును సంహరింపనుద్యుక్తుఁడు కాఁగా, ముజాహీదుషాహా భుజబలాఢ్యుఁడు గాన నతనిరక్షణకై తత్క్షణమే పోవ నా హిందువు మూమూదును జంపుటమాని, సత్తువతో సుల్తాను నొక్క దెబ్బ తీసెను. కాని, యదృష్టవశమున సుల్తానడ్డుపెట్టిన యినుపసుత్తెవలన నతఁడు జీవింపఁగలిగెను. లేనియెడల, నా దెబ్బతో ముజాహీదు నామమాత్రావశిష్టుఁ డగుననుటకు సంశయములేదు. చూపఱులందఱు నా దెబ్బ సుల్తాను ప్రాణముఁగొనెనని నిశ్చయించిరి. కాని, యట్లు జరుగక సుల్తాను సుత్తెపెట్టుతో శత్రువు రెండు తుండెములై క్రిందఁబడిపోయెను. తరువాత మూమూదును గుఱ్ఱముపై నెక్కించి, సుల్తాను సైన్యమును జేరుకొనెను. తదనంతరము ఘోర యుద్ధము జరిగినది; కాని, హిందువులు పరాజితులయిరి.

తురుష్కులు బడలికఁ దీర్చుకొనుచుండిరి. ఇంతలోఁ గృష్ణరాయల సోదరులలో నొకరు (మారభూపతియో, లేక ముద్దప్పయో) అఱువది వేల గుఱ్ఱపు దళముతోడను, నధిక కాల్బలముతోడను రాజధానికి వచ్చి, రాయలను గలసికొనఁగా, భయంకరమగు యుద్ధము మరల నారంభమయ్యెను. అప్పుడు సుల్తానునకు నాపద కలుగునేమో యను భీతిచే, నతని బంధువు దావుదుఖానుండను వాఁడు తన స్థానమగు ధర్మసముద్రమును విడిచి, యుద్ధము జరుగు ప్రదేశమునకు వచ్చెను. తురుష్కులు మఱల జయమును బొందిరి. కాని, శత్రువులు దావుదుఖానుఁడు విడిచివచ్చిన ధర్మసముద్రమును ముట్టడించి, పట్టుకొని, సుల్తాను సైన్యమునకు వెనుకనే హానిఁజేయుచు భీతి కలిగించుచుండిరి.

ముజాహిదుషాహ యుద్ధభూమిని విడిచిపెట్టి కొండలలో నుండి తన సైన్యమును సురక్షితముగా నావలకుఁ దరలించుకొని, యఱువది వేల హిందువులను - ముఖ్యముగా స్త్రీలను ఖైదీలనుగాఁ దీసికొనిపోయి యాదవాని దుర్గమును దొమ్మిది మాసములు ముట్టడించియు నయ్యది స్వాధీనము గాకపోవుటవలన నా ప్రయత్నమును మానుకొని స్వదేశమునకుఁ బోయెను. అంతటితో యుద్ధము ముగిసినది.''

ఇఁకఁ బై వివరింపఁబడిన యుద్ధ విషయములనుగూర్చి యించుక చర్చింతము. ఈ దండయాత్రవలన సుల్తానున కెట్టి లాభమును గలుగలేదు సరికదా, మీఁదు మిక్కిలి, యనేక సైన్యములను గోలుపోయి వచ్చినత్రోవనే మరలిపోయెను. ఇది యపజయముగాక జయమెట్లగును? విజయనగరములోను, ఆదవానిలోను సుల్తానున కపజయము గలిగెనని స్పష్టముగఁ దెలియుచున్నది.

విజయనగరమునుండి రామేశ్వరమువఱకును నైదువేల సైనికులఁగొని ముజాహిదుషాహ రాయలను దఱుముకొని వచ్చె

నని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు. విజయనగరమునుండి రామేశ్వరమున కైదువందలమైళ్ల దూరముగలదు. వెళ్ళి వచ్చుటకు వేయి మైళ్ళగును. రామేశ్వర విజయనగరములకు నడుమ బుక్కరాయలకు లోఁబడిన రాజ్యములు పెక్కులు గలవు. అల్పసైన్యములతోఁ బోయిన సుల్తానును మధ్యేమార్గమున నెవ్వరును నడ్డగించియుండరా? కతిపయసేనతో నాతఁ డెట్లన్ని రాజ్యములను దాఁటి, రామేశ్వరమునకరిగియుండును? ఈ యుద్ధకాలమునకును, శ్రీకృష్ణదేవరాయల జనన కాలమునకును నంతరము నూఱు వత్సరములు గలదు. కావున, నీ విషయములు సత్యదూరములు.

బుక్కరాయల యోగ్యత: పరిపాలనము

కొందఱు చరిత్రకారులు బుక్కభూపాలుని సత్త్వహీనునిగఁ జిత్రించిరి. కాని, ఫెరిస్తా వ్రాఁతలవలె వీరి వ్రాఁతలును నిరాధారములని చెప్పవలసియున్నది. ఏలన-నీతఁడు, సోదరుఁడైన మొదటి హరిహరునకు బాసటయై, విద్యానగరరాజ్యాభివృద్ధికై యెంతయుఁ బాటుపడినవాఁడు. హరిహరుని మరణానంతరము రాజ్యమునకు రావలసిన కంపభూపతియే తన తమ్ముఁడైన బుక్కరాయల పరాక్రమాతిశయమును గమనించి, యాతనినే రాజ్యమున నిలిపెను. నిజముగా బుక్కభూపతి సత్త్వహీనుఁడగుచోఁ, గంపరాయ లాతని నేల సింహాసనమున నిలిపియుండును? మఱియు, నీతని కాలముననే విద్యానగరసామ్రాజ్యము విస్తృతమై, మొనలేని కీర్తి గౌరవముల నార్జించి, మహోన్నతదశనందెను. ఈతని కాలముననే యతివిశాలములగు వీథులు విద్యానగరమున నిర్మింపఁబడెను. భవ్యతర భవనములు గట్టఁబడెను. విపణి వీథు లేర్పఱుపఁబడెను. ఖండాంతరములందలి వణిక్శిఖామణులకు సహిత మీనగరము ప్రధానవర్తకస్థానమయ్యెను. ఈతఁడు సకల ప్రజారంజకుఁడనియుఁ, బ్రజలు రాజున

కనుకూలురుగ నుండిరనియు, దేశము ప్రజావంతముగ నుండెననియు ఫెరిస్తాయే వ్రాసియున్నాఁడు. బుక్కభూపతి యనేక తటాకములును, గాలువలును, బావులును ద్రవ్వించి, సేద్యమున కనువైన వసతుల నేర్పఱచెను. దాన, సర్వంసహా సర్వసస్యాఢ్యయై యొసలారుచుండెను.

రాజ్యవ్యాప్తి

బుక్కరాయల కాలమున విద్యానగరము సకలవైభవోపేతమై, యుత్తరమునఁ గృష్ణానదివఱకును, దక్షిణమున మధురానగరమువఱకును, బూర్వపశ్చిమ సముద్రతీరములవఱకును వ్యాపించి యుండెనని చరిత్రలు నుడువుచున్నవి. సంపదయందేమి, రాజ్యవిస్తారమునందేమి యిది బహమనీరాజ్యమునకన్న నన్ని విధముల మిన్నయై వెలుఁగొందెను. రేవుపట్టణమగు 'గోవా' పట్టణమును, 'మాల్‌గా' మను దుర్గమును, తుళువదేశములోని యనేక మండలములును బుక్కభూపతి పరిపాలనమునకు లోఁబడియుండెను. సింహళము మొదలగు దేశముల పరిపాలకులు సహితము బుక్కరాయల కనర్ఘములైన కానుకలఁ బంపుచుండిరని ఫెరిస్తాయే వ్రాసియున్నాఁడు.

మతము

బుక్కభూపతి శైవమతావలంబకుఁడు. శైవాగమతంత్రవేది యగు కాశీవిలాసక్రియాశక్తిపండితునకు శిష్యుఁడు. ఈతఁడు పరమతద్వేషి కాఁడు. క్రీ. శ. 1368-వ సంవత్సరమున 'శ్రావణబెళ్గొలా' యను పట్టణమున జైనవైష్ణవ మతావలంబకులకు మతకలహము లంకురించెను. తాను శైవాచారపరుఁడయ్యుఁ బరమతసహనపరాయణుఁడగుటచే నుభయులను బిలువనంపి, యాదరించి, సమాధానపఱచి, తగవుఁ దీర్చెను.[1]

1. Rice Inscriptions at Sravana Belgola, Translations, Page 80.

సారస్వతసేవ

బుక్కరాయలు సంస్కృతాంధ్రముల సమానముగ నాదరించిన మహనీయుఁడు. సాయణమాధవు లీభూపాలుని యాదరణమున వేదములకు భాష్యము రచించిరి. అదియే యిప్పుడు 'సాయన భాష్య' మని వ్యవహరింపఁబడుచున్నది. మాధవమంత్రియు నీతని ప్రోత్సాహమునఁ బెక్కు గ్రంథములు రచించెను.

బుక్కభూవిభుని ప్రాపునఁ బెంపొందిన యాంధ్ర కవిసత్తముఁడు నాచనసోముఁడు. ఈతఁ డాపస్తంబసూత్రుఁడు; భారద్వాజ గోత్రుఁడు; యజుశ్శాఖీయుఁడు; సకలాగమవేది. ఈతని వాసస్థానమిద్దియని నిర్ణయింపఁదగు నాధారములు లేవు. ఉత్తర హరివంశ కావ్యమును రచించిన మేటికవి. బుక్కరాయ లీ కవిసత్తమునకును, మఱి యెనుగురు బ్రాహ్మణులకును బాపాతటమున భాస్కరక్షేత్రమున శ్రీవిరూపాక్షస్వామి సన్నిధిని శా. శ. 1266 తారణ సంవత్సర చైత్రశుద్ధ నవమినాఁడు పినాకినీతీరముననున్న 'పంచాలక దిన్న' (పెంచుకలదిన్న) యను గ్రామమును 'బుక్కరాయపుర' మను పేరుపెట్టి, ధారపోసెనని యొక శాసనమువలనఁ దెలియు చున్నది.

ఏడటూరు శాసనమువలన బుక్కరాయలు క్రీ. శ. 1377–వ వత్సరమున భౌతిక దేహమును జాలించెనని తెలియు చున్నది. [1]

# రెండవ హరిహరరాయలు

వీరబుక్కరాయలకుఁ బెక్కురు భార్యలుగలరు. వారివలన నాతనికి హరిహరరాయలు, కుమార కంపరాయలు, చిక్కకంప రాయలు, సంగముఁడు, విరుపన్న, భాస్కరుఁడు, మల్లినాథుఁడు

1. Epigraphia Carnatica. Vol. IV. YD. 46

నను నేడ్గురు కొడుకులు గలిగిరి. వారిలో దేవాంబికవలన జనించిన కుమార కంపరాయలు ప్రసిద్ధికెక్కినవాఁడు. ఈతని దక్షిణదిగ్విజయయాత్రను గూర్చి వ్రాయునప్పు డీతని శౌర్య పరాక్రమములను విపులీకరించియుంటిని. కుమార కంపరాయలు దండ్రికంటె ముందుగ, క్రీ. శ. 1375-వ వత్సర ప్రాంతమున మృతినందెను. పితృమరణానంతరము, గౌరాంబికా తనూభవుఁడగు హరిహరరాయలు క్రీ. శ. 1377-వ సంవత్సరమున సింహాసన మలంకరించెను.

హరిహరరాయ లదృష్టశాలి. సాహిత్యవిశారదుఁడు. ప్రజాసుఖైకరతుఁడు. దేవబ్రాహ్మణ భక్తియుతుఁడు. నిష్పక్షపాత బుద్ధిఁ గలవాఁడు. ఎట్టి యొడుదొడుకులు లేక యీతఁడు రాజ్యమును బూజ్యముగ నిరువదియేడు వత్సరములు పాలించెను. ఈతని పాలనము శాంతియుతమై యొప్పెను. సంగమవంశ రాజులలో నీతఁడు మఱవఁదగినవాఁడు కాఁడు. ఏలన—ఈతనికి ముందు విద్యానగర సామ్రాజ్యమును బాలించిన హరిహరరాయలును, బుక్కరాయలును 'మహామండలేశ్వర', 'ఒడయర్' అను బిరుదములతో మాత్రము తృప్తినొందియుండిరి. రెండవ హరిహరరాయలు తన వారు సంపాదించిన బిరుదములతోఁ దృప్తినొందక, దాక్షిణాత్య ప్రభువుల నెల్లర నిర్జించి, సామ్రాజ్యమును విస్తరింపఁజేసి, 'మహారాజాధిరాజ', 'రాజపరమేశ్వర' బిరుదులు ధరించి, చక్రవర్తి యయ్యెను. ఈతనికి లోఁబడి యనేక మాండలిక రాజులుండుటయే యీతని చక్రవర్తిత్వమునకు నిదర్శనము.

## మంత్రులు : దండనాయకులు

పరిశీలించిచూడ, రాజ్యాభివృద్ధికిని, సత్పరిపాలనమునకును గారణభూతులు రాజును, మంత్రులును నగుదురు. ఉభయులును

సామరస్యభావమున మెలఁగిననేకాని, సామ్రాజ్యము వృద్ధినొందఁ జాలదు. హరిహరరాయలు చక్రవర్తియగుటకుఁ గారణ మాతని సత్పరిపాలనమే కాదు, మంత్రుల యద్వితీయ శక్తిసంపదయు నై యున్నది. తండ్రికివలెనే యీతనికిని బ్రజ్ఞాశాలురగు సచివులును, దండనాయకులును గలరు. వారిలో మొదటివాఁడు మాధవ విద్యారణ్యుల సోదరుఁడగు సాయణాచార్యుఁడు; రెండవవాఁడు గౌడబ్రాహ్మణుఁడగు మాధవమంత్రి; మూఁడవవాఁడు ముద్దపదండ నాథుఁడు; నాల్గవయతఁడు గుండపదండనాథుఁడు; ఐదవయతఁడు జైనమతావలంబకుఁడగు ఇరుగపదండనాయకుఁడు.

సాయణాచార్యునిఁ గూర్చి మాధవవిద్యారణ్యుల చరిత్ర మునందును, మాధవమంత్రినిఁ గూర్చి బుక్కరాయల కథాభాగ మునను విపులముగ వ్రాసియుంటిని. ఇఁక మిగిలిన మువ్వురను గూర్చి తెలిసికొందము.

### ముద్దపదండనాథుఁడు

మొదటి హరిహరుని తమ్ముఁడగు ముద్దప్పయు, నీ ముద్దప దండనాథుఁడును భిన్నపురుషులా? ఒక్కరా? యను సందియము గలుగుచున్నది. కాని, యిదమిత్థమని నిర్ణయింపఁదగు నాధార ములు లేవు. ఈతనిఁ గూర్చి రెండు శాసనములు గనఁబడుచు న్నవి. [1] అందు మొదటిశాసనమున నిట్లు సెప్పఁబడియున్నది. 'తొల్లి శ్రీరామచంద్రుఁడు దశరథుని యొద్దనుండి సుమంతునిఁ బడసినట్లు, హరిహరరాయలు బుక్కరాయలనుండి ముద్దప్పను బడ సెను. ముద్దప్ప రాజనీతివైశద్యమున శత్రురాజుల బంధించెను. హరిహరరాయలు రాజ్యభారమంతయు నీ మంత్రిసత్తమునిపై నిలిపి, తాను విష్ణుమూర్తివలె సుఖముండెను.' రెండవ శాసనమున

1. Mysore Inscriptions, Pages, 55. 267

ాయఁబడిన విషయములలోఁ గొన్నిఁటి నిటఁ జేర్చుచుందును.
ంద్రవంశమునఁ బేరుగన్న బుక్కరాయలు జనించెను. ఆతఁడు
ాలరాజ్యమును, బ్రసిద్ధిఁగన్న ముద్దపదండనాయకునిఁ బడసెను.
ుద్దప్ప మంత్రి యౌగంధరాయణుని మించిన ప్రజ్ఞాశాలి. ప్రజ
ు బిడ్డలవోలెఁ గాపాడినవాఁడు.' ఈ మంత్రిసత్తముఁ డొక
గ్రహారముఁ గట్టించి, దానికి 'ముద్దదండనాయకపుర' మని పేరుఁ
ట్టి, బ్రాహ్మణులకు దాన మొసఁగెను.

డపదండనాథుఁడు

ఈతని పరాక్రమాతిశయమును దెలుపు శాసనము బేలూరి
ని కేశవస్వామి గుడియందుఁ గలదు. ఆ శాసనము క్రీ. శ.
97 వ సంవత్సరమున వ్రాయఁబడినట్లు తెలియుచున్నది. అందిట్లు
ుపఁబడియున్నది. 'గుండపదండనాథుఁ డనేక దేశములు జయిం
ు. తురుష్క వీరులను బెక్కురను జయించి, బంధించెను.
డలు విఱిచి, రెండు పులులను జంపెను.' ఈతఁడు జయించిన
ములందు విజయాంకముగ శతకుంభాలంకృత జయ స్తంభముల
ట్టించెను.

గపదండనాయకుఁడు

హరిహరరాయలకడ హిందూమంత్రులే గాక, జైనమంత్రు
గూడ నుండిరి. విద్యానగరమందున్న యొక జైన దేవాలయము
దలి ధ్వజస్తంభమునఁ జెక్కఁబడిన శాసనమునుబట్టి చూడ హరి
రరాయలకడఁ బైచదండనాయకుఁ డుండెనని తెలియుచున్నది.
తఁడు జైన మతస్థుఁడు. ఈతని కుమారుఁడే యిరుగపదండనాయ
డు. ఈతఁడు హరిహరరాయలకడ మంత్రిగను, సేనానాయకుఁ
గను నుండి, 'మహాప్రధాన', 'రాజప్రతిపాలక' బిరుదములఁ బొందె

వని యొక శాసనమువలనఁ దెలియుచున్నది.[1] ఈతఁడు మహా కవియునై యుండి, 'నానార్థరత్నమాల' యను నిఘంటువును రచించెను.[2] విజయనగరమున నీతఁడు 'గానిగిత్తి' యను పేరుగల జైన దేవాలయము గట్టించెను.[3]

రాజ్యవ్యాప్తి

హరిహరరాయలు విద్యానగరమును బాలించుచుండ, నాతని కుమారులలో నొక్కరుఁడగు మొదటి దేవరాయలు యువరాజుగ నుండి, యుదయగిరి రాజ్యమును బాలించుచుండెనని తెలియుచున్నది.[4] హరిహరుని కాలమున మహమ్మదీయులు ఆదవాని దుర్గ ప్రాంతమునఁ జేరి, దానిని స్వాధీనము చేసికొనఁ బ్రయత్నించిరి. ఆ సమయమున హరిహరుని సోదరుఁడైన మల్లినాథుని పుత్త్రుఁడగు చెన్నప్ప మహమ్మదీయుల నోడించి, యా దుర్గమును హరిహరుని కిచ్చెనని తెలియుచున్నది.[5] హరిహరరాయల తనూభవులలో నొక్కరుఁడగు విరూపాక్షరాయలు తొండీర, చోళ, పాండ్య రాజ్యముల జయించి, వానిని దన తండ్రికొసఁగి, యా రాజ్యముల కాతఁడే రాజప్రతినిధిగా నుండెనని యలంపూడి శాసనమువలనఁ దెల్లమగుచున్నది.[6] ఈతని శాసనములు తెలుఁగు దేశముననే కాక ధార్వాడ, కాంచీనగరము, చెంగలుపట్టు, తిరుచునాపల్లి మొదలగు ప్రదేశములందును గనఁబడుచున్నవి. పై వివరింపఁబడిన శాసనాధారములను బట్టి విజయనగర రాజ్యము హరిహరరాయల కాలమున నుత్తరమునఁ గృష్ణానదివఱకును, దక్షిణమునఁ బాండ్యదేశము

1. Epigraphical Report, 1923, Page 116
2. 'ఇతి జగదుప కారుణ్య ఇరుగపదండనాథ రచితాయామ్,
 అవ్యయపద కాణ్డోఽయం పూర్ణో నానార్థరత్నమాలాయామ్.'
3. South Indian Inscriptions Vol. 1, Page 156
4. Indian Antiquary, Vol. XXXVIII, Page 91 and Nellore Inscriptions, Kg. 23
5. Epigraphia Carnatica Vol. XII, Kg. 43; Forgotten Empire, pages 50-51

వఱకును, బూర్వపశ్చిమ సముద్రములవఱకును వ్యాపించియుండె నని విశదమగుచున్నది.

### రెడ్డిరాజులతోడి మైత్రి

క్రీ. శ. 1383 మొదలు క్రీ. శ. 1400 వఱకుఁ గొండవీటి రాజ్యమును బాలించిన కుమారగిరి భూపాలుఁడును, క్రీ. శ. 1386 మొదలు క్రీ. శ. 1410 వఱకు రాజమహేంద్రవర రాజ్యమును బాలించిన కాటయవేమభూపాలుఁడును విజయనగరాధీశ్వరుఁడగు రెండవ హరిహరరాయలకు సమకాలీనులు. వీరికిని, విజయనగరాధీశ్వరునకును గల సంబంధబాంధవ్యములను గూర్చి ముచ్చటించుటకు ముందు వీరి చరిత్రములఁగూర్చి యించుక వ్రాయుదును.

### కుమారగిరిభూపాలుఁడు

అనపోతనాయని మరణానంతర మాతని కుమారుఁడైన కుమారగిరిరెడ్డి రాజ్యమునకు వచ్చెను. ఈతనికి వసంతోత్సవములన్నఁ బ్రీతి; రాజ్యవ్యవహారములన్న నేవగింపు. ప్రజ్ఞావంతుఁడు గాఁడు. కాని, సాహిత్యపోషకుఁడు. సంస్కృతమున 'వసంతరాజీయ' మను నాట్యశాస్త్రమును రచించిన మేటి. వసంతోత్సవప్రియుఁ డగుట వలన నీతనికి 'వసంతరా' జను బిరుదము గలదు. అవచి తిప్పయశెట్టి యను నాతఁ డీతని మిత్రుఁడు. తిప్పయశెట్టి మిత్రుఁడే గాక, మంత్రియు, సుగంధ భాండాగారాధ్యక్షుఁడు నై యుండెను. వసంతరాజువలన నీతఁడెనలేని గౌరవము లందినవాఁడఁట!

హరిహరరాయలు విజయనగరమును బాలించుచుండ, నాతని తనూభవుఁడగు మొదటి దేవరాయలు యువరాజుగనుండి, యుదయగిరిరాజ్యమును బాలించుచుండెనని వ్రాసియుంటిని. దేవరాయలు రాజ్యరక్షణమునందుఁ బ్రమత్తుఁడై యున్న కుమారగిరి

భూపాలునిఁ గనిపెట్టి, తన రాష్ట్రముననున్న యాతని రాజ్యభాగము లను గబళింపఁ బ్రయత్నించుచుండెను. ఇది యిట్లుండ - రాచ కొండ, దేవరకొండ దుర్గాధీశ్వరులగు పద్మనాయకులును, శూర వర పట్టణాధీశ్వరులగు రాచవారును మఱియొకవంకఁ గుమారగిరి రెడ్డిరాజ్యము నాక్రమించుకొనఁ బ్రబల ప్రయత్నములు గావించు చుండిరి.

**కాటయ వేమభూపాలుఁడు**

ఈతఁడు కుమారగిరిభూపాలుని తోఁబుట్టువైన మల్లాంబిక పెనిమిటి. కొండవీటి రాజ్యమును శత్రురాజులు గబళింపనున్నతఱిఁ గాటయవేమారెడ్డి తన మఱఁది ప్రమత్తతను గమనించి, రాజ్యము శత్రువులపాలఁబడకుండ వేయిగన్నులఁ గనిపెట్టి, కర్ణాటాధీశ్వరు లతో మైత్రి గలిగియుండెను. తానే కొండవీటి రాజ్యమునకు మంత్రియు, సేనానియు నైయుండెను. ఈతఁడు శత్రుభీకరుఁడని పేరు గాంచిన వీరుఁడు. కుమారగిరిభూపాలుఁడు సకల రాజ్యభారమును వహింపఁజాలక, తన రాజ్యమునుండి తూర్పుదేశమును విడఁదీసి, తన మేనమఱఁదియగు కాటయవేమారెడ్డి కొసఁగెను. ఆతఁడు రాజమహేంద్రవరము రాజధానిగ నా దేశమును బాలించుచుండె నని తొత్తరమూడి శాసనమువలనఁ దెలియుచున్నది.[1] కాటయ వేమారెడ్డి కాళిదాస కవికృతనాటకత్రయమునకు విపులవ్యాఖ్య రచించెనందురు.

---

1. "ఆసీ దమాత్యరత్నం కాటయవేమప్రభు స్తస్య
అతిసుర గురు భార్గవ మతిరతి భార్గవ విజయ విఖ్యాతిః."
"సింహాసనే నిధాయాసౌ కుమారగిరి భూవరం
ఆ తేజయన్మహాతేజా శ్రీకృష్ణ ఇవధర్మజం
కుమారగిరి భూనాథో యస్మై విక్రమ తోషితః
ప్రాదాత్ ప్రాచీభువం రాజమహేంద్ర నగరీముఖాం."

రెడ్డిరాజులతోడి బాంధవ్యము

హరిహరరాయలు సింహాసన మెక్కినది మొదలు తన సామ్రాజ్యమును దక్షిణహిందూస్థానమున విస్తరింపఁజేయవలెనని సంకల్పించి, యందులకుఁ బ్రతికూలముగనున్న హిందూరాజులను జయింపఁ దలపెట్టియుండెను. హరిహరుని కాలమున నోరుగల్లు రాజ్యమును సింగమనాయఁడు పాలించుచుండెను. అతఁడు హరిహరునకు సామంతుఁడుగ నుండెను. కాని, రెడ్డిరాజులుమాత్రము లోఁబడక, స్వతంత్రులుగ నుండిరి. కాటయవేమారెడ్డి ప్రతిభాశాలి యనియు, శౌర్యవంతుఁడనియు హరిహరుఁ డెఱుంగును. అతనితో బాంధవ్యముఁ జరిపినఁగాని, గజపతులను గెలువ శక్యముగాదని తలఁచి, తన కుమారికయగు హరిహరాంబను గాటయవేమారెడ్డి తనూభవుఁడగు కాటయప్రభునకిచ్చి, పరిణయముఁ గావించెను.[1]

ఫిరోజిషాహాతో యుద్ధము - 1398

బహామనీసుల్తానగు నల్లాఉద్దీన్ కనిష్ఠపుత్త్రుఁడగు మహమూద్ షాహ క్రీ. శ. 1397-వ సంవత్సరమునఁ గాలధర్మము నొందెను. ఈతని మరణానంతరము సింహాసనమును గూర్చి దాయాదులలో వివాదములు జరిగెను. మహామూదు కుమారు లిరువురును క్రమముగా సింహాసనాసీనులైరి. కాని, కొలఁదికాలములోనే పదచ్యుతులైరి చివరకు, మహమూదు సోదరుఁడైన దావూద్ ఖానుని కుమారుఁడైన ఫిరోజ్ షాహ క్రీ. శ. 1397-వ సంవత్సరము నవంబరు నెల 15-వ తేదిని సింహాసన మెక్కెను.

ఫిరోజిషాహకాలమున బహామనీరాజ్యము మహావైభవమున నుండెను. ఈతఁడు 'భీమా' నదియొడ్డున నొక నగరమును గట్టించి, దానికి 'ఫిరోజాబాద్' అని పేరుపెట్టెను.

1. Annual Report on Epigraphy; 1906 -Para 63

క్రీ. శ. 1398-వ సంవత్సరమున బహామనీసుల్తానగు ఫిరోజిషాహకును విజయనగర రాజునకును యుద్ధము జరిగెననియు, నా విజయనగరరాజు దేవరాయలనియు ఫెరిస్తా వ్రాసియున్నాఁడు. కాని, శాసనాధారమువలన నా కాలమున విజయనగర పరిపాలకుఁడుగా నున్నవాఁడు రెండవ హరిహరరాయలుగాని దేవరాయలు కాఁడని స్పష్టమగుచున్నది. ఇఁక యుద్ధ విషయములివి.

† "బహామనీరాజ్యము నిమిత్తమై కులబరుగీ (గుల్‌బర్గా) పట్టణములో దాయాదులకు వివాదములు జరిగి, కొందఱు సుల్తానులు చంపఁబడి, తుదకు ఫెరోజ్‌షాహ సుల్తానయ్యెను. ఇట్లు గుల్బర్గాలోఁ గల్లోలములు జరుగుటచూచి, హరిహరరాయ లదియే మంచిసమయము గదాయని యెంచి, రాయచూరు, ముద్గలు దుర్గములను స్వాధీనపఱుచుకొనుటకుఁ బుత్త్రిసమేతుఁడై వెడలెను. అప్పుడు ఫెరోజ్‌షాహకూడ నాతని నెదుర్కొనవచ్చెను. వర్షాకాలమైనందునఁ గృష్ణానది నిండి ప్రవహించుచుండెను. దానికుత్తరమునఁ దురుష్కసైన్యమును, దక్షిణమున రాయలసైన్యములును విడిసియుండెను. కాని, రాయలసైన్యములఁ జూచి ఫెరోజ్ భయపడి, చేయుకర్తవ్యంబెద్దియని చింతించి, యాతఁడు తన సేనానాయకుల నందఱినిఁ బిలిపించి, యాలోచించెను. కాని, వారును దగిన యాలోచనయేమియుఁ జెప్పలేకపోయిరి. సుల్తాను చిన్నవోయెను. అంత నాతనియొద్దనున్న యొక కాజీ (మతగురువు) తాను మాయోపాయముచేసి రాయలనుగాని, యాతని కుమారునిఁగాని చంపివచ్చెదనని చెప్పి, కొందఱుజనులతో సన్న్యాసివేషము ధరించి, నదినిదాఁటి, పదిమైళ్ళవఱకు సముద్రమువలెఁ బ్రసరించియున్న

† ఈ యుద్ధమును గుఱించి ఫెరిస్తానుసరించి 'మహామ్మదీయ మహాయుగ' మను గ్రంథములో వర్ణించిన యంశములే యిందుఁ బొందుపఱుపఁబడినవి.

చూ. మహా. పుటలు - 324 - 326

సైన్యములోనున్న రాజపుత్త్రిని శిబిరము ప్రవేశించెను. అచ్చట నున్న భోగముదానిమీఁద వలపు పుట్టినట్టు నటించి, తన సంగీత మువలన దానిని మెప్పించియు, దాని పాదములకు మ్రొక్కి బ్రతి మాలుకొనియు, తన యుద్దేశము దానికిఁ దెలుపక, దాని మేళ ములోఁ జేరి, యది రాజపుత్త్రినిగొద్దకు నాట్యమునకుఁ బోయి నపుడు మేళమువానివలెఁ దానును, మఱియొకఁడును గలిసి, వెంటఁ గత్తులు తీసికొనివెళ్ళి, నాట్యకాలమందు మోసముచే రాజ పుత్త్రినిఁ జంపిరి. అంత శిబిరమునందుఁ గల్లోలము కలిగి, చీఁకటి రాత్రియగుటచే శత్రువు వచ్చి మీఁదఁబడి యందఱిని నఱుకుచున్నాఁ డని తలఁచి, హిందూసైన్యమంతయుఁ జెల్లాచెదరయ్యెను. ఈ సంధి కనిపెట్టి ఫెరోజ్‌షాహ నది దాఁటివచ్చి, రాయల సైన్యముల వెంటఁదఱిమెను. రాయలు విజయనగరమునకుఁ బాఱిపోయెను. ఫెరోజ్‌షాహకుఁ దమ్ముఁడును, తరువాత సుల్తాన్ అయినవాఁడును నగు అహమ్మదనువాఁడు కొంత దేశమును బాడుచేసి, కొందఱు జనులను జెఱఁబెట్టెను. కొంత ధనమిచ్చి రాయలు వారిని విడిపిం చెను. పూర్వమువలెనే యెవరి రాజ్యపుఁ బొలిమేరలు వారికుండ వలసినదని సంధి చేసికొనిరి."

ఫెరిస్తా వ్రాసిన యీ వ్రాఁతలను బట్టిచూడ ఫిరోజిషాహకు నీ యుద్ధమువలన సంపూర్ణ విజయము గలుగలేదనియు, నట్లు గలిగి యుండినచో నిట్టి సంధి నియమమున కవకాశ ముండియుండదనియుఁ దెల్లమగుచున్నది.

రెండవ హరిహరరాయలు క్రీ. శ. 1404 లో ఆగస్టు 31-వ దినమున స్వర్గస్థుఁడయ్యెనని తెలియుచున్నది. మఱియొక శాసనమున నీతఁడు క్రీ. శ. 1404 లో సెప్టెంబరు 2-వ దినమునఁ గీర్తిశేషుఁడై నట్లు గన్పట్టుచున్నది.[1] స్యూయల్ పండితుఁడు హరిహరరాయలు

1. Epigraphia Carnatica, Vol. III, Part II

క్రీ. శ. 1399 లో మరణించెనని వ్రాసెను. కాని, యది విశ్వసనీయము కాదు.

## మొదటి దేవరాయలు

రెండవ హరిహరరాయలు మరణించిన పిదప, నాతని తనయులగు దేవరాయలకును, విరూపాక్షరాయలకును రాజ్యమును గూర్చి వివాదము గలిగెను. ఆ పోరాటము రెండేండులు జరిగిన మీఁదట, దేవరాయలు విజయమునంది క్రీ. శ. 1406–వ సంవత్సరము నవంబరు 5–వ తేది శుక్రవారమునాఁడు సింహాసనమధిష్ఠించెను.[1]

### మంత్రులు

దేవరాయలకడ లక్కన మంత్రియను సచివుఁడుండెను. అతనికి 'లక్ష్మీధరుఁ' డను నామాంతరము గలదు. లక్ష్మీధరుఁడు మాధవసాయణుల సోదరియైన సింగాంబ కొడుకు. రాజద్రోహులు కొందఱొకనాఁడు దేవరాయలఁ జంప నాయుధపాణులై, కోట గుమ్మము కడఁ గాచియుండిరఁట! లక్ష్మీధరుఁడా సంగతిఁ దెలిసికొని, యుపాయమున వారినిఁ బట్టి, చంపి, యేలిక ప్రాణములు గాపాడెనఁట! ఆ మంత్రిసత్తముని యద్వితీయరాజభక్తి కిదియే నిదర్శనము. లక్కన మంత్రి, మాల్యవంత పర్వతశ్రేణులయందలి గుహాలో గణపతి విగ్రహమును బ్రతిష్ఠించెనని తెలియుచున్నది.[2]

వెన్నెలకంటి - జన్నయ మంత్రియు, నాతని తనయుఁడగు సిద్దన మంత్రియు దేవరాయలకడ మంత్రులుగా నుండినట్లు జక్కన కవి ప్రణీతమైన విక్రమార్క చరిత్రమునందలి క్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

1. Prof. Kielhorn's Southern List No. 480
2. Asiatic Researches, Vol. XX - Page 31

"విమలవర్తనమున వేదశాస్త్ర పురాణ
వాక్యార్థ సరణికి వన్నె పెట్టెఁ,
బరమ హృద్యంబైన పద్య శతంబున
దేవకీతనయు విధేయుఁ జేసె,
రసికత్వమున దేవరాయ మహారాజ
కరుణాకటాక్ష వీక్షణముఁ గాంచె,
కర్ణాటకటకము కలయంగ మెచ్చంగఁ
గడఁక విద్యాప్రౌఢి ఘనత కెక్కె,
గురులఁ బోషించె, సత్కవీశ్వరులమంచెఁ,
బ్రజలఁ బాలించె, భాగ్యసంపదవహించె,
హారితముని ముఖ్యవంశ రత్నాకరేంద్ర
చంద్రుఁడై యొప్పు సిద్దయజన్నమంత్రి."
"దేవరాయ మహారాయ ధీ విధేయ
మంత్రి వల్లభ చామనామాత్యదత్త
చామరచ్ఛత్ర భూషాది సకల భాగ్య
చిహ్నములనొప్పి జన్నయసిద్దమంత్రి."

రాజ్యభాగములు: ప్రతినిధులు

అరగడ రాజ్యమునకు విట్టన్న దండనాయకుఁడును, ముళువాయి రాజ్యమునకు నాగన్న దండనాయకుఁడును,[1] గోవెగుత్తి రాజ్యమునకు విరుపన్న దండనాయకుఁడును,[2] బరకూరు రాజ్యమునకు శంకరదేవయొడయరును,[3] జంద్రగుత్తి రాజ్యమునకు బాచప్ప దండనాయకుని యనుజుఁడైన మల్లప్పయొడయరును బ్రతినిధులుగ నుండిరి. భవానీ నది విట్టల్ దుర్గప్రాంతములను రాజతనూభవులైన హరిహరరాయయొడయరును, వీరమల్లనయొడయరును బాలించు చుండిరి.[4] ఉదయగిరి రాజ్యమును దేవరాయల పుత్త్రులలో నొక్క రుఁడగు రామచంద్రరాయలు పాలించుచుండెను.

1. Epigraphia Carnatica, Vol. X. M. 7
2. Epigraphia Carnatica, Vol. VII· S. K. 37
3. Epigraphia Carnatica, Vol, VII. SK. 288
4. A. S. R. 1907-08. Page, 246

రాయల మహాత్కార్యము

ప్రజలకు మహోపకార మొనర్చిన సంగమవంశ రాజులలో దేవరాయ లగ్రగణ్యుఁడు. రాయలు సింహాసన మధిష్ఠించినతోడనే యనేక ప్రాకారములను, బురుజులను గట్టించి, విద్యానగరమునకు నూతన శోభ గలిగించెను. తరువాత, నా పుటభేదనమున మూరి మసఁగియున్న జలాభావ సమస్యను బరిష్కరింప నాతఁడు నడుము కట్టెను. వెంటనే విద్యానగరమునకుఁ బండ్రెండు మైళ్ళ దూరమునఁ దుంగభద్రాస్రవంతికి నానకట్టఁ గట్టించి, యందలి పవిత్రోదకముల నొకకల్యమూాలమునఁ బట్టణములోనికిఁ బ్రవహింపఁజేసెను. దాన నా పట్టణము జలసమృద్ధమై యొప్పెను. ఇఁకేఁ జెప్పవలసిన దేమి! ఎటు చూచినను నుద్యానవనములే! ఎటుగాంచినను నికుంజపుంజములే! ఎటు వీక్షించినను ద్రాక్షాగుళుచ్ఛములే! వేయేల? సర్వం సహా సర్వసస్యాఢ్యయై యొసలారెనన్న నతిశయోక్తిగానేరదు. ఆ కాలువ నేఁటికిని జెక్కుచెదరకయున్నది. దాని నిర్మాణ విధాన మప్రతిమానము; ఆశ్చర్య జనకము. ఆనకట్టను గట్టించి, కాలువను ద్రవ్వించుటవలన దేవరాయలకు బొక్కసమునుండి ధనమెంత వ్యయమైనను, నాతనికి సంవత్సరమునకుఁ బండ్రెండు లక్షలా కాలువవలన నాదాయము౦డెడిదఁట!

# యుద్ధములు

ఫెరిస్తా వ్రాఁతలను బట్టిచూడ బహమనీ రాజ్యపు సుల్తానైన ఫిరోజ్ షాహకును, విద్యానగరాధీశ్వరుఁడైన మొదటి దేవరాయలకును ముమ్మారు యుద్ధము జరిగినట్లు తెలియుచున్నది. ఆ యుద్ధ విషయము లెంతవఱకు విశ్వసనీయములో పరిశీలింతము.

మొదటి యుద్ధము : 1406

బహామనీ రాజ్యమునకుఁ జేరిన ముదిగల్లుపట్టణమున నొక కాఁపుపడుచు గలదు. ఆ చిన్నది చక్కఁదనాల చుక్క. ఒక బ్రాహ్మణుఁడు సంగీతసాహిత్యాది విద్యలనునేర్ప, నా కన్యక యత్యల్ప కాలమున సకల విద్యలనేర్చి, యద్వితీయ పాండితీగరిమ నొప్పారెను. ఒకనాఁ డా పాఠుఁడు విజయనగరాధీశ్వరుని కడ కేఁగి, యా బాలిక వైదుష్యమును, సౌందర్యమును నాతనికి వర్ణించి చెప్పెను. భూమీశుఁ డా యువతినిఁ బరిణయమాడఁ దలఁచెను. స్వాతంత్ర్యాభిలాషిణి యగు నక్కాఁపుపడుచు శుద్ధాంతమున బంధింపఁబడియుండుట కొల్లక, రాజును వివాహమాడఁ దిరస్కరించెను. కాని, కామాంధుఁడైన యా రాజు బలవంతముగ నా కన్నియను వివాహమాడ నిశ్చయించి, సైన్యసమేతుఁడై ముదిగల్లు చేరెను. రాజు రాక విని, యందలి జనులు భీతిల్లి పలాయనమైరి. కాఁపుపడుచును బౌరుల వెంటఁ బోయెను. తన కోర్కి ఫలింపమికి రాజు చింతించి, నగరముఁ బ్రవేశించి, యందలి సంపదలను గొల్ల గొనిపోయెను. ఈ సమాచారము బహామనీరాజ్య పాలకుఁడైన ఫెరోజ్ షాహకుఁ దెలిసెను. ఆతఁ డత్యంత కోపావిష్టుఁడై సైన్యమును గొనిపోయి యుద్ధమున రాయల నోడించెను. రాయలు పరాజితుఁడై విజయనగరముఁ జేరెను. వెన్నంటివచ్చిన సుల్తాను విద్యానగర బహిఃప్రాకారమును స్వాధీనపఱచుకొని, తన చేతికి గొప్ప గాయము తగిలిన కారణమున రాయలతో యుద్ధమునకుఁ దలపడక, నాలుగు నెలల కాల మాతఁడు సైన్యముతో విద్యానగర బాహ్యసీమను గాచియుండెను. దేవరాయలును బురమునుండి వెలువడఁడయ్యెను. అటఁ గా పుండిన సుల్తాను సైనికులలోఁ గొందఱు పయనమై బంకాపురమున కేఁగి, దానిని స్వాధీనపఱచుకొని, యచ్చు పదివేల హిందువులను జెఱఁబట్టి తెచ్చిరి. అది కారణముగ రాయలు విధిలేక, ఫెరోజ్ షాహతో సంధిఁ జేసికొని, తనకూఁతును

నాతనికిచ్చి మహావైభవమునఁ బెండిలిఁ గావించెను. కాని, వైవాహిక సమయమున నుభయులలో ద్వేషభావములు దలయెత్తెను.

ఇఁక నీ యుద్ధవిషయము లెంతవఱకు సత్యములో చర్చింపవలసియున్నది. నిజముగా విద్యానగరాధీశ్వరుఁడు దన కూఁతును సుల్తానునకిచ్చి వివాహము గావించియుండినచో మిగిలిన చరిత్రకారులేల తమ గ్రంథములయం దీ విషయమును బేర్కొని యుండరు? పారసీకదేశపుఁ దురుష్క రాయబారియగు అబ్దుర్ రజాక్ విజయనగరమునకు క్రీ. శ. 1443-వ వత్సరమున వచ్చెను. ఫెరిస్తా వ్రాఁతప్రకార మీ వివాహము జరిగి యప్పటికి ముప్పదియాఱు వత్సరములై యుండును. రజాక్ తన గ్రంథమున విద్యానగరమును గూర్చిన విషయముల నెన్నిటినో వ్రాసెను గాని, యీ వివాహ విషయమును మాత్రము సూచించి యుండలేదు. నిజముగా నిది జరిగియున్నచో, విషయజాలమును సేకరించి, పూసగ్రుచ్చినట్లన్నిటిని వ్రాసిన యీ రాయబారి దీనినేల వ్రాయక విడిచియుండును? ఈ కాలమునకుఁ దరువాత నూఱేండ్లకుఁ బుట్టిన పోర్చుగీసు చరిత్రకారులయిన 'పెయిస్', 'నునిస్' - అను వారలు సహిత మీ విషయమును దాము రచించిన విద్యానగర చరిత్రమునందు వ్రాసియుండరైరి. ఏ చరిత్రకారునకును గోచరింపని యీ వివాహవిషయ మీ కాలమునకు రెండువందల యేండ్ల తరువాత జనించిన ఫెరిస్తాకు మాత్ర మెట్లు గోచరించెనో తెలియకున్నది.

రెండవ యుద్ధము : 1419

ఆదవానికి నీశాన్యమున నెబ్బదిమైళ్ల దూరమున పానుగల్లు దుర్గము గలదు. దానిని ముట్టడింప ఫెరోజ్‌షాహ క్రీ. శ. 1417-వ సంవత్సరమున బయలుదేఱిపోయెను. కాని, రెండు సంవత్సరములు ప్రయత్నించినను బ్రయోజనము లేకపోయెను. ఆ సమయమును గనిపెట్టి విద్యానగరాధీశ్వరుఁడగు దేవరాయలు ఫెరోజ్‌షాహాపై దండెత్తిపోయెను. ఉభయులకును ఘోరయుద్ధము జరిగెను. సుల్తాను తప్పించుకొనిపోవుటయే దుస్తరమయ్యెను. హిందువులు ఫెరోజ్

షాహాను వెంబడించిపోయి, పట్టణముఁ బ్రవేశించి, జనుల ననేక విధముల బాధించిరి. సుల్తానా విపత్తును భరింపలేక మనోవ్యాధిచేఁ గ్రీ. శ. 1422–వ వత్సరమునఁ బరలోక గతుఁడయ్యెను.

**మూఁడవ యుద్ధము : 1422**

ఫెరోజ్‌షాహా మరణించినపిదప నాతని తమ్ముఁడైన యహమ్మద్‌షాహా సుల్తానయ్యెను. వెంటనే, యాతఁడు సైన్యమును గూర్చుకొని, దేవరాయలతో యుద్ధము చేయఁ బోయెను. ఇరువురకును యుద్ధము జరిగెను. ఆ యుద్ధమున రాయలు దురుష్కులకుఁ జిక్కెనఁట. మహమ్మదీయులు దేవరాయల శిరముపైఁ గట్టెల మోపుంచి, కొంతదూరము మోయించి, విడిచిపుచ్చిరఁట. ఒక నాఁడు, హిందువు లొంటరిపాటుననున్న సుల్తానును గాంచి, తఱిమి పట్టుకొనఁబోవ నాతఁడు తప్పించుకొనిపోయెనఁట. తుదకు దేవరాయ లోడిపోయి, యహమ్మద్‌షాహాతో సంధిఁ జేసికొనెనఁట. ఇవియన్నియు ఫెరిస్తా వ్రాఁతలు.

మొదటి దేవరాయలు క్రీ. శ. 1422–వ వత్సరమున మరణించినట్లు తెలియుచున్నది. †

# రెండవ (విజయ) బుక్కరాయలు

దేవరాయలకు విజయరాయలు, రామచంద్రరాయలు నను నిరువురు కొడుకులు గలరని కొందఱును, హరిహర వొడయరు, విజయరాయలు, వీరమల్లన యను మువ్వురు కొడుకులు గలరని మఱికొందఱును నుడివిరి. హరిహరరాయ వొడయరును, వీరమల్లన వొడయరును భవానీనదీ విట్ఠల్‌దుర్గప్రాంతములను పాలించుచుండిరనియు, రామచంద్రరాయ లుదయగిరిరాజ్యమును పాలించుచుండెననియు వ్రాసియుంటిని. కాని, తండ్రి జీవించియుండఁగా, విజయరాయలు యువరాజుగ నుండెనని తెలియుచున్నది. [1] విజయరాయ

† Epigraphia Carnatica, Vol. IV, Gr, 24

1. Epigraphia Carnatica, Vol. X, Introduction, Page 35

లకు విజయబుక్కరాయలను నామాంతరముగలదు. దేవరాయలు మరణింపఁగనే యువరాజుగనున్న విజయబుక్కరాయలు సింహాస నాసీనుఁడై, యొక్కవత్సరముమాత్రము పరిపాలించి, మరణిం చెను. న్యూనిజ్ విజయబుక్కరాయ లాఱేఁడులకాలము రాజ్య మును బాలించెనని వ్రాసిన వ్రాఁత నిరాధారము.

విజయబుక్కరాయల పరిపాలనాకాలమున నెన్నఁదగిన విశేషములు లేకపోయినను నొక్కటిమాత్రము గమనింపఁదగియు న్నది. రాజకీయోద్యోగులలోఁ బ్రబలియున్న లంచగొండితనము నీ భూపాలుఁడు తన మంత్రిపుంగవులైన యప్పన్న, నాగరసయొడ యరుల సాయమున రూపుమాపెను.[1] దాన, ప్రజలకు క్షేమము గలిగెను.

# రెండవ (ప్రౌఢ) దేవరాయలు

విజయబుక్కరాయలకు దేవరాయలు, పర్వతరాయలు, ప్రతాపదేవరాయలు నను మువ్వురు కొడుకులును, హరిహరాంబ యను కూఁతురును గలరు. హరిహరాంబను సాళువవంశ సంజాతుఁ డగు తిప్పరాజునకిచ్చి వివాహము చేసెను.

విజయరాయలు మరణించినపిదప నాతని తనయుఁడగు దేవరాయలు సింహాసన మలంకరించెను. దేవరాయలకు 'ప్రౌఢదేవ రాయ'లను వ్యవహారనామము గలదు. ఈతనికి ఇమ్మడి దేవ రాయలనియుఁ, బ్రతాపదేవరాయలనియు, గజబెంటదేవరాయ లనియు నామాంతరములు గలవు. 'గజబెంట' యన నేనుఁగు వేఁట. ప్రౌఢదేవరాయలకు నేనుఁగువేఁటయం దెక్కువ మక్కువగల కారణ మున నాతనికి గజబెంట దేవరాయలను నామము సిద్ధించినది. సంగమ వంశపువారిలో నింతటి పేరు ప్రతిష్ఠలు గడించిన చక్రవర్తి మఱి యొక్కరుఁడు లేఁడు. ఈతఁడు జైనమతాభిలాషి. ఇందులకుఁ

1. Annual Report on Epigraphy for 1904-05, Page 58, Para 30

దార్కాణముగ నీతఁడు విజయనగర వీథులలో నొకదానియందొక జైనాగారమును నిర్మించి, యందొక శాసనమును జెక్కించెను. ఆ శాసనాధారమువలన నీ చక్రవర్తికి 'రాజాధిరాజపరమేశ్వర' బిరుద మున్నట్లు దెలియుచున్నది.

రాజ్యభాగములు: ప్రతినిధులు

అరగడరాజ్యమునకు శ్రీగిరినాథుఁడును, గోవగుత్తి రాజ్యమునకుఁ ద్ర్యంబకదేవుఁడును, బిదప హండియరాయలును, మంగులూరు రాజ్యమునకు నాగన్నయొడయరును, బరకూరు రాజ్యమునకుఁ జందరస, నరసింహా యొడయరులును, తేరకమాంచి (తెరకనంబి) రాజ్యమునకుఁ బర్వతరాయలును, నిప్పటి యుత్తరార్కాడు జిల్లా భాగమునకుఁ బ్రతాపదేవరాయలును బ్రతినిధులుగానుండి, పాలించు చుండిరి.

మంత్రులు

ప్రౌఢదేవరాయలకడఁ జామనామాత్యుఁడును, సింగనదండ నాయకుఁడును, లక్ష్మణదండనాయకుఁడును మంత్రులుగ నుండిరి. వారిలో లక్ష్మణదండనాయకుఁ డఖండ విక్రమోపేతుఁడు; ప్రభు భక్తిపరాయణుఁడు; రాజనీతివిశారదుఁడు.[1] ఈ మంత్రిసత్తముఁడు రాజగంభీరరాజ్యమునకుఁ బ్రతినిధిగనుండి, 'దక్షిణసముద్రాధీశ్వరుఁ' డను బిరుదము నార్జించెను. ఈతఁడు సింహళద్వీపమువఱకును సముద్రయానమొనర్చెను.[2]

పరిపాలన విశేషములు

దేవరాయలు సింహాసనాసీనుఁడైన పిదప, నాతని దృష్టి రైతులవంకకుఁ బాఱెను. రైతు రాజ్యమునకుఁ బునాదియనియు, రైతుబాగు రాజ్యంపుబాగనియుఁ దలఁచి, వ్యవసాయాభివృద్ధికై సదుపాయములఁ గలిగింపఁదొడఁగెను. రెండవ హరిహరరాయలచేఁ గట్టింపఁబడిన 'హరిద్రా' యను నానకట్టను జక్కఁ జేయింప

1. Epigraphical Collections for 1901, No, 128
2. Annual Report on Epigraphy, Page 58

మంత్రుల నాజ్ఞాపించెను. రాజునాజ్ఞఁ దలఁదాల్చి, చామనామాత్యుఁడా పనికిఁ గంకణము గట్టుకొనెను. తరువాత సామ్రాజ్యాభివృద్ధికి మూలకందములైన[1] సప్తాంగములలోఁ బ్రధానములైన కోశ, దుర్గ, బలములను బలపఱుపఁబూనెను. అందులకై యాతఁడసంఖ్యాక ధనమును బ్రోగుచేయ సంకల్పించెను. కాని, యాతనికిఁ దురుష్కులతోడను, గజపతులతోడను ఘటిల్లిన యుద్ధములవలన మితిలేని ధనము వ్యయమయ్యెను. ఎంత వ్యయమైనను నాతని ధనాగారమున ననర్ఘములైన రత్నములుగాక, యెనుబదియైదుకోట్ల వరహాలుండెనఁట. క్విలన్, సిలోన్, పిలికట్, పెగో, టెనాసీరమ్ మొదలగు దేశముల రాజులీ చక్రవర్తికిఁ గప్పములు చెల్లించుచుండిన కారణమున నింత ధన మీతఁడు సేకూర్పఁగలిగెనని 'ననిజ్' అను చరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు.[2] దేవరాయలచేఁ బ్రచురింపఁబడిన రాగి నాణెములపై నొకప్రక్క నేనుఁగును, రెండవవైపు రాయగజగండభేరుండ యను చిత్రమును జెక్కఁబడియున్నవి.[3] ఈతనికాలమున విజయనగరసామ్రాజ్యమున నేడులక్షల సైన్యముండెనని తెలియుచున్నది. అసంఖ్యాక సైన్యమును బోషించుచుఁ, బ్రత్యర్థిబృందమును బ్రతిఘటించుచు, నంతటి ధనమును గూడఁబెట్టుట శ్లాఘాపాత్రము. విజయనగర సామ్రాజ్యమునఁ బొటకరించిన కన్యాశుల్కాంకురము లీచక్రవర్తి కాలమున మొగ్గదొడుఁగ నారంభించి, సంఘమునకుఁ జేటుమూడు స్థితిగలిగెను. అట్టి సాంఘికదురాచారమును రూపుమాప దేవరాయలు వివాహములపైఁ బన్నువిధింప నది కొంతవఱకు నశించెను.

**సామ్రాజ్య వైభవము: వర్ణనము - 1443**

ప్రౌఢదేవరాయలకాలమున విద్యానగరసామ్రాజ్య వైభవమింతయని వర్ణింపనలవికాదు. అపారవైభవోపేతసామ్రాజ్య మగుటవలననే - పారసీకదేశపుఁ జక్రవర్తియగు 'షాహరుఖ్' అను

---

1. స్వామి, అమాత్యుఁడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము.
2. Forgotten Empire, Page 302
3. Indian Antiquary, Vol XX, Page 303

నాతఁడు 'అబ్దుర్ రజాక్' అనువానిని, పోర్చుగల్ దేశపు రాజు 'నికోలో డెయి - కోంటె' అను నాతనిని దేవరాయలకడకు రాయబారులుగ నంపిరి. వారిలో నబ్దుర్ రజాక్ విజయనగరమును స్వయముగ వీక్షించి వర్ణించిన విషయము లిటఁ బొందుపఱచుచున్నాను. ఈ విషయములవలన నా సామ్రాజ్యవైభవము వెల్లడి కాఁగలదు.

'క్రీ. శ. 1443-వ సంవత్సర చైత్రమాసాంతమున విజయనగరపట్టణమును జేరితిని. నారాక విని, సార్వభౌముఁడు, స్వాగత మిచ్చుటకై తగిన పరివారమును నెదురుగ సన్నాహముఁ బంపెను. వారు నన్ను సముచితరీతిని గౌరవించి, చక్కని యొక సౌధమునకుఁ గొంపోయి విడియించిరి.

'విజయనగర మేలు నృపాలుఁ డసాధారణ బలదర్పితుఁడు. అతని సామ్రాజ్యము సింహళద్వీపప్రాంతములనుండి కలబరిగెరాజ్య ప్రాంతమువఱకు వ్యాపించి, యెటుచూచిన వేయియామడల దూరమున్నట్లున్నది. అతని రాజ్యమునకుఁ బూర్వపశ్చిమ దిశలందు సముద్రములే యెల్లలు. దేశమంతయుఁ జక్కఁగ సాగుచేయఁబడుచున్న కనులపండువైన భూములతో నొప్పారుచున్నది. ఈభూపాలుని రాజ్యమందు దేశదేశాంతర నగరములతో సముద్రవ్యాపారము చేయు ప్రసిద్ధములైన రేవు పట్టణములు మూఁడువందలు గలవఁట. నగరమం దెచ్చటఁ జూచినను రాక్షసులవలెను, గొండలవలెను భయంకరములైన యేనుఁగులు వేలకొలంది గాన్పించుచుండును. ఈ రాజుసైన్యమునందుఁ గాల్బలము పదునొకండు లక్షలు గలదు. ఈ దేశీయులు తమ యేలికను 'రాయ' లని పిలుతురు. హిందూస్థానమం దెచ్చట నీ రాయలంతటి బలదర్పసంపన్నుఁడగు భూపాలుఁ డింకొకఁడు లేఁడని వింటిమి. ఇచ్చటిప్రజలలో నందఱికంటె బ్రాహ్మణులు విశేషగౌరవమును బొందుచుఁ బూజింపఁబడుచున్నారు.

'విజయనగరమును బోలిన యనుపమాన భాగ్యవైభవ సౌందర్యములుగల మహానగరమును ప్రపంచమం దెచ్చటను నింకొక

దానిని జూడఁ బోము. మీఁదు మిక్కిలి వినఁజాలమన్నను నతిశ యోక్తి కాదు. ఎంత విస్తీర్ణము! ఒకప్రాకారములోపల నింకొక ప్రాకారముచొప్పున నేడుప్రాకారముల నడుమఁ గట్టిన యీ మహా నగరము మిక్కిలి దుర్గమమైనది. ఏడవప్రాకారమునకు వెలుపల నేఁబది గజముల వెడల్పుగల వాహ్యాళి ప్రదేశము గలదు. అచ్చోట నిలువెత్తున మొనలుదేఱి, కఱకుగానున్న బండరాళ్లు దట్టముగా నిలువులోతునఁ బాతిపెట్టఁబడియున్నవి. వానిమూల మునఁ గాలిబంటుగాని, రౌతుగాని సులభముగా నా రాళ్ల నడుమ నుండి దూరిపోవఁ జాలఁడు.

'నగరము చుట్టునుగల సప్తప్రాకారములలో వెలుపలిది వలయాకారముగానుండి యెత్తయిన యొక శిఖరముపైనున్నది.

'అయ్యది రాతితోడను, సున్నముతోడను గట్టిగాఁ గట్టఁ బడి, బలిష్ఠమైన కవాటమును గలిగియున్నది. ఆ ద్వారముచెంత రేయింబవళ్లెల్లప్పుడును రక్షకభటు లేమరక పడికావలికాయుచుం దురు. వారు దుర్గరక్షణమందెంత యప్రమత్తులుగానుందురో యా గంతుకులకడ నగరప్రదేశపు సుంకమును గైకొనుటలోఁ గూడ నంతటి యప్రమత్తులు. తొలి కోటనుండి రెండవప్రాకారమును, దానిని గడచి మూఁడవదానిని, అందుండి నాల్గవకోట వాకిలిని, అట్లు వరుసగా దాఁటుచుఁ బోయి, యేడవప్రాకారమును సమీ పించితిమి. ఈ కడపటి ప్రాకారములోపల రాయల మందిరములు, సౌధములు, సభామంటపములు, కొల్వుకూటములు, కచ్చేరీలు కలవు. నగరమునకు వెలుపలఁగల యేడవప్రాకారమునకు నాలుగు గవనులు కలవు. అందుత్తరదక్షిణముల వానికి నడుమను, పూర్వ పశ్చిమముల వానికి నడుమను రెండామడల దూరముండును. వెలు పలిప్రాకారములలో మొదటిదానికిని, రెండవదానికిని నడుమగల ప్రదేశమున సారవంతములయి సాగుచేయఁబడుచున్న భూములు, ఫలపుష్పవంతములయిన చక్కని తోఁటలును పెక్కులు గలవు. అచ్చటచ్చట మంచి సౌధములును, ఇండ్లును, బావులును,

ఆరామములును గలవు. వెలుపలినుండి మూఁడవప్రాకారము మొదలుకొని లోపల నేడవప్రహరీవఱకును, రాజవీధి కిరుప్రక్కలను. దట్టముగా నిండ్లు, అంగళ్లు, నడుమనడుమ వీథులు, తోఁటలును గలవు. ఏడవప్రాకారములోపల రాయల నగరును, సభాగారములును, సౌధములును, నాలుగు రాజవీథులు గలిసికొను మొగయును గలవు. ఆ రాజవీథులు నాలుగు నొకదానికొకటి యెదురుగా నున్నవి. ముందుత్తరముగా రాయలు నివసించు నగరు కలదు. ఈ నగరి వాకిటనుండియే నాలుగు వీథులును నాలుగు మొగలకును బోవును. ప్రతి రాజవీథి మొగను, నగరి వాకిటికి సమీపమున ధనురాకారముగనున్న తోరణముతోఁ గూడిన యెత్తయిన గోపురమును, దాని చుట్టును స్తంభములతో నలంకరింపఁబడిన వసారాయును గలవు. ఈ రాజవీథుల మొగలనున్న తోరణ గోపురములన్నింటికంటెను నందమైన గోపురము నగరివాకిటఁ గలదు. ఈ తోరణ గోపురముల క్రిందినుండి నాలుగు ముఖములఁ బోవు రాజవీథులు మిక్కిలి వెడల్పుగానుండి రమ్యముగానున్నవి. రాజవీథులందిరుప్రక్కలను బుష్పలావికలు పరిమళముగ్రమ్ముకొను నానావిధ పుష్పములను విక్రయించుచుందురు. అంగడివాండ్రు తమ యంగళ్ల ముందట నందమైన మంచెలుగట్టుకొని తమ సరకుల నమ్ముకొనుచుందురు. ఇట్లిరుప్రక్కలను నంగళ్లు, పుష్పలావికలు స్థలమాక్రమించుకొనినను, అశ్వికులు, పథికులు, ఏనుఁగులు, బండ్లు, పల్లకీలు మున్నగునవి గుంపులు గుంపులుగ నిసుకవైచిన రాలకుండ వచ్చుచుఁ బోవుచుండుటకు వీలయినంత వెడల్పుగా రాజవీథులున్నవి. ఈ వీథులు చాల పొడవై చూపుమేరకు వ్యాపించియుండి, చూచుటకు మనోహరములై యున్నవి. ఏవంకఁ జూచినను బరిమళభరిత కుసుమజాతులే కనఁబడుచుండును. ఇన్ని పుష్పములలో నీ దేశీయులకు గులాబిపూవులన్న మిక్కిలి యిష్టము. అవి విశేషముగా దొరకును. ఇచ్చట, ప్రజలకుఁ బుష్పములనినఁ బ్రాణము. ఆహారమెంత యావశ్యకమో, పూవులంత యావశ్యకము. భోజనమైన లేకుండఁ బోవుదురుగాని, స్త్రీపురుషులు పూవులు ముడువ

కుండ నెక్కడకుఁ బోలేరు. ఒక్కొక విధమగు వస్తుచయమును విక్రయించు నొక్కొక్క యోడవర్తకు లొక్కొకచోటఁ గుమి గూడి వ్యాపారముచేసికొందురు. ఏ సరకులయోడ యా సరకులదే కాని, యింకొకసరకా యోడలో దొంకదు. ఇచ్చటి రత్నవర్త కులు నిర్భయముగాఁ దమ సరకులను - ఎంత విలువగలవానినైనను - వజ్రవైడూర్యాది రత్నములను మొదలైనవానిని విచ్చలవిడిగా రాసులక్రిందఁ బోసి, నడివీధులందు విక్రయించుకొందురు.

'అత్యంతరామణీయకమై, మనోజ్ఞమైన యచ్చోటి నగరి వాకిటి కెదురుగానున్న నాలుగు వీధులందును జక్కని నునుపైన ఱాతికాలువలగుండఁ బరిశుద్ధ జలము నగరులోనికిఁ బట్టణములోనికి నెడతెఱపి లేక ప్రవహించుచుండును. ఈ ఱాతి కాలువలు పట్టణ మందంతటను గాన్పించును. రాయల సౌధమునకుఁ గుడివైపున మంత్రిశేఖరుని సభామంటపము గలదు. ఆ విశాలమంటపమునకు నలువది స్తంభములు కలవు. దానికెదురుగా మనుష్యునికంటె నెత్తయిన వసారాయొకటి కలదు. ఆ వసారా యించుమించుగా నిరువది గజముల పొడవును, ఆఱుగజముల వెడల్పును గలదిగా నున్నది. దీనిని 'దస్తర్‌ఖానా' లేక 'దస్తరుకొట్టు' అని పిలుతురు. రాజ్యమునకు సంబంధించిన యావత్తు కాగితములు, పత్రములు మొదలగునవన్నియు దస్తరములుగాఁ గట్టియుందుంతురు. ఇచ్చటనే కరణములు తెఱపిలేక లెక్కల వ్రాయుచుఁ గూర్చుందురు. ఇచ్చటి జనులు రెండువిధముల వ్రాఁత సామగ్రినుపయోగింతురు. అందు మొదటిది - రెండుగజముల పొడవును, రెండువ్రేళ్ల వెడల్పును గల తాటాకులు. ఈ జను లా తాటియాకులపై గంటములతో గీఁకుచు వ్రాయుచుందురు. ఈ వ్రాఁత అంత శ్రేష్ఠమైనదిగా జనులు తలంపరు. తాటియాకులపై వ్రాయఁబడిన యక్షరములు మసితో వ్రాయఁబడ నందున రంగుతోఁ గంటికిఁ గానరావు. అదియునుగాక, తాటాకులు చిరకాల ముండకపోవుటవలన వానిపై వ్రాయఁబడిన యక్షరము లును జిరకాలముండవు. ఇఁక రెండవపద్ధతి - తెల్లపలకలకు నల్లని

రంగు పూసి, వానిపై అాతి బలపములనుబెట్టి తెల్లగా వ్రాయుట. ఈ పద్ధతి చాల మంచిదఁట. ఇట్లు వ్రాసిన యక్షరములు చిరకాల ముండును.

'స్తంభములుగల యీ సభామంటపముపైన నెత్తయిన వేదికపై దండనాయకుఁడు, రాజకీయోద్యోగులు తన్నుఁ బరివేష్టింప నిండుకొలువుండును. ఉభయపార్శ్వములందును వేత్రహస్తులు బారులుతీరి నిలువఁబడియుందురు. మంత్రిశేఖరునితో విజ్ఞాపనమొన రించుకొనఁ దలంచినవారు ఈ వేత్రహస్తుల నడుమ నడచివచ్చి యేదైన నొక వస్తువును గానుక గానొసంగి, సాష్టాంగదండప్రణామ మాచరించి, నిలువఁబడి, ముకుళితహస్తులై, శిరమువంచి, తెలిపికొందురు. దండనాయకుఁడును వారి విన్నపమాలించి, యుచితరీతిని న్యాయవిమర్శనముఁ గావించి, తీర్పిచ్చి పంపివేయును. అతని తీర్పునకుఁ దిరుగులేదు. దండనాథుఁడు కొలువునుండి వెడలిపోవునపుడు కొలువు చాలింపఁబడును. ఆయన కేడు రంగు రంగుల గొడుగులు గలవు. అతఁడు బయలుదేరునపుడా ఛత్రములఁ గైకొని పరివారములు ముందు నడతురు. వారి ముంగట శంఖకాహాళాది మంగళతూర్యములు పూరించఁబడును. అతని కిరుప్రక్కలను వందిమాగధులు కైవారములు సేయుచు, స్తోత్రపాఠములు చదువుచు, 'జయీభవ! దిగ్విజయీభవ!' యనుచు నడతురు. ముందు వేత్రహస్తులు బరాబరులు తెలుపుచుండ, నితరసేవకులు ఛత్రచామరములు బట్టుకొనిరా, దండనాయకుఁడు బయలువెడలి రాజమందిరమున కరుగును. రాజనగరునకును, దండనాయకుని సభామంటపమునకును నడుమ నేడుకక్ష్యాంతరములు గలవు. ఒక్కొక్క కక్ష్యాంతరముఁ గడచినప్పు డాతని వెంటఁ బట్టుకొని రాఁబడు గొడుగులలో నొకటి తరువాత నొకటి వరుసగా మూసి, వెనుక నుంచఁబడును.

'అట్లా దండనాయకుఁ డేడుకక్ష్యాంతరములు గడచునప్పటి కేడు గొడుగులు వెనుకనుంచఁబడును. రాజ సమ్ముఖమున దండనాయకుఁ డొంటరిగఁ బ్రవేశింపవలయును. ప్రవేశించి, రాజ్యమునం

దలి సర్వవృత్తాంతముల నాతనికిఁ దెలిపి, యాతని యాజ్ఞలఁ గైకొని, సెలవుదీసికొని పోవుచుండును. దండనాయకుని మందిరము రాయలనగరునకు వెనుకభాగమున నున్నది.

'నగరున కెడమప్రక్కను దండనాయకుని సౌధము కలదు. దానికి వెనుక టంకసాల కలదు. ఇచ్చట నీ దేశమునందుఁ జలామణియగుచున్న నాణెములన్నియు ముద్రింపఁబడుచున్నవి. ఈ దేశమున మూఁడు విధముల బంగారు టంకములు రాగికలిపి ముద్రింపఁబడుచున్నవి. వానిలో మొదటిది 'వరహా'. వరహాలో సగము విలువగల నాణెమునకు 'ప్రతాప' మని పేరు. మూఁడవ నాణెము 'పణము.' వరహాకు నిరువది పణములుఁ, బ్రతాపమునకుఁ బదిపణముల నిత్తురు. పణమున కాఱు 'తరము' లను వెండినాణెములు వచ్చును. తరమునకు మూఁడు 'జత' లను రాగిటంకములు వచ్చును. ఈ దేశాచారములను బట్టి రాయలకు సామంతమండలేశ్వరులు, మహామండలేశ్వరులుఁ దా మీయవలసిన కప్పమును సంవత్సరమున కొకమాఱు టంకసాలయందుఁ జెల్లించుచుండుట యలవాటు. ఎవరికైన ధనమీయఁ దలంచినపుడు రాయలు టంకసాలపై వాని కీయవలసినదానికి రాయసమంపును. సిపాయిలకు బత్తెము నాలుగు నెలల కొకసారి రాయలిచ్చుచుండును. అందఱికిని టంకములనే యిత్తురుగాని, సామంతరాజ్యములపై వచ్చు పన్నులాదాయమును విలియవేయు నాచారము రాయలపాలనమునందు లేదు.

'ఆ దేశపు జనసంఖ్య యింతయని యుజ్జాయింపుగానైనను జెప్పుట కలవిగాదు. ఎచ్చటఁ గాంచినను దేశమంతయు జనసంకీర్ణమే. ఇసుకవైచిన రాలనియంత జనము గలదు. రాయల కోశాగారమునందు ధనము దాఁచుకొనుటకై పాతాళపుఁ గొట్టు లనేకములు గలవు. అందు బంగారము, వెండి కరఁగించి, దిమ్మెలుగాఁ బోసి యుంచెదరు. ఆ దేశమునందుఁ బేదవాని మొదలుకొని భాగ్యవంతునివఱకు స్త్రీలు, పురుషులు, బాలురు, చివరకు వీథులలో దొమ్మరియాటలాడు దొమ్మరులు సహితము చేతులకు, దండలకు,




శ్రీ కృష్ణదేవరాయలవారి గజశాలలు, హంపీ.

*—By Courtesy of Archaeological Dept., Madras.*

మెడలకుఁ, గాళ్లకు నమూల్యరత్నాభరణములో, పూఁతమెఱుఁగు నగలో, యేవో కొన్నిటినైనను ధరింతురు.

'రాయలకు మంచి చక్కనైన యేనుఁగొకటి గలదు. ప్రతి యుదయము నీ మదకరీంద్రమును రాయలసమ్ముఖమునకుఁ గైకొనివత్తురు. ప్రాతఃకాలమున నీ యేనుఁగును దర్శించుట రాయలకు శుభదాయకమఁట. రాయలవారి రాచయేనుఁగుల కన్నము వండి పెట్టుదురు. ఆ వంట యా యేనుఁగుల ముందటనే వండవలయును. అన్న ముడికినపిమ్మట నా యన్నమునందుఁ గొంచెముప్పును, బెల్లమును వేసి రెండేసిమణుఁగుల బరువుగల ముద్దలుగాఁ జేసి, నేతిలోఁ గాని, పెరుగులోఁగాని ముంచి, యా జంతువుల నోటిలోనుంతురు. ఇట్లీవిధమున నా మత్తకరీంద్రములకు రెండువేళల మేఁతనిడెదరు. ఒక్కొక్క యేనుఁగున కొక్కొక్కసాల చొప్పున నన్నిటికిని నన్ని సాలలు గలవు. ఆ సాలలగోడ లెత్తుగానుండి, బలిష్ఠములుగా నున్నవి. ఆ గోడలపైన లావు దూలములును, వానిపైనఁ గట్టుసరంబియుఁ గలవు. పైనున్న దూలములకును, ఈ యేనుఁగు వీఁపులకును, మెడలకును, ఇనుపగొలుసులు గట్టిగాఁ గట్టఁబడియుండును. ...వీనికి ముందఱకాళ్లకు గొలుసుల సంకెలలుగూడఁ దగిలించఁబడును.

'వేశ్యవాటికలు : టంకసాల కెదురుగా, కటకపాలుని కచ్చేరి కలదు. ఆతనిక్రింద నగరరక్షణమునకై పన్నెండువేల మంది కావలివాండ్రు గలరు. వారికి జీతములక్రిందఁ బ్రతిదినమును మనుష్యున కొక పణముచొప్పున వేశ్యవాటికలందుఁ బన్నెండువేల పణముల సుంకము వసూలు చేయుచుందురు, వేశ్యవాటికయందలి వెలయాండ్ర సౌధములు, వైభవసంపదలు, అప్పటి విలాసినీతతుల సౌందర్యము, మొల్కలేనగవుతో ముద్దులుగురియుచున్న వారియొయ్యారపునడకలు, నెంతటివారినైన వలపించు వారి నేర్పరితనపు మినుకులు, మోహనాస్పదములైన వారి చూపులు, విలాసములు వర్ణింపనలవికానివి.

'వేశ్యవాటికను గూర్చి యొక మాటమాత్రము చెప్పక తప్పదు. టంకసాల వెనుక నించుమించుగా నిరువదిగజముల వెడల్పును, మూఁడువందల గజముల పొడవును గల యొకవీధి గలదు. ఆ వీథి కిరుప్రక్కలను జక్కని పూపొదరిండ్లతో నిండిన ముంగిట వాకిళ్లుగల శోభనగృహములు బారులు తీరియున్నవి. ఆ ప్రాంగణములందుఁ జంద్రకాంతశిలా నిర్మితములైన వేదికలు వరుసగాఁ గలవు. ఆ వేదికలకు వెనుక మేడగోడలపై సింహములు, పులులు, చిఱుతపులులు, ఏనుఁగులు మొదలగు వన్యమృగములు అనేకములు జీవములతో నున్నట్లుగాఁ జిత్రింపఁబడినవి. అపరాహ్ణమున నెండవేడిమి యించుక తగ్గుచుండ, నీ వారవిలాసినులు చక్కఁగా నలంకరింపఁబడిన తమ యిండ్ల ప్రాంగణములందున్న చంద్రకాంత శిలావేదికలపైఁ దివాసులమీఁదను, కుర్చీలమీఁదను, సోఫాల మీఁదను......చేటీజనముతో సుఖోపవిష్టలై యుందురు. ప్రతివారవిలాసినియు నొడలంతయు నవరత్నఖచితామూల్యాభరణములతో, మంచి ముత్తెముల హారములతోఁ, గన్నులకు మిఱుమిట్లు గొలుపు చక్కఁదనముతో, రంగుచీరలఁ గట్టుకొని, చూచువారల హృదయములను జూఱగొనుచుండును......ఒక్కొక్క పడుపుటింతికి నిద్దఱు ముగ్గురు దాసీలు. వారు తమ యజమానులకడ నిలువఁబడి మార్గమునఁ బోవు విటకాండ్రను...ప్రయత్నించుచుందురు ...... వెలయాండ్రపొత్తును గూడి సుఖింపఁ గోరువాఁడు ఈ వీధినిఁ బోయి తన యిచ్చవచ్చిన తరుణినిఁ బడయవచ్చును. వేశ్యాగృహములందలి పరిచారికలు, దాసీలు మిక్కిలి జాగరూకులై యుందురు. విటుల సొత్తేదైనఁ బోయినచోఁ బరిచారికలకుఁ బ్రాణముమీఁదికి వచ్చును. వెంటనే వారు గృహములనుండి వెడలఁగొట్టఁబడుదురు. ఈ నగరపు టేడు ప్రహరీల నడుమ లెక్కకు మించిన వేశ్యాగృహములున్నవి......కావలివాండ్రు, అనుక్షణము నగరములో నేమేమి జరుగుచున్నదో ప్రతిక్షణమును గటకపాలున కెఱింగింపవలెను. ఏ వస్తు వెచటపోయినను, ఎక్కడ నే దొంగతనము జరిగినను, వెంటనే, నేరముఁ జేసినవానిని వెదకి, పోయిన

సొత్తును సొత్తుపోయినవానికిఁ దెచ్చియీయవలెను. ఏ నేరమును జరుగనీయరాదు. అట్లు జరిగినచో, దానికి వారు కొంత జరిమానా నిచ్చుకొనవలెను.'†

## తెలుఁగురాయఁడు

ప్రౌఢదేవరాయల పరిపాలనకాలముననే కొండవీడు, వినుకొండరాజ్యములు విద్యానగరసామ్రాజ్యమున లీనమయినవి. కొండవీడు, వినుకొండ, కందుకూరు రెడ్డిరాజులును, బద్మనాయకులును ప్రౌఢదేవరాయలకు సామంతమండలేశ్వరులుగ నుండి, కప్పములు చెల్లించుచుండిరి. కొండవీడు, వినుకొండదుర్గములను స్వాధీనపఱచుకొను సందర్భమునఁ దెలుఁగురాయఁడును, బంట మైలారరెడ్డియు దేవరాయల కత్యంతసాహాయ్య మొనర్చిరి.

తెలుఁగురాయఁడు వెలనాటిసీమలోని కృష్ణానదీ ముఖద్వారముననున్న శ్రీకాకుళము రాజధానిగఁ జేసికొని పాలించుచుండెనని కొందఱును, సబ్బినాపిరాష్ట్రములోని రామగిరిదుర్గమును బాలించుచుండెనని మఱికొందఱును నుడువుచున్నారు. కావున, నీ తెలుఁగురాయఁడు నిజముగ రాచఱికమెక్కడ నెఱపెనో తెలియరాదు. ఈతని తండ్రి శంభురాయలు. శంభురాయలకు 'సాంపరాయ' లని వ్యవహారనామము గలదు. తెలుఁగురాయలకు 'శ్రీమన్మహామండలేశ్వర మేదిని మీసరగండ కఠారి సాళువధరణివరాహ' యను బిరుదావళి యున్నట్లు గోచరించుచున్నది.

కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁ డొక సమయమునఁ దెలుఁగురాయల యాస్థానమున కేఁగి, యాతనిఁ గాంచి

"ధాటీ ఘోటకరత్నఘట్టన మిళద్ధాత్రీధృష్ట కళ్యాణ ఘుం
టా టంకార విలుంఠ లుంఠిత మహోన్మత్తాహిత క్షోణి భృ

---

† భారతి - సంపుటము 1, సంచిక 12. ఈ విషయము శ్రీ భావరాజు కృష్ణారావుగారిచే 'ఎల్లియట్' చరిత్రకారుని గ్రంథమునుండి వ్రాయఁబడినది. దానినే నేనిటఁ బొందుపఱచితిని.

తో త్కోటీ ఘోటీ ఘటిత కుంభినీ ధర సముత్కూటాటవీ ఝాట, క
ర్ణాటాంధ్రాధిప, సాంపరాయని తెలుంగా నీవు దీర్ఘాయువా."

అని యాశీర్వదించెనఁట. ఆ పద్యమునందలి శయ్యాచమత్కృతి కెంతయుఁ దెలుంగురాయఁ డలరి, యా కవి శ్రీనాథమహాకవియై యుండనోపునని నిశ్చయించి, యాతని కోర్కెఁ దెలుపుమని యెనఁట. అంతఁ గవిసార్వభౌముఁడు——

"అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ, కస్తూరికా
భిక్షాదానము సేయరా సుకవిరాడ్బృందారక శ్రేణికిన్
ద్రాక్షారామ పురీవిహారవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభి కుంభముల పైవాసించుఁ దద్వాసనల్."

అను పద్యమును జదివి, తనవాంఛను దెలుపుకొనెనఁట. వెంటనే, రాయ లాతనికిఁ గస్తూరి మొదలగు పదార్థములనిచ్చి, గౌరవించి, యంపెనఁట. అందులకే కాఁబోలు, శ్రీనాథుఁడు, తన యవసానకాలమున——

"రంభఁగూడె దెలుంగురాయ రాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు"

నని వాపోయెను.

తెలుఁగురాయల శాసనములు వెలనాడు, పొదిల ప్రాంతములందును, సింహాచలమునందును గన్పట్టుచున్నవి. విజయనగర రాజులకును, గజపతులకును పోరుగలిగిన సందర్భమున నీతఁడు ప్రౌఢదేవరాయల పక్షము వహించి, క్రీ. శ. 1428 లో సింహాద్రియందొక దాన శాసనము వ్రాయించెను. అసంతొమ్మాత్యుని తండ్రియైన తిక్కన యీతనికడ మంత్రిగ నుండినట్లు దెలియుచున్నది.

**పంట మైలారరెడ్డి**

ఈతఁడు ప్రౌఢదేవరాయలకు విశ్వాసపాత్రుఁడైన సేనాని. అతిపరాక్రమవంతుఁడు. తండ్రి ముమ్మడీంద్రుఁడు; తల్లి ముంచాంబ. తురుష్కులతోడను, గజపతులతోడను పోరవలసివచ్చినపుడెల్ల నీతఁడు రాయలకుఁ దోడ్పడి, విజయము ఘటింపఁజేయుచుండెను. మైలారరెడ్డి తోడ్పాటునకు రాయ లెంతయు సంతసించి, 'నీకేమి

కావలయు' నని యడిగెను. అందులకు రెడ్డి ముదమంది, 'ప్రభూ ! బ్రాహ్మణుల కొక మంచి యగ్రహారమును దానముసేయుఁడు. అదియ నా కోరిక' యని విన్నవించెను. దేవరాయలు 'వల్లె' యని, శా. శ. 1351, కీలకనామ సంవత్సర మాఘమాసమున భాస్కర క్షేత్రమున హేమకూటమున నివసించు విరూపాక్షదేవుని సన్నిధిని, పూరినాటిసీమలో గుండ్లకమ్మనది యొడ్డుననుండు పోలవరమను గ్రామమునకుఁ 'జేజెర్ల' యని పేరిడి, దానిని భూసురుల కగ్రహార ముగ ధారవోసెను.[1] మైలార రెడ్డికి 'ధరణీవరాహుఁడు', 'చౌహత్త మల్లుఁడు' అను బిరుదములు గలవు. ఆతఁడు మరణించిన పిదప, శ్రీనాథ కవి—

'కైలాసగిరిఁ జేరె మైలారు విభుఁ డేఁగి
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు'

అని విలపించెనఁట.

సాహిత్యవిజ్ఞానము

ప్రౌఢదేవరాయ లొకవంక జయశీలుఁడును, మఱియొకవంక హైందవధర్మరక్షకుఁడును, వేఱొకవంక సాహిత్యపోషకుఁడునై విరాజిల్లెను. ఈతఁ డాంధ్రకవులఁ బెక్కండ్రఁ జేరఁదీసి, గౌరవించెను. శ్రీనాథమహాకవి ప్రభువతంసునివలనఁ గనకాభిషిక్తుఁడగుటయే యిందులకుఁ దార్కాణము. కనకాభిషేక వృత్తాంతమును దెలుపుటకు ముందీ కవిసార్వభౌముని జీవితమును సంగ్రహముగఁ దెలుపుట నావిధి.

# శ్రీనాథుఁడు

'శ్రీనాథుఁడు భౌతికమున నార్జింపని విద్యలేదు. అనుభవింపని భోగములేదు. చేయకమానిన త్యాగములేదు. రక్తియందు విరక్తిని దర్శించెను. భోగవిస్ఫూర్తియందు యోగమునకు మార్గ మేర్పఱచు

1. Nellore Inscriptions, Copper Plate, No. 18

కొనెను. కవితావిలాసుఁడు; రసజ్ఞుఁడు; రసతన్మయుఁడు; ప్రకృతి లీలలో బ్రహ్మమును బ్రతిష్ఠించినవాఁడు.'†

శ్రీనాథుఁడు పాకనాటి నియోగిబ్రాహ్మణుఁడు. తల్లి భీమాంబ; తండ్రి మారయ; తాత కమలనాభుఁడు. భారద్వాజ గోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; యజుశ్శాఖీయుఁడు. క్రీ. శ. 1360 ప్రాంతమున నుండినవాఁడు.

శ్రీనాథుని జన్మస్థానమును గూర్చి పండితులలో భేదాభిప్రాయములు గలవు. శ్రీనాథుని పితామహుఁడు కమలనాభామాత్యుఁడు సముద్రతీరమునందలి కాల్పట్టనమున కధీశ్వరుఁడుగనుండెనని భీమఖండమువలనఁ దెలియుచున్నది.* ఈ యాధారమును బట్టి శ్రీనాథుని జన్మస్థానము కాల్పట్టనమనియు, నది పాకనాటిసీమలోని దనియుఁ గొందఱు నిర్ణయించిరి. కాల్పట్టనమే క్రొల్పట్టనమనియు, నదియే గుంటూరుమండలములోని సముద్రతీరముననున్న క్రొత్తపట్టనమనియు వీరేశలింగముగారు వ్రాసిరి. కాల్ అనఁగా నలుపను నర్థోపపత్తివలన నెల్లూరుమండలమున సముద్రతీరమునఁగల కృష్ణపట్టనమే కాల్పట్టనమని వీరభద్రరావుగారు రచించిరి. మచిలీపట్టణమునకుఁ దూర్పున సముద్రతీరముననున్న కాలీపట్టనమే కాల్పట్టనమై యుండనోపునని మఱికొందఱనిరి. కాలీపట్టనమునకు సమీపముననే కలపటమను గ్రామము గలదు. వీనికి దాపుననే శ్రీనాథుని యత్తింటివారి గ్రామమైన దగ్గుబల్లి కలదు. కావున నీతని జన్మస్థానము కాలీపట్టనమో, కలపటమో యై యుండనోపును.

**పాండిత్యము: గ్రంథరచనము**

> "సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య
> భాషా పరిజ్ఞాన పాటవంబుఁ

---

† శ్రీనాథవైభవము, పుట 108

* "కనకక్ష్మాధరధీరు వార్నిధి తటీక్రాల్పట్టనాధీశ్వరుఁ
ఘనునిం, బద్మ పురాణ సంగ్రహ కళాకావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతి సార్వభౌముఁ గవితా విద్యాధరుంగొల్తునా
యనుఁగుందాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్యచూడామణిన్."

బన్నగపతి సార్వభౌమ భాషిత మహా
భాష్య విద్యా సమభ్యాస బలము
నక్షపాద కణాద పక్షిలో దీరిత
న్యాయకళా కౌశలాతిశయము
శ్రుతి పురాణాగమ స్మృతిసాంఖ్య సిద్ధాంత
కబళన వ్యుత్పత్తి గౌరవంబు
పూర్వకవి ముఖ్య విరచితాపూర్వకావ్య
భావరస సుధా చర్వణ ప్రౌఢతయును
గిందళింపఁగఁ గాశికాఖండ నైష
ధ ప్రముఖ వివిధ ప్రబంధము లొనర్చె."

— నాచికేతూపాఖ్యానము.

ఈ పద్యమువలన శ్రీనాధుని సర్వతోముఖపాండిత్యము వెల్లడి యగుచున్నది. ఇక్కవిసత్తముఁడు బహు గ్రంథకర్తయనుట కీ పద్యము తార్కాణము.

"చిన్నారి పొన్నారి చిఱుత కూఁకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర;
నూనూఁగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి;
సంతరించితి నిండు జవ్వనమ్మునయందు
హర్షనైషధ కావ్య మాంధ్రభాష;
ప్రౌఢనిర్భరవయః పరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమ;

ప్రాయమింతకు మిగులఁ గైప్రాలకుండఁ
గాశికాఖండ మను మహాగ్రంథ మేను
దెనుఁగు జేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథ భట్ట సుకవి"

'అయః పిండమగు కాశీఖండమును గఱంచి, నిజపాండిత్య పరుసవేదిప్రభావమున, దానిని గనకకలశముగ మార్చివేసినాఁడు. ఆ కలశమునుండి నిజకవితామృతమును ఆ శ్రీనాధుఁడువలె ఈ శ్రీనాధుఁడు విబుధలోకమునకుం బంచినాఁడు. విద్వద్దౌషధమగు నైషధమును సహజప్రతిభావిశేష మనుపానముగా, రసికసేవ్యముగఁ జేసినాఁడు. నైషధము నలంకరించినాఁడు. శివరాత్రిమాహాత్మ్యమున

భక్తులను శ్రీశైల మెక్కించినాడు. హరవిలాసమున శివుని సాక్షాత్కరింపఁజేసినాఁడు. భక్తినిఁ బోషించెనా, విటుఁడుగూడ విశ్వాత్మయందు లీనమై తాండవింపవలసిన దే. కరుణముఁదరంగించెనా, కిరాతుఁడసైత మహింసాధర్మము నుపదేశింపవలసినదే. శృంగారము నభివర్ణించెనా, మహర్షియు మరులెత్తి శివాలాడవలసినదే.'†

ఇఁక నీ కవిశేఖరుని గ్రంథములఁ గూర్చి యించుక చర్చింతము.

1. మరుత్తరాట్చరిత్ర – చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటి నాఁడు రచించిన దీగ్రంథము. పదునాఱు వత్సరములకు లోపలి వయస్సన్నమాట. ఈ గ్రంథము దుర్లభము. కావునఁ దత్కథాంశమును, శైలిని వ్రాయుట కాధారములు లేవు.

2. శాలివాహనసప్తశతి— ఇది నూనూఁగు మీసాల నూత్నయౌవనమున రచింపఁబడినది. ఇరువది వత్సరముల వయస్సన్నమాట. దీనికి 'సాతవాహనసప్తశతి', 'గాథాసప్తశతి' యను నామాంతరములు గలవు. మాతృక ప్రాకృతభాషలోనిది. సాత (శాలి) వాహనుఁడు రచించెను. ఇందు నేడు వందల గాథలు గలవు. దీనినే శ్రీనాథుఁ డాంధ్రీకరించెను. కాని యిదియు దుర్లభమే. దానఁ, దెలుఁగు నేఁతయందలి మఱుఁగులు, మెఱుఁగులు గనఁజాలము.

3. శృంగారనైషధము——ఇది నిండు జవ్వనమున సంతరింపఁబడినది. ముప్పదియైదు వత్సరముల వయస్సన్నమాట. శ్రీహర్ష కృతమునకిది యాంధ్రీకరణము. మామిడి సింగనమంత్రికి సంకితము. శ్రీహర్షుని పాకమునుగూర్చియుఁ, దన యాంధ్రీకరణమును గూర్చియు శ్రీనాథుఁ డిట్లు నుడివెను —

"పనివడి నారికేళఫలపాకమునం జవియైన భట్టహ
ర్షుని కవితానుగుంభములు సోమరిపోతులు గొందఱయ్యలో
నని కొనియాడ నేర; రదియట్టిద; తేజవరాలు చెక్కఁగీ
టిన వసవల్చు బాలవుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే॥"

† శ్రీనాథవైభవము, పుట 109

నైషధమునుండి మచ్చునకొక పద్యము —

"లాటీచిత్త సరోమరాళ ! కరులీలావశ్య లోలాత్మ ! క
ర్ణాటీ నృత్తకళావిలోకన సమారంభ ప్రియం భావుకా
భోటీనేత్ర చకోరచంద్ర ! మగధీ పుష్పాస్త్ర ! చోళీకచా
ఘాటా స్థాపిత మన్మథాంక ! కుహాళీగాఢాంక పాళిప్రియా !"

4. హరవిలాసము—దీనిని నలువదివత్సరముల ప్రాయమున సంతరించియుండనోపు. అవచి తిప్పయ్యశెట్టి కిది యంకితము. ఏడాశ్వాసముల ప్రబంధము. ఇందు 'సిరియాలచరిత్రము', 'పార్వతీపరిణయము', 'దారుకావనవిహారము', 'హాలాహలభక్షణము', 'కిరాతార్జునీయము' అను శివకథలు గలవు.

మచ్చునకొక పద్యము—

"వికవికనవ్వి యక్కపట విప్రకుమారుఁడు మేలు లెస్స వా
నికినయి రాగబంధమును నిల్చె మదిం దరళాయతాక్షి మీ
సకియ వివాహవేళఁ బురశాసనుపాణి పరిగ్రహించుచో
ఝుకమున బుస్సుమంచు నహిగ్రామోఁగిన నెట్లు భయంబు నొందునో."

5. భీమఖండము—దీనిని నలువది వత్సరముల ప్రాయమున రచించియుండనోపును. ఇయ్యది స్కాందపురాణాంతర్గత భాగమున కాంధ్రీకరణము. రాజమహేంద్రవరపాలకులగు రెడ్డి రాజుల యాశ్రయమందిన పిదప దీనిని వ్రాసెను. బెండపూడి అన్నయామాత్యుఁ డీకృతికి నాథుఁడు. అన్నయమంత్రి వదాన్యతను గూర్చి శ్రీనాథుఁ డీ గ్రంథమున నిట్లు వాకొనెను —

"రాజమహేంద్ర దుర్గమునఁ గావించె శ్రీ
వీరభద్రునకుఁ బ్రాకారరేఖ;
నిలిపె మార్కండేయ నీలకంఠునిమ్రోల
రామేశుఁ దనతల్లి నామకముగ;
సంగమేశ్వరదివ్య శంభులింగమునకుఁ
గల్పించెఁ గళ్యాణ గర్భగృహము;
దక్షవాటికయందుఁ దం కేంద్రు మాళిక
మొగలివాకిట ధామమును రచించె

ప్రాగ్దిశా వప్ర గోపుర ప్రాంగణమున
సప్తమునిసింధు సోపాన సరణికెలనఁ
దీర్చె భవనంబు భీమయదేవునగర
మంత్రిదేవయ యన్నయామాత్యవరుఁడు.''

6. కాశీఖండము—దీనిని వ్రాయ మింతకు మిగుల శైత్రాల కుండ రచించినాఁడు. డెబ్బది వత్సరముల ప్రాయమున్నమాట. ఇదియు స్కాందపురాణాంతర్గత భాగమున కాంధ్రీకరణమే. భాషాంతరీకరణమున మూల మనుసరింపక, శ్రీనాథుఁడు స్వైరవిహార మొనర్చెను. కృతిపతి వీరభద్రారెడ్డి. మచ్చునకొక పద్యము -

''కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చె న
బ్జసరుహనేత్ర కొండచటిఁ బెద్ద యెలుంగున వెక్కివెక్కి వె
క్కసమగు మన్యువేగమునఁ గాటుక కన్నుల నీరు సోనలై
యుసిరికకాయలంతలు పయోధరముల్ దిగఁ బాఱుచుండఁగన్.''

7. శివరాత్రి మాహాత్మ్యము—రచనాకాలమునకు శ్రీనాథునకు డెబ్బదియైదు వత్సరములుండనోపును. శ్రీనాథుఁడు శివరాత్రి మహోత్సవమునకు శ్రీశైలమునకరుగఁగా, శాంతిభిక్షావృత్తియతీశ్వరుఁడు మల్లికార్జునదేవుని ముఖమంటపమున సభఁ గావించి, నిజశిష్యుఁడగు శాంతయ్యకు శివకథామాహాత్మ్య మొకటి యంకితముసేయ నాతనిఁ గోరెనఁట. దాన నాతఁ డీ గ్రంథమును రచించెనఁట.

మిగిలిన గ్రంథములు—ధనంజయవిజయము, నందనందన చరిత్రము, వల్లభాభ్యుదయము, కామశాస్త్రము - ఇవి ప్రకృతము నామమాత్రావశిష్టములు. పల్నాటి వీరచరిత్రము, కాటమరాజు కథ, వీథి, రసికాభిలాషము - ఇవియు శ్రీనాథుని కృతములందురు.

ఆస్థాని ప్రవేశము

కొండవీటి ప్రభుఁడైన కాటయవేమారెడ్డి తొలుఁదొల్త శ్రీనాథునకుఁ దన యాస్థానమునఁ దావొసంగెను. శ్రీనాథుఁ డఖండశేముషీధురంధరుఁ డగుటచే నాతని కాస్థానియందుఁ బ్రాధాన్య మబ్బెను. ఆ ప్రాధాన్యమున నాతఁడు విద్యాధికారి పదస్థుఁడాయెను.

ఆ పదవీధర్మముననుసరించి యాగతుఁడైన పండితులను బరీక్షించుట వలన శ్రీనాథుని సర్వంకషవైదుష్యము వెల్లడియయ్యెను. వైదుష్యమునకు ఫలముగఁ బెదకోమటి వేమారెడ్డివలన ననేకాగ్రహారములు వడసెను. అగ్రహారాది దానశాసనములందు 'విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః' అని కనఁబడుచున్నది.

పిదప, రాజమహేంద్రవరపాలకుఁడైన వేమ వీరభద్రారెడ్లు శ్రీనాథునకుఁ బ్రాపొసంగిరి.

**నానారాజసందర్శనము: కనకాభిషేకము**

తెలుఁగురాయఁడు—మేదినీ మీసరగండ కటారి సాళువ సంబురాయని కొడుకగు తెలుఁగురాయని దర్శించి, యాతనివలనఁ గస్తూరికా భిక్షాదానముఁ గొనిన విషయమును గూర్చి ప్రౌఢదేవరాయల కథాభాగమున విపులముగ వ్రాసియుంటిని.

ప్రౌఢదేవరాయలు—శ్రీనాథుఁడు కర్ణాటదేశాటనము సేయుచు విద్యానగరాధీశ్వరుఁడైన ప్రౌఢదేవరాయల దర్శింపనేఁగెను. రాయల యాస్థానమున 'గౌడడిండిమభట్టు', 'ముమ్మకవి' మొదలగు విద్వాంసులుండిరి. శ్రీనాథుని పాండిత్యమును గూర్చి గౌడడిండిమభట్టునకుఁ గన్నుగుట్టెను. డిండిమభట్టారకు లనేకులు గలరు. యోగానందప్రహసనకర్తయైన డిండిమభట్టారకుఁడే శ్రీనాథుని ప్రత్యర్థి. ఈ డిండిములకు డిండిమ యను కంచునగారా ముందు మ్రోయుచుండును. వారి వైభవమును బ్రకటించుశ్లోకమిది-

"అగ్రే డిండిమ తాండవం, తతఇతో వంది వ్రజోద్ఘోషణం
ద్విత్రాశ్చిత్ర పటాః కియన్తి బిరుదప్రోతాని పద్యానినః,
ఆస్తాం తావదిదం మహేశ మకుటీ కోటీర కల్లోలినీ
కల్లోల ప్రతిమల్ల సూక్తి విభవై ర్ద్వేష్యాన్విజేష్యామహే."

ముమ్మకవి శ్రీనాథునిఁ గాంచి, 'మీకేమేని బిరుదములు గలవా?' యని ప్రశ్నించెనఁట. అందులకుఁ బ్రత్యుత్తరముగా శ్రీనాథుఁ డీ పద్యమును జెప్పెనఁట.

"తరువున గాండీవంబిడఁడె ధర్మజునానఁ గిరీటి, యేను వా
క్సరసిజ నేత్ర యానతి విచారము చొప్పున గర్వహీనతన్
మరలి తెలుంగు భూమి కసమానగతిన్ గొని పోవువాఁడనై
బిరుదులు నారివాగుకడఁ బెట్టితి సత్కవి సార్వభౌముఁడన్."

ఇందుఁ బ్రయోగింపఁబడిన 'సత్కవిసార్వభౌముఁడన్' అను పదములు డిండిమునివైషమ్యమునకుఁ గారణమైనవి. ప్రౌఢదేవరాయల సమక్షమున సభ గావింపఁబడెను. శ్రీనాథ డిండిమభట్టారకు లిరువురు వాగ్యుద్ధమున కుపక్రమించిరి. ఉభయుల రసనాగ్రముల నుండి దివ్యవాక్కులు గురియఁదొడఁగెను. చంద్రభూషక్రియాశక్తి రాయ లనునతఁ డీ కవిప్రకాండుల వాదమున మధ్యవర్తిగనుండెను. పెద్దకాలము వాగ్వివాదము జరిగినపిదప, డిండిమభట్టారకుఁడు తల వాల్చెను. అంత డిండిముని 'కవిసార్వభౌమ' బిరుదము శ్రీనాథుని వశమాయెను. గౌడ డిండిమభట్టు కంచుఢక్క పగులఁగొట్టింపఁ బడెను. శ్రీనాథుఁడు ముత్యాలశాలలో దీనారటంకములఁ దీర్థమాడెను.

సింగభూపాలుఁడు:—రేచర్ల వంశజుఁడును, సర్వజ్ఞ బిరుదాంకితుఁడునునగు సింగభూపాలుని దర్శింపనేఁగి, సభాస్థానమున శ్రీనాథుఁడు శారదాదేవి నిట్లు ధ్యానించెను.

"దీనార టంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలసాల;
పగులఁగొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క;
చంద్రభూషక్రియా శక్తిరాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుదు;
పలుకుఁదోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధ గ్రంథ సందర్భమునను;

ఎటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగ మహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు
సరస సద్గుణ నికురుంబ శారదాంబ."

పిమ్మట విద్వత్సభ జరిగెను. శ్రీనాథుని వైదుష్యము ప్రకటితమయ్యెను. సింగభూవిభునివలన సన్మానితుఁడయ్యెను.

ఆపరవయస్సు: అగచాట్లు

వినుకొండరాజు లంతరించిరి. రాజమహేంద్రవర ప్రభువులు కాలగర్భమున లీనమైరి. ఇఁక, శ్రీనాథునకుఁ బ్రాపు లేదు. నిరాలంబుఁడు. గ్రహగతి విపరీతమార్గముఁ బట్టెను. పొట్టకూటికిఁ గఱవయ్యెను. పలనాటిసీమకుఁ బయనమయ్యెను. 'చిన్నచిన్న గుళ్లు, చిల్లర దేవుళ్లు, నాగులేటినీళ్లు, నాఁపరాళ్లు' దర్శించెను. 'జొన్నకలి, జొన్నయంబలి, జొన్నన్నము, జొన్నపిసరు' భుజించెను. విసుగుఁ జెందెను. పొట్ట చేతఁబట్టుకొని యొక్కయూఁపున 'మొరసరాజ్యము' న వ్రాలెను. కొంతకాలము గడపెను.

ఇపుడు శ్రీనాథుఁడు మూఁడుకాళ్ల ముదుసలి. అష్టైశ్వర్యయుక్తుఁ డష్టదరిద్రుఁడాయెను. ఎట్టులో 'బొడ్డుపల్లి' చేరి, యందు వాసమేర్పఱచుకొనెను. అటనేదో కొంత పొలముండఁబట్టి దానిని సేద్యముసాగించెను. బ్రాహ్మణసేద్యముగావునఁ బంట సున్న. మీఁదు మిక్కిలి వఱదలు. 'శిస్తు' తప్పదు. ఏడునూర్లు చెల్లింపవలసియుండెను. దాత లేఁడు. సంపాదనముడిగినది. చరమదశ.

అపుడిట్లు విలపించెను —

"కాశికా విశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయఁ డిచ్చు?
రంభగూడెఁ దెలుంగు రాయరాహుత్తుండు
కస్తూరి కే రాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు?
కైలాసగిరిఁజేరె మైలారు విభుఁడేఁగి
దినవెచ్చ మే దాత తీర్పఁ గలఁడు?
భాస్కరుఁడు మున్నె దేవుని పాలికరిగెఁ
గలియుగమ్మున నికనుండఁ గష్టమనుచు

దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.''

ఎంత విలపించినను ద్రవ్యము కూడు మార్గమెట్లు? కొంప నమ్ముటకా యది వల్లకాడైన పాడుపల్లె. కొనువారెవరు? చివరకు శ్రీనాథుఁడు బందీకృతుఁడైనాఁడు. పాపము! కాలపురుషునకుఁ దల యొగ్గినాఁడు. కాలుసేతుల కందువులు దగిల్చి, యెదురెండలో నిలిపినారు. ఇదియంతయు 'ఒడ్డె' రాజుల మహిమ.

అపుడు శ్రీనాథుఁ డిట్లు తలపోసెను—

''కుల్లా యుంచితిఁ, గోకఁ జుట్టితి, మెయింగూర్పాసముం దొడ్గితిన్,
వెల్లుల్లిం దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ,
జల్లాయంబలిఁ ద్రావితిన్, రుచులు దోసంబంచుఁ బోనాడితిన్,
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా నేను శ్రీనాథుఁడన్.''

ఎంతతలపోసినను దండనము తప్పునా? అంమనను నలవి కాని దండనము. వృద్ధత్వమున నంతటి కఠినశిక్ష ననుభవింపఁ జాలక, శ్రీనాథుఁ డిట్లు గన్నీరుగార్చెను.

''కవిరాజు కంఠంబుఁ గౌఁగిలించెను గదా
పురవీథి నెదురెండ పొగడదండ;
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మమ్మునఁ
దగిలియుండెను గదా నిగళయుగము;
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెను గదా వెదుఱుగొడియ;
సార్వభౌముని భుజాస్తంభమెక్కెను గదా
నగరివాకిటనుండు నల్లగుండు;
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలుఁ బెసలు
బొడ్డుపల్లెను గొడ్డేటి మోసపోతి
నెట్లు చెల్లింతుఁ డంకంబు లేదునూర్లు.''

తుదకుఁ గవిసార్వభౌముఁడు బ్రహ్మపదమలంకరించెను. ఒడ్డె రాజుల యప్రతిష్ఠమాత్రము ప్రపంచమున శాశ్వతముగ నిలిచిపోయెను.

### అల్లాఉద్దీన్ షాహతో యుద్ధము

అహమ్మదుషాహ క్రీ. శ. 1435-వ వత్సరమున మరణించెను. తరువాత నాతనికుమారుఁడైన అల్లాఉద్దీన్ షాహ బహమనీ రాజ్యాధిపత్యము వహించెను. ఈతఁడు రాజ్యమునకు వచ్చినతోడనే తనసోదరుఁడైన మహమ్మదుఖానునకుఁ గొంతసైన్యమిచ్చి, విద్యానగరాధీశుఁడగు దేవరాయలమీఁదికి యుద్ధమునకుఁ బంపెనఁట. దేవరాయలు పోరలేక, మహమ్మదుఖానుతో సంధిఁ జేసికొని, కొంత ధనమిచ్చి పంపెనఁట. తన కనాయాసముగఁ జేకూరిన విజయమునకు మహమ్మదుఖాను విఱ్ఱవీఁగి, తన యన్నను సింహాసనమునుండి తొలఁగింప యత్నించి, దేవరాయల సహాయముఁ గోరెనఁట. అందులకు రాయలు సమ్మతించెనఁట. మహమ్మదుఖాను ముదిగల్లు, రాచూరు, విజాపురము మొదలగుదుర్గములను స్వాధీనపఱచుకొనెనఁట. చివరకు, సుల్తానుసైన్యము మహమ్మదుఖాను నోడించెనఁట. సుల్తాను దయాంతరంగుఁడై సోదరుని మన్నించి, యాతనికి రాచూరుదుర్గాధిపత్య మొసఁగెనఁట.

### రాయలు సైన్యమును బలపఱచుట

రాయ లొకనాఁడు నిండు పేరోలగంబుండి, సభాస్తారులను గాంచి, 'జగద్విఖ్యాతులని పేరొందిన విజయనగరరాజులు తురుష్కులకోడిపోవుటకుఁ గారణమేమి?' యని ప్రశ్నించెను. అంత, సభాసదులు, 'ప్రభూత్తమా! తురుష్కులకు నుత్తమాశ్వములు గలవు. మనవి దేశవాళివి. ఇదియే వారి విజయరహస్య' మని విన్నవించిరి. దేవరాయ లాపలుకులయందలి నిజతత్త్వమెఱిఁగి, నాఁటినుండియు నుత్తమాశ్వములఁ దెప్పించి, యశ్వదళమును వృద్ధి యొనర్చెను. కొలఁదికాలముననే 2000 మహమ్మదీయ విలుకాండ్రును, 60,000 హిందూ విలుకాండ్రును, 48,000 ఆశ్వికులును, ఖడ్గములును, బల్లెములును ధరించి పోరాడు కాలిబంట్లు 200000 లును జేరి విద్యానగరసైన్య మలంకరించిరి.

రాజద్రోహులను శిక్షించుట

దేవరాయల విభవాతిశయమున కాతనితమ్మునకుఁ గన్నుగుట్టెను. ఎట్టులేని రాయల వధించి, తాను సింహాసనమలంకరింపఁ దలపెట్టెను. అందులకొక యుక్తిఁబన్నెను. తాఁ గట్టించిన నూత్న గృహప్రవేశమహోత్సవమున కెల్లరకు రాయల తమ్ముఁ డాహ్వాన పత్రికలనంపెను. ఆహూయమానులైన పురప్రముఖులెల్లరు రాజ గృహమలంకరించిరి. విందున కేర్పఱుపఁబడిన యాసనముల నందందు నాసీనులైరి. వారిలోఁ బెక్కండ్రను రాజసోదరుఁడు సంహరించి, రాయలకడ కేఁగి, యన్నను విందునకు రమ్మని వేఁడు కొనెను. ఆయువు గట్టిగానుండుటవలన, దైవముపలికించినట్లు రాయలు, తన కస్వస్థతగానున్నదని చెప్పి, రాఁజాలననెను. తమ్ముఁడు విఫలమనోరథుఁడై, తములపాకుల మఱుఁగున దాఁచి యుంచిన కత్తితో నన్ననుబొడిచి, శిరముఖండింప నొక భటున కాజ్ఞనొసఁగి, తాను రాజునని ప్రకటించుకొనెను. రాయ లించుక తెలివిదెచ్చుకొని, చంపవచ్చిన భటుని ఖండించి, యంతిపురి వెడలివచ్చి, 'నేను సజీవుఁడను. రాజద్రోహినిఁ బట్టుకొనుఁ' డని బిగ్గరగానఱచెను. పౌరు లా రాజద్రోహినిఁ బట్టి చెండాడిరి.

తురుష్కులు దండెత్తివచ్చుట

విజయనగరరాజ్యమునందలి ప్రకృతస్థితిగతులను గమనించి బహామనీసుల్తాను - అల్లాఉద్దీను – ఏడులక్షల వరహాలు కట్టవలసిన దని రాయలకుఁ గబురంపెనఁట. రాయ లా వర్తమానము విని, జంకక, తురుష్కులపై దాడివెడలెనఁట. పోయిపోయి ముదిగల్లు, రాచూరు, బెంగాపురము దుర్గములను బట్టుకొని, సాగరు, విజాపురమువఱకుఁ గల దేశమునంతయుఁ గొల్లకొట్టి, బహామనీరాజ్యమును గల్లోలపఱుపసాగెనఁట. సుల్తానుసైనికులును దండెత్తిపోయిరి. కాని, జయముగలుగక, సంధిచేసికొనిరి.

ప్రౌఢదేవరాయలు క్రీ. శ. 1446 ప్రాంతమున మరణించెను. †

† A. S. R., Page 25

# మల్లికార్జునరాయలు

ప్రౌఢదేవరాయలకుఁ బొన్నలదేవి, సింహళదేవి యను నిరువురు భార్యలుండిరి. పొన్నలదేవివలన మల్లికార్జునరాయలును, సింహళదేవివలన విరూపాక్షరాయలును గలిగిరి. మల్లికార్జునరాయలకు ఇమ్మడి ప్రౌఢదేవమహారాయలనియు, దేవరాయమహారాయలనియు నామాంతరములు గలవు. ప్రౌఢదేవరాయలు మరణించిన పిదప, మల్లికార్జునరాయలు సింహాసనమలంకరించెను. ఈతని మంత్రి తిమ్మనదండనాయకుఁడని కొందఱును, గణపన్నయొడయరని మఱికొందఱును నుడువుచున్నారు.

మల్లికార్జునరాయలు గోకర్ణక్షేత్రమందలి మతగురువుల నాదరించి, వారికి విరివిగ దానములు చేసినట్లు గనఁబడుచున్నది.

రాయల కిరువురు పుత్త్రులున్నట్లు దెలియుచున్నది. కాని, వారినిఁ గూర్చి యేచరిత్రకారుఁడును వ్రాసియుండలేదు.

గజపతుల దండయాత్ర

కటకపురాధిపతియైన కపిలేంద్రగజపతిమహారాజు జైత్రయాత్ర వెడలి, మొదట రెడ్డిరాజులను జయించెను. ఆమీఁద, రాజమహేంద్రవరరాజ్యమును, ఉదయగిరివఱకుఁ గల కర్ణాటరాజ్యమును, ఏకశిలానగరమువఱకుఁగల పద్మనాయకుల రాజ్యమును జయించి, వాని పాలనముకొఱకుఁ బ్రతినిధుల నియమించెను. ఈ విజయగాథయంతయు క్రీ. శ. 1460 లోపలనే ముగిసినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. అంతటఁ గపిలేంద్రగజపతి విజయకాంక్షమెయి విద్యానగరముపై దండెత్తిపోయెను. కాని, మల్లికార్జునరాయలు గజపతితోఁ బిఱితివియని పరాక్రమమునఁ బోరి, యాతనిఁ దఱిమివేసెను. *

మల్లికార్జునరాయ లించుమించుగా నిరువదేఁడులు ప్రశాంత

* Indian Antiquary, Vol. XXXVIII, Page 93

ముగఁ బ్రజలను బాలించి, క్రీ. శ. 1465 లో భౌతికశరీరమును జాలించెను.

## విరూపాక్షరాయలు

మల్లికార్జునరాయలు గతించినపిదప, నాతని సోదరుఁడగు విరూపాక్షరాయలు సింహాసనమునకు వచ్చెనని 'సజ్జలూరు' శాసనమువలనఁ దెలియుచున్నది. ఈతఁడే సంగమవంశపు రాజులలోఁ గడపటివాఁడు.

విరూపాక్షరాయలు స్త్రీలోలుఁడు. సురాపానమత్తుఁడు. విషయలంపటుఁడు. అహర్నిశలు శుద్ధాంతమునఁ గడపువాఁడు. రాజ్యకార్యములయందు విముఖుఁడు. ప్రజల కాతని దర్శనము దుర్లభము; దండనాయకులకును నలభ్యము. దాన, రాజ్యమునం దెల్లెడల నసంతుష్టిభావ ముదయించెను. రాయలు తన యవివేకమువలన దండనాయకులను బెక్కండ్ర సంహరించెను.

ఈతనికాలమునఁ గపిలేంద్రగజపతి కుమారుఁడైన పురుషోత్తమగజపతి విజయనగరముపై దండెత్తి, యపారధనమును, సింహాసనమును, సాక్షిగోపాల విగ్రహమును గొనిపోయి, యావిగ్రహమును గటకమునఁ బ్రతిష్ఠింపఁజేసి, సింహాసనమును జగన్నాథస్వామికి సమర్పించెనఁట. ఈతని కాలముననే (క్రీ. శ. 1469) మహమ్మద్ గవాన్ అను నాతఁడు పశ్చిమ సముద్రతీరమందలి గోవాను స్వాధీనము చేసికొనెను.

ప్రథమవంశావసానము

ఏ వంశము జగద్విఖ్యాత సామ్రాజ్యస్థాపనమునకుఁ గారణమయ్యెనో, యే వంశము ప్రాచీన హైందవధర్మరక్షణమునకుఁ గంకణము గట్టుకొనెనో, యే వంశము సంస్కృతాంధ్రకవిజనపోషకమయ్యెనో, యే వంశము పూర్వపశ్చిమ సముద్రాధీశ్వర బిరుదాంచితమయ్యెనో, యే వంశము పరిపంథి భీకరారణ్యదవానల మయ్యెనో-

యట్టి సంగమవంశము పతనమైనది. ఈ వంశమునకుఁ గడపటి వాఁడగు విరూపాక్షరాయలే పతనకారకుఁడు; ఆతని విషయలోలుప తయే పతనహేతువు.

విరూపాక్షరాయలకు రాజశేఖరరాయలు, ప్రౌఢదేవరాయలు నను నిరువురు కొడుకులుండిరి. అందు జ్యేష్ఠుఁడు-రాజశేఖరరాయలు జనకుని దుర్నయమును గాంచి, యాతనిఁ జంపి, సింహాసనమధిష్ఠించెను. రాజశేఖరరాయలు రాజ్యమునకు వచ్చిన కొలఁది దినములకే తండ్రినిఁ జంపిన దుష్టుఁడని యాతనిఁ ప్రౌఢదేవరాయలు తుదముట్టించి, తాన రాజ్యాధిపతియై, తండ్రివలెనే స్త్రీలోలుఁడై వర్తించుచుండెను.[1] ప్రౌఢదేవరాయలనే 'న్యూనిజ్' పాడియోరావని వ్రాసియున్నాఁడు.[2] భ్రాతృహంతకుని రాజ్యము ప్రజలకు రుచి పడమ్యేను. ప్రౌఢదేవరాయల సేనానాయకులలోఁ ప్రసిద్ధుఁడైన సాళువ-నరసింహరాజు తన ప్రభుని యసమర్థతను గ్రహించి, యాతనిని రాజ్యమునుండి తొలఁగించి, తాన సింహాసనమధిష్ఠించెను.

అంతటితో సంగమవంశ మంతరించెను.

1. Forgotten Empire, Pages 305-06.
2. Epigraphical Collections for 1902, No. 593

# సాళువవంశ చరిత్రము

సాళువవంశము పురాతనకాలమునుండియుఁ బ్రసిద్ధిఁగన్నది. ఈవంశమువారు కల్యాణనగరమునందుండి పరిపాలనము సేయుచున్నట్లు దెలియుచున్నది. వీరి వంశానుక్రమణిక సాళువాభ్యుదయము, రామాభ్యుదయము మొదలగు సంస్కృతకావ్యములందును, జైమినిభారతము, వరాహపురాణము మొదలగు నాంధ్ర గ్రంథములయందును వర్ణింపఁబడియున్నది. ఆంధ్రదేశమున ననేక శాసనములందును వ్రాయఁబడియున్నది. ఈ వంశము వా రాంధ్రులు. వీరిలోఁ గొందఱు సంగమవంశ రాజులకు సన్నిహితులును, సరదారులును నై యుండి, వారికిఁ బలు తెఱంగులఁ దోడ్పడుచుండిరి.

రాజనాథకవికృతమగు సాళువాభ్యుదయమునం దీవంశము సమగ్రముగ వర్ణింపఁబడియున్నది. చంద్రవంశమున యదువు జనించెను. వాని వంశమునఁ జాళుక్యనారాయణుఁ డుద్భవించెను. వాని వంశమున వీరరాయలు, సుందరమల్లుఁడు, ఘనమల్లుఁడును బుట్టిరి. ఈ వంశజులకు 'పంచఘంటానినాద' అను బిరుదముగలదు. వరాహచిహ్నముగల ధ్వజముగలదు. కఠారి ప్రధానాయుధము. కావున వీరు 'కఠారిరాయ', 'ధరణీవరాహ' యను బిరుదులచే విరాజిల్లిరి. వీరి వంశమున గుండదేవుఁడు జనించెను. ఈతనికిఁ గమలాదేవివలన గుండయ, సాళువమంగిదేవుఁడు, సావిత్రిమంగిదేవుఁడు, బలుఁడు, గౌతయ, ఆదిరాజు అను నార్గురు తనయులు జనించిరి. గుండదేవుని కొడుకులలోఁ బ్రసిద్ధిఁగన్నవాఁడు సాళువమంగిదేవుఁడు. ఈతనిఁ గూర్చి జైమినిభారత మిట్లు నుడువుచున్నది:

"దురములో దక్షిణ సురతాను నెదిరించి
కొనివచ్చి సంపరాయనికి నిచ్చె,
సామ్రాజ్యమున నిల్పి సంపరాయస్థాప
నాచార్య బిరుద విఖ్యాతిఁ గాంచె,
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్చ్యాదివేలు
మాడలదేవు నమ్మడికి నొసఁగె,

# సాళువవంశము


గుండ్రాజు = కమలాదేవి
గుండ్రాజు
సాళువమంగిదేవుఁడు
సావిత్రిమంగిదేవుఁడు
వీరహోబలుఁడు
గౌతరాజు
ఆదిరాజు
సింగరాజు
గుండ్రాజు
గౌతరాజు
సావడిక్షితీశుఁడు
హనుమరాజు
మల్లినాథుఁడు
గుండ్రాజు=మల్లాంబ
సాళువరాజు
బొప్పరాజు
తిప్పరాజు=హరిహరాంబ
(రెండవ దేవరాయల చెల్లెలు)
నరసింహరాజు=శ్రీ రంగాంబ
(1)
తిమ్మరాజు
తిమ్మరాజు
ఇమ్మడి నరసింహరాయలు
(2)

మధురాసురత్రాణు మడియించి పరపక్షి
సాళువ బిరుదంబు జగతి నెఱపె,
గబ్బితనమునఁ దేజి మొగంబుగట్టి
తఱిమి నగరంపు గవఁకులు విఱుగఁ ద్రోలి
తాను వ్రేసిన గౌరు సుద్దవిడిఁదెచ్చె
సాహసంబున నుప్పాంగు సాళ్వమంగు."

— జైమి. ప్ర. ఆ. ప. 31

కుమారకంపరాయల దక్షిణదిగ్విజయయాత్రాసందర్భమున సాళువమంగిదేవుఁడు గోపన్నమంత్రికి దండనాథుఁడుగా నుండి యాతని యాజ్ఞానువర్తియై యుండెనని దక్షిణార్కాడు మండలములోని 'దలవనూరు' శాసనమువలనఁ దెలియుచున్నది.

గౌతరాజునకు గుండరాజు జనించెను. గుండరాజునకు మల్లాంబిక వలన నరసింహభూపాలుఁడును, తిమ్మరాజును గలిగిరి.

## సాళువ నరసింహరాయలు (క్రీ. శ. 1486-1493)

నరసింహరాయలు మల్లికార్జునరాయలకాలమునుండియు విద్యానగరాధీశ్వరులకు సామంతుఁడుగను, సేనానిగను నుండెను. ఈతనిశాసనములు దక్షిణదేశమునఁ బెక్కులు గాన్పించుచున్నవి. బహమనీరాజ్యపు సుల్తాను గండికోటను, కటకపురాధీశ్వరుఁడైన పురుషోత్తమగజపతి కాంచీనగరమును ముట్టడించినపుడు నరసింహరాయ లద్వితీయపరాక్రమమునఁ బోరి, యా శత్రువులను బాఱఁ దోలెను. తా రచియించిన రామాభ్యుదయమునందుఁ దాను కాంచీ, కటక, కుంతల, చోళ, పుండ్రక రాష్ట్రములను జయించి, వానిని బాలించుచుండినట్లు చెప్పుకొనియున్నాఁడు. రాజనాథ డిండిమకవికృతమైన సాళువాభ్యుదయమునందు నరసింహరాయల దిగ్విజయము లిట్లభివర్ణింపఁబడియున్నవి.

† 'యోగానంద ప్రహసనమును రచించి దేవరాయలకాలమునఁ బ్రఖ్యాతి వహించిన డిండిమకవిసార్వభౌమ బిరుదాంచితుఁడగు నరుణగిరినాథునకు రాజనాథ కవి కుమారుఁడు. ఈతనికిని డిండిమకవిసార్వభౌముఁడను బిరుదము సంక్రమించినది.'

''నరసింహరాయలు కళింగముపై దండెత్తిపోయెను. గజపతికిని, రాయలకును ఘోరయుద్ధము జరిగెను. గజపతి యోడిపోయి, పలాయితుఁడు కాఁగా, నరసింహరాయ లాతని నగరమును ముట్టడించి, గజపతినిఁ బట్టుకొనెను. ఉత్తరదిగ్విజయయాత్రపిమ్మట, దక్షిణదేశమునకుఁ దిరుపతిమీఁదుగా చోళరాజ్యముపై దండు విడిసెను. నరసింహరాయల దాడి విని, చోళదేశపు రాజు పలాయితుఁడయ్యెను. కుంభకోణమునకును, దరువాత శ్రీరంగమునకును బోయి, పిమ్మట జంబుకేశ్వరములోని శివుని దర్శించెను. ఇతని ప్రతాపమునకుఁ దాళఁజాలక రాజులందఱు నితనికిఁ గప్పము గట్టుచుండిరి. సింహళపు రాజుసహితము నరసింహరాయలతో నొడంబడికను గావించుకొనుటకు సిద్ధముగానుండెను. తరువాత నాగమండలమును బెనుగొండను జయించెను. పెనుగొండకడ మహమ్మదీయ సైన్యములు తన్నెదురుకొనఁగా, వానిని బూర్తిగ నోడించెను. నృసింహరాయలు హిమాలయమునకుఁ బోయి, కాశికావిశ్వేశ్వరుని దర్శించి, యచటఁ బట్టాభిషిక్తుఁడయ్యెను.''*

సాళువాభ్యుదయమునందలి క్రింది శ్లోకమువలన నరసింహరాయలు చంద్రగిరినిఁ బాలించుచున్నట్లు దెలియుచున్నది.

> ''తదిహ స కలరక్షసావధానో
> విహరతి సాంగ్రధరోహి వేంకటాద్రిః,
> సవిధ భువి తదా హితావనాయాం
> నృపవర చంద్రగిరౌ ని........''

ఆ కాలమునందు నారాయణవనము చంద్రగిరి రాజ్యమునకు రాజధానీనగరముగ నుండెను.

విజయనగరసామ్రాజ్య మొకవంక మహమ్మదీయ విజృంభణమునకును, వేఱొకవంక గజపతుల విజృంభణమునకును దాళలేక, పరహస్తములఁబడునని నరసింహరాయ లెఱింగి, సామ్రాజ్యక్షేమమునుగోరి, స్వతంత్రుఁడై, విజయనగరమున కరుదెంచి, క్రీ. శ.

* జీర్ణ విజయనగరచరిత్రము - పు. 130-131

1486-87 ప్రాంతమున సింహాసనమధిష్ఠించి, రాజపరమేశ్వర, (మహా) రాజాధిరాజ బిరుదవిరాజితుఁడై, ప్రజలను బాలింపఁ దొడఁగెను.[1]

మంత్రులు

నరసింహరాయలకడ నిరువురు మంత్రులుండినట్లు తెలియుచున్నది. అందు మొదటివాఁడు తుళువ నరసరాజు; రెండవ యతఁడు నాదిండ్ల చిట్టిగంగనామాత్యుఁడు.

తుళువవంశసంజాతుఁడైన యీశ్వరరాజుపుత్త్రుఁడు నరసరాజు. ఈతఁడు సాళువగుండయ నారసింహభూపాలునికడ సైన్యాధ్యక్షుఁడుగను, ముఖ్యమంత్రిగను నుండెను. ఈశ్వరరాజు సహిత మీ నృపాలునికడఁ గొంతకాలము సైన్యాధిపతిగా నుండి, బహు దేశములను జయించి, విద్యానగరరాజ్యమును విస్తరింపఁ జేసెను. నరసరాజుచరిత్ర తుళువవంశమున సమగ్రముగఁ దెలుపఁబడును.

చిట్టిగంగనామాత్యుఁడు కౌశికగోత్రుఁడు. అర్థశాస్త్రవేత్త. మొదట నీతఁడు చంద్రగిరిరాజ్యాధిపతియైన సాళువ నరసింహరాయలకడ మంత్రిగనుండి, యీ రాజ్యమును విస్తరింపఁ జేసెను. కడుంగడు వృద్ధుఁడైనను గాయపుష్టియును, బుద్ధివైశారద్యము నీతనికి బలీయముగనుండెను. ఈతఁడు రాజుతోఁ గూడఁ జంద్రగిరిరాజ్యమునకు రాజధానియైన నారాయణవనమున వసించుచుండెను. తన రాజు విద్యానగరాధీశుఁడైన పిమ్మట నాతనితోఁ గూడఁ దానును విజయనగరమున కరుగుదెంచెను. తిమ్మరుసును వృద్ధికిఁ దెచ్చినవాఁడీతఁడే.

---

1. "The last record of Virupaksha available to us is one dated Friday, July 29, 1485 A. D. The first in which Saluva **Narasimha appears** with the **Imperial** titles, Rajadhiraja, Rajaparameswara, etc., is dated **November 1, 1486 A. D.** Between these dates the actual usurpation **must have taken place, there having** been the two sons of Mallikarjuna alive at the time not counting the prince that was set aside-a son of **Virupaksha - Mallikarjuna's Brother"** - A Little Known chapter of Vijayanagar History, Page 47.

### సాహిత్యపోషణము

సాళువ గుండ నరసింహభూపాలుఁడు సంస్కృతాంధ్రముల సమానముగ నాదరించిన మహనీయుఁడు. తాను గవియై, సంస్కృతమున రామాభ్యుదయమను కావ్యమును రసవంతముగ రచించిన మేటి. ఆంధ్రకవితల్లజుఁడగు పిల్లలమఱ్ఱి-పినవీరభద్రకవినిఁ దన యాస్థానమున నుంచుకొని, కృతిని వెలయింపఁజేసి, దానికి నాథుఁడైన మేధావి.

## పినవీరభద్రకవి (పిల్లలమఱ్ఱి)

పినవీరభద్రకవి నియోగిబ్రాహ్మణుఁడు; గాదయపుత్త్రుఁడు; పెదవీరభద్రునితమ్ముఁడు; భారద్వాజగోత్రుఁడు. నిరుపమాన కవితాధారగలవాఁడు. ఈతని వంశము కవివంశమనుటకుఁ గ్రింది పద్యములే తార్కాణము.

'తాతయుఁ దండ్రియు నగ
భ్రాతయునుం దాను భువనభాసుర కృతిని
ర్మాతలు పిల్లలమఱ్ఱి వి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్'

— జై. ప్ర. ఆ. ప. 20

'అమృతాంశుమండలం బాలవాలము గాఁగ
మొలచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగురించె విలయసింధుగతకైతవడింభ
శయనీయ వరపలాశములతోడఁ
బితృదేవతలకు సంచితసత్త్రశాలయై
చెట్టు గట్టెను గయాక్షేత్రసీమ
నిలువనీడయ్యె నిందీవరప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు

మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలెఁగాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరు వాక్యసరణి
సరసులకు నెల్ల గర్ణరసాయనంబు.'

— జై. ప్ర. ఆ. ప. 21

పినవీరభద్రకవి తనకు భారతీతీర్థ గురుకృపా విశేషముచేతఁ గవిత్వమబ్బినట్లు క్రింది పద్యమునఁ జెప్పుకొనినాఁడు.

'పరగంగ మల్లమాంబాకుమారుఁడవు సో
మకులాంబునిధి పూర్ణిమావిధుఁడవు
భరతకీర్తికిఁ దులాపురుషాది దానాంబు
జంబాలితాస్థాన సాధుఁడవును
బరరాజభీకర ధరణీవరాహ్వయున
కాత్రేయగోత్ర పవిత్రుఁడవును
గుండయ నరసింహ మండలేశ్వరుఁడవు
నభ్యుదయపరంపరాభివృద్ధి
కరముగా భారతీతీర్థ గురుకృపా స
మృద్ధ సారస్వతుఁడు సత్కవీంద్ర సఖుఁడు
కుకవిమల్లకపోల్ల సత్కులిశహస్త
పల్లవుఁడు చెప్పెఁ బినవీరభద్ర సుకవి.'

జై. అ. ఆ. ప. 219

పినవీరభద్రకవి సాళువగుండనరసింహరాయల యాస్థాన కవియని వ్రాసియుంటిని. నరసింహభూపాలుఁ డొకనాఁడు నిండు పేరోలగంబుండి, పురాణేతిహాస కథాప్రసంగంబుల వినోదించుచుఁ బినవీరభద్రకవినిఁ గాంచి—

"నామది నిరతము భారత
రామాయణ కథలఁ బ్రేమ రంజిలు నంమన్
జైమిని భారతమనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్."

జై. ప్ర. ఆ. ప. 16

"ఆపురాణంబుఁ గనఁ దెనుఁగయ్యె నేనిఁ,
జెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁ డేనిఁ,
దెనుఁగు నుడికారమున మించుఁ గనియె నేనిఁ
గుందనము కమ్మవలచినచందమగును."

— జై. ప్ర. ఆ. ప. 17

"........హృద్యానవద్య గద్యపద్యానుబంధంబుగాఁ బ్రబంధంబు నాంధ్ర భాషను జైమినిభారతం బశ్వమేధపర్వంబు నిర్విఘ్నంబుగా రచియింపుము......"

వచ-25

అని యానతిచ్చెను. ఈకవి 'మహాప్రసాద'మని యా గ్రంథ
ను రచింప నొక్కమాసము గడువు వేఁడెను. రాజందులకు
ల్లె' యని, కర్పూరతాంబూలంబుఁ దెప్పించి, సగౌరవంబుగ
సంగి, కవికి సెలవొసఁగి యంపెను. రాజునాజ్ఞఁగొనిపోయిన
వీరన గడువుదినముదనుకఁ గావ్యరచన కుపక్రమింపఁడయ్యెను.
్గ గడువుదినము. తమ్ముని యలసత యొకవంకను, ప్రభునాజ్ఞ
ొకవంకను పెదవీరభద్రుని మనమును గలవరపెట్టుచుండెను.
ఈ నాతఁడు తమ్మునిఁ జేరఁబిలిచి, 'నాయనా! ముందు వెనుకలు
ాజింపక చేనికడఁ గఠిన ప్రతిజ్ఞఁజేసితివి. తెల్లవాఱిన గడువు.
ర్యము భారమైనది. ఇంతవఱకును వ్రాఁతను సాగింపవైతివి.' అని
ందలించెను. పినవీరన్న యా పలుకులకు నవ్వి, 'అన్నా! భయ
ు? నా కిది యెంతపాటిపని? వేగులోపల నీపని ముగింతును.
ర కుటుంబమునకు శాశ్వత యశముఁ గూర్తును' అని నుడువఁ
వీరనమన మించుక కుదుటఁబడెను.

నాఁటి సాయంసమయమునఁ బినవీరభద్రుని కోర్కెమెయి
కని వదినె యొక గదిని శుభ్రపఱిచి, గోమయమున నలికి, రంగ
యలు దీర్చి, దానిని నాముదపుదివ్వెలఁ గైసేసెను. పినవీరన
ం రేయి త్వరితగతిభుజించి, యా గదినిఁ బ్రవేశించి, లోనఁ
ుఁ దగిలించి, మంచముపైఁ బరుండెను పెదవీరన్న తమ్ముని
్నహమును గమనించి, లోలోన నువ్విళులూరుచుండెను. కొంత
టికి గదిలోపలనుండి తాటాకు వ్రాయు చప్పుడు వీతెంచెను.
ఏ నాతని యన్న కొంతతడవాలించి, భార్యను బిలిచి, 'యోసీ!
ం గదినుండి వెలువడుచప్పుడు నీవును నాలించితివా? నీ మఱఁది
మేని వ్రాయుచున్నాఁడా?' యని ప్రశ్నింప, నాయమ కేమియుఁ
చక మిన్నకుండెను. అంత నాతఁడు చెవిని దోరగిలఁబెట్టి
ంలింపఁ, దమ్ముఁడు గుఱ్ఱువెట్టుచు నిద్రించుచున్నట్లును, ఎవ్వరో
ాకును వ్రాయుచున్నట్లును వినవచ్చెను. ఆతఁ డిదమిత్థమని
యింపఁజాలక, యెట్టకేలకుఁ గవాటముకడ కేఁగి, తలుపునందలి

రంధ్రమునఁ గన్నుంచి, లోనఁ బరికించెను. ఏమి యాశ్చర్యము! ఒక సుందరాంగి, సర్వాభరణభూషితయై గంటముఁ గేలఁబూని, తాళపత్త్రమును లిఖించుచుండెను. తమ్ముఁడు మంచమున నిద్రించుచుండెను. పెద్ద వీరన్న యట్టులె చూచుచు నా నలువరాణి కినిసి, చేతనున్న గంటము నాతని కంటిపై విసరెను. అతఁ డా దెబ్బకుఁ దాళఁజాలక బొబ్బరిలెను. ఆ గాటమైన కేకకుఁ బినవీరన్న యులికిపడి లేచి, యన్నను గాంచి, 'కారణ మే' మని యడిగెను. సోదరుఁడు దన కంటినిఁ జూపెను. తమ్ముఁడు 'భయపడకు' మని నుడివి, వ్రాఁతచేఁ గ్రిందరాలిన తాటాకుపొడిఁ దెచ్చి, కంటిలో నుంచి, కట్టుఁ గట్ట, గాయము వెంటనేమాని, నేత్రము యథారూపముఁ దాల్చెను.

అన్యపురుషుఁడు దన్ను వీక్షించుటచే నట నుండనొల్లక, వాణి తా వ్రాయుచున్న పుస్తకము నటవైచి, యంతర్హితయయ్యెను.

మిగిలినభాగమును బినవీరన్న ముగించెను. బల్లునఁ దెల్లవారెను.

అన్నదమ్ములిరువురుఁ గాల్యకృత్యంబులు దీర్చుకొని, జైమినిభారతగ్రంథమును గైకొని, ప్రభువునాస్థానమున కేఁగిరి. రాయలును వారిని రావించి యుచితాసనములఁ గూర్చుండఁజేసెను. అంత వీరన గ్రంథము నామూలాగ్రముఁ జదివి, నరసింహరాయల కంకితమొసఁగెను. రాయ లంతఁ జామీకరహయము, ధవళచామరములు, నానామణివిభూషణంబులు, గ్రామము నొసఁగి, వీరభద్రకవిని సత్కరించెను.

సభాస్తారు లంతఁ బినవీరన సరసతకు మెచ్చి, యా కవిసత్తముని గాంచి, 'ఇంత యల్పకాలమున నింతటి గ్రంథము నెట్లు ముగింపఁగలిగితి'వనిరి. ఆ మాటలకు వీరభద్రుఁడు 'వాణి నా రాణి' యని వాక్రుచ్చెను. పండితు లా మాటల కత్యంతము కసలి, 'జగ

న్నాతయగు వాణి నీకెట్లు రాణియగును? నీవు పండితమానివికాని, పండితుఁడవు కా'వని యధిక్షేపించిరి.

అంత నశరీరవాణి పండితుల నుద్దేశించి, మేఘగంభీరస్వరమున—'వాణి జగంబునకు మాత. ఇతనికిమాత్రము భార్యయగును. ఇతఁడు చతురాననుని యవతారము. కావున నీ సంశయ మింక వదలుఁడు.' అని పలికెను. సభ్యులద్భుతమందిరి.

పినవీరభద్రకవి జైమినిభారతమునుగాక, శకుంతలాపరిణయమును సహితము రచించెను. మచ్చునకు —

"కాఁక నెదిర్చి సంగరముఖంబున హెచ్చినరాజవంశముక్
గూఁకటివేళ్ళతోఁ బెఱికి గోత్రవధంబును జేసినట్టి యా
ప్రేఁకపుఁగీడు గాక ప్రజవేఁచఁ దలంచిన గోరుచుట్టుపై
రోఁకటి పోటు చందముగ రోసి జనుల్మనుఁ జూచి తిట్టరే."

— జైమినిభారతము

"నవలావణ్యపయోధిఁ జిత్తమను మంథానాద్రికిం జంద్రికా
పవనాశిం దరిత్రాడుగాఁ బెనఁచి యబ్జాతాసనుం డేర్చెఁ గ్
రవళిం గోకిల కీరము ల్దరవ నారత్నాకరంబందు ను
ద్భవముం బొందిన లక్ష్మిగావలయు నప్పద్మాక్షి వీక్షింపఁగన్"

— శకుంతలాపరిణయము

### సైన్యాభివృద్ధి

నరసింహరాయలకాలమున గజపతులును, నశ్వపతులును నాతనికిఁ బ్రత్యర్థులుగనుండిరి. ఒక సమయమున బహమనీసుల్తాను కోలారుమండలమునందలి మాలూరికోటను ముట్టడించెను. సుల్తానుతోఁ బోరఁదగినంతసైన్యము తనకడలేమిఁ జేసి, నరసింహరాయలాతనితో సంధిచేసికొనెను. సుల్తాను మరలఁ గాంచీనగరము నాక్రమించి, యందలి దేవాలయములను గొల్లకొట్టెను. ఎప్పటికైనను సుల్తాను తనకు ముప్పని నరసింహరాయలు భావించి, యశ్వపతులను గజపతులను గృష్ణానదిని దాఁటి రానీయక చేయుటకును, నుదయగిరి రాయచూరుదుర్గములను సాధించుటకును బ్రబలప్రయత్నము

సేయ సంకల్పించెను. ఈ సంకల్పము నెఱవేఱుటకై యశ్వదళము నభివృద్ధిసేయ మొదలిడి, పారసీక, అరబ్బీదేశములనుండి మేలు జాతి గుఱ్ఱములను దెప్పించుచుండెను. మూఁడు గుఱ్ఱములకు వేయి వరహాల చొప్పున నాతఁడొసంగుటచే ననేక దేశములనుండి వర్తకు లుత్తమాశ్వములఁ దెచ్చి, నరసింహరాయలకు విక్రయించుచుండిరి. దాన నానాఁటికి నశ్వదళము వృద్ధికాఁజొచ్చెను.

అవసానదశ

నరసింహరాయలు తనకు మరణకాలమాసన్నమైనదని తెలిసికొని, తనకు మంత్రిగనున్న తుళువ నరసరాజును బిలువనంపి, తన కొడుకుల నిద్దఱను, బొక్కసమును, సైన్యమును నాతని స్వాధీన పఱచి, 'నరసన్నా! నాకుమారులు పెద్దవారలగువఱకు నీవ రాజ్యభారము వహింపుము. ఆమీఁద నిరువురలో నుత్తముఁడైనవానికిఁ బట్టముఁ గట్టు' మని నుడివి, ప్రాణములు విడిచెను.

## ఇమ్మడి నరసింహరాయలు (క్రీ. శ. 1493–1505)

సాళువ నరసింహరాయలు క్రీ. శ. 1493 ప్రాంతమున మరణించియుండవచ్చును. అతని మరణానంతర మాతని యాజ్ఞచొప్పునఁ, దుళువ నరసరాజు నరసింహరాయుల పెద్దకొమారుఁడగు తిమ్మరాజును సింహాసనముననిలిపి, యాతఁడు బాలుఁడగుటచేఁ దాన రాజ్యకార్యములు నిర్వహించుచుండెను. అయాచితముగ నరసరాజునకు లభించిన రాజ్యాధిపత్యమున కొక సరదారుఁ డోర్వలేక, యా బాలరాజును జంపి, యా నిందను నరసరాజుపైఁబెట్టెను. తన కకారణముగఁ గలిగిన యపనిందకు నరసరాజు వగచి, దానిని బాపుకొనుటకై నరసింహరాయల ద్వితీయ పుత్త్రుఁడైన యిమ్మడి నరసింహరాయలను సింహాసనమెక్కించెను. నరసింహరాయలు క్రీ. శ. 1493–వ వత్సరమున సింహాసనాసీనుఁడైనట్లు ముత్తుకూరు శాసనమువలనఁ దెలియుచున్నది.[1]

[1] Epigraphical Collections for 1906 No. 516

బాలరాజును జంపిన దళవాయి తన ప్రయత్నము విఫల మగుట కెంతయువగచి, మెలమెల్లన నరసింహరాయలకడఁ జేరి, నరసరాజుపైఁ గొండెములు వలికి, యాతని హృదయముఁ గ్రోధ పూరితముగావించెను.

కుశాగ్రబుద్ధియగు నరసరా జప్పటి పరిస్థితులను గమనించి, యటనుండుట పాడిగాదని తలఁచి, యేదియో సాకుమీఁదఁ బెను గొండకుఁ బోయెను. అతఁడు గొన్నిదినము లందుండి, వలయు సైన్యముఁ గూర్చుకొని, విద్యానగరమును ముట్టడించి, రాజద్రోహి యైన దళవాయినిఁ దుదముట్టింతువా? లేక, రాజ్యము వీడిపో వుదువా? యని నరసింహరాయలకు వర్తమాన మంపెను. బాల రాజావర్తమానము విని, తనకు బాసటగ నిలుచువారెవ్వరును నానగరమున లేమిఁజేసి, చేయునదిలేక, యా దళవాయి కంఠముఁ దునిమి, యాతని శిరమును నానవాలుగ నరసరాజు శిబిరమునకుఁ బంపెను. నరసరా జంత సంతసించి, విద్యానగరముఁ బ్రవేశించి, రాజ్యక్షేమమును గోరి యా బాలరాజున కనేక విధముల నీతులఁ గఱపెను. కాని, యాతఁడు వినక, మూర్ఖపుఁ బట్టుఁబట్టెను. ఆకా రణమున నరసింహరాయలు పెనుకొండదుర్గమున బంధింపఁబడి, క్రీ. శ. 1505 ప్రాంతమునఁ జనిపోయెను. *

అంత, విద్యానగరసామ్రాజ్యము తుళువ వంశజుల హస్తగత మయ్యెను.

---

* Epigraphia Indica, Vol. 7, No. ;

# తుళువవంశ చరిత్రము

తుళువ వంశము సాళువ వంశాంతర్గతమని కొందఱు చరిత్ర కారులు విశ్వసించియున్నారు. అది పొరపాటు. ఆ రెండు వంశము లకుఁగల సంబంధమెచ్చటను సూచింపఁబడియుండలేదు. శాసన ములందు సహిత మీ విషయము గానరాదు.

"అతనికి యదు తుర్వసులను
సుతులుద్భవమొంది రహితసూదనులుఁ, గళా
న్వితమతులు - వారిలో వి
శ్రుత కీర్తి వహించెఁ దుర్వసుఁడు గుణనిధియై" మను. పీఠి. ప. 21

"వానివంశంబు తుళువాన్వవాయమయ్యె
నందుఁ దెక్కంద్రు నృపు లుదయంబు నొంది
నిఖిల భువన ప్రపూర్ణ నిర్నిద్ర కీర్తి
నధికులై రి తదీయాన్వయమునఁ బుట్టి." మను. పీఠి. ప. 22

అను మనుచరిత్రమునందలి పద్యములను బట్టి యయాతికి యదుతుర్వసు లుద్భవించిరనియు, వారిలోఁ దుర్వసుఁడు ప్రసిద్ధుఁ డనియు, నా తుర్వసుని వంశమే తుళువవంశమనియుఁ దెలియుచున్నది.

## * నరసరాజు (క్రీ. శ. 1493-1505)

నరసరాజు తుళువవంశసంజాతుఁడు, తండ్రి యీశ్వరరాజు తల్లి బుక్కాంబ.

సాళువ నరసింహరాయలు చంద్రగిరిరాజ్యమును బాలించు చుండ, నీ తుళువ నరసరాజు తనయొద్ద సుప్రసిద్ధసేనానాయకుఁడుగ నుండి, రాజ్యకార్యములయందు రాజున కెంతయు సాయపడుచుండె ననియు, విద్యానగరసామ్రాజ్యము హీనస్థితికి వచ్చినతఱి, దానిని

* ఈతఁడు విజయనగరసామ్రాజ్యమును బాలించినట్లు కొన్ని చారిత్రక గ్రంథములందుఁ జెప్పఁబడియుండలేదు. ఇమ్మడి నరసింహరాయల తరువాత (తుళువ) వీరనరసింహరాయలే విద్యానగరసింహాసనమధిష్ఠించినట్లు కొన్ని గ్రంథము లందు వ్రాయఁబడియున్నది.

# తుళువవంశము

- చంద్రుఁడు
  - బుధుఁడు
    - తురువసుఁడు
      - తిమ్మరాజు = దేవకి
        - ఈశ్వరరాయలు = బుక్కాంబ
          - (నరసరాజు) నరసింహరాయలు
            - (తిప్పాంబవలన) వీరనరసింహరాయలు (1)
              - తిరుమలదేవరాయలు
            - (నాగాంబవలన) శ్రీకృష్ణదేవరాయలు (2)
              - తిరుమలాంబ
              - వేంగళాంబ
              - తిరుమలయ్యదేవ మహారాయలు
              - కుమారుఁడు (పేరు తెలియదు)
            - (ఓబాంబవలన)
              - అచ్యుతదేవరాయలు (3)
                - (చిన) వేంకటదేవరాయలు
              - రంగరాయలు
                - సదాశివ రాయలు (4)
          - తిమ్మరాయలు

నరసింహరాయల యేలుబడికిఁ దెచ్చెననియు, నరసింహరాయల మరణానంతర మాతని తనయుఁడగు నిమ్మడి నరసింహరాయ లాతనిమాట వినకపోవుటచే నాతనిఁ బెనుగొండదుర్గమున బంధించి, నరసరాజే విద్యానగరాధీశుఁడయ్యెననియు నీవఱకే వ్రాసియుంటిని.

విజయములు

నరసరాయ లద్వితీయ పరాక్రమశాలి; ధైర్యసంపన్నుఁడు; శత్రుభీకరుఁడు. సరదారు లీతని శౌర్యమునకు భయపడి, యడఁగి యుండిరి. ఈతని విజయములను గూర్చి పారిజాతాపహరణ మిట్లు నుడువుచున్నది —

"కంతకేశ్వరుఁడు చిక్కపడంగ విద్యాపు
రంబుఁ గైకొని నిజప్రౌఢి నెఱపెఁ,
బారసీకునకు దుర్భరమానవత్వంబుఁ
దొలఁగించె మానవదుర్గసీమఁ,
జోళవల్లభునకు సురవధూ మధురాధ
రములిచ్చి మధురాపురంబుఁ గొనియె,
శ్రీరంగపట్టణసీమ ఖడ్గనటీవి
నోదంబు హావనేంద్రునకుఁ జూపె

నతఁడు నుతికెక్కు రామసేత్వంతరాళ
కలిత షోడశ దాన విఖ్యాతయశుఁడు,
మండలీకర మేఘ మార్తాండ బిరుదుఁ
డీశ్వరాధిప నరస పృథ్వీశ్వరుండు"—ప. 13

నరసరాయల పరాక్రమమును సూచించు శాసనములు పెక్కులు గలవు. వానియందు నరసరాజు కావేరీనదికి సేతువు గట్టి, నదినిదాఁటి, శ్రీరంగపట్టణమును ముట్టడించినట్లును, చేర, చోళ, మధుర, పాండ్యమండలములను గెలిచినట్లును, తురుష్కులను బరాజితులనొనర్చినట్లును వ్రాయఁబడియున్నది. ఈ విషయములనే కన్నడశాసన సంపుటములును, మఱికొన్ని శాసనములును బలపఱచుచున్నవి.

1. (a) Epigraphia Carnatica, Vol. IV, Part II, Gudlupet, No, 30
(b) No. 152 of 1901

ఒక సమయమున విజాపురాధీశ్వరుఁడగు నాదిల్షాకును, బెడందకోట సుల్తానగు కాసింబరీదునకును ద్వేషము గలిగి, కాసింబరీదు నరసరాజు సాయము గోరెను. నరసరాజు కాసింబరీదునకుఁ దోడ్పడి, ముద్దగల్లు రాయచూరు దుర్గములను గైకొనెను. నరసరాజు ప్రతిపక్షుల గర్వమడఁచఁ దాను దక్షిణదేశమునకుఁ బోయిన తఱి, నాదిల్షా యదియే తగిన సమయమని తాను గోలుపోయిన ముద్దగల్లు, రాయచూరుదుర్గముల నాక్రమించెను. ఆ సమయమునఁ బ్రతినిధిగనుండి విద్యానగరమును బాలించుచుండిన తిమ్మరుసు నరసరాజు తమ్ముఁడగు తిమ్మరాజునకుఁ గొంత సైన్యమొసఁగి, సుల్తానును బాఱఁదోల రాయచూరి కంపెను. కాని, తురుష్కులసైన్య మధికముగనుండుటచేఁ దిమ్మరాజు సుల్తాను నోడింపలేక, రాయచూరు, ముద్దగల్లుదుర్గములను గోలుపోయి, మరలి వచ్చెను. నరసరాజు దక్షిణదేశమునుండి తిరిగివచ్చి, యీ వార్త విని, చింతించి, వాని నెట్లైన సాధింపనెంచి, చతురంగబలముల నభివృద్ధి సేయఁదొడఁగెను.

భాషాపోషణము

నరసరాయ లెంతటి పరాక్రమశాలియో, యంతటి యాంధ్రభాషాపోషకుఁడు నైయొప్పెను. తెలుఁగుకవుల నాదరించి, కృతుల నందుకొనిన యజరామరుఁడు. ఈతని యాస్థానమున నందిమల్లయ్య, ఘంటసింగయ్య యను జంటకవులుండిరి. వీరి పుస్తకములయందలి యాశ్వాసాంత గద్యములనుజూడ, వీరిరువురుఁ గలిసియే గ్రంథములు వ్రాయుచుండిరని తెలియుచున్నది.[1] వీరి గ్రంథములలోఁ బ్రసిద్ధములైనవి ప్రబోధచంద్రోదయము, వరాహపురాణమును. అనంతామాత్యపుత్త్రిఁడైన గంగయమంత్రికిఁ బ్రబోధచంద్రోదయమును, తుళువనరసరాయలకు వరాహపురాణము నంకితమొనర్చిరి.

1 'ఇది శ్రీమదుమామహేశ్వర ప్రసాదలబ్ధ సారస్వతాభినంది నందిసింగయామాత్య పుత్త్రి మల్లయమనీషితల్లజ మలయమారుతాభిధాన ఘంట నాగయ ప్రధాన తనూభవ సింగయ కవిపుంగవ ప్రణీతంబయిన'

ఈ కవులిరువురును నియోగిబ్రాహ్మణులు. నందిమల్లయ్య కౌశికగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; దక్షిణామూర్తి శిష్యుఁడు. తండ్రి సింగమంత్రి; తల్లి పోతమాంబ. ఘంటసింగయ్య భరద్వాజ గోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; అఘోరశివశిష్యుఁడు. తండ్రి నాగయ్య; తల్లి అమ్మలాంబ. నందిమల్లయ్యకు ఘంటసింగయ్య మేనల్లుఁడు. సింగయ్యకు 'మలయమారుతకవి' యను బిరుదము గలదు. ఈ విషయములు క్రింది పద్యములవలనఁ దెలియుచున్నవి

"కలఁడు కౌశికగోత్ర కలశాంబురాశిమం
 దారంబు సంగీతనందినంది
సింగమంత్రికిఁ బుణ్యశీల పోతమ్మకు
 నాత్మసంభవుఁడు మల్లయమనీషి
యతని మేనల్లుఁ డంచితభరద్వాజ గో
 త్రారామ చైత్రోదయంబు ఘంట
నాగక్షమణికిఁ బుణ్యచరిత్ర యమ్మలాం
 బకుఁ గూర్మితనయుండు మలయమారు
తాహ్వయుఁడు సింగనార్యుఁ డమృతవాక్య
లీశ్వరారాధకులు శాంతులిలఁ బ్రసిద్ధు
లుభయభాషల నేర్పరు లుపమరులు స
మర్థులీకృతిరాజనిర్మాణమునకు."

— ప్రబోధచంద్రోదయము.

"అపుడు సభావేదికాగ్రస్థితుల మైన
 మమ్ము వాగీశ్వరీమంత్రరాజ
సిద్ధిపారగులఁ గౌశిక భరద్వాజగో
 త్రుల మహాదేవాంఘ్రి జలజభక్తి
పరతంత్రమతుల నాపస్తంబ సూత్రుల
 గురుదక్షిణామూర్త్యఘోరశివుల
శిష్యుల నతిశాంతచిత్తులఁ దనకు నా
 శ్రితుల భాషాద్వయకృతినిరూఢ
శేముషీ భూషణుల నంది సింగనార్య
తనయు మల్లయకవికులోత్తముని ఘంట

నాగధీమణి కూర్మినందను నిమలయ
మారుతాంకితు సింగయమంత్రిఁజూచి.''

— వరాహపురాణము

వారి గ్రంథములనుండి మచ్చునకుఁ గొన్ని పద్యములు —

''కమ్మని తేనియల్ తఱుచు కాలువలై ప్రవహింప మీఁద జుం
ఝుమ్మని మ్రోయు తుమ్మెదల జొంపము మల్లికనీళ్లు గట్టుచోఁ
బమ్మినవేడ్కఁ బాడు వనపాలక బాలకదంబకంబు చం
దమ్మున నొప్పునప్పురము నాలుగువంకలఁ బువ్వుఁదోఁటలన్''

— వరాహ.

''మెత్తని దుప్పటంబులను మెత్తినకస్తురికప్పురంబులన్
ముత్తెపుఁ బేరులన్ సురభిపూరిత పుష్పములన్ వృధా వెలిన్
హత్తినవేడ్కఁ జాతురహహా మతిహీనులు లోనెఱుంగ కీ
బిత్తరివారనారులను పేరిటి జంగము నారకంబులన్.''

ప్రబోధ.

నరసరాయలు క్రీ. శ. 1505 ప్రాంతమునఁ జనిపోయినట్లు తెలియుచున్నది.

# వీరనరసింహరాయఁడు

నరసరాజునకు తిప్పాంబిక, నాగాంబిక, ఓబాంబిక యను ముగ్గురు భార్యలుండిరి. అందు తిప్పాంబికకు వీరనరసింహరాయఁడును, నాగాంబికకుఁ గృష్ణరాయఁడును, ఓబాంబికకు నచ్యుతరాయఁడును బుట్టిరి. ఓబాంబికకు రంగరాయఁడను వేఱొకతనయుఁడు సహితముండినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది.

నరసరాజు మరణించినపిదప, నాతని జ్యేష్ఠతనయుఁడగు వీరనరసింహదేవరాయలు క్రీ. శ. 1505లో సింహాసనాసీనుఁడైనట్లు తెలియుచున్నది. †

మంత్రి

వీరనరసింహరాయలకు సాళువ తిమ్మరుసు మంత్రిగానుం

† A Little Known Chapter of Vijayanagar History, Page 50

డెను. ఈ ప్రతిభాశాలి కృష్ణరాయలకాలమున సహితము మంత్రిగానుండి, యాతని కనేకవిధములఁ దోడ్పడినవాఁడగుటవలన నాతని చరిత్రముననే యీ మంత్రిసత్తముని చరిత్రసహితము విపులముగ వ్రాయుదును.

**సామంతుల నడఁచుట**

నరసింహరాయలకాలమునఁ బెక్కండ్రు సామంతరాజులు కప్పములు గట్టక తిరుగఁబడిరి. రాజ్య మన్యాక్రాంతము గాకుండునట్లు రాయలు వలసినంత సైన్యమును విద్యానగరరాజ్యపు మేరలలో నిలిపి, తిరుగఁబడిన రాజులనుండి కప్పములు గొనితెచ్చుటకై తన తమ్ములగు నచ్యుతరంగరాయలను గొంకణకర్ణాటదేశములపైకిఁ బంపెను. కొంకణప్రభువుమాత్రము కప్పముఁ జెల్లింప సమ్మతించెను. తక్కంగల రాజపుంగవు లందులకు సమ్మతింపక, యచ్యుతరాయాదులను రాష్ట్రపుహద్దులను దాఁటువఱకుఁ దఱిమిరి. ఖిన్నులై తిరిగివచ్చిన తమ్ములనుగాంచి, వీరనరసింహదేవరాయలు చింతించి, యుపేక్షచేయరాదని భావించి, దక్షిణదేశమునకుఁ దాను జైత్రయాత్ర సాగించెను. పోయినచోటులందెల్ల నరసింహరాయలకు జయముగలిగెను. తిరుగఁబడిన వారెల్లరుఁ గప్పములు చెల్లించిరి. ఈతనికి 'భుజబలరాయఁ' డను బిరుదము గలదు.

**తీర్థయాత్రలు**

నరసింహదేవరాయలు కంచి, పక్షితీర్థము, కుంభకోణము, చిదంబరము, జంబుకేశ్వరము, శ్రీరంగము, మధుర, రామసేతువు, గోకర్ణము, కాళహస్తి, అహోబలము, శ్రీశైలము, త్రిపురాంతకము, వేంకటాచలము, సంగమేశ్వరము మొదలగు పుణ్యక్షేత్రములను దర్శించి, బ్రాహ్మణుల కనేక దానములొనర్చినట్లు శాసనముల వలనఁ దెలియుచున్నది.[1]

**అవసానదశ: దుష్టబుద్ధి**

వీరనరసింహదేవరాయఁడు కుటిలస్వభావుఁడు; క్రూరచి

---

1. Epigraphia Indica, Vol. 1, Page 368

త్తుఁడు. ఈతఁడు తిమ్మరుసునెడ ననుమానమును, కృష్ణరాయని యెడ నీర్ష్యయుఁ గలిగియుండెను. సామ్రాజ్యమును దన సంతతివారికి లేకుండఁ జేసి, కృష్ణరాయఁడే యనుభవించునేమో యను ననుమాన మాతని నధికముగఁ బీడించుచుండెను. తాను కృష్ణరాయనిఁ జంపింప నూహించెనుగాని, తిమ్మరుసువలని భయముచే నాతఁడు ప్రయత్నింపఁడయ్యెను. అవసానదశయందుమాత్రము తన దుష్టబుద్ధిని వెల్లడింపక తప్పినదికాదు. తనయనంతరము తిమ్మరుసు తనకుమారునకుఁ బట్టముఁ గట్టక కృష్ణదేవరాయనికే సామ్రాజ్యాధిపత్య మొసంగునని యాతఁడు దృఢముగ నమ్మియుండెను. చివరకుఁ దాను మరణింపనున్న స్థితిలోఁ దిమ్మరుసు నేకాంతమునఁ బిలువనంపి ——

'మంత్రిశేఖరా ! మా తండ్రి యానతిచొప్పున నీవు నన్ను సామ్రాజ్యమున నిలిపి, నా కనేకవిధములఁ దోడ్పడితివి. నీ సాహాయ్యమును నేను మఱవఁజాలను. నీవు, మా తండ్రి యానతినిఁ బాలించినవిధమున, నా యాజ్ఞను సహితము పాలింపవలయునని కోరుచున్నాను. నాకిది యవసానదశ. ఇఁక నే బ్రదుకఁజాలను. నా కుమారుఁడైన తిరుమలదేవరాయఁడు బాలుఁడు; ఎనిమిది వత్సరములైన దాఁటనివాఁడు. నీవు నా యనంతర మా బాలుని సింహాసనమున నిలిపి, కార్యకర్తవై, రాజ్యమును బాలింపుము. ఇది నా యాజ్ఞ. కాని నా పిమ్మట, రాజ్యమును నా తనయుని కీయక, నీ వత్యంతము ప్రేమించు కృష్ణరాయని కొసఁగెదవను నమ్మకము నాకు మిక్కిలి కలదు. ఆ యనుమానము నన్నుఁ బీడింపకుండునట్లు కృష్ణరాయల కన్నులు పెఱికించి, తెప్పించి, నాకుఁ జూపినఁగాని యసువులఁ బాయఁజాల' నని తన మనోభీష్ట మెఱిఁగించి, యట్లుసేయ నాతని నాజ్ఞాపించెను.

ఆ కఠినవాక్కులు తిమ్మరుసు చెవులకు ములుకులై సోకఁ, గొంతవడి ఱిచ్చవడి, ధైర్యమవలంబించి, రాజును గాంచి, 'ప్రభూ!

యిది యెంతపాటిపని? నీ కోరిక యిప్పుడ తీర్చెద. దీనికై నీవు చింతింపవల' దని నుడివి, సెలవుగైకొని, మందిరమునకుఁ బోయెను.

గృహమునకేఁగి తిమ్మరు సనేకవిధములఁ దలపోసెను. వీర నరసింహరాయల దుష్టబుద్ధికి వగచెను. తన తనయునికన్న మిన్నగఁ దానుప్రేమించుచున్న కృష్ణరాయని నెట్టులేనిఁ గాపాడ నిశ్చయించి, యాతని రహస్యముగ రప్పించి, కన్నుల నీరు నించుచు, 'నాయనా! మీ యన్నగారి వాక్యములు వింటివా? చెప్పుటకు నోరాడకున్నది. తనయనంతరము తన కుమారునకుఁ బట్టము గట్టవలయునఁట. నీ కన్నులు పెఱికించి, తెచ్చి చూపవలయునఁట. అంత దనుక నాతనికిఁ బ్రాణములుపోవఁట' అని పలికెను.

కృష్ణరాయ లా పిడుగువంటి వార్తవిని, తిమ్మరుసుతో నిట్లనెను —

'అప్పాజీ! బాల్యమాదిగ నన్నెక్కువగఁ బ్రేమించినవాఁడవు. నా సవతి తల్లియగు తిప్పాంబ విషముపెట్టి నన్నుఁ జంపింపఁ బ్రయత్నించిన సమయమునందు సహితము నన్నుద్ధరించితివి. నాకు రాజ్యము వలదు. ఎందేని యేఁగి, జోగినై పొట్టపోసికొందును. రాజునాజ్ఞ మీఱుటకుఁ గాదేని నా కన్నులు పెఱికించుటకు బదులు నా శిరమును ఖండింపుము. నీ కెంతయుఁ బుణ్యము గలుగును.

కృష్ణరాయఁడు పలికిన పలుకులకుఁ దిమ్మరుసు జాలినొంది, 'భయపడకు' మని నుడివి, యాతనిఁ దనయింట దాఁచి, యొక యాఁడుమేఁక కన్నులను దెప్పించి, వానిని గొనిపోయి నరసింహరాయలకుఁ జూపించెను. ఆ కన్నులను జూచుటయే తడవుగా రాయలు ప్రాణములు విడిచెను.

సామ్రాజ్య పరిస్థితులు

వీరనరసింహరాయలు క్రీ. శ. 1509–వ సంవత్సరమున మరణించునప్పటికి గోవానగరము నేలుచుండిన మహమ్మదీయ రాజు విజయనగరమును గబళింపఁ దీవ్రప్రయత్నములు సేయుచుండెను.



శ్రీ కృష్ణదేవాలయము, హంపి.

కొండవీడు, ఉదయగిరిదుర్గములు గజపతుల వశమయ్యెను. ఉమ్మత్తూరు నాయకులు చక్రవర్తిని ధిక్కరించి, స్వతంత్రులైరి. బీజపూరు నవాబులును విజయనగరముపై ప్రాల నుంకించుచుండిరి.

## శ్రీకృష్ణదేవరాయలు (క్రీ. శ. 1509–1529)

ఏ సార్వభౌముని సత్పరిపాలనమున విజయనగరసామ్రాజ్యము మహోన్నత్యమునందెనో, యే చక్రవర్తి దిగ్విజయయాత్రల వలనఁ దన శౌర్యపరాక్రమంబుల జగత్ప్రసిద్ధముగఁ జేసెనో, యే పార్థివపుంగవుఁ డాంధ్రభాష నాదరించి, యష్టదిగ్గజములఁ బోషించి, యాంధ్రభోజుఁడని కీర్తిగాంచెనో, యే నృపశ్రేష్ఠుఁడు విష్ణుచిత్తీయమను నామాంతరముగల యాముక్తమాల్యద యను ప్రబంధరచనచే సంస్కృతాంధ్రములయం దసాధారణ పాండిత్యమును వెలిపుచ్చెనో - యట్టి శ్రీకృష్ణదేవరాయల చరిత్రమును దెలిపెదను.

జననము

కృష్ణరాయల జననకాలమును గూర్చి పెక్కు సందేహములు పొడముచున్నవి. రాయ లీశ్వరరాజ కుమారుఁడైన నరస (నరసింహ) రాజునకు నాగాంబికవలన క్రీ. శ. 1465–వ వత్సరమున జనించెనని కొందఱును,[1] క్రీ. శ. 1487–వ వత్సరమున జన్మించెనని మఱికొందఱును వ్రాసియున్నారు. ఇఁక నాతని మరణకాలమును గూర్చి విచారించినచో - కావలి వేంకటస్వామిరచితమైన 'దక్షిణహిందూదేశ కవుల చరిత్రము' లో రాయలు తన నలువదవయేఁట – అనఁగా, 1524–వ వత్సరమున మరణించినట్లు వ్రాసి

1. "అందలి శాలివాహన శకాబ్దము లద్రివసు త్రిసోములన్
వందితమైన యవ్వికృతి వత్సరమందలి పుష్యమాసమం
దుం దగు కృష్ణపక్షమున నుండెడి ద్వాదశి శుక్రవాసరం
బం దుదయించెఁ గృష్ణుఁడు శుభాన్వితుఁ డా నరసింహమూర్తికిన్."

యున్నాఁడు.[1] ఆకాలమునందలి యొక చాటుపద్యమును బరిశీలింప, శాలివాహనశకాబ్దములు 1447 టికి సరియైన హూణశకము 1524-వ వత్సరమునఁ గృష్ణరాయలు మృతినందినట్లు కానఁబడుచున్నది.[2] దక్షిణహిందూదేశ కవులచరిత్రమును, జాటుపద్యమును మరణకాలమును దెలుపుటలో నేకీభవించినను, శాసనాధారములను బట్టి రాయలు శా. శ. 1452 టికి సరియైన హూణశకము 1529-వ వత్సరమునఁ దన భౌతికశరీరమును జాలించినట్లు తెలియుచున్నది.[3] కావున, మరణకాలము సహిత మిదియని నిరయింపఁదగిన యవకాశము లేకయున్నది. కాని, కృష్ణరాయల సమకాలికుఁడును, పోర్చుగీసుచరిత్రకారుఁడును నగు న్యూనిజ్ విద్యానగరసామ్రాజ్యచరిత్రమును వ్రాయుచు వీరనరసింహరాయల మరణకాలమునకు (అనఁగా 1509) రాయ లిరువది వత్సరముల వయస్సుగలవాఁడని సూచించెను.[4] రాయలు మరణించునప్పటికి నలువదియేండ్ల వయస్సుగలవాఁడని దక్షిణహిందూదేశ కవులచరిత్రమున వ్రాయఁబడియున్నది. రాయలు 1529 ప్రాంతమున మరణించెనని శాసనాధారములనుబట్టి చరిత్రకారులు సూచించియున్నారు. వీరనరసింహరాయల మరణకాలమునకు రాయల కిరువది వత్సరముల వయస్సుండుటచేతను, నలువది వత్సరములు జీవించియుండినట్లు తెలియుటచేతను, 1529 ప్రాంతమున మరణించుటచేతను కృష్ణదేవరాయలు క్రీ. శ. 1489 ప్రాంతమున జనియించియుండనోపునని నిర్ణయింపవలసియున్నది. రాయల జననకాలము 1465-వ వత్సరమే యగునెడల నాతఁడు 1505 లో మరణించియుండును. కాని, కృష్ణరాయలు

1. ఆంధ్రకవులచరిత్రము, ద్వి. భా. పుట 170
2. "భోరన యాచకప్రతతి భూరి విపద్దశ నొందుచుండఁగా
నారయ శాలివాహన శకాబ్దము లద్రియుగాబ్ధి సోములం
దారణవత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధ ష
ష్ఠీరవివాసరంబున నృసింహుని కృష్ణుఁడు చేరె స్వర్గమున్
ద్వారకనున్న కృష్ణుఁ డవతార సమాప్తము నొందుకై వడిన్."
3. No. 525 of Epigraphical Collections for 1926
4. Forgotten Empire, Page 315

1509 లో నభిషిక్తుఁడగుటవలన నిది విశ్వసనీయముకాదు. ఇఁక, 1487-వ వత్సరమే జనించెనందుమా, 1527 లో మరణించియుండును. కాని, 1529 లో మరణించినట్లు శాసనములే తెలుపుచున్నవి. ఈ కారణమున నిదియు విశ్వసనీయముగాదు. పై వివరించిన విషయములు సహేతుకములుగా నున్నందునఁ గృష్ణరాయలు క్రీ. శ. 1489 ప్రాంతమున జనించియుండును.

రాయలవంశము

తుళువ నరసరాజునకుఁ దిప్పాంబిక, నాగాంబిక, ఓబాంబిక యను మువ్వురు భార్యలుండిరనియు, వారిలో మొదటి యిరువురకును గ్రమముగా వీరనరసింహరాయఁడును, కృష్ణరాయఁడును జనించిరనియుఁ, గడపటి భార్యకు నచ్యుతరాయఁడును, రంగరాయఁడును బుట్టిరనియు వీరనరసింహరాయలచరిత్రమున వ్రాసియుంటిని. నరసింహరాయలకు మువ్వురు పత్నులుండిరా? వారిలో నాగాంబిక కులకాంతయా? యను విషయములను నిర్ధరించుటకుఁ దగిన ప్రమాణముల నరయవలసియున్నది.

విజయనగరరాజ చారిత్రములోను, కొంగదేశ రాజకాల్ అను గ్రంథములోను నరసింహదేవరాయల భార్యాపుత్త్రిలను గూర్చి యిట్లు వ్రాయఁబడియున్నది: 'తిప్పాంబ యను భార్యయందు వీరనృసింహేంద్రుఁడను కుమారుఁడు పుట్టెను. నాగమాంబ యను భార్యయందుఁ గృష్ణరాయఁడు పుట్టెను. ఓబాంబ యను భార్యయందు రంగదేవరాయఁడు, అచ్యుతదేవరాయఁడు అను నిద్దరు పుత్త్రిలు పుట్టిరి.'[1] ఈ విషయములోఁ గృష్ణరాయలు కృతులందిన పారిజాతాపహరణ, మనుచరిత్రగ్రంథములును, కృష్ణరాయరచితమగు నాముక్తమాల్యదయు నేకీభవింపవు. ఎట్లన —

"ఆ నరస మహీ మహిళా
జానికిఁ గులసతులు పుణ్యచరితలు తిప్పాం

1. కవిజీవితములు, పుట 487

బా నాగాంబిక లిరువురు
దానవ దమనునకు రమయు ధరయును బోలెన్''
— పారి. పీ. ప. 14

''ఆనృసింహప్రభుండు తిప్పాంబవలన
నాగమాంబికవలన నందనులఁ గాంచె,
వీరనరసింహరాయ భూవిభుని, నచ్యు
తాంశ సంభవుఁ గృష్ణరాయ క్షితీంద్రు.''
— మను. పీ. ప. 31

''ఆనృసింహప్రభుండు తిప్పాంబవలన
నాగమాంబికవలన నందనులఁ గాంచె,
వీరనరసింహరాయ భూవిభుని, నచ్యు
తాయ తాంనిజు శ్రీ కృష్ణరాయ నిన్ను.''
ఆము. ఆ. 1, ప. 31

పై పద్యములను బరిశీలించిచూడ నరసరాజునకుఁ దిప్పాంబా నాగాంబిక లను కులసతులిరువురు గలరనియు, వారికిఁ గ్రమముగా వీరనరసింహరాయఁడును, కృష్ణరాయఁడును జనించిరనియుఁ దేలుచున్నది. క్రింది శ్లోకము సహిత మీ విషయమును బలపఱచుచున్నది.

''తిప్పాజీ నాగలాదేవ్యోః, కౌసల్యా శ్రీ సుమిత్రయోః
దేవ్యోరివ నృసింహేన్ద్రా త్తస్మాత్ప జ్క్తిరథాదివ.
వీరౌ వినయినౌ రామలక్ష్మణావివ నన్దనౌ,
వీరశ్రీ నరసింహేన్ద్ర కృష్ణరాయ మహీపతీ.''

విజయనగరరాజ చారిత్రమునందును, కొంగదేశరాజకాల్ గ్రంథమునందును బేర్కొనఁబడిన యోబాంబిక యను భార్యవిషయమే పై గ్రంథములయందుఁగాని, శ్లోకమునందుఁగాని సూచింపఁబడియుండలేదు. కాని, నరసరాజునకు ఓబాంబిక యను భార్య గలదనియు, నామెకు నచ్యుతదేవరాయలను కొడుకు గలఁడనియు శాలివాహనశక 1459-వ వత్సరమునకు సరియైన హూణాబ్దము 1537 హేవిళంబి సంవత్సరమున చిత్తూరు మండలములోని నార్థా

యణపురము నొక బ్రాహ్మణునికి దానమిచ్చుచు నచ్యుతదేవరా యలు వ్రాసియిచ్చిన తామ్రశాసనమువలనఁ దెలియుచున్నది.[1] మనుచరిత్ర, పారిజాతాపహరణాది గ్రంథములు నరసింహరాయల కిరువురు భార్యలుగలరని నిరూపించినను, విజయనగరరాజచారిత్ర మును, కొంగదేశ రాజకాల్ గ్రంథమును మువ్వురు భార్యలు గల రని చెప్పు విషయము నచ్యుతదేవరాయల తామ్రశాసనము సహితము బలపఱచుచున్నది. కావున, నరసింహరాయలకు మువ్వురు భార్యలు గలరను విషయము తేలినది. ఇఁక నరసింహ రాయల ద్వితీయ భార్య యగు నాగాంబిక కులకాంతయా? వెల కాంతయా? యను విషయమునుగూర్చి చర్చింపవలసియున్నది.

కృష్ణరాయల జననవృత్తాంతము నెఱింగినఁగాని, నాగాంబిక విషయము తేటపడదు. ఈతని పుట్టుకనుగూర్చి పలువురు పలుతె ఱఁగుల వ్రాసియున్నారు. స్థాలీపులాకన్యాయముగ వాని నిట వివ రింతును.

"ఒకనాఁటి రాత్రి నరసరాయలు కాలోచితకృత్యంబు నిర్వ ర్తింప బహిర్దేశంబునకుం జన నచ్చట నొకరిక్క యాకాశమున నుండి తన పాత్రమునఁ బడెననియు, నయ్యది మిక్కిలి తేజోవం తమై కన్నులు మిఱుమిట్లుగొల్పుచుండఁ దత్క్షణమే తిమ్మరుసు మంత్రికీ వార్తఁ దెలిపెననియు, నాతండా యుదకమును ద్రావమనె ననియు, రాయ లట్లుచేసెననియుఁ, దిమ్మరుసు నాజ్ఞాను సారమున స్వీయతో ఒతిసుఖంబునఁదేల యత్నింపఁ బట్టమహిషి వచ్చుటకు వీలులేకుండుటచే నీ దాసియగు నాగాంబికఁ గూడి సుఖంబుననున్న నాపెకీ రాయలు జనించెననియు వాడుకగాఁ జెప్పెదరు."[2]

1. "తిప్పాజీనాగలాదేవ్యోః కౌసల్యాశ్రీ సుమిత్రయోః
జాతౌ వీరనృసింహేంద్రో కృష్ణరాయ మహీపతిః.
అస్మాదోబాంబికాదేవ్యా మచ్యుతేంద్రోపిభూపతిః."

2. శ్రీకృష్ణదేవరాయచరిత్ర, పుట 7

"విజయనగరపురాజులలోఁ [1] బదియాఱవవాఁడగు వీర నృసింహారాయలు చిరకాలము పుత్త్రిలులేక ఖేదపడుచుండఁగా, నొకనాఁ డొక విప్రశ్రేష్ఠుఁ డేతెంచి, 'రాజా! నే నేర్పఱిచిన ముహూర్తకాలమందు నీవు నీ భార్యతోఁ గూడినచోఁ దప్పకుండ నీకుఁ బుత్త్రుఁడు కలుగు' నని చెప్పెను. అందుల కారాజు సంత సించి, ముహూర్తకాలమునకు సిద్ధముగానుండునటుల నిజపత్ని యగు తిప్పాంబకు వర్తమాన మంపెను. 'చీరెసింగారించువఱకు పట్నము కొల్లఁబోయెను' అను లోకము వాడుక నిక్కముగాఁ, దిప్పాంబగారు దిద్దుకొని తీర్చుకొని రాజు సమ్ముఖమున కేతెంచు వఱకు ముహూర్తకాలము మించిపోయెను. ఈ మధ్యకాలములో రాజుగారి పడకటింటిలో దీపాలు బాగుచేసెడి నాగి యను నొక దాసి ముహూర్తకాలమునకు హాజరుగానుండఁగ రాజు దానితో రమించెను. తత్క్షణమే నాగికి గర్భోత్పత్తియాయెను. నవమాస పూర్తియైనతర్వాత దివ్యతేజస్సుగలిగిన శిశువును గనెను. ఈ శిశు వునకుఁ గృష్ణదేవరాయలు అను నామమేర్పడెను." [2]

ఇఁకఁ బై కథలలోని విషయములయందలి సత్యాసత్యములను గూర్చి చర్చింపవలసియున్నది. ప్రపంచమున నొక మహనీయునకుఁ గాని, శౌర్యవంతునకు గాని యేదే నొక కళంకము నాపాదింపఁ జేయుట మానవస్వభావము. అట్టులే యద్వితీయశౌర్యోపేతుఁడగు శ్రీకృష్ణదేవరాయల జన్మకథానకమునకును నెవ్వరో మహానుభావులు లేనిపోని యపోహలు గల్పించియుందురు.

పై రెండు కథలయందు సూచింపఁబడిన ముహూర్తము, నరసింహారాయలు తిప్పాంబను నలంకరించుకొని రమ్మని చెప్పియం పుట అను విషయములు సత్యదూరములు గాకపోవచ్చును. తిప్పాంబ జ్యేష్ఠభార్య, పుట్టపురాణి యగుటవలన రాయ లామె యందు సుపుత్త్రినిఁ గాంచఁ గుతూహలపడియుండవచ్చును.

1. చింత్యము.
2. కవిజీవితములు, పుట 480

అదియు ధర్మబద్ధమే. పట్టపురాణియగుటవలననే తిప్పాంబను సింగా రించుకొని రమ్మని రాయ లాజ్ఞాపించియుండవచ్చును. కాని, యా సమయమున నామె దేహ మస్వస్థముగానుండి రాఁజాలక పోయి యుండవచ్చును. దాన నా యేలిక ముహూర్తకాలము మించిపోవు నను వేదనచే ద్వితీయ భార్యయగు నాగాంబికకుఁ గబురంపి యుండవచ్చును. ఆమె తత్క్షణమే భర్తృసన్నిధిఁ జేరి, యాతని కనుసన్నల మెలఁగి, పరాక్రమశాలియగు కుమారునిఁ బడసియుండ వచ్చును. లేదా, తిప్పాంబ కప్పటికే వీరనరసింహరాయ లను కుమారుఁడుండుటవలన[1] ద్వితీయ భార్యయగు నాగాంబిక సంతాన హీనయని యెంచి, యాసదవకాశమును రాయ లామెకే గలుగఁ జేసియుండవచ్చును. ఈ రెండవకారణమే నిజమగుచో రెండవ కథయందు సూచింపఁబడిన 'నరసింహరాయలు చిరకాలము పుత్త్రిలులేక ఖేదపడుచుండఁగా' [2] నను సంశము నిరాధారమును, నసత్యమును నగుచున్నది.

శ్రీ రాజనాథ మహాకవికృతమగు 'అచ్యుతరాయాభ్యుదయ' మను సంస్కృతకావ్యమును, [3] 'పారిజాతాపహరణము'ను, [4] కొన్ని

1. చిలుకూరి వీరభద్రరావుగారి 'తిమ్మరుసుమంత్రి' - పుట 44
2. కవిజీవితములు, పుట 480
3. 'అద్వైరపి క్షోణిపతిప్రకాణ్డై
   రాకాఙ్క్షణీయ స్స్వయశోఽవతారః,
   వసన్తతస్యాం వసుధాపతీనాం
   కన్యామణీః కాఞ్చన పర్యణైషీత్.'
   'తిస్రోన్నృప స్యే త్యభవన్నభీష్టా
   స్తిప్పాంబికా తాసుచ నాగమాంబా,
   పట్టాభిషిక్తాః పతిదేవతానా
   ముత్తంస భూషామణి రోబమాంబా.' అచ్యు. ప్రః స. శ్లో. 51-52
4. 'ఆ నరస మహీమహిళా, జానికిఁ గులసతులు పుణ్యచరితలు తిప్పాం బా నాగాంబిక లిరువురు'—పారి. ప్ర. ప. 14

శాసనములును [1] నాగాంబ కులకాంతయని వాకొనుచుండ, నాధార శూన్యములైన యీ కథ లెట్లు నాగాంబిక దాసీకన్యయని నిరూపించ సాహసించినవియో తెలియకున్నది. ఇవి పుక్కిటిపురాణములు. నాగాంబిక కులకాంతయని నిరూపించుటకుఁ బై వివరింపఁబడిన గ్రంథములను, శాసనములునుగాక, యాంధ్రదేశమునందిప్పటికిని నాగాంబిక 'సాగి' వారి యాఁడుపడుచనియు, వారి కుటుంబము పురాతనమునుండియుఁ బ్రసిద్ధిఁగన్న క్షత్త్రియ కుటుంబమనియుఁ జెప్పుకొను మాటలకుఁ దోడుగా, నీ విషయమును గొన్ని గ్రంథములును స్థిరీకరించుచున్నవి. [2] ఈ విషయమును గ్రంథములనుండి తెలిసికొనుటయే కాక, తుని సంస్థానాధీశ్వరులును, గీర్తిశేషులునునైన శ్రీరాజా వత్సవాయ వేంకటసింహాద్రి జగపతిరాజు బహద్దర్ వారి మేనల్లుని కుమారులును, నరపతి (ఆనెగొంది) సంస్థానాధీశ్వరులగు శ్రీమంత్ దర్బార్ శ్రీకృష్ణదేవరాయలవారి బావమఱఁదులును నగు శ్రీరాజా దాట్ల - వేంకటసింహాద్రి జగపతిరాజు గారివలన సహితము వింటిని. పై విమర్శనలనుబట్టి నా గాం బి క యధోసూచిక (Foot note) యందు సూచించినట్లు చదరంగపు

---

1. 'నిఖిలభూపతి మూర్ధన్యేన, నాగామ్బికా నరసనృప నన్దనేన'
— ఆము. పీ. అవ. పుట 147 (భూదాన శాసనము)

2. (ఎ) భారతి, సం. 7, సంచి. 1, పుట 93 (వరదరాజేశ్వరి)
రుచీదేవి గజపతిమహారాజ్ఞికి వ్రాసిన జాబు —
'నాథర్త కులహీనుఁడని వ్రాసితివి. ఉత్తమక్షత్త్రియులగు సాగివారి వంశమున నుద్భవించిన నా గ మాం బ తనయుఁడు కులహీనుఁ డెట్లగును? పూర్వము మాయత్త తన సవతులతో, నోడినవారు గెలిచినవారి కాఱు నెలలు దాసీత్వము చేయునట్లు పందెమిడుకొని, యాడిన చదరంగపాటలో నోడుటచే మా యత్తగారికి దాసి యను వాదు పరిహాసముగా వచ్చెను కాని, తుళువాన్వయాంబుధిరాకాశశాంకుఁడగు కృష్ణదేవరాయభూపతి దాసీపుత్త్రుఁడు గాఁడు.'

(బి) ప్రభాతము, పుట 112 (వంగూరి సుబ్బారావుగారు)
'శ్రీ రాయలవారు సుక్షత్త్రియ కన్యయగు నాగాంబా పుత్త్రులు. వారు సాగి వారికి దగ్గఱ బంధువులు. మన మెఱిఁగిన - వియ్యమందిన వారి బంధుగులు.'

టాటలో నోడుటవలన సవతులకుఁ బరిహాసముగ దాసియయ్యెనుగాని, నిజముగా నామె సుక్షత్త్రియకులసంజాత యని తెల్లమగుచున్నది.

**తిప్పాంబ కౌటిల్యము**

కృష్ణరాయల జననకాలవిశేషమును బట్టి బీజనగరదేశమంతయు నరసింహారాయల యధీనమయ్యెను. నాఁటినుండియు నరసింహరాయలు కృష్ణరాయనియెడలను, నాతని తల్లియైన నాగాంబికయెడలను మిక్కిలి మక్కువగలిగి, వారి నత్యంతము ప్రేమించుచుండెను. దీనివలనఁ దిప్పాంబకు నాగాంబికా కృష్ణరాయలయెడ నసూయ జనించెను. తిప్పాంబ కుమారుఁడైన వీరనరసింహరాయఁడు కృష్ణరాయనికంటె వయసునఁ బెద్దవాఁడు. నరసింహరాయల తనయుల కందఱకును దిమ్మరుసు విద్యాగురువు. తిమ్మరుసు కృష్ణరాయని కుశాగ్రబుద్ధిని గమనించి, పెక్కుసారు లాతని బుద్ధివైశద్యమును గూర్చి నరసింహరాయలకడఁ బ్రశంసించెను. ఇది యంతయుఁ దిప్పాంబకు నురిసినపుండులో నుప్పుపెట్టినట్లుండెను. తన కుమారునిఁ బట్టాభిషిక్తునిఁ జేయక, యత్యంతముఁ బ్రేమించెడి కృష్ణరాయనికే తన భర్త పట్టముగట్టునేమోయని తిప్పాంబ భావించి, యెట్టులేనిఁ గృష్ణరాయనిఁ దుదముట్టింపవలయునని నిశ్చయించి, యాతనికి విషప్రయోగముసేయఁ దన దాసీకన్యకలతో దురాలోచనముచేసి, యా దుష్కార్యమునకుఁ గడంగెను.

అఖండ ప్రజ్ఞావంతుఁడగు తిమ్మరుసు మంత్రి యెట్టులో తిప్పాంబ కౌటిల్యమును గుర్తించి, యా బాలుని మృత్యువు వాతఁ బడకుండ సంరక్షించెను. తిప్పాంబ యంతటితో నూరకొనక, తన ప్రయత్నము గొనసాగింప మున్మాఱు యత్నించెను. కాని, తిమ్మరుసుమంత్రి సుదర్శనచక్రమువలె నడ్డుపడుటచే నాయమ ప్రయత్నములు కొనసాగినవికావు. ఇందు సత్యమున్నను లేకపోయినను, నిట్టివి వర్తిల్లుటమాత్రము సవతులలో నిజము.

తన ప్రాణములను గాపాడుచు, విద్యాబుద్ధులు గఱపుచుఁ

బెనుచున్నందునఁ గృష్ణరాయఁడు తిమ్మరుసుమంత్రిని 'అప్పాజీ (నాయనగారూ) అని పిలుచుచుండెను.

విద్యాభ్యాసము

కృష్ణరాయలకు బాల్యమాదిగఁ దిమ్మరుసుమంత్రి విద్యాగురువని వ్రాసియుంటిని. తిమ్మరుసు విద్యాగురువే కాక, ప్రాణరక్షకుఁడు నై యుండెనని పై కథవలనఁ దెలియుచున్నది. తిమ్మరుసు సహోదరుఁడగు గోవిందరాజు సహిత మీ బాలరాజునకు విద్యాబుద్ధులు గఱపుచుండెను. కృష్ణరాయలు పదునెనిమిది వత్సరముల ప్రాయముననే యాంధ్రగీర్వాణ భాషలయందసామాన్య ప్రజ్ఞావంతుఁడయ్యెను. కర్ణాటభాష నేర్చెను. తురకము నభ్యసించెను. సాముగరిడీలయం దారితేరెను. ధనుర్వేదమున మేటియయ్యెను. అశ్వారోహణమున నందెవేసిన చేయి యాయెను. రాజనీతి, దండనీతి మొదలగు రాజ్యతంత్ర విధానములయందు గడి తేఱెను.

రాజ్యాభిషేకము

వీరనరసింహరాయలు క్రీ. శ. 1509-వ వత్సరమున మరణించెనని వ్రాసియుంటిని. ఆతని మరణానంతర మాతని సవతితల్లి కుమారుఁడైన శ్రీకృష్ణదేవరాయలు శా. శ. 1430 టికి సరియైన శుక్ల నామ సంవత్సర మాఘశుక్ల చతుర్దశి (1509, ఫిబ్రవరి, 4-వ తేది)ని నత్యంత వైభవమున విద్యానగరసింహాసన మధిష్ఠించినట్లు విజయ నగరమునందలి విరూపాక్షాలయములోని శాసనమువలనఁ దెలియుచున్నది.[1] మఱియొక్కచోట నీతఁడు క్రీ. శ. 1510-వ వత్సరము జనవరి నెల 24-వ తేదిన పట్టాభిషిక్తుఁడైనట్లు వ్రాయఁబడియున్నది.[2] కొంగదేశ రాజకాల్ గ్రంథమునందుఁ గృష్ణరాయలు శా. శ. 1426, రక్తాక్షి సంవత్సర చైత్రమాసమున సింహాసనాసీ

1. "స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్ష 1430 నందు మేలేనడవశుక్ల సంవత్సర మాఘ శు. 14 లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీర ప్రతాప శ్రీవీర కృష్ణరాయ మహారాజరు పట్టాభిషేకోత్సవ పుణ్యకాలదలు శ్రీవిరూపాక్షదేవర."

2. Journal of the Royal Historic Society, 394-395

నుఁడైనట్లు వ్రాయఁబడియున్నది.[1] శాసనాధారమే ప్రబలప్రమాణ మగుటవలన, శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1509-వ వత్సరము ననే పట్టాభిషిక్తుఁడైనట్లు నిశ్చయింపవలసియున్నది.

ఏతన్మహోత్సవ సమయమున శ్రీకృష్ణదేవరాయని వారు శ్రీవిరూపాక్షస్వామికి భూదానము గావించిరి.[2]

అమ్మహోత్సవమును గన్నులారఁ గాంచి యానందింప విద్యానగరమున కేతెంచిన రాజులయు, సామంతరాజులయు నామములను కుమారధూర్జటి తన కృష్ణరాయవిజయమున నిట్లు వ్రాసి యున్నాఁడు —

'చక్కారవిలుకాని చక్కందనముగల్గి
చొక్కమా నార్వీటి బుక్కరాజు,
సాకల్యముగఁ గీర్తి సర్వదిక్తటులందుఁ
బ్రాకటస్థితి నిల్ప నాకువారు,
కంటకరాజన్య గర్వంబు లణఁగించి
లీలచే మించు నందేలవారు,
ధాటీనిరాఘాట ఘోటీహతవిరోధి
కోటులై వెల్గు వెల్గోటివారు,
చండతర శౌర్యులగు కరాసానివారు [3]
బూదహాలివారు మొదలైన భూమిపతులు
కొలువఁ బట్టాభిషిక్తుఁడై చెలువుమీఱె
రమ్యగుణపాళి శ్రీకృష్ణ రాయమౌళి.''

— కృష్ణ. ద్వి. ఆ. ప. 14

కారణాంతరములవలన నమ్మహోత్సవమునకు రాఁజాలని రాజులెల్ల రనర్ఘములైన కానుకలనంపి, తమ భక్తివిశ్వాసములను బ్రకటించిరి. రాయలు సింహాసనాసీనుఁడగుటవలన నాతని సోదరుని పుత్త్రుఁడును, దమ్ములును గలహమునకుఁ గడంగనుండిరి. ధీవిశా... దుండగు రాయ లా విషయమును దక్షణమే గ్రహించి, దేశ...

...ం దండె
...రాకుళని కేత

1. కవిజీవితములు, పుట 491
2 Journal of the Royal Asiatic Society, Pages 394-395
3. పెమ్మసానివారు - అని పాఠాంతరము

నకు వారివలన బాధకలుగకుండుటకై, వారినిఁ గడుదూరముననున్న చంద్రగిరిదుర్గమున కంపి, వారి రక్షణార్థమై కొందఱు భటులను గాపుంచెను.

రాయల వర్ణనము

రాయ లంత పొడుగరియు నంత పొట్టియును గాక, సామాన్యమైన యెత్తుగలవాఁడై, చక్కని ముఖవర్చస్సును, సుందరాకారమును, దృఢకాయమును గలిగియుండెను. ముఖమున నందందు స్ఫోటకపు మచ్చలుండెను. కాని, యవి యెంతమాత్రమును ముఖలావణ్యమునకు వికారము గల్గించినవి కావు. ఆతని వదనబింబము వీక్షించినంతనే యెట్టివానికిని బూజ్యభావ ముదయించును.[1]

శరీరసాధనము: ప్రాతఃకాలకృత్యములు

కృష్ణదేవరాయ లనుదినము ప్రొద్దుపుట్టకమున్నె పడకనుండి లేచి, రమారమి సోలెడు (Quartilho - three-quarter pint[2]) నూగుల నూనె త్రావి, దానితో దేహమంతయు రాచుకొనును. అంత నాతఁడు మొలకొక చిన్నబట్టఁ గట్టుకొని బరువుగల లోడీలను ద్రిప్పును. ఆమీఁదఁ దాఁ ద్రాగిన నూనెయంతయు స్వేదరూపమున వెలికివచ్చువఱకుఁ గత్తిసాము చేయును. ఆవల నొక మల్లశ్రేష్ఠునితో మల్లయుద్ధ మొనర్చును. పిమ్మట నాతఁ డొక గుఱ్ఱము నెక్కి, విశాలప్రదేశమున కేఁగి, యొకవైపునుండి మఱియొకవైపునకుఁ దెల్లవాఱుదనుక స్వారి చేయును. ఈ కార్యకలాపమంతయు ముగిసిన పిదపఁ, దన కిష్టుఁడగు నొక భూసురశ్రేష్ఠునివలన సుస్నాతుఁడగును తరువాత నాతఁడు రాజప్రాసాదావరణములోపల నున్న దేవాలయమున కేఁగి, కులాచారపద్ధతిని దేవునిఁ బూజించి, యట నుండి కదలి, విచిత్రచిత్రములచే నలంకృతమై మనోహరముగ నొప్పెడి సభాభవనమునకుఁ జని, రాజ్యవ్యవహారములఁ గూర్చి ప్రశస్తులైన రాజకీయవేత్తలతో ముచ్చటించును.[3]

1. శ్రీవిరూ...orgotten Empire - Pages 246-247
2. Journal ...rgotten Empire - Page 249
3. ...rgotten Empire, - Pages 249-250

రాయల స్వభావము

దక్షిణాపథమును బాలించిన రాజులలో నింతటివాఁడు లేఁడని ఘంటాపథముగఁ జాటవచ్చును. ఏమి యీతని సామర్థ్యము! దూరదృష్టి! రాజ్యకార్యనిర్వహణనైపుణి! శరీరపాటవము! అన్నింట నీతఁ డద్వితీయుఁడు. ఈతని బలపరాక్రమములఁ బ్రకటించుట కీతఁ డొనర్చిన యుద్ధములే ప్రబలసాక్ష్యములు. ఈతని పాలనమునను్న సామ్రాజ్యపు సుఖస్థితియే యీ రాజవరేణ్యుని పరిపాలనాదక్షతను సహస్రముఖముల వెల్లడించుచున్నది. ప్రజల కష్టనిష్ఠురముల నర యుటయే యీతని నిత్యకృత్యములలోఁ బ్రధానమైనది. రేయి యనక, పగలనక, యెల్లవేళల జనులమేలుకై పాటుపడువాఁడు. విదేశీయుల నాదరించుటయందును, సన్మానించుటయందును నెక్కువ శ్రద్ధవహించువాఁడు. అనిశము వారి యోగక్షేమముల విచారిం చుచు, వారి వ్యాపారముల కెట్టి యభ్యంతరమును గలుగనీయక, తన దేశమునందలి వాణిజ్యము నభివృద్ధిపఱచెడివాఁడు. అన్యదేశీ యులయెడ నత్యంత మైత్రిగలిగి యుండెడివాఁడు. అన్యకాంతల మాతృభావమునఁ జూచెడివాఁడు. సర్వసమత్వ మీతని సొమ్ము.

ఈతని ముఖవర్చస్సును, నేత్రగాంభీర్యమును, ఉదారహృద యమును, ధర్మగుణమును, ధైర్యసాహసములును బరికింప నీతఁ డసామాన్యపురుషుఁడని తోఁపక మానదు. రాయఁడు దైవాంశసం భూతుఁడని చెప్పక తప్పదు.

రాయల మతము

కృష్ణదేవరాయలు వైష్ణవమతావలంబకుఁడు; పరమతద్వేషి కాఁడు. శైవవైష్ణవుల సమానభావమున నాదరించువాఁడు. శ్రీ తిరుపతివేంకటేశ్వరు లీతని కిష్టదైవము. విష్ణుచిత్తీయ (ఆముక్త మాల్యద) గ్రంథరచనమే యిందులకుఁ దార్కాణము.

మున్ను, కృష్ణరాయలు, 'కళింగదేశ విజిగీషామనీషం దండె త్తిపోయి, విజయవాటిం గొన్ని వాసరంబులుండి, శ్రీకాకుళనికేత

నుండగు నాంధ్రమధుమథను సేవింపంబోయి, హరివాసరోపవాసం
బచ్చటఁ గావింప, నప్పుణ్యరాత్ర చతుర్థయామంబున' —

'నీలమేఘము డాలు డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుఁ జామనచాయ మేనితోడ,
నరవిందములకచ్చు లడఁగించుజిగి హెచ్చు
నాయతంబగు కన్నుదోయి తోడఁ,
బులుఁగురాయని చట్టుపలవన్నె నొరవెట్టు
హొంబట్టు జిలుఁగు రెంటెంబుతోడ,
నుదయార్కబింబంబు నొఱపువిడంబంబు
దొరలంగ నాడు కౌస్తుభముతోడఁ,
దమ్మికేలుండఁ బెఱకేల దండయిచ్చు
లేములుడిపెడు లేఁజూపు లేమతోడఁ
దొలఁకు దయఁదెల్పు చిఱునవ్వుతోడ...'

ఆము. ఆ. 1 - ప. 12

కలయం దాంధ్రజలజాక్షుఁడు సాక్షాత్కరించి —

'పలికి తుత్ప్రేక్షోపమలు జాతిపెంపెక్క
రసికు లౌ నన మదాలసచరిత్ర,
భావ ధ్వని వ్యంగ్య సేవధిగాఁగఁ జె
ప్పితివి సత్యావధూ ప్రీణనంబు,
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకల కథాసార సంగ్రహంబు,
శ్రోత్రఘటలు విచ్చఁగ రచించితి సూక్తి
నైపుణి జ్ఞానచింతామణి కృతి,
మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్య
రచనమెప్పించికొంటి గీర్వాణభాష,
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియముగాఁగ.'

ఆము. ఆ. 1 - ప. 13

'ఎన్నఁగూర్తు నన్నవిను, మేమును దాల్చిన మాల్యమిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండిలిసెప్పుము, మున్నుగొంటి నే
నన్నదవండ యొక్కమగవాఁడిడ, నేను దెలుంగురాయఁడ,
న్గన్నడరాయ, యక్కొదువఁ గప్పుప్రియాపరి భుక్తభాక్కథక్.'

ఆము. ఆ. 1 - ప. 14




హంపీ పంపాపతి దేవాలయములోని ఒక దృశ్యము

*—By Courtesy of Archaeological Dept., Madras.*

అని యానతిచ్చెను. అంత రాయలు విష్ణుభక్తిని వెదచల్లు 'విష్ణుచిత్తీయ' మును రచించి, దానిని దన యిలువేల్పునకుఁ గృతి యొసఁగి, ధన్యుఁడయ్యెను.

కృష్ణరాయ ఉదయగిరిని జయించి, విద్యానగరమున కేఁగుచు, మార్గమధ్యమున శ్రీతిరుపతి వేంకటేశ్వరులను దర్శించి, యా దేవునకుఁ గనకాభిషేకముఁ జేయించి, మణిరత్నఖచిత సువర్ణ కంకణములను సమర్పించినట్లు తిరుపతియందలి శాసనములవలనఁ దెలియుచున్నది.[1]

ఇఁక, రాయలు శైవమతమును సహితము ప్రేమించెనను టకుఁ దగిన హేతువులను జూపవలసియున్నది.

పంపాక్షేత్రముననున్న విరూపాక్షేశ్వరునకుఁ జక్కని గోపురమును, రంగమంటపమును గట్టించి,[2] కొన్ని గ్రామముల దాన మొసఁగెను.[3] అంతఃపురావరణముననున్న గణపతి స్వామికిఁగొన్ని గ్రామములొసఁగెను.[4] కాళహస్తీశ్వరునకు గోపురముఁ గట్టించెను. శ్రీశైలమున వీథుల కిరువైపులఁ బెక్కు మండపములు గట్టించెను.[5]

## సాళువ తిమ్మరుసు

'ఏ మంత్రిమణి నిజస్వామి కార్యక్రియా
తత్పరమానసోత్సాహశాలి,
యే మంత్రిమణి మిత్రహిత బాంధవాశ్రిత
ప్రకరరక్షణకళా ప్రౌఢబుద్ధి,
యే మంత్రిమణి వచో హేలాతి నైర్మల్య
శీతలతాధూత శీతరోచి,
యే మంత్రిమణి సుధాధామ శాంభవధామ
ధాళధళ్యసుతుల్య ధవళకీర్తి,
యట్టి మంత్రివరులలో నెంచ మహిత నృపతి
పటలమకుటాగ్ర ఘట్టితపాదయుగళి

1. A. S. R. - 1908-1909
2. Epigraphia Indica, Vol. I, Page, 366
3. Journal of the Royal Asiatic Society, Pages, 394-395
4. Epigraphia Indica, Vol. IV, Page 266
5. No. 74, Epigraphical Collections - 1903 and Annual Report of the Archaeological Department, Southern Circle

సకల కర్ణాట రక్షా విచక్షణుండు
దీనసురశాఖి - సాళువ తిమ్మమంత్రి.'

— రాజశేఖరచరిత్రము

శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయములను వర్ణించుటకు ముందాతని విజయములకుఁ గారకుఁడై, తోడునీడయై, రాజ్యతంత్రజ్ఞుఁడై యొప్పిన తిమ్మరుసుమంత్రి చరిత్రమును సంగ్రహముగఁ దెలుపుట నా విధియైయున్నది.

వంశము

తిమ్మరుసు వంశీయులు సాళ్వవంశరాజులకడ మంత్రిత్వాది పదవులు సంపాదించి, దిగంత విశ్రాంతకీర్తి నార్జించుటచే నీతని వంశమునకు 'సాళువ' వంశమను పేరుగలిగెను.

తిమ్మరుసు బ్రాహ్మణుఁడా? క్షత్త్రియుఁడా? యను విషయమునుగూర్చి చరిత్రకారులు పెక్కండ్రు వివాదపడిరి. సంశయగ్రస్తమగు నీ విషయమునుగూర్చి యించుక చర్చింతము. శ్రీసింహాచల స్వామి యాలయములోని యొక శాసనమున నిట్లు వ్రాయఁబడి యున్నది —

'శాకాబ్దే బహుధాన్య నామని నభో వేదాబ్ధిచంద్రాన్వితే
కార్తిక్యాం శశివాసరే శుభతిథౌ సింహాసలస్వామినే
హారం కర్ణవిభూషణే చ కటకే శ్రీకృష్ణరాయాధిపా
మాత్యారాచయ సాళ్వ తిమ్మనృపతిః ప్రాదాద్ ద్విజన్మాగ్రణీః.'

పై శ్లోకమునుబట్టి తిమ్మరుసు బ్రాహ్మణుఁడని తేలినది. ఇఁక నీతఁడు భూసురులలో నే తెగకుఁజేరినవాఁడో యోజింతము. తిమ్మరుసునకు నాదిండ్ల అప్పయామాత్యుఁడను మేనల్లుఁడు గలఁడు. మాదయగారి మల్లన రాజశేఖరచరిత్రమను మూఁడాశ్వాసముల గ్రంథమును రచించి, యప్పయామాత్యున కంకితము గావించెను. అందు ద్వితీయాశ్వాసాంతమున నిట్లు వ్రాయఁబడి యున్నది —

'పారదప్రభావిభాసి భద్రకీర్తి వాహినీ
పూరదాన ధూతదివ్య భూజకామధేను దు

ర్వార యాఱువేల వంశ వార్ధిపూర్ణ చంద్రమా
సారబుద్ధిజాల నీత శత్రుభూమి భృద్రమా.'

ఈ సుగంధివృత్తమువలన నప్పయామాత్యుఁడా ర్వేల నియోగిబ్రాహ్మణుఁడని తెలియుచున్నది. కావున, అప్పయామాత్యునకు మేనమామయగు తిమ్మరుసును నార్వేల నియోగిబ్రాహ్మణుఁడే.

తిమ్మరుసు కౌండిన్యసగోత్రుఁడు. తండ్రి రాచిరాజు; తాత వేమరాజు; సోదరుఁడు గోవిందరాజు; సోదరి కృష్ణమాంబ.

ఈతని తొలిపేరు తిమ్మరాజు. 'అరుసు' శబ్దము కర్ణాట భాషయందు 'రాజు' శబ్దమునకుఁ బర్యాయపదము. కావున నీతఁడు తిమ్మరాజనియుఁ, దిమ్మరుసనియుఁ బిలువఁబడుచుండెను.

ఈతని తాతయుఁ దండ్రియుఁ గర్ణాటసామ్రాజ్యసార్వభౌములకు సామంతులుగనున్న సాళ్వ వంశీయులకు మంత్రులుగనుండి ప్రఖ్యాతిఁగాంచిరి. మల్లికార్జునరాయలకాలమునఁ గొండవీడు, ఉదయగిరిరాజ్యములను గజపతు లాక్రమించుకొనిరి. ఆ కారణమున రాచిరాజు తన సర్వస్వమును గోలుపోయి, కుటుంబముతోఁ జంద్రగిరికి వలసపోయెను. అచ్చటనే తిమ్మరుసు క్రీ. శ. 1460-వ వత్సర ప్రాంతమున జనించెను. ఈతని బాల్యముననే తల్లిదండ్రులు మృతులైరి. వారు బ్రదికియుండఁగనే, తమ పుత్రికయైన కృష్ణమాంబను, సాళ్వ నరసింహరాయలకడ మంత్రిగనున్న నాదిండ్ల చిట్టిగంగనామాత్యుని యన్న మనుమఁడగు తిమ్మరాజున కిచ్చి పరిణయము గావించిరి. జననీజనకులు పరలోకగతులైన కారణమున దిక్కులేక సోదరు లిరువురును నిచ్చమెయిఁ ద్రిమ్మరుచుండిరి.

బాల్యదశ

తిమ్మరుసు నొకనాఁడు చంద్రగిరి సమీపారణ్యమునకేఁగి, యందందుఁ జరించి, యలసి, భాస్కరతాపంబున నోర్వఁజాలక, విశ్రాంతిఁగైకొనఁ దలఁచి, చేరువనున్న యొక రసాలతరుచ్ఛా

యను బయుండి నిద్రించెను. పగిలింటి ద్వార పశ్చిమదిక్కాంతాగ్ర హంబునకేఁగ నించుక పశ్చిమమునకు జాఱెను. కిరణజాల మా బాలుని ముఖముపై నేటవాలుగఁ బడుచున్నను నాతఁడు మేలు కొనక, యట్టులే నిద్రించుచుండెను. సమీపముననున్న వల్మీకమున వసించుచున్న కృష్ణసర్పమొకటి యచ్చటికి వచ్చి, యా బాలుని ముఖమునకు నెండ తగులకుండునట్లు తన ఫణమును విప్పి ఛత్రము వలెఁ బట్టెను. ఆ పరిసరముననే యొంటరిపాటునఁ జనుచున్న సిద్ధుఁ డొకఁ డా యద్భుతసంఘటనమును గాంచి, బాలకుని దిక్కునకు నడచుచుండ, నా భుజంగ మాతని పొలకువఁ గాంచి, బిరబిరఁ బోయెను. సిద్ధుఁడంతఁ దిమ్మరుసును సమీపించి, నిద్రనుండి లేపి, 'బిడ్డా! నీ కచిరకాలమున మహత్తరమగు నైశ్వర్యము లభ్యము కానున్నది. మహారాజభోగంబు లనుభవింతువు. దేశక్షేమసంధా యకుఁడవగుదువు. ఇకమీఁదనిట్టి యొంటరిపాటున సంచరింపకుము. ఇవి యరణ్యప్రదేశములు; దుష్టమృగభూయిష్ఠములు. గృహో న్ముఖుఁడవు కమ్ము' అని యానతిచ్చి, యా పరదేశి వెడలిపోయెను.

అప్పు డా బాలుఁ డిట్లు చింతించెను—

'నా కచిరకాలంబున మహదైశ్వర్యపదవి యబ్బునఁట! రాజభోగంబు లనుభవింతునఁట! ఇవి యేటిమాటలు? నే నేడ? రాజభోగంబు లనుభవించు టేడ? శుష్కదరిద్రుఁడను. దిక్కులేని వాఁడను. సిద్ధునిమాట లసత్యములౌదుమా? ఆతఁడు త్రికాలవేది. ఆ మహనీయుని వాక్యము లెట్లు దబ్బఱలగును? ఏది యెటులు న్నను విద్యాధనమును సముపార్జించుట నా ప్రథమ కర్తవ్యము. దానికై ప్రయత్నింతును.'

అని లోలోన వితర్కించుకొనుచుఁ జంద్రగిరికిఁ బోయి, సిద్ధుని వచనములను గోవిందునకు వినిపించెను. గోవిందుఁడును నా పలుకులు విని, యాశ్చర్యపడెను.

**విద్యాభ్యాసము**

అన్నదమ్ము లిరువురును బ్రతిదినము వేకువనే మేల్కాంచి,

కాల్యకృత్యంబులు దీర్చుకొని, స్వర్ణముఖ కేఁగి, స్నానసంధ్యాద్యను ష్ఠానంబులు నిర్వర్తించుకొని, గ్రంథపఠన మొనర్చి, మధ్యాహ్న కాలమున మాధుకరభిక్షఁ గొనితెచ్చి, యిరువురును భుజింతురు. భోజనానంతరము కొంతవడి విశ్రమించి, పిమ్మటఁ, గావ్యపఠన మొనరించి, యుద్యోగుల నాశ్రయింపనేఁగుదురు. సమయము దొరకినపుడెల్ల మహనీయులయొక్కయు, వీరపురుషులయొక్కయుఁ జారిత్రములు పెద్దలవలన వినుచుందురు. ఇవి వారి నిత్యకృత్యములు.

ఇటు లైదాఱేఁడులు గడచినవి అంతకు సంస్కృతాంధ్ర ములయందుఁ జక్కనిపాండిత్యమును గడించిరి. పేరుగన్న ప్రాయస కాండ్రైరి. ఆమీఁదఁ బండితులకడ కేఁగి, శుశ్రూషలొనరించి, శాస్త్రపాఠముల నేర్చిరి. గణితమునఁ బ్రసిద్ధులైరి.

తిమ్మరాజు గోవిందునికంటెను సూక్ష్మబుద్ధిగలవాఁడు. వస్తుతత్త్వమును గ్రహించుటలో మేటి.

సోదరు లిరువురు 'శరీరమాద్యంఖలు ధర్మసాధన' మ్మను లోకోక్తి ననుసరించి దేహపరిశ్రమ మొనరించుచు శరీరబలము నార్జిం చిరి. ఇరువదిరెండు వత్సరముల ప్రాయము పచ్చుసరికి సకలకళా ప్రవీణులై, చంద్రగిరి, పెనుగొండ మొదలగు పట్టణములయందుఁ బేరుగాంచిరి.

ఆర్థశాస్త్ర పఠనము

అప్పటికి వారు రాజనీతిశాస్త్రముమాత్రము నేర్చియుండ లేదు. దీనిని సమగ్రముగ నెఱిఁగి బోధింపఁగలవా రత్యల్ప సంఖ్యా కులైయుండిరి. నాఁటి కీ శా స్త్ర ము నఁ బ్రసిద్ధిఁగన్నవాఁడు నాదిండ్ల - చిట్టి గంగనామాత్యుఁ డొక్కరుఁడే. ఈతఁడు చంద్ర గిరిరాజ్యాధిపతియైన సాళువ నరసింహరాయలకడఁ బ్రధానమంత్రిగ నుండెను. తిమ్మరుసున కీతఁడు బంధువు. కాని, యేకారణముననో సోదరు లప్పటికి గంగనామాత్యుని బ్రాపు గోరలేదు. ఈ సోదరుల వైదుష్యమునుగూర్చి పలుమారు లాతఁడు విని, వీరినిఁ దన పట్టణ

మగు నారాయణవనమునకుఁ బిలిపించుకొనెను. ఆకాలమున నారాయణవనము చంద్రగిరిరాజ్యమునకు రాజధాని. రాజుతోఁ గూడ గంగనామాత్యుఁడును నారాయణవనముననే వసించుచుండెను. గంగనామాత్యుఁడు వీరి పాండిత్యమును బరీక్షించి, దివాణమున నుద్యోగము లిప్పించెను. వీరును దమ యుద్యోగముల నత్యంత శ్రద్ధాభక్తులతో నిర్వహించుచుండిరి. గంగనామాత్యుఁడు వీరి బుద్ధివిశేషమునకు మెచ్చి, రాజనీతిశాస్త్రము నేర్పిన నీ సోదరులు మహోన్నతస్థితికి రాఁగలరని తలఁచి, తిమ్మరాజును జేరఁ బిలిచి, 'నాయనా! నీ బుద్ధివిశేషమును గమనించి, నీవు మా యందఱి కంటెను మేటివై దక్షిణహిందూస్థానమున కంతకును సర్వాధికారివై, ధర్మపాలనము గావింతువని తెలిసికొంటిని. నీకంటె సమర్థుఁడీ రాజ్యమున మఱియొక్కరుఁడు లేఁడు. నేను గడువృద్ధుఁడను. నాకుఁ దెలిసినంతవఱకు రాజనీతిశాస్త్ర మర్మములను మహారాజ్య తంత్రవిధానములతోడఁ గఱపి, నిన్ను రాజనీతివిద్యావిశారదునిఁ గావించెదను. కాని, ఒక్కమాట! ఈ సామ్రాజ్యము హైందవ ధర్మరక్షణార్థ మేర్పడినది. ఆ ధర్మము వినాశమునొందకుండునట్లు చూచుట నీ కర్తవ్యము. ఈ మాట మఱవకు' మనెను. అందులకు 'వల్లె' యని తిమ్మరుసు పలికెను.

క్రమక్రమముగా సోదరు లిరువురు గంగనామాత్యునికడ శుక్రనీతి, అర్థశాస్త్రము, కామందకము మొదలగు రాజనీతి గ్రంథములను, ధనుశ్శాస్త్రము, వ్యూహబోధిని మున్నగు సంగ్రామ గ్రంథములను జదివి, వానియందు సంపూర్ణ పాండిత్యము గడించిరి. అనన్యసామాన్యమేధాశాలియగు తిమ్మరుసు ప్రతిష్ఠ యాంధ్రదేశమునందంతటను వ్యాపించెను.

ఉద్యోగప్రాప్తి

ఆ కాలమున విద్యానగర సామ్రాజ్యమునకుఁ బ్రతినిధిగనుండి గుత్తి, పెనుగొండ, చంద్రగిరి దుర్గములను పాలించుచుండిన తుళువ నరసరాజీసోదరుల ప్రజ్ఞావిశేషమునుగూర్చి పెక్కండ్రవలన విని,

వీరలఁ దనకడకు రప్పించుకొని, తిమ్మరుసును మంత్రిగను, గోవింద రాజును దండనాయకునిగను నొనర్చెను. తిమ్మరుసు తన యసాధారణ ప్రజ్ఞాబలమున రాజ్యాంగములలో సంపూర్ణానుభవము నార్జించి, రాజ్యము నత్యంతాభివృద్ధికిఁ దెచ్చెను.

విద్యానగరము నార్జించుట

ఆ కాలమున విద్యానగర సామ్రాజ్యము నొక చపలచిత్తుఁడు పాలించుచుండెను. ఆ కారణమున మహమ్మదీయులా రాజ్యమును గబళింపఁ గాచియుండిరి. విద్యానగరసామ్రాజ్య మన్యాక్రాంతము గాకుండ, హైందవ పరిపాలనముననుండుట యుక్తమని భావించి, యాత్మీయ రాజ్యమునఁ జేర్చుకొనుట కిదియే తగిన సమయమని తలఁచి, తిమ్మరుసు పెనుగొండ, చంద్రగిరి దుర్గములను దాను రక్షించుచు, విద్యానగరమును ముట్టడింప నరసరాజును ప్రేరేపించెను. నరసరాజు తిమ్మరుసు పలుకుమేరకు విద్యానగరమును ముట్టడించి, దానిని స్వవసము చేసికొని, కొలఁది కాలమునకే దివంగతుఁడయ్యెను. ఆమీఁద వీరనరసింహరాయలును, నాతని పిమ్మట శ్రీకృష్ణదేవరాయలును విద్యానగరమునఁ బట్టాభిషిక్తులైన కథాంశములనుగూర్చి సందర్భోచితముగ వివరించియుంటిని. శ్రీ కృష్ణదేవ రాయల జైత్రయాత్రలందుఁ దిమ్మరుసు రాయలకెట్లు సహాయపడెనో, రాయల చరిత్రమునందు విశదపఱతును.

విద్యాగోష్ఠి

తిమ్మరుసు మంత్రి సంస్కృతాంధ్రములయం దసామాన్య పాండిత్యముగలవాఁడని వ్రాసియుంటిని. అగస్త్యకృతమగు సంస్కృత బాలభారతమున కీతఁడు సంస్కృతమున మనోహరమగు వ్యాఖ్యానము రచించెను. అందు గద్యమిట్లున్నది—

"ఇతి శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర కర్ణాటేశ్వర శ్రీకృష్ణరాయ శిరఃప్రధాన సకలాగమ పారావారపరీత సాళ్వ తిమ్మయదండనాథ విరచితాయాం బాలభారత వ్యాఖ్యాయాం మనోహరాఖ్యాయాం పంచమస్సర్గః" †

† Sources of Vijayanagar History, Page 143

రాయలతోఁగూడఁ దానును విద్యావినోద కార్యములయందు భాగస్వామియై కాలము గడపుచుండెను. 'మణినావలయంవల యేనమణిః' అను సామ్యమట్టుల, తిమ్మరుసువలనఁ గృష్ణరాయలును, కృష్ణరాయలవలనఁ దిమ్మరుసును విద్యాప్రపంచమునఁ బేరు గాంచిరి.

చరమదశ

అత్యంతము ప్రేమించుచు 'అప్పాజి' యని పిలిచెడి కృష్ణరాయలే చరమ దశయందీతని ననేక కష్టములకు గుఱిచేసెనని కథలు తెలుపుచున్నవి. ఆ విషయములను కృష్ణరాయల చరిత్రమునందు విశదపఱతును. కాని, యవి విశ్వసనీయములు కావేమో!

అప్రతిమ ప్రతిభాశాలియగు తిమ్మరుసుమంత్రి రాయలకంటె ముందుగ, క్రీ. శ. 1527-వ వత్సరమునఁ గీర్తి శేషుఁడయ్యెనని తెలియుచున్నది.*

కృష్ణరాయని మనోభీష్టము

రాయలు రాజ్యమునకు వచ్చినపిదప, నొకనాఁడు తిమ్మరుసును గాంచి, 'అప్పాజీ! దుష్టశిక్షణము, శిష్టరక్షణము రాజునకుఁ బ్రధానధర్మము. ఆ ధర్మమును నిర్వహింప నీవు నాకన్ని తెఱఁగులఁ దోడ్పడవలయును. నా సోదరుఁడును, నా తండ్రియు సాధింపలేక విడిచిపెట్టిన కార్యములను సాధింప నాకనువగు మార్గమును జూపవలయును. రాచూరు, ముదిగల్లుదుర్గములు విజాపుర సుల్తానునకు స్వాధీనములయినవి. ప్రాగ్దిశాభాగమున నుదయగిరివఱకుఁ గల దేశమంతయు గజపతుల హస్తగతమైనది. ఆ దేశములందుఁ గల శత్రురాజులను బాఱఁదోలి, యా భాగములను లోఁబఱచుకొని, దక్షిణహిందూస్థానమున నేకచ్ఛత్రాధిపత్యము వహింపవలయునను కోరిక గలదు. అసంఖ్యాకసైన్యములను గూర్పసహితము వాంఛింతు' ననెను. మంత్రిసత్తముఁడా మాటలువిని, 'ప్రభూత్తమా! దీనికై యింత యోచింపనేల? మీ కోర్కె మెయిఁ గార్యములను

* మహామ్మదీయ మహాయుగము, పుట 405

జక్కఁబెట్టెదను. జైత్రయాత్ర కనుకూలములైన ప్రయత్నములు చేయ నాకు రెండు వత్సరముల కాలము గడువీయవలయును. అశ్వపతులును, గజపతులును మిగులబలాఢ్యులు. ఒక్కమాఱుగ బలవంతులతో విరోధము తగదు, దాన ననర్థము వాటిల్లును. మును ముందు సైన్యములను బలపఱుపవలయును. ధనాగారములను ధన సమృద్ధములు గావింపవలయును. దుర్గప్రాకారములను దృఢపఱుపవలయును. విశ్వాసపాత్రులను గొలువునందుంచవలయును. ఈ పనులను గావించుటకు రెండు వత్సరముల కాలము పట్టు' నని పలుక, రాయ లెంతయు సంతసించి, తత్ప్రయత్నముననుండఁ దిమ్మరుసు నాజ్ఞాపించెను. ఆతఁడును ప్రభు నాజ్ఞ శిరమునఁ దాల్చెను.

సంస్కరణములు

రాయలు విద్యావినోదములందుఁ దగుల్కొని, రాజ్యభారమును దిమ్మరుసుపై మోపెనను మిషవలన సామంతప్రభువు లసంతృప్తిఁజెంది, స్వాతంత్ర్యమును సంపాదింపఁ బ్రయత్నించుచుండిరి. ఆ విషయమును నఘటనఘటనాసామర్థ్యముగల తిమ్మరసు గ్రహించి, కృష్ణరాయలకుఁ దెలిపి, రాష్ట్రమునకుఁ జేటుగూర్పనున్న పెద్దసామంతులను దొలఁగించి, వారి స్థానముల విశ్వాసపాత్రులైన చిన్నసామంతులను నియమించెను. ఈ వర్తమానము పరరాష్ట్రప్రభువులు విని, భయమంది, విద్యానగరముపై దండెత్తిపోవ మానిరి.

కృష్ణదేవరాయఁడు సింహాసనమెక్కుటకుఁ బూర్వము సేనలోఁ గొంతభాగము విద్యానగరాధీశుని వశమునను, మఱికొంత భాగము సామంతరాజుల వశముననునుండెడిది. విద్యానగరసామ్రాజ్యమంతయు నాయకరములుగా విభజింపఁబడి యొక్కొక్క నాయకర మొక్కొక్క రాజాజ్ఞానువర్తియగు నాయకునిచేఁ బరిపాలింపఁబడుచుండెను. ఈ నాయకు లిరువదెనిమిది తెఱంగులుగ విభజింపఁబడియుండిరి. అందొక తెగ నాయకులు తాము జీతములు గైకొనుచుఁ దమ నాయకరములలో నార్జించిన ద్రవ్యమంతయును నగరికిఁ బంపెడి

యాచారముగలవారుగ నుండిరి. మఱియొక తెగ నాయకులు పుత్త్రపౌత్త్రాను క్రమముగాఁ బరిపాలించు సామంతరాజులు. వీరినే యమరనాయకులందురు. ఈ యమరనాయకులు తమ రాజునకై కొంత సైన్యమును నాయత్తపఱచియుంచు పద్ధతికి లోఁబడి, తమ నాయకరము లనుభవించుచుండెడివారు. నిర్ణీతవిధమున వీరలకడనుండు సైన్యములు సంఖ్యలోఁ గొఱవడియుండుటయె గాక, గుణమునందును గొఱవడియుండుటను గనిపెట్టి, తిమ్మరుసుమంత్రి, యా సైన్యములను సమకూర్చు భారము వారలనుండి తొలఁగించి, సైన్యమును దనవశము చేసికొని, బలపఱచి, యుద్ధము తటస్థించినప్పుడు సిద్ధముగానుండునట్లొనర్చెను. రాయలు శత్రురాజులతో నెప్పుడు యుద్ధము చేయవలసివచ్చినను గొఱంత లేకుండునట్లు పదిలక్షలసైన్యమును సిద్ధపఱచెను. అందు ముప్పదియాఱువేల గుఱ్ఱపుదళమును, ఎనిమిదివందల యేనుఁగులు నుండెను. ఈ సైన్యపోషణము నకు వలయు ద్రవ్యము నమరనాయకులనుండి కైకొనుచుండెను. ఆసైన్యముపై రాయలే సర్వాధికారము గలిగియుండెను.†

నగర కోశాగారము ధనరాసులచే నింపెను. ప్రధానదుర్గములను దృణకాష్ఠజలసమృద్ధములుగఁ జేసెను. దుర్గప్రాకారములను బలపఱచెను. వప్రములను, అగడ్తలను, కొత్తడములను, అట్టళ్లను నను వుపఱచెను.

కవితారచనము: విద్యాగోష్ఠి

కృష్ణదేవరాయఁడు రాజ్యభారము వహించినది మొదలు జైత్రయాత్రలకు బయలుదేఱువఱకుఁ గల రెండు మూఁడేఁడుల కాలమును సైన్యమును బలపఱచుటయందును, విద్యావినోదగోష్ఠియందును గడపెను.

ఈతఁడు కర్ణాటాంధ్ర సంస్కృతభాషలయం దఖండప్రజ్ఞ నార్జించి, విద్వాంసుఁడును, విద్వద్గోష్ఠీలోలుఁడును, గవియు నై

† ఈ విషయము చిలుకూరి వీరభద్రరావుగారి 'తిమ్మరుసుమంత్రి' చరిత్రమునుండి గ్రహింపఁబడినది.



హంపీ విఠ్ఠలరాయ దేవాలయసమీపములోని రాయలవారి తులాభార స్తంభతోరణము

—*By Courtesy of Archaeological Dept., Madras.*

యుండెను. ఈ రాజకవి గీర్వాణభాషయందు మదాలసచరిత్ర, సత్యావధూప్రీణనము, సకలకథాసారసంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి మున్నగు కావ్యములు రచించినట్లు తెలియుచున్నది. కాని, యందొక్కటియు నిప్పుడు కానరాదు.

ఈ విద్వచ్చక్రవర్తి విష్ణుచిత్తీయమను నామాంతరముగల 'ఆముక్తమాల్యద' యను నాంధ్రప్రబంధమును రచించెను. ఈ గ్రంథకర్తృత్వమును గూర్చి వాదోపవాదములు గలవు. కొందఱా ముక్తమాల్యదాకర్త పెద్దనయనిరి; మఱికొందఱు కృష్ణదేవరాయలనిరి. ఇదమిత్థమని నిర్ణయింపఁదగు నాధారములు గానరావు. కాని, శైలియందు మనుచరిత్రమునకును, ఆముక్తమాల్యదకును నత్యంత భేదముండుటఁ బట్టి యాముక్తమాల్యద రాయలే యని నిర్ణయింపవలసియున్నది.

ఇది యేడాశ్వాసములు గలిగి, విశిష్టాద్వైతమును ప్రబంధరాజము. వేంకటాచలపతి కంకితము. ఋతువర్ణపుళికర ప్రథమగణ్యము. నూతనకవన ఫక్కికలకుఁ బరమావధి. క్రమకును, బిగువునకును నాంధ్రవాఙ్మయమున నగ్రగణ్యము. కావ్యషష్ఠ్యంతములును, నాశ్వాసాంతపద్యములును సాటిలేనివి. లోకానుభవము సమగ్రము. పాండిత్యమపారము; అద్వితీయానుకరణ

ఏతద్గ్రంథమునుండి మచ్చునకు రెండు పద్యములు

'ఖ వట త్పయోబ్ధి వీక్ష్యరసాతలాన్యోన్య
పిండీకృతాంగ భీతాండజములు,
ధృత కలాయార్ధ ఖండిత సమిల్ల వరూప
చరణాంతికభ్రమ త్తరువరములు,
ఘన గుహా ఘటిత ఝూంకరణ లోకైక ద్వి
దుందుభీకృత మేరు మందరములు,
చటుల ఝంపా తర స్స్వ నగరీ విపరీత
పాతితాశా కోణ పరిబృఢములు,

ప్రబలతర బాడబీకృ తేరమ్మదములు,
ఖాస్వ కేరమ్మదీకృత బాడబములు,

పతగ స్రమాట్పత త్త్రి ప్రభంజనములు,
వృజినతూ లౌఘములఁ దూల విసరుఁగాత.'

ఆము. ఆ. 1, ప. 3.

'చని కాంచె న్విరజాభిధాంతర వపు స్సహ్యోద్భవాతీర నం
దనవాటీ కలయద్రుమావళి దళాంతర్దృశ్యపాపాళి భం
జన చాంపేయసుమాయమాన విషమస్వర్ణావృతివ్రాత ర
శ్మి నభ స్స్పృక్శిఖరాళి దీపకళికా శృంగంబు శ్రీరంగముౘ్.'

ఆము. ఆ. 7, ప. 27

## అష్టదిగ్గజములు

కృష్ణరాయఁడు తాను గవియుఁ బండితుఁడును నగుటయే సంస్కృతాంధ్ర కర్ణాటకవులఁ జేరదీసి, యాంధ్రభోజుఁడనఁ దిగంత విశ్రాంతకీర్తి నార్జించెను. ముఖ్యముగా నీ విద్వచ్ఛ కాలమున నాంధ్రభాషావధూటి సర్వాలంకారశోభితయై నను. సంస్కృత వాఙ్మయమునకు భోజవిక్రమ ప్రభుత్వము ల్యాటిన్ భాషకు ఆగస్టస్ చక్రవర్తిపాలనమును, హూణ ఎలిజబెత్ రాణియొక్క రాచఱికమును నెట్లు శుభప్రద తెలుఁగున కట్టులే కృష్ణదేవరాయల కాలమును.

కృష్ణరాయని యాస్థానమున 'అష్టదిగ్గజము'లని పేరొందిన మంద్రు కవులుండినట్లు తెలియుచున్నది. అల్లసాని పెద్దన్న, నంది తిమ్మన్న, అయ్యలరాజు రామభద్రుఁడు, ధూర్జటి, మాదయ్యగారి మల్లన్న, పింగళి సూరన్న, రామరాజభూషణుఁడు, తెనాలి రామకృష్ణుఁడు అను నెనమండ్రును 'అష్టదిగ్గజము' లని పేరందిరి. ఇందు మొదటఁ బేర్కొనిన యేవురును రాయల సమకాలీనులనుట నిర్వివాదాంశము. పింగళి సూరన్నయు, రామరాజభూషణుఁడును కృష్ణదేవరాయల జామాత యగు అళియ రామరాజు కాలమున నున్నవారని స్పష్టమగుటవలన నీ యిరువురును రాయల సమకాలీనులు గావచ్చును. ఈ విషయమునకు వ్యాఘాతముగా

వీరేశలింగము పంతులవారు తమ యాంధ్ర కవుల చరిత్రమందును.[1] చిలుకూరు వీరభద్రరావుగారు తమ కృష్ణరాయ చరిత్రమునందును జర్చించిరి. 'కాని, రాయల మంత్రియైన తిమ్మరుసునకు నల్లుఁడైన నాదిండ్ల యప్పామాత్యునకుఁ దన కావ్యమంకితము చేసిన మాదయ్యగారి మల్లన రాయలవారి యాస్థానములోనివాఁడు కాఁగా, రాయల యల్లుఁడగు రామరాజుయొక్క సభలోను, కాలములోను నున్న రామరాజభూషణ పింగళిసూరన్నలు రాయల యాస్థానములో నేలయుండఁగూడదో తెలియకున్నది.'[2] ఇఁక, తెనాలి రామకృష్ణుని కాలనిర్ణయమునకుఁ దగిన యాధారములు దొరకమింజేసి, యీతఁడు రాయల కాలమున నుండెనో లేదో చెప్పఁజాలను. కాని, వీరేశలింగము పంతులవారు తమ యాంధ్రకవుల చరిత్రమున నీతఁడు వేంకటపతిదేవరాయలకాలమున నుండిన వాఁడని నిరూపించియున్నారు.[3] ఏది యెటులున్నను పైఁ బేర్కొనఁబడిన కవులే యష్టదిగ్గజములని వ్యవహరింపఁబడుచున్నారు.

పద్యకవిత్వము మొదట నాంధ్రీకరణమై, పిదప విపులీకరణమై, తరువాత ననుకరణమై, తుదకు స్వకపోలకల్పనంబై క్రమక్రమంబుగ నభ్యున్నత స్థితికి వచ్చిన ట్రాయా మహాకవుల కావ్య పరంపరయే చాటుచున్నది. కృష్ణరాయుని కాలమున - అష్టదిగ్గజముల ప్రాపున - ఆంధ్ర భాషాయోషామతల్లి విపులీకరణానుకరణ స్వకపోల యుక్తములగు గ్రంథఘుంటికలను దాల్చి, యాంధ్రభోజుని యాస్థానమునఁ జిందులాడినది. జిలిబిలిపలుకుల బలుముద్దులు గులికినది. ఓయ్యారంపునడలఁ గృష్ణరాయ ధరాతలేంద్రుని జేఁబట్టినది.

అల్లసాని పెద్దన్న

ఆంధ్రవాఙ్మయమును సర్వాంగసుందర మొనర్చిన మహాకవులెందరేనిఁ గలరు. అం దల్లసాని పెద్దనార్యుఁ డగ్రగణ్యుఁడు.

---

1. ఆంధ్రకవుల చరిత్రము, ద్వి. భా. పుట 230
2. మహమ్మదీయ మహాయుగము, పుట 422
3. ఆంధ్రకవుల చరిత్రము, ద్వి. భా. పుటలు 266-267

పెద్దన నందవరీకబ్రాహ్మణుఁడు. ఇంటిపేరు అల్లసానివారు. తండ్రి చొక్కనామాత్యుఁడు. జన్మస్థానము కర్నూలుమండలము లోని దూపాటిసీమయందలి దోరణాల యను గ్రామము. బాల్యముననే యీతఁడు శఠగోపయతి యను మహాపండితునాశ్రయించి, యుభయభాషలయం దసమాన ప్రజ్ఞగడించి, మృదుమధురముగఁ గవిత రచింపనేర్చెను.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవులగు నష్టదిగ్గజములలోఁ బెద్దన ప్రథముఁడు. ఈతఁ డనిశము రాయలకడ వసించుచు నాతని కవితాభ్యున్నతికిని, సామ్రాజ్యాభ్యున్నతికిని దోడ్పడెను. పెద్దన సరసకవితావిశారదుఁ డగుటయే కాక, బలశాలియు, శూరుఁడును, ఖడ్గధారణనిపుణుఁడు నై యుండెననుట కాతనికాలమునందలి కథలే నిదర్శనములు.

శ్రీకృష్ణదేవరాయ లొకనాఁడు సువర్ణమయరత్నఖచితమగు గండపెండేరమును జేయించి, దానిని గైకొని సభాస్థానమున కేఁగి, సింహాసనాసీనుఁడై, యష్టదిగ్గజముల నుద్దేశించి, 'కవిసింహులారా! మీలో నెవ్వరేని సంస్కృతాంధ్రములయం దాశువుగ నొక్కమాలికను జెప్పి, యీ పెండేరమును గైకొనుఁ' డని పలికెను. సభ్యులలో నెవ్వరును ముందంజవేయరైరి. అంతఁ గృష్ణరాయలు —

> 'ముద్దుగ గండపెండియరముం గొనుఁడంచు బహూకరింపఁగా
> నొద్దిక నా కొసంగుమని యొక్కరుఁ గోరఁగ లేరు, లేరొకో?'

అనుసరికిఁ బెద్దన లేచి —

> 'పెద్దనఁబోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే
> పెద్దన కీఁ దలంచినను బేరిమి నాకిదు కృష్ణరాణ్ణృపా!'

అని ప్రత్యుత్తరమిడి, విశ్రుత భువన విజయమందిరమున నిలువఁబడి, కవితాపాకమునుగూర్చి సంస్కృతాంధ్రములఁ జక్కని యుత్పలమాలిక నాశువుగఁ జెప్పెను. దాని నిటఁ బొందుపఱుతును.

‘పూఁతమెఱుంగులున్ బసరు పూఁప బెడంగులుఁ జూపునట్టివా
కైతలు జగ్గునిగ్గునెనగావలెఁ గమ్మనఁ గమ్మనన్వలెన్
రాతిరియున్ బవల్మఱపురాని హొయల్బలి యారజంపు ని
ద్దా తరితీపులున్వలెను దారసిలన్వలె లోఁ దలంచినన్
డా తొడ సున్న మిన్నల మిటారపు ముద్దులగుమ్మకమ్మనా
వాతెఱ దొండపంటివలె వాచవిగావలెఁ బంట నూఁదినన్
జేతులకొద్ది కౌఁగిటను జేర్చిన కన్నియ చిన్నిపొన్నిమే
ల్మూఁతల చన్నుదోయివలె ముచ్చట కావలెఁ బట్టిచూచినన్
బాఁతిగఁ బైకొనన్వలపుఁ బైదలి కుత్తుకలోని పల్లటీ
కూఁతలునున్వలెన్ సొగసు కోర్కులు గావలె నాలకించినన్
గాతల తమ్మిచూలి దొరకైవసపుం జవరాలి సిబ్బెపు
న్మేతెలియుబ్బరంపు జిగినిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బ పొం
బూఁతలనున్న కాయసరి పోఁడిమి కిన్నెరమెట్ల బంతిసం
గాతపు సన్నతంతి బయువారపు కన్నడ, గౌళ, పంతుకా
సాతత తాన తానలపసం దివుటాడెడు గోటమీటుబల్
మ్రోఁత లనన్వలెన్ హరువు మొల్లముగావలె నచ్చతెన్గు లీ
రీతిగ సంస్కృతంబు పచరించిన పట్టున భారతీవధూ
టీ తపనీయ గర్భనికటీ భవదానన పర్వసాహితీ
భాతిక నాటకప్రకర భారత భారత సమ్మతిప్రభా
శీతనగాత్మజాగిరిశ శేఖర శీతమయూఖరేఖికా
పాత సుధాప్రపూర బహుభంగ ఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతక తాళయుగ్మలయ సంగతి చుంచు విపంచికా మృదం
గా తతతత్తతాధిహిత హోధిత దంధణుధాణుదింధిమి
వ్రాత లయానుగుణ్య పదవారి కుహూద్వహ హారికింకిణీ
నూతన ఘుల్ఘులాచరణ నూపుర ఝూళీ ఝురీకరాబ్జ సం
ఘాతవియద్ధునీ చకచకద్వికచోత్పల సారసంగ్రహా
యాత కుమార గంధవహహారిసుగంధ విలాసకృత్యమై
చేతము చల్లఁజేయవలెఁ జిల్లునఁ జల్లవలె న్మనోహర
ద్యోతక గోస్తనీ మధుమధుద్రవ గోఘృతపాయసప్రసా
రాతి రసప్రసార రుచిరప్రతి గావలె సాఁగెసారెకున్.’

రసజ్ఞశేఖరుఁడగు కృష్ణరాయ లా మనోహరమాలికాప్రౌఢి కానందించి, తన గద్దియడిగ్గి, పెద్దనార్యుని సమీపించి, యాతని పాదమునకు గండపెండేరమును దొడిగి గౌరవించెను.

కృష్ణరాయ లొకదినమున భువనవిజయసభామందిరమునఁ

గవితాగోష్ఠి నలుపుచు నల్లసాని పెద్దనార్యునిఁ దిలకించి, యిట్లు నుడివెను.

'సప్తసంతానములలోఁ ప్రశస్తిఁగాంచి
ఖిలము గాకుండునది ధాత్రి కృతియ కానఁ
గృతిరచింపుము మాకు శిరీషకుసుమ
పేశల సుధామయోక్తులఁ బెద్దనార్య!

'హితుఁడవు చతురవచోనిధి
వతుల పురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వరీడు పేర్కొనసీకున్.

'మనువులలో స్వారోచిష
మనుసంభవమరయ రససముంచితకథలన్
విననింపు కలిధ్వంసక
మనఘ భవచ్చతుర రచన కనుకూలంబున్.

కావున, మార్కండేయ పురాణోక్త ప్రకారంబునం జెప్పు'మని కర్పూర తాంబూలంబుం బెట్టినం బట్టి, 'మహాప్రసాదం' బని మోదంబున నమ్మహాప్రబంధ నిబంధనంబునకుం బ్రారంభించితి.

అని పెద్దనార్యుఁడు తన మనుచరిత్రపీఠికయందుఁ జెప్పుకొని యున్నాఁడు.

మనుచరిత్రమునకు 'స్వారోచిషమనుసంభవ' మను నామాంతరము గలదు. ఇది షష్ఠాశ్వాసపరిమితిగల కావ్యరత్నము. ఇందుఁ జిత్రింపఁబడిన ప్రధానకథ మార్కండేయపురాణములోనిది. ఆపురాణమును మారనకవి యాంధ్రీకరించెను. అటనట నౌచితీ పోషణమునకై చిఱుమార్పులఁ గావించెఁగాని, పెద్దనార్యుఁ డీ ప్రబంధరాజమును మదముట్ట నా మార్కండేయ పురాణపుఁ ద్రోవనే పెంపొందించెను. మారనకవిత్వమున నూటయేఁబది పద్యములలో ముగిసిన స్వారోచిషుని కథ పెద్దనకవనమున నెనిమిది వందల పద్యములవఱకుఁ బెరిఁగినది. పెద్దనకు ముం దాంధ్రమున వెలువడిన గ్రంథము లాంధ్రీకరణములు. పెద్దనతో విపులీకరణ మారంభమయ్యెను. విపులీకరణమనఁగా - సుప్రసిద్ధపురాణముల

లోని కథను గ్రహించి, దానిని సరసకల్పనంబున నలంకరించి, వివరించి వ్రాయుట. ఈ కృత్యమునకుఁ గడంగినవారిలో నాంధ్రకవితాపితామహుఁడగు పెద్దనార్యుఁడే మొదటివాఁడని విశ్వసింపవలసి యున్నది. ఇందుల కీతనికి మున్ను మనుచరిత్రఁ బోలిన ప్రబంధములు నిర్మించినవారు లేకుండుటయు, నీతని తరువాతివా రీతని ధోరణినే యనుసరించి యనేక ప్రబంధములు రచించుటయు నిదర్శనముగాఁగలవు. స్వభావవర్ణనమం దధికచాతుర్యముగల యీతని సత్కవిత్వము లోకమున కెంత మూలధనముగానున్నదో వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. 'అల్లసాని వాని యల్లిక జిగిబిగి' యను పలుకును బ్రతిపదమును సార్థకపఱచుచున్నది. ఈ ప్రబంధ మీతని సర్వతోముఖపాండిత్యమును, జతుర్విధ కవితావిలాసమును వెలయించుచున్నది. 'ఈతని పద్యములు ముద్దులొలుకు నిద్దంపుఁ బలుకుల నేర్చి, కూర్చి, తీర్చి, దిద్ది, చికిలిచేసి, నునుమెఱుఁగు వెట్టి, వెల్లరింపఁబడినవి.' కావున నెక్కడను నొక్కులువోయి కాన్పింపవు.

మచ్చునకు —

'అటఁ జనికాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరిజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
గటక చరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్.'

—మను. ద్వి. ఆ. ప. 3

'కెలఁకులనున్న తంగెటిజున్ను గృహమేధి
యజమానుఁ డంకసీతార్థపేటి
పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు
దొడ్డిఁ బెట్టిన వేల్పుగిడ్డి కాఁపు
కడలేని యమృతంపు నడబావి సంసారి
సవిధ మేరునగంబు భవనభర్త
మరుదేశపథ మధ్యమప్రప కులపతి
యాఁకటికొదవు సస్యము కుటుంబి
బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజకాతిథిక్షపణ కావ

ధూర్త కాపాలికాద్యనాథులకుఁ గాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె.'

మను. ప్ర. ఆ. ప. 66

మనుచరిత్రమునకుఁ గృతిభర్త శ్రీకృష్ణదేవరాయలు. పెద్దన మనుచరిత్రమునే కాక హరికథాసారమను మఱియొక గ్రంథమును సహితము రచించెనని తెలియుచున్నది. కాని, యది యిపుడు కానరాదు.

పెద్దనార్యుఁడు రాయల మరణానంతరము కొంతకాలము జీవించియుండెను. ఈతఁడు ప్రసిద్ధిఁగన్న రాజభక్తుఁడు. కృతజ్ఞతలో నగ్రగణ్యుఁడు. ఇందులకుఁ గ్రింది పద్యమే తార్కాణము.

"ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొను వేళఁ బురమేఁగఁ
బల్లకి తనకేలఁ బట్టియెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవ
తగుదని తానె పాదమునఁ దొడిగెఁ
గోకటగ్రామాద్యనేకాగ్రహారము
లడిగిన సీమలయందు నిచ్చె
నాంధ్రకవితా పితామహ! యల్లసాని
పెద్దనకవీంద్ర! యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివికేఁగలేక
బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు."

శ్రీకృష్ణదేవరాయఁడు దివంగతుఁడైన పిదపఁ, గటకపురాధీశుఁడగు గజపతి నిర్భయుఁడై విజయనగరముపై దండెత్తిపోయి, తత్పట్టణసమీపమున విడిసెను. దాన, ప్రజలెంతయు భీతిల్లిరి. పెద్దన యదిగాంచి, జంకులేక—

"రాయరావుతుగండ రాచయేనుఁగువచ్చి
యారట్లకోటఁగోరాడునాఁడు
సంపెటనరపాల సార్వభౌముఁడు వచ్చి
సింహాద్రిజయశిలఁ జేర్చునాఁడు

సెలగోలుసింగంబు చేరి ధిక్కృతి గంచు
 తలుపులఁగరుల డీకొలుపునాఁడు
ఘనతరనిర్భర గండపెండెర మిచ్చి
 కూఁతు రాయలకును గూర్చునాఁడు
నోడలెఱుంగవో - చచ్చితో - యుర్విలేవో
చేరఁజాలక తలచెడి జీర్ణమైతో
కన్నడం బెట్లు చొచ్చెదు గజపతీంద్ర
తెఱచినిలు కుక్క చొచ్చిన తెఱఁగుదోఁప.''

అను పద్యమును వ్రాసి, గజపతికడకంప, నాతఁ డద్దానిని జదివికొని, సిగ్గుపడి, నిజదేశమునకు మఱలెనను ప్రతీతి గలదు.

పెద్దనార్యుఁడు క్రీ. శ. 1540 ప్రాంతమునఁ దన భౌతిక దేహమును జాలించి, † నేఁటికిని నాంధ్రవాఙ్మయప్రపంచమున నమరుఁడై యున్నాఁడు.

నంది తిమ్మన్న

అల్లసాని పెద్దనార్యునితో సమముగ రాయల మన్ననకుఁ బాత్రుఁడైనవాఁడు తిమ్మనార్యుఁడు. ఈతఁ డాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌశికగోత్రుఁడు; సింగనకును దిమ్మాంబకును బుత్త్రుఁడు; మలయమారుతకవికి మేనల్లుఁడు; ఇంటిపేరు నందివారు; శివభక్తుఁడు; అఘోరశివగురుని శిష్యుఁడు.

తిమ్మనకవికి 'ముక్కుతిమ్మన' యను వ్యవహారనామము గలదు. ఈతని కీపేరు గలుగుటకుఁగల కారణమును దెలుపు కథ యొకటి వాడుకలోనున్నది. దానినిట సంగ్రహపఱతును.

తిమ్మనార్యుఁ డొకనాఁడు మంగలినిఁ బిలిపించి, వానివలనఁ బనిగొని, యాతని పనితనమునకు మెచ్చి—

'నానాసూనవితాన వాసనల నానందించుసారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకం దపంబంది యో

† 1535 ప్రాంతమునఁ గాలధర్మమునొందియుండునని 'మహమ్మదీయ మహాయుగము' తెలుపుచున్నది. చూ. పుట 124

షా నాసాకృతిఁబూని సర్వసుమన స్సౌరభ్య సంవాసియై
పూనెం ద్రేక్షణమాలికా మధుకరీపుంజంబు లిర్వంకలన్.'

వసు. ద్వి. ఆ. ప. 47

అను పద్యమును వ్రాసి, యా ఘోటికునికొసఁగి, 'ఓరీ! నీ వీ పద్దెమును గొనిపోయి యెవరికేని నొసఁగి, ధనము గొను' మని నుడివి యంపెను. ఆ మంగలియుఁ దిమ్మనార్యునిమాట దలఁదాల్చి, పద్దెమునుగొని రాజవీథినిఁ బోవుచుండ, రామరాజభూషణకవి చంద్రుఁడా పద్యమునుగాంచి, యందలి యర్థగాంభీర్యమునకు మెచ్చి, యయ్యంబష్ఠునకు నాలుగువేల వరహాలిచ్చి దానినిగొని, కాలాంతరమున దానిని దన వసుచరిత్రమునఁ గూర్చెనఁట. *

ఇవి యేటి మాటలు! నవనవవర్ణనావైచిత్ర్యశోభితమైన కావ్యమును సృష్టించిన రామరాజభూషణకవి యింతటి వర్ణనగల పద్యమును రచింపలేకపోవునా? ఒకవేళ నంతటి వర్ణనాబంధురమైన పద్య మాతని జిహ్వాగ్రమునుండి వెడలకపోయినను, సిగ్గుమాలి, వేఱొక్కకవి రచించిన పద్యమును వెలయిచ్చి కొని, తన గ్రంథమున నతికించియుండునా? ఈ విషయము విశ్వసనీయముగాదు. మఱి ముక్కుతిమ్మన యను పేరెట్లు వచ్చెనందురా? బహుశా, అతనికి ముక్కు పొడవై యుండనోపును. ఆ కారణమున బాల్యమాదిగ నాతని కా పేరు సిద్ధించియుండవచ్చును.

తిమ్మకవి రచిత పారిజాతాపహరణమునకు మూలకథ భాగవతమునందలి క్రింది శ్లోకములనుండి కైకొనఁబడినది.

'చోదితో భార్యయోత్పాట్య పారిజాతం గరుత్మతి,
ఆరోప్య సేంద్రాన్ విబుధాన్నిర్జిత్యోపానయత్పురం.
'స్థాపితః సత్యభామాయా గృహోద్యానోపశోభనః,
అన్వగుర్భ్రమరా స్స్వర్గాద్యద్గంధాసవలంపటాః.
'యయౌ చ ఆనమ్య కిరీటకోటిభిః
పాదౌ స్పృశన్నచ్యుత మర్థసాధనం,

* ఈ కథాంశములు స్వ. గురుజాడ శ్రీరామమూర్తిగారి 'కవిజీవితము' లనుండి కైకొనఁబడినవి. పుటలు 184-185

సిద్ధార్థ ఏతేన విగృహ్యతే మహా
నహో సురాణాంచ తమో ధిగార్యతాం''

భాగ. ద. స్కం. అధ్యా. 59

వేదవ్యాసమహాముని మూఁడు శ్లోకములలో రచించిన కథాభాగమును తిమ్మనార్యుఁడు పెంచిపెంచి, 511 పద్యములుగల మైదాశ్వాసముల కావ్యమును రచించెను. ఇతని కల్పనాచాతుర్యమున కిదియే ప్రబలసాక్ష్యము. ఇందు, మూలమునలేని స్వకపోల కల్పితకథలు గొన్ని కలవు.

ఇఁక నీ కావ్యరచనాహేతువును గూర్చి జనులాడుకొను మాటలివి—

''కృష్ణదేవరాయలు ప్రియురాలితోడి ప్రణయకలహముల యందుఁ దనకు భార్యయొనర్చిన యవమతికిఁ గోపించి, విరసుఁడై యుండ, నాతని కోపముఁ దీర్పఁదలఁచి, కావ్యమును రచించుట యను మిషఁ బెట్టికొని నాయికానాయకుల రహస్యభావముల నతనికి వెల్లడింపఁగోరి —

'పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటుగామి మృదుపల్లవ కోమల తత్పదద్వయీ
పాటలకాంతిమౌళిమణి పంక్తికి వన్నియ వెట్ట నా జగ
న్నాటక సూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్.

— పారి. ప్ర. ఆ. ప. 120

'జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరముచ్చో వామపాదంబునం
దొలఁగం ద్రోచె లతాంగి యట్లయగు నాథు ల్నేరముల్సేయఁ జే
రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారము ల్నేర్తురే.

— పారి. ప్ర. ఆ. ప. 121

'ననుభవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁబూని తా
చిన యది నాకు మన్ననయ చెల్వగు నీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్ర కంటకవితానము దాఁకిన నొచ్చునంచు నే
ననియెద నల్కమానవుగదా యిఁకనైన నరాళకుంతలా!'

— పారి. ప్ర. ఆ. ప. 123

అను తేనెలొలుకు తియ్యని ముద్దుపద్దెములనల్లి శ్రీకృష్ణ సత్యభామా శృంగార కేళీవిలాస వర్ణనావ్యాజమునఁ గృష్ణదేవ రాయలకు సూచించెననియు, భావజ్ఞుఁడగు నతఁడు కవిసూచన నెఱింగి, సిగ్గుపడి, 'రహస్యస్థలములఁ బ్రియులు ప్రియురాండ్రచేఁ బ్రధర్షితులగుట రసికజనతాసాధారణ' మని భావించి, యది నుత ప్రియతమయందుఁ దొల్లిటికన్నఁ బ్రేమానుబంధమున మెలంగె ననియు నీ కథను గొందఱు చెప్పుదురు.'' †

కాని, యీ కారణ మంత విశ్వసనీయముగఁ దోఁప లేదు. ఏలయందురా – నవరసభూయిష్ఠమైన కావ్యరత్నమును సృష్టించిన మేటికవీంద్రున కీపాటి శృంగారరసస్వరూపము దెలియకుండునా ? నాయికానాయకుల శృంగారవిలాసరహస్యములఁ దెలిసికొనఁ జాల నంతటి మోటుమానిసి కాఁడు రాయఁడు. అదియునుగాక, యంతః పుర రహస్యము తిమ్మకవి కెట్లు దెలిసియుండునను సంశయము పొడముచున్నది. కాని, యేల తెలిసియుండరాదు? తిమ్మనార్యుఁడు తిరుమలదేవి యరణపుఁ గవి. అది కారణముగ నామె కాతని యందుఁగల స్వాతంత్ర్యముచే నంతఃపురప్రణయకలహామునుగూర్చి తిరుమలదేవి యక్కవికి రహస్యముగ వక్కాణించియుండనోపును. ఈ విషయము సహితము కొంతవఱకు విశ్వసనీయమే.

ఈ రసవత్తర కావ్యము కృష్ణరాయల కంకితము. కవిత్వము మృదుమధురము; సాలంకారము; సంస్కృతాంధ్రపదభూయిష్ఠము. ఈతని కవితాసారళ్యము రామరాజభూషణాది కవిపుంగవులకు సహిత మలవడలేదనుట యతిశయోక్తి కానేరదు. ఈతని కవన నైపుణింగూర్చి రామకృష్ణకవి —

'ముక్కుతిమ్మనార్యు ముద్దుపల్కు'

అని నుడివెను. వేఱొక కవి —

'లోకమునం గల కవులకు
నీ కవనపుఠీవి యబ్బునే కూపనట

† ఈ భాగము ఉత్పల-వేంకటనరసింహాచార్యులవారి పారిజాతాప హరణ ప్రస్తావననుండి కైకొనఁబడినది.

ద్యోకములకు గగనధునీ
శీకరముల చెమ్మ నందిసింగయతిమ్మా!'

అని వక్కాణించెను.

ఇమ్మహాకవి కీర్తిశరీరుఁడై, రసికాగ్రణుల హృదయసౌధముల విహరించుచున్నాఁడు.

అయ్యలరాజు రామభద్రుఁడు

రామభద్రకవి రచించిన రామాభ్యుదయ ప్రబంధములోని క్రింది గద్యమువలన నీతని వంశవృత్తాంతము కొంత తెలియుచున్నది.

'ఇది శ్రీమదొంటిమెట్ట రఘువీరశతక నిర్మాణ కర్మఠ జగదేకఖ్యాతి ధురీణాయ్యలరాజు తిప్పయమనీషి పర్వతాభిధాన పౌత్ర, త్రాక్కయాచార్య పుత్ర, పరిశీలిత సమిద్ధ రామానుజ మతసిద్ధాంతమర్మ ముమ్మిడివరదాచార్య కటాక్షవీక్షాపాత్ర, హృదయపద్మాధిష్ఠిత శ్రీ సుభద్ర రామభద్రకవి ప్రణీతంబైన రామాభ్యుదయ మహాప్రబంధము.'

ఈతఁడు ద్రావిడనియోగిబ్రాహ్మణుఁడు; కడపమండలములోని యొంటిమెట్టనివాసి; అక్కయాచార్యునకుఁ బుత్త్రుఁడు; పర్వతరాజునకుఁ బౌత్త్రుఁడు; కౌండిన్యసగోత్రుఁడు; ఇంటిపే రయ్యలరాజువారు; వైష్ణవమతాభిమాని, ముమ్మిడి వరదాచార్యుల శిష్యుఁడు.

ఇతఁడు నిఱుపేద. పెక్కు బిడ్డల తండ్రి. అది కారణముగ నీతనిని 'పిల్లల రామభద్రుఁ' డని పిలుచుచుండిరి. బీదటికమున సంసారభారమును భరింపఁజాలక, యుదరపోషణముకొఱకు విజయనగరమునకుఁ బోయి, యట రాయల ప్రాపు సంపాదించెను.

ఈతని కవనము మృదుతరమై, కల్పనాచాతుర్యముతో నొప్పుచుండును. ఈ కవి రచించిన గ్రంథములనెల్ల నుత్తమమైనది రామాభ్యుదయము. ఇయ్యది యెనిమిది యాశ్వాసముల గ్రంథము. కృతిపతి గొబ్బూరి నరసరాజు. † రామభద్రుని భక్తికి మెచ్చి

† తిరుమలరాయని మేనల్లుఁడు.

శ్రీరామభద్రుఁడే యష్టముఖగండభేరుండంబై, యెనిమిది గంటంబులఁ బూని యీ గ్రంథమును రచించెనను ప్రతీతి గలదు. *

మచ్చునకొక పద్యము —

'కానక కన్న సంతానంబు గావునఁ
గానక కన్న సంతానమయ్యె
నరయ గోత్రనిధానమై తోఁచుఁ గావున
నరయ గోత్రనిధానమయ్యె నేఁడు
ద్విజకులాదరణ ధరిష్ణుండు గావున
ద్విజకులాదరణ ధరిష్ణుఁడయ్యె
వివిధాగమాంత సంవేద్యుండు గావున
వివిధాగమాంత సంవేద్యుఁడయ్యెఁ
గటకటా దాశరథి సముత్కటకరీంద్ర
కటకలిత దానధారార్ద్రి కటకమార్గ
గామి యెట్లు చరించు నుత్కటకరీంద్ర
కటకలితదాన ధారార్ద్రి కటకతతుల.'

రామా. పం. ఆ. ప. 12

ధూర్జటి

ఈతని కులగోత్రాదులఁ దెలుపఁదగు సాధనములెవ్వియుఁ గానరావు. కాని, ఈతని పౌత్త్రుఁడగు వేంకటార్యకవి (కుమారధూర్జటి) రచించిన కృష్ణరాయవిజయమునందలి క్రింది పద్యము వలన —

'నను భరద్వాజగోత్రుని సదాపస్తంబ
సూత్రుని బాంధవస్తోత్రపాత్రు
పాకనాటార్వేలవంశ ప్రసిద్ధుని
ధూర్జటి పౌత్త్రు బంధురచరిత్రు
సద్గురుకారుణ్య సంప్రాప్త విద్యావి
హారుని శ్రీ కాళహస్తినిలయ
చిత్ప్రసూనాంబికా శ్రీకరానుగ్రహో
సాఽతకవితా రసజ్ఞ హృదయు
సారరచనాధురీణుఁ గుమారధూర్జ
టీప్రధానాగ్రగణ్యుఁ బటీరహీర

* కవిజీవితములు, పుట 145

మహితసత్కీర్తి కాళియామాత్యపుత్త్రు
వేంకటార్యునిఁ బిలిపించి వేడ్కఁ ననియె.'

—కృష్ణ. పీఠిక, ప. 23

ఈతఁడు పాకనాటి యార్వేల నియోగిబ్రాహ్మణుఁడు - భరద్వాజగోత్రుఁడు - ఆపస్తంబసూత్రుఁడు మున్నగు విషయములు తెలినవి. కాఁపురము కాళహస్తి. శివభక్తాగ్రేసరుఁడు.

'స్తుతమతియైన యాంధ్రకవిధూర్జటి పల్కుల కేలకల్గెనో
యతులిత మాధురీమహిమ...'

అని కృష్ణరాయ లడుగఁగా నాతని సభాసదులలో నొకరు—

'హా తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమారవారవనితా జనతాఘనతాపహారిసం
తతమధురాధరోదిత సుధారసధారలు గ్రోలుటంజుమీ'

అని దానిని బూరించెనని పల్కుచు దానిచే నీతఁడు వేశ్యాలోలుఁడై యుండెనని తలంతురు. భక్తివైచిత్ర్యముల వెల్లడించు నీతని కృతియగు కాళహస్తిమాహాత్మ్యమును గాంచినపు డీ మహాకవికిఁ గలిగిన యపయశస్సునకుఁ గారణమేదియో గోచరింపకున్నది. అమ్మహాకావ్యమును నరాంకితము సేయనొల్లక కాళహస్తీశ్వరునకుఁ గృతియొసఁగెను.

శైలి చదువఁజదువఁ జవులూరుచుండును. మచ్చునకు—

'ప్రాణము వోవునో తనువు భంగమునొందునో నాకతూణికా
బాణము జిక్కునందిగిచి భల్లముఖాగ్రము రక్తపద్మదృ
క్కోణముఁ జేర్చి త్రవ్వి యొకగ్రుడ్డు వడిం బెకలించి శోణిత
ద్రోణికయైన దైవతశిరోమణి కంటనమర్చెనంతటన్.'

—కాళ. తృ. ఆ. ప. 115

మాదయగారి మల్లన

ఈతఁడు శైవబ్రాహ్మణుఁడు; కొండవీటి నివాసి.

'చెప్పఁదగుఁ గవితరసముల్
చిప్పిల నప్పప్ప బళిబళీయన; లేదా

యెప్పుడు చెప్పకయుండు పె
యొప్పునుమీ సుకవియెంత యుచితజ్ఞుఁడో కో.'

అని ప్రతిజ్ఞ చేసి, యీ మహాకవి రాజశేఖరచరిత్ర మను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి, తిమ్మరుసుమంత్రికి నల్లుఁడగు నాదెండ్ల యప్పామాత్యునకు నంకితమొనర్చెను. ఇకావ్యము చక్కని లోకోక్తులతోడను, జాతీయపదములతోడను నొప్పుచున్నది.

మచ్చునకొక పద్యము—

'మూసిన ముత్యమవై కడు
వాసియు వన్నెయును గలిగి వఱఁడౌనఁగా
నీ సకలబంధుకోటికిఁ
బూసలలో దారమగుచుఁ బొసఁగి మెలఁగుమీ.'

పింగళి సూరన్న

సూరనార్యుఁడు నియోగిబ్రాహ్మణుఁడు. యాజుషశాఖాధ్యయనపరుఁడు. గౌతమగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. అమరనార్యునకును, అబ్బమ్మకును బుత్త్రుఁడు. తమ్ములు - అమలన, ఎఱ్ఱన.

ప్రభావతీ ప్రద్యుమ్నమునందలి —

'తరముల్ నాల్గయి దెందు నెందునగుఁ ద త్తద్గ్రామనామంబులం
బరఁగుకా వంశము లెల్లఁబూర్వపు నిజప్రఖ్యాతిమాయంగ నే
మరుదో పింగలినామమందుఁ జిరకాలావాసులై యున్న సు
స్థిరతంగోకనమంత్రి వంశజులకుం జెన్నొందు మిన్నందుచున్.'.

పద్యమునుబట్టి యీ వంశమువారికిఁ బింగలి (కృష్ణామండలము) యను గ్రామమున వసించినకారణమునఁ బింగలివారని పేరు వచ్చినట్లు తెలియుచున్నది. కాలక్రమమున నీతఁడు పింగలినివీడి, దక్షిణమునకుఁ బోయి, కందనూలు (కర్నూలు) మండలములోని నంద్యాల, ఆకువీడు మొదలగు సంస్థానముల నాశ్రయించి యుండెను.

ఈతఁడు ద్వ్యర్థికావ్యకర్తలలో మొదటివాఁడు. గరుడపురాణము, గిరిజాకల్యాణము, రాఘవపాండవీయము, కళాపూర్ణోద

యము, ప్రభావతీప్రద్యుమ్నము మొదలగు గ్రంథములను రచించి నట్లు తెలియుచున్నది. కాని, కడపటి మూఁడు గ్రంథములును బ్రసిద్ధిఁగన్నవి.

రాఘవపాండవీయరచనాకౌశల మనన్యసాధారణము. ఇట్టి కథాద్వితయ ఘటనావైచిత్రికి నీ మహాకవియే మొట్టమొదటఁ ద్రోవఁ దొక్కినవాఁడు. ఇందు రామాయణభారతకథలు వర్ణితములు. క్లిష్టార్థములులేక, సులభపదములతో, సులభశైలిని సంపూర్ణశ్లేషగల యిట్టి గ్రంథమును రచించుట యొక యపూర్వసామర్థ్యము. మచ్చునకు—

'వినియతనిందనపై నిడు
కొనియేఁగినియమికిఁ దగని ఘోరా ర్తియొన
ర్చినవాఁడ మీకు దండ్యుఁడ
నని తనుఁదెలుపుచును వారి కప్పనసేసెన్'

— రాఘ. ప్ర. ఆ. ప. 28

'కళాపూర్ణోదయమున విచిత్రమయిన కల్పితకథ కలదు. తెలుఁగులో నిట్టి నూతన కథాచమత్కారమును మఱియేకవియుఁ గల్పించినవాఁడుకాఁడు. కథానకవైచిత్ర్యమునందు దీనిని బాణభట్టకృత కాదంబరితోఁ బోల్పవచ్చును.' ఇందు నన్నయభట్టారకుని పోకడలు గొన్ని కాన్పించుచున్నవి. ఇందుల కుదాహరణము—

'ఆవులు నాకఁ గన్నలమోద్పు పులులును
    బులుల చకా గుడువంగఁ బోవు లేళ్లు
లేళ్ల చెర్లాట రంజిల్లెడు హరులును
    హరులు గోళ్లనుగోఁక నలరుకరులు
కరులకటాళివై ఖరినాడుపాములు
    పాములలాలించు బభ్రుతతులు
బభ్రుతతులప్రక్కఁ బాయని యెలుకలు
    నెలుకలఁ బెంచు పిల్లులునుగలిగి
యపుడు వెలఁగొనరించె నాయంగనలకఁ
గీరభాషితపోషితాఖిలతపస్వి

పటలతారకబ్రహ్మ విభావనంబు
భావితశుభావనంబు తపోవనంబు.'

— కళా. తృ. ఆ. ప. 10

'ప్రభావతీప్రద్యుమ్నము చక్కని స్వభావోక్తులుగలదయి, లలితపదఘటితమై, కథాచమత్కృతిగలిగి, చదువువారికిఁ గర్ణరసాయనముగానుండెడు ప్రౌఢకావ్యము. తిక్కనకుఁ దరువాత నింత ప్రౌఢకావ్యరచనయందు సర్వతోముఖపాండిత్యముగల కవి యితఁడుతప్ప మఱియొకఁడు లేఁడు.'

రామరాజభూషణుఁడు

ఈతఁడు బట్టుకులమునకుఁ జేరినవాఁడు. తొలిపేరు బట్టుమూర్తి. అళియరామరాజు నాస్థానముననున్న కారణమున 'రామరాజభూషణుఁ' డను నామాంతరము గలిగియుండనోపునని పండితులును, చారిత్రకపరిశోధకులును నిర్ణయించిరి. ఈ సిద్ధాంతమును బట్టి చూడ నీతఁడు రాయల యష్టదిగ్గజములలోఁ జేరినవాఁడు కాఁడని స్పష్టమగుచున్నది.

ఈతని జన్మస్థానమును గుఱించి సహితము వాదోపవాదములు జరిగినవి. కొందఱీతని జన్మభూమి బళ్లారిమండలములోని పాలమండలము తాలూకాయందలి బట్టుపల్లెయనిరి. మఱికొందఱు కడపమండలములోని పులివెందల తాలూకాయందలి బట్టుపల్లెయనిరి. వేఱొకకొందఱు కృష్ణామండలములోని మోదుకూరనిరి. పుట్టినచోటెదియని నిర్ణయింపఁదగిన యాధారములు దొరకినవి కావు. కాని, యీతని యింటిపేరు 'ప్రబంధాంకము' వారనియు, ఆపేరీతని పూర్వులకు బిరుదనామమనియు, అయ్యది వారి కవితాగరిమచేఁ గృష్ణదేవరాయలవలనఁ గలిగినదనియుఁ, బ్రబంధాంకము వారికి బళ్లారిమండలములోని బట్టుపల్లె రాయలవలన నీయఁబడెననియుఁ దెలియుచున్నది. ఇదికారణముగ నీతని జన్మభూమి బళ్లారి మండలములోని బట్టుపల్లె యనియే నిర్ణయింపవలసియున్నది.

రామరాజభూషణుఁడు శ్రీరామ ఆంజనేయోపాసకుఁడు,

ఏకదినప్రబంధఘటనాసమర్థుఁడు. సద్యశ్శతగ్రంథకల్పనాశక్తిగల వాఁడు. సంగీతశాస్త్రరహస్యవేది. సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకషుఁడు. చతుర్విధకవితా నిర్వాహకుఁడు. సాహిత్యరసపోష ణుఁడు.

ఈతఁ డెన్నియేని గ్రంథములు రచించియుండవచ్చునుగాని, ప్రకృతము హరిశ్చంద్రనలోపాఖ్యానము, నరసభూపాలీయము, వసుచరిత్ర యను మూఁడు గ్రంథములుమాత్రము చూపట్టుచున్నవి. ఇందు మొదటిది ద్వ్యర్థికావ్యము. హరిశ్చంద్రునియొక్కయు, నలునియొక్కయుఁ గథ లిందు జోడింపఁబడినవి. పింగళి సూరనా ర్యునిపిదప ద్వ్యర్థికావ్యరచనమున కుపక్రమించినవారిలో మొదటి వాఁ డీతఁడే. రెండవది యలంకారశాస్త్రము. మూఁడవది శ్లేష ప్రబంధము. ఇందు నుపరిచరుఁడని ప్రసిద్ధిఁబడసిన వసురాజవర్యుని చరిత్రము వర్ణితము. ఇది భారతమం దాదిపర్వమున సంగ్రహముగాఁ జెప్పఁబడియున్నది. 'ఈ ప్రబంధము రసములకు సముద్రము; కల్ప నలకుఁ గల్పవల్లి; అలంకారములకుఁ బేటిక; శబ్దవైచిత్ర్యమునకు నాటపట్టు; శ్లేషలకు నిధి; ధ్వనులకు జయఘంట.' *

మచ్చునకు —

'తలిరుఁ బ్రాయమువాని వలరాజు నలరాజు
నలరాజుఁ దెగడు సోయగమువానిఁ
బసిఁడిచాయలవానిఁ బగడంబు జగడంబు
జగడంబుగలమోవి సొగసువానిఁ
దళుకుఁజెక్కులవానిఁ దులకింపు పలుకెంపు
పలుకెంపు లొలయు నవ్వొలుకువానిఁ
జికిలిచూపులవాని సిరిమించుదొరయించు
దొరయించు కాంచనాంబరమువాని

నొంటుపుగలవాని మకుటకేయూరహార
కటకకుండలచాకచక్యములవాని

* కొంతి భద్రాద్రిరామశాస్త్రిగారు వ్రాసిన పీఠిక.

నమ్మహీజానిఁగని లేచి యమితవినయ
సంభ్రమముదోఁపనిలిచి రజ్ఞాతముఖులు.'

— వసు. తృ. ఆ. ప. 46.

తెనాలి రామలింగకవి

ఈతఁడు యాజ్ఞవల్క్యశాఖాబ్రాహ్మణుఁడు. కౌండిన్యస గోత్రుఁడు. తండ్రి రామయ్య; తల్లి లక్ష్మమ్మ. వైష్ణవమతప్రవిష్టుఁడు.*

జన్మస్థానము కృష్ణామండలములోని గార్లపాడు. ఆకారణమున నింటిపేరు గార్లపాటివారు. కాని, కొందఱు 'ఈశ్వర ప్రెగ్గడ' వారనియు నందురు. బాల్యముననే తండ్రి చనిపోవుటచే నీతఁడు మాతులునిగ్రామమగు తెనాలికిఁ గొంపోఁబడి, యటఁ బెరిఁగెను. నాఁటినుండియు నీతఁడు 'తెనాలి రామలింగ' మని వ్యవహరింపఁబడెను.

ఈతనిఁ గూర్చిన హాస్యరసప్రధానములైన కథలెన్నియేనిఁ గలవు. కాని, యవి యెంతవఱకు సత్యములో చెప్పఁజాలను.

రామలింగకవి పదగుంభనకవిత్వమునకు మిగులఁ బ్రసిద్ధుఁడు. ఈతని కృతియగు పాండురంగమాహాత్మ్యమే యిందులకుఁ బ్రబలసాక్ష్యము.

మచ్చునకు —

'సంపాతరంగ రింఖణ
ఝంపా సంపాత్యమానజలకణరేఖా
సంపాత శీతలానిల
సంపదవొదలించెఁ బరమశైవోత్తంసున్.'

— పాండు. ప్ర. ఆ. ప. 128

అష్టదిగ్గజములని ప్రసిద్ధినొందిన కవులేకాక, రాయల యాస్థానమున సంస్కృతాంధ్రకర్ణాటక కవులు కొందఱుండిరి. బొడ్డుచెర్ల చినతిమ్మనకవి 'కవిదిగ్దంతి' యను బిరుదువహించి, రాయలతోఁ జదరంగమాడుచుండెనఁట. చింతలపూడి యెల్లయకవి సమస్యా

* గద్యము (పాండు.) 'ఇది శ్రీమత్పరమ పరమపదనాథ'

పూరణమున నద్వితీయుఁడు. ఆతఁడు 'రాధామాధవ' మను గ్రంథమును రచించి, రాయలవలన 'రాధామాధవుఁ' డను బిరుదు నందెను. భానుకవి 'పంచతంత్రము' నాంధ్రీకరించెను. ఈశ్వరదీక్షితుఁడు సంస్కృతమున నఖండప్రజ్ఞ గలవాఁడు. ఈతఁడు రామాయణ వ్యాఖ్యలు, బృహద్వివరణము, లఘువివరణము మొదలగువానిని రచించెను. తిమ్మణార్యకవి కర్ణాటకభాషయందు భారతమును రచించి, రాయలకుఁ గృతియొసఁగెను. లక్ష్మీనారాయణుఁడు సంగీత విద్వాంసుఁడు.

దక్షిణదిగ్విజయయాత్ర : 1512

కృష్ణదేవరాయలు సింహాసనాసీనుఁడైన పిదపఁ దన యన్నయుఁ, దండ్రియు సాధింపక విడిచిన కార్యములను సాధింపఁ దలపెట్టెననియు, నందులకు సైన్యమును బలపఱుపఁదొడఁగె ననియు నింతకుముందే వ్రాసియుంటిని. సైన్యమభివృద్ధియొనర్చుటకుఁ గృష్ణరాయలకు రెండువత్సరముల కాలము పట్టెను. దండయాత్రా పరికరములన్నియు సిద్ధమైనపిదప, రాయలదృష్టి దక్షిణాపథముపైఁ బ్రసరించెను. క్రీ. శ. 1512-వ వత్సరమున యుద్ధయాత్రకుఁ బయన మయ్యెను.

కావేరీతీరమున శివసముద్రమను పట్టణము గలదు. దాని చుట్టును బలమైనకోట గలదు. తత్పరిపాలకులు విజయనగరరాజులకు సామంతులుగానుండిరి. కాని, వీరనరసింహరాయలకాలమున దానిని బాలించుచున్న గంగరాజు స్వతంత్రుఁడై, విజయనగర రాజులకుఁ గప్పముఁ గట్టమానివైచెను. అదికారణముగఁ, గృష్ణ దేవరాయలా వీటిపై జైత్రయాత్రసాగించెను. ఆ కాలమున శ్రీరంగపట్టణమును జిక్కరాయలు పాలించుచుండెను. ఆతనికిని గంగరాజునకును బ్రబలవిరోధము. రాయలావిషయమును గుర్తించి, చిక్కరాయలను దనతోఁ జేర్చుకొని, కొండత్రోవలఁ బోయి, శివసముద్రపుఁ గోటను ముట్టడించి, దానిని స్వాధీనపఱచు

కొనెను. * గంగరాజు తనకుఁ గలిగిన యవమానమును భరింపఁ జాలక, కావేరీ పూరతోయముల లీనమయిపోయెను. రాయలామీఁద నుమ్మత్తూరును జయించి శ్రీరంగపట్టణాధీశ్వరుఁడగు చిక్కరాయని సహితము తనకుఁ గప్పము గట్టునట్లు చేసికొనెను. పిమ్మట మహిసూరు దేశమును, గర్ణాటకమును వశపఱచుకొని వానికన్నిటికిని శ్రీరంగపట్టణమును రాజధానిగ నొనర్చి, విజయధ్వజము నాటించి, చిక్కరాయనిఁ దనకుఁ బ్రతినిధిగా నిలిపెను.

ఆ ప్రదేశములకు సమీపముననున్న పాళెములను జయించి, 'కాంబగౌడఁడు', 'వీరగౌడఁడు' అనువారల వశమున వాని నుంచెను.

తరువాత, నాతని బాహువులఁ గొడగు, మళయాళ దేశముల పైకిఁ జాఁచెను. సులభోపాయమున వానిని జయించి, వారీయవలసిన కప్పములను నిర్ణయించి, పాండ్యాది దక్షిణదేశముల జయించుకొఱకు విజయప్పనాయకుఁడు, వెంకటప్పనాయకుఁడు ననువారల నంపెను. విజయప్పనాయకుఁడు చిత్తూరు, తొండమండలము, జింజి, చోళమండలము, తంజావూరు, తిరుచినాపల్లి, మధుర, తిరునగరు మొదలగు ప్రాంతములను జయించి, తాను జింజిలో నివాసమేర్పఱచుకొని, కప్పములు మొదలగువానిని వసూలుచేయుచుండెను. ఇవ్విధమునఁ బూర్వకర్ణాట ద్రవిడదేశమంతయు రాయలవశమయ్యెను. ఆ ప్రాంతములనుండి యేఁడాదికి మూఁడుకోట్ల రూకలు వచ్చుచుండెను.

కృష్ణదేవరాయలు దక్షిణదేశమంతటిని మూఁడుభాగములుగ విభజించి, యా భాగములను బాలింప ముప్వురు నాయకులను నియమించెను. జింజిలోనుండు కృష్ణప్పనాయకుఁడు నెల్లూరు మొదలు కొల్లడమునదివఱకును, తంజావూరిలోనుండు విజయరాఘవనాయకుఁడు కావేరీతీరస్థప్రదేశములను, వెంకటప్పనాయకుఁడు

* Epigraphical Collections, 180 of 1913

కొడగు, మళయాళ దేశములను బాలించునట్లు చేసి, రాయలు విద్యానగరమునకు విచ్చేసెను.

ఇవ్విధమునఁ గర్ణాట ద్రావిడ మళయాళ దేశము లాంధ్రుల స్వాధీనములయ్యెను.

పూర్వదిగ్విజయయాత్ర: 1513

తిమ్మరుసుమంత్రి పూర్వదిగ్విజయయాత్రాసమారంభుఁడై, రాయలచే ననుజ్ఞాతుఁడై, సైన్యమును నేఁడుభాగములుగ విభజించి, యొక్కొకభాగమునకు ముప్పదివేల కాల్బలమును, నాలుగువేల గుఱ్ఱపుదళమును, ఇన్నూఱేనుఁగులును నుండునట్లు నియమించెను. 'ఈ యేఁడుభాగములకును కందనోలు పురాధీశ్వరుండైన ఆర్వీటి [1] శ్రీరంగరాజు, నంద్యాల పురాధీశ్వరుండైన ఆర్వీటి [2] నారపరాజు, ఆకువీడు దుర్గాధ్యక్షుఁడైన [3] యిమ్మరాజు, రాయసము తిమ్మరుసుమంత్రి కుమారుఁడైన కొండమరాజు (కొండమరుసు), గండికోటదుర్గాధ్యక్షుఁడైన పెమ్మసాని రామలింగన్ననాయఁడు, వెలుగోటిదుర్గాధ్యక్షుఁడైన రేచెర్ల కుమారతిమ్మానాయఁడు, రూపనారాయణ బిరుదాంచితుఁడగు గంగాధరరెడ్డి యను నేడ్వురకు నాధిపత్య మొసంగి, ముఖ్యసేనాధిపతులనుగఁ జేసెను.' * సోదరుఁడగు గోవిందరాజును నగరాధ్యక్షునిగ నియమించి, నగరరక్షణార్థ మాతనికడ లక్షసైన్యముంచి, దానికిఁ దోడుగ మూఁడులక్షల సైన్యమును మూలబలముగ నిలిపెను.

(i) ఉదయగిరి ముట్టడి: 1513

ప్రధానామాత్యుఁడగు తిమ్మరుసుగావించిన యేర్పాటులకు రాయ లెంతయు హృష్టుఁడై, యాతనితో క్రీ. శ. 1513–వ వత్సరమున నుదయగిరిపైకి దండువెడలెను.

ఉదయగిరి నెల్లూరుమండలమునకుఁ జేరినది. అది మొదట విజయనగరరాజులకుఁ జేరియుండి, కాలక్రమమునఁ గటకపురాధీశు

1, 2, 3. నరపతివంశీయులైన రాజులు
* తిమ్మరుసుమంత్రి, స. ప్ర. పుట 99

లైన గజపతులకు సంక్రమించెను.[1] మనకథ జరుగు కాలమునఁ బ్రతాపరుద్రగజపతి కటకపురి మొదలు నెల్లూరుమండలమువఱకును గల తెలుఁగు దేశమును బాలించుచుండెను. పూర్వము తమకుఁ జేరిన యుదయగిరిని మరలఁ గైవసము చేసికొనుటకే రాయలు దండె త్తిపోయెను. అయ్యది శత్రువుల కభేద్యమైన దుర్గము. దాని నెల్లవేళలఁ బదివేల కాల్బలమును, నాలుగువందల గుఱ్ఱపుదళ మును సంరక్షించుచుండును. రాయ లాదుర్గమును సమీపించి, పదు నెనిమిది నెలలవఱకును గోటను ముట్టడించి, సైన్యాధ్యక్షుఁడైన రాయసము కొండమరుసయ్య సాయమునఁ జివరకు దానిని వశ పఱచుకొనెను. వశపఱచుకొనిన పిమ్మట, నా దుర్గాధ్యక్షుని పిన తండ్రియగు ప్రహరేశ్వరపాత్రుని[2] జెఱపట్టి, విజయనగరమునకుఁ గొనిపోయెను. మఱియు, రాయలు దుర్గాధ్యక్షుని మేనత్తను సహి తము చెఱపట్టి, విజయనగరమునకుఁ గొనిపోయెనని న్యూని జ్ వ్రాసియున్నాఁడు.[3]

విజయానంతరము రాయ లుదయగిరిరాజ్యమునకుఁ 'గొండ మరుసయ్యాదండనాథుని నేకధురంధరధారేయునిగా (Governor) నియమించెను.'

(ii) కొండవీడు ముట్టడి: 1515

ఉదయగిరి హస్తగతమైన పిదప, రాయలు తన దృష్టినిఁ గొండవీటిపైఁ బఱపెను. కొండవీటిదుర్గము మిక్కిలి బలిష్ఠమైనది. దక్షిణహిందూదేశమునఁ బేరుగన్న పర్వతదుర్గములలో నిది యొకటి. కాకతీయసామ్రాజ్యము విచ్ఛిన్నమైనపిదప, రెడ్డిరాజులు స్వతం త్రులై, యీ దుర్గమును గట్టుకొని పాలించుచుండిరి. ఈ దుర్గము క్రీ. శ. 1454-వ వత్సరమునఁ గటకరాజుల హస్తగతమయ్యెను.

1. Barbosa in A. D. 1514 mentions this expedition
2. 'తద్దుర్గాధ్యక్షుఁడైన తిరుమలకాంతరాయని చెఱగొనె' నని చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసియున్నారు. చూ. తిమ్మ. పుట 103
3. Forgotten Empire, Page 131

మనకథ జరుగుకాలమున నుత్కలదేశాధీశుఁడగు ప్రతాపరుద్రగజపతికుమారుఁడు వీరభద్రగజపతి యీ దుర్గమును బాలించుచుండెను. ఈతనికిఁ దోడుగ, 'కుమారహంవీరపాత్రుని కుమారుఁడు నరహరిదేవుఁడు, శ్రీనాథరాజు రామరాజుకుమారుఁడు లక్ష్మీపతి రాజు, జన్యామలకసవాపాత్రుఁడు, సుప్రపాలచంద్రమహాపాత్రుఁడు, పూసపాటి రాచరాజు, రాచూరి యల్లాఖానుఁడు, ఉద్దండఖానుఁడు మొదలగు నుద్దండసేనాను లనేకులు సేనాసమేతులై కొండవీటి సీమను రక్షించుచుండిరి.[1]

కృష్ణదేవరాయ లుదయగిరినిఁ గబళించి, కొండవీటిని నంజుకొనఁ గూలంకషప్రజ్ఞావంతుఁడగు తిమ్మరుసును వెంటఁబెట్టుకొని యేఁగుచున్నాఁడను వార్త వినఁగానే, కటకాధీశ్వరుఁడగు ప్రతాపరుద్రదేవుఁ డఖండ బలసమన్వితుఁడై తరలి, రాయల నెదుర్కొనఁ గృష్ణానది కుత్తరపు టొడ్డునఁ జేరెను. ఆ నదికి దక్షిణభాగమున రాయలసైన్యములు విడిసి, యుద్ధమునకు వేచియుండెను. ఎంతకాలమునకును గజపతి యేటిని దాఁటిరానందున, రాయలు ససైన్యుఁడై తరంగిణి నుత్తరించి, యుత్కలాధీశునితోఁ బోరి, యాతనిఁ బాఱఁదోలి, యేనుఁగులు మున్నగువానిని గొల్లగొనెను.

అంత రాయలును, దిమ్మరుసును గొండవీటిదుర్గమును ముట్టడించి, మాసద్వయము పోరి, తుదకు వశపఱచుకొనిరి. శా. శ. 1437 లో ఆషాఢశుక్ల ఏకాదశి శనివారము (23-వ జూన్, 1515) నాఁ డీ దుర్గమును నమాత్యశేఖరుఁడగు తిమ్మరుసు జయించిన ట్లీదుర్గముమీఁద నొక శాసనము గలదు. దుర్గాధిపతి యగు వీరభద్రగజపతిని రాయలు చెఱపట్టి, విడిపించి, మైసూరు జిల్లాలోని చిట్టలదుర్గప్రాంతములకుఁ బరిపాలకునిగఁ జేసినట్లు శాసనాధారమువలనఁ దెలియుచున్నది.[2] తిమ్మరుసుమంత్రి తన మేనల్లుఁడగు నాదిండ్ల గోపనమంత్రిని దుర్గపాలకునిగా నియమించిన

1. మహమ్మదీయమహాయుగము, పుట 408

2. Epigraphia Indica, Vol. VI, Pages 117-233

ట్లుందలి యొక శాసనమువలన స్పష్టమగుచున్నది. కాని, తిమ్మరుసు తన సోదరునే దుర్గపాలకునిగా నియమించినట్లు న్యూనిజ్ వ్రాసియున్నాఁడు.[1] కృష్ణదేవరాయ లీ సమయముననే బెల్లముకొండ, నాగార్జునకొండ, అద్దంకి, అమ్మనబ్రోలు, తంగేడు, కేతవరము మున్నగుదుర్గములను సహితము వశపఱచుకొనెను.

కృష్ణదేవరాయ లామీఁదఁ గొండపల్లిదుర్గమునకుఁ బోయి, దానిని రెండునెలలకాలము ముట్టడించి, స్వాధీనపఱచుకొని, కటకేశ్వరుని భార్యను, బుత్త్రిని, నేడ్గురు సేనాధిపతులను జెఱపట్టి, విజయనగరమునకుఁ బంపెను. అటనుండి కదలిపోయి, కృష్ణాగోదావరీ నదుల నడుమనుండు వేఁగిదేశముపై దండెత్తి, జమ్మిలోయ, కోనసీమ, కొఱాము మొదలగు మన్యసీమలను జయించి, రాజమహేంద్రవరదుర్గమును లోఁబఱచుకొనెను. పిమ్మట బాహుబలేంద్ర వంశస్థులకు రాజధానియగు పొట్నూరికడ జయస్తంభమునాటి, మాడుగులు, వడ్డాది మున్నగువానిని వశపఱచుకొని, సింహాచలమునకేఁగి, నృసింహస్వామివారికిఁ బెక్కు దానములు చేసినట్టు లాకశాసనమువలన విశదమగుచున్నది. తరువాతఁ గటకమునకుఁ జని, గజపతిని జయించి, యా రాజ్యములోని కొన్ని గ్రామములను సింహాచలస్వామివారికి దానముచేసినట్లు కృష్ణరాయని రెండవ సింహాచల శాసనమువలనఁ దెలియుచున్నది.[2]

ఇట్లు రాయలు పూర్వదిగ్విజయయాత్రను సమాప్తినొందించి, విజయధ్వానములు మిన్నుముట్ట నిజరాజధానికి 1515-వ వత్సరమునఁ జేరినట్లు 'మహమ్మదీయమహాయుగము' ను,[3] 1520-వ సంవత్సరప్రాంతమునఁ జేరినట్లు 'జీర్ణవిజయనగరచరిత్రము'ను[4] నుడువుచున్నవి. కాని స్యూయల్ చరిత్రకారుఁడు 1516

1. Forgotten Empire, Page 131
2. Epigraphical Report of 1899, Nos. 244 & 255
3. మహమ్మదీయమహాయుగము, పుట 410
4. జీర్ణవిజయనగరచరిత్రము, పుట 147

మొదలు 1520 వఱకు విజయనగరమున గమనింపఁదగిన యంశము లెవ్వియుఁ గానరావని హిందువుల వ్రాఁతలననుసరించి వ్రాసెను. [1] ఇట్టి యాధారములను బట్టిచూడ, రాయలు, పూర్వదిగ్విజయయాత్రానంతరము 1515-వ వత్సరముననే విజయనగరమునకుఁ బోయి యుండవలయునని తోఁచుచున్నది.

రాయలు నిజపురమునకు వచ్చినతరువాతఁ గొంతకాలమునకుఁ జెఱలోనున్న యుత్కలాధీశుని పుత్త్రుని ఖడ్గకౌశలముఁ జూడ నాతని రప్పించి, విద్యానైపుణిఁ జూపు మన నాతఁడా పరాభవమును భరింపఁజాలక, చేతనున్న ఖడ్గమునఁ బొడుచుకొని యసువులఁ బాసెను. ఈ ఘోరకార్యము జరిగినపిదప, రాయలకును గజపతికిని సంధి కుదిరెను. అందుకుఁ బ్రతిఫలముగ గజపతి తన కూఁతును రాయలకొసఁగి వివాహము గావించెను. [2] కృష్ణరాయ

1. Forgotten Empire, Page 135

2 గజపతికూఁతును రాయలు వివాహమాడలేదని కొందఱి యభిప్రాయము. కాని, క్రింది యాధారములను బట్టిచూడ గజపతి కూఁతును రాయలు వివాహమాడినట్లు స్పష్టమగుచున్నది.

1. 'ఘన తరనిర్ఝర గండపెండెరమిచ్చి
కూఁతు రాయల కొనగూర్చినాఁడు'
— అల్లసాని పెద్దన

2. (i) 'నీరుణమెందుఁ దీర్చుకొన నేర మదీయకుమారిఁ జారుశృం
గారమణిన్ గుణోన్మణిని గైకొను మిచ్చితి నీకుఁ గీరతు
ఖ్కారసమానరూప హిమకైరవబంధు యశఃకలాప ల
క్ష్మీరమణా ప్రతాపనరసింహకుమార కుమారవిక్రమా.'
— కృష్ణరా. చ. ఆ. ప. 12

(ii) 'మధుపర్కమొసఁగి కలశాం
బుధి హరికిన్ లక్ష్మినొసఁగు పోలికె గజరా
డ్విభుఁడు సుత దారవోసెం
బ్రథితోన్నతిమీఱఁ గృష్ణరాయలకెలమిన్'
— కృష్ణరా. చ. ఆ. ప. 122

3. విశ్వనాథనాయకుని స్థానాపతి 1535 ప్రాంతమున వ్రాసిన రాయవాచకమునందు —

లును కృష్ణానది కుత్తరమునఁ క్రొత్తగా సంపాదించిన రాజ్యభాగ మంతయు గజపతికిచ్చెను.

(iii) రాయచూరి ముట్టడి : 1520

రాయచూరు కృష్ణా, తుంగభద్రానదులకు నడుమఁగలదు. దీనినే 'రాచూరు' అనియు వ్యవహరింతురు.

నరసరాజు ఆదిల్ఖాను విరోధియైన కాసింబరీదునకు సాయపడి, ముద్గల్లు, రాయచూరుదుర్గములను స్వాధీనపఱచుకొనెను. కాని, నరసరాజు శత్రువుల నడఁచ దక్షిణాపథమున కరిగినప్పు డాదిల్ఖా మరల వానిని గైకొనెను. ఈ విషయములన్నియు నరసరాజు చరిత్రమున విపులముగ వ్రాయఁబడియున్నవి.

అన్నయుఁ, దండ్రియు సాధింపకవిడిచిన కార్యములను జక్కపెట్టుటయే రాయల యాశయము. దీనికిఁ దోడుగ సాళ్వనరసింహరాజు విజయనగర రాజులు బలాఢ్యములైన దుర్గములను స్వాధీనపఱచు

'గజపతివారు రాయలదేవునితోను సమయోచితముగా పలుకరించి తమ కొమార్తె అయిన జగన్మోహినీ అనే కన్యకను దారపోసి ఆవల మరిన్ని అల్లునికిన్ని ఆడుబిడ్డకున్ను యియ్యతగిన బహుమానోచిత క్రమభూషణాలన్నిన్ని అంపించి మరిన్ని తనకొమార్తెకు పట్టుపరిమళ పసుపులకని కృష్ణవేణికి దక్షిణపుదిక్కు నడిచే రాజ్యాలున్ను కోట కొత్తళములున్ను దుర్గాలున్ను ఇచ్చి అంపగా, రాయలవారు...' అని వ్రాయఁబడియున్నది.

4. ఉత్కలభాషలో—

'ప్రతాపరుద్రుఁడు కృష్ణరాయలతో సంధిచేసుకొన్నాఁడు. ఈ సంధిప్రకారం కృష్ణానదికి దక్షిణదిక్కున ఉండే రాజ్యాలపై ఉత్కలగజపతుల ప్రభుత్వం అంతరించింది. కృష్ణరాయలు ప్రతాపరుద్రుని కన్య పాణిగ్రహణం చేసాడు.'

చూ. కృపాసింధు మిశ్ర. ఎమ్. ఏ. గారి ఉత్కల ఇతిహాసము (ఒరియా), పుట 141

(ఈ విషయములన్నియు పురిపండా అప్పలస్వామిగారి 'గజపతికూఁతును రాయలు వివాహమాడలేదా' అను వ్యాసమునుండి యుద్ధృతములు.

— ఆం. ప. 13-3-1940.)

కొనవలెనని మరణశాసనమున వ్రాసియుంచినట్లు తెలియుచున్నది.[1] ఈ కారణములను పురస్కరించుకొని రాయలు యుద్ధమునకుఁ బ్రయత్నింపఁ దలఁచెను. కాని, కొంతకాలమునుండియు రాయలును, ఆదిల్షాయు నైకమత్యభావమున మెలఁగుచుండిరి. నిష్కారణముగ మిత్రునిపై దాడివెడలుట క్షత్రియధర్మముగాదని తలఁచి, రాయ లట్టి యవకాశమునకు నెదురుచూచుచుండెను.

ఇట్లు చూడఁ జూడ, రాయలకొక చక్కని రాచబాట యగపడెను. సయ్యద్ మర్కార్ అను తురుష్కుఁడొకఁడు గుఱ్ఱములు తెచ్చియిచ్చెదనని నుడివి, రాయలయొద్ద ధనముఁ గొని పోయి, విజాపురమునఁ దలదాఁచుకొనెను. రాయ లా విషయమును దెలిసికొని, యా తురుష్కుఁడొనర్చిన మోసకృత్యమును దెలిపి, యాతనిఁ దనకు స్వాధీనపఱుపవలసినదని ఆదిల్షాను గోరెను. కాని, విజాపురాధీశుఁడు స్వకులాభిమానియై, స్వధర్మమును బాటింపక, యా మహమ్మదీయుని నెటకో పంపివైచి, తన రాజ్యమున లేఁడని రాయలకు వర్తమాన మంపెను. తనకు హితుఁడైనవాఁడు సాయపడకపోయెఁగదాయని రాయలు తలఁచి, యదియే కారణముగఁగొని, యాదిల్షాపై దండెత్తిపోవ నిశ్చయించెను.

కృష్ణదేవరాయ లీయుద్ధముకొఱకుఁ గావించిన ప్రయత్నములు వర్ణనాతీతములు. ఇవియన్నియు నీ యుద్ధమును గన్నులారఁ గాంచి వ్రాసిన పోర్చుగీజుచరిత్రకారుఁడగు న్యూనిజ్ (Nuniz) వ్రాఁతల వలనఁ దెలియుచున్నవి.[2]

రాయలు సామంతరాజులకెల్ల వర్తమాన మంపి, యపార సైన్యముల రావించి, 1520 సంవత్సరపు వేసవిదినములలో దండయాత్రకు బయలుదేఱెను. రాయలవెంటఁ జనిన దండనాయకులఁ గూర్చియు, వారివెంటఁ జనిన సైన్యములను గూర్చియు న్యూనిజ్ ఇట్లు వర్ణించియున్నాఁడు. —

1. మహమ్మదీయ మహాయుగము, పుట 411
2. Chronicle of Fernao Nuniz-Chapters VII to XI

'విలుకాండ్రును, కత్తులుదూసికొనియున్న వారును, తుపాకులు చేతఁబట్టిన సిపాయీలును, ఈఁటెలఁ గైకొన్న వారును గలిసి ముప్పది వేల కాల్బలమును, వేయి తురంగములును, పదునా ఱేనుంగులును గల సేనతో సేనారక్షకులలో ముఖ్యుఁడగు కామానాయకుఁడు ముందు నడచుచుండెను. అతని వెనుక త్ర్యంబకరా (Trimbicara) వనునతఁ డేఁబది వేల కాల్బలమును, రెండువేల తేజులును, ఇరువ దేనుంగులును గల సేనతోఁ బోవుచుండెను. తిమ్మప్ప నాయకుఁ (Timapanayque) డనువాఁ డిరువది వేల కాల్బలమును, మూఁడువేల యైదువందల గుఱ్ఱములును, ముప్ప దేనుంగులును గల సైన్యముతో త్ర్యంబకరావును వెంబడించిపోవుచుండెను. అతనితరువాత ఆదెప్పనాయకుఁ (Adapanayque) డనువాఁడు లక్ష కాల్బలమును, అయిదువేల గుఱ్ఱములును, ఏఁబ దేనుంగులును గల సైన్యముతోఁ బోవుచుండెను. అతని వెనుక లక్షయు నిరువది వేల కాల్బలమును, ఆఱువేల తురంగములును, అఱువ దేనుఁగులును గల సైన్యముతోఁ గొండమరెడ్డి (Comd mara) పోవుచుండెను. ఎనుబది వేల కాల్బలమును, రెండువేల యేఁబది గుఱ్ఱములును, నలువ దేనుంగులును గల సైన్యముతో నతని కుమారుఁ డాతని వెంబడించి పోవుచుండెను. విజయనగరపురపాలకుఁడుగా నియమింపఁబడిన సాళువ గోవిందరాజు (Ogemdraho) ముప్పది వేల కాల్బలమును, వేయి తేజులును, పది యేనుఁగులును గల సైన్యముగలిగి వారల వెనుకనుబోవుచుండెను. అతని వెనుక రాయలకుఁ దములం బందిచ్చు మధురనాయకుఁ డొకఁడు పదునైదువేల కాల్బలమును, రెండువందల గుఱ్ఱములును గల సేనతోఁ బోవుచుండెను. కృష్ణరాయలకుఁ గూఁతునిచ్చినవాఁడును, మయిసూరుమండలాధిపతియునగు కుమార వీరయ్య (Comarherca)-కుమారవీరశ్యామరాయలు - ఎనిమిదివేల కాల్బలమును, నాలుగువందల గుఱ్ఱములును, ఇరువ దేనుంగులును గల సైన్యముతో నాతని వెనుకఁ బోవుచుండెను. తరువాత వెంగాపురదుర్గాధ్యక్షుఁడును, నరపతివంశములోని యుత్తమక్షత్రియులు

మొదలగువారు బహుసేనలతోఁ బోవుచుండిరి. రాయలు ప్రేమించు మూవురు ఖోజ్జాలు నలువదివేల కాల్బలమును, వేయి తురంగములును, పదునై దేనుంగులునుగల సైన్యమును దీసికొని సాళ్వగోవిందరాజు సైన్యమును వెన్నంటిపోవుచుండిరి. నలువదివేల కాల్బలమును, ఆఱువేల తురంగములను, మూఁడువందల యేనుంగులను తనకు రక్షకసైన్యముగానుంచుకొని శ్రీకృష్ణదేవరాయలు పైనుదాహరించిన సేనలకన్నిటికిని నాయకుఁడై నడపించుకొని రాచూరుదుర్గమువైపునకుఁ బోవుచుండెను.[1]

[2] అపారబలసమన్వితులై దండనాథులు వెంటరా, రాయలు కతిపయప్రయాణముల రాయచూరుదుర్గమును సమీపించి, ముట్టడించెను. కోటలో నత్యల్పసంఖ్యాకులగు సైనికులుండిరి. వారు రాయలధాటికి భయపడి, దుర్గద్వారములను బంధించి, బురుజులపై నిలిచి పోర సిద్ధముగనుండిరి.

కృష్ణదేవరాయలు రాయచూరును ముట్టడింప నపారబలముతో వచ్చెననువార్త విని, యాదిల్షా ససైన్యుఁడై వచ్చి, కృష్ణానదికి నుత్తరపుటొరను విడిసెను. రాయలసైన్యము దక్షిణభాగమున నిలిచి యుద్ధమునకు సిద్ధపడియుండెను. కొలఁదికాలమునకు నవాబు తనసైన్యమును దీసికొని కృష్ణానదిని దాఁటి, రాయలసైన్యమునకుఁ దొమ్మిదిమైళ్లదూరమున నిలిచెను. అంత నిరువాఁగులును యుద్ధమున కుపక్రమించి, పిఱుతివియని పరాక్రమమునఁ బోరినవి. తుదకుఁ దురుష్కసేన కపజయము గలిగెను; రాయలసేన జయలక్ష్మిని వరించెను. ఆదిల్షా తనకుఁ గలిగిన పరాభవమునకు వగచి, చేయునదిలేక, యొక యేనుఁగునెక్కి కృష్ణానదిని దాఁటి పాఱిపో

1. మహామ్మదీయమహాయుగము, పుటలు 413-414

సూచిక—ఇందు ఆంగ్లమున వ్రాయఁబడిన నామములన్నియు 'విస్మృత సామ్రాజ్యము' నుండి గైకొనఁబడినవి.

2. Nuniz states-703,000 foot, 32,600 horse, and 551 elephants
'Forgotten Empire'

యెను. సుల్తానుని ముఖ్యసేనానాయకుని రాయలు చెఱపట్టెను. పరాభూతులైన యోధులెందఱో కృష్ణవేణీమతల్లికిఁ బ్రాణములర్పించిరి. ఈ యుద్ధమున రాయల కసంఖ్యాకధనమును, తురగములును, గజములును లభించినవి. ఈ ఘోరసంగ్రామము 1520-వ సంవత్సరము మేనెల 19-వ తేది శనివారమునాఁడు జరిగినట్లు కొన్ని యాధారములను బట్టి స్యూయల్ నిర్ణయించెను. [1]

ఆదిల్షా పాఱిపోయినపిదప, రాయలు మరల రాయచూరును ముట్టడించెను. కోటలోనివారెంతయు ధైర్యముతో నిరువది దినములవఱకుఁ బోరిరి. రాయలసైన్యమును నత్యుత్సాహమునఁ బోరఁదొడఁగెను. రాయలకడనున్న పోర్చుగీసుసైనికుల నాయకుఁడైన క్రిస్తోవిడి ఫిగరీడో (Christovao de Figueiredo) తన యద్వితీయపరాక్రమమును బ్రకటించి, కోటను స్వాధీనపఱచుకొనుటలో రాయలకెంతయు సాయపడెను. గత్యంతరములేక, దుర్గవాసులు కోటతలుపులు దెఱచి, రాయలకు వశులైరి. జయజయధ్వానములు మిన్నుముట్ట, రాయలు పురప్రవేశ మొనర్చి, యందలివారిని దయతో రక్షించెను. రాయల దయారసమునుగూర్చి శత్రువులుసయితము కొనియాడిరి.

ఆమీఁదఁ గృష్ణదేవరాయలు రాయచూరును రక్షింపఁదగినసైన్యము నట నిలిపి, విజయలక్ష్మినిఁ జేకొని, విజయనగరమున కరిగి, విజయోత్సవముఁ గావించి, దండనాయకుల బహూకరించెను.

కృష్ణదేవరాయ లాదిల్షా నోడించి, రాయచూరుకోటను స్వాధీనపఱచుకొనెనను వార్త దేశమంతటను దావానలమువలె వ్యాపించెను. దాన రాజులందఱు భయపడిరి. ఎట్టులేని, రాయల మైత్రి సంపాదించుట లెస్సయని మహమ్మదీయ రాజులందఱును దలంచిరి.

---

(1) Forgotten Empire, Page 147

పురదుర్గాధ్య... 47 of Epigraphical Collections, 1906

పరాభూతుఁడైన యాదిల్షా కొం
కిట్లు వర్తమానమంపెను —

"మీరు న్యాయప్రభువులరని వింటిమి. మీ రేల
పైకి దండయాత్ర సాగించితిరో తెలియదు. చిరకాలము
మీకును, మాకునుగల స్నేహబంధమును నిష్కారణముగఁ ద
వ్వైచితిరి. యుద్ధరంగమున మమ్మోడించి, మా బలములను గైకొం
టిరి. ఆ బలములను, మా రాయచూరుదుర్గమును మా కీయఁ
గోరెదము. న్యాయమును బాటించి మీ రట్లు సేయుట లెస్స. లేదేని
మీ చేత మీ కెంత బాగున్నను, లోకమున కది దుష్కృత్యమని
తోఁపక మానదు."

ఆ మాటలన్నియు నాదిల్షా సేనానివలన విని, [1] 'మీ
సుల్తాను మా పాదములపైఁ బడునెడల మీరు గోరినవన్నియు నీయఁ
బడు' నని రాయలు ప్రత్యుత్తరమంపెను. ఆదిల్షా గత్యంతరము లేక,
యీ పద్ధతికి సమ్మతించెను. ఉభయులును దమ రాజ్యముల పొలి
మేరయొద్దఁ గలియునట్లేర్పాటుగావించుకొనిరి. అనుకొన్న మేరకు
రాయలు సైన్యముతో వెడలి ముద్గల్లు చేరెను. ఆదిల్షామాత్రము
రాలేదు. ఆ నియమభంగమునకు రాయ లోర్వఁజాలక, యాదిల్షా
రాజధానియగు బిజాపురమునకుఁ బోయి దానిని ధ్వంసముగావిం
చెను. కల్యాణి, కలబరిగిదుర్గములను సహితము నాశమొనర్చి,
వానిని లోఁబఱచుకొనెను. [2] అంతకుముందే యాదిల్షా బహమనీ
వంశజులైన ముగ్గురు రాజపుత్త్రులను జెఱపట్టి, కలబరిగికోటలో
నుంచెను. రాయలు వారిని విడిపించి, యందుఁ బెద్దవానికి రాజ్యాభి

1. "When the King sent answer by him to his enemy, that if the Adil Shah would come to him, do obeisance, and kiss his foot, his lands and fortresses should be restored to him."

Forgotten Empire, Pages 156-157

2. 'తిరుగుమారిపురి సురతరు సురలమరిగి
బహుళహాళహాళిభరిత కల్బరగినగర
నగరపురవర పరివృఢ జవనయవన
పృతన భవధని ననిఁదెగి కృష్ణరాయ.' — ఆముక్తమాల్యద

ద్ర నిద్దఱినిఁ దనవెంట విజయనగర మొను. సుల్తానుని ముఖ్యస్థేక్కి నున్నతోద్యోగముల నిచ్చెను. పరాభూతులైన యా... టను స్వాధీనపఱచుకొని[1] యందు బంధితులఁ చిరి. ఈ య... బహమనీరాజపుత్త్రునకుఁ బట్టముఁ గట్టిన కారణమునఁ లును, దేవరాయలకు 'యవనరాజ్య స్థాపనాచార్య' యను బిరుద నామముఁ గలిగెను.

శిల్పకళాభివృద్ధి

కృష్ణదేవరాయలు తనదృష్టిని సాహిత్యపోషణమందే కాక, శిల్పకళాభివృద్ధికిని మరల్చెను. విదేశీయులగు న్యూనిజ్ (Nuniz), పేయస్ (Paes) ల వ్రాఁతలే మన కీవిషయమునఁ బ్రబలసాక్ష్యములు.

జైత్రయాత్రలవలనఁ దాను గొనితెచ్చిన ద్రవ్యమునందుఁ జాలభాగము రాయలు తన రాజ్యమునందలి శిల్పకళాభివృద్ధికై వెచ్చించెను.

రాయలు రాజ్యాభిషిక్తుఁడైన వెంటనే హంపీవిరూపాక్షము లోని పంపాపతి దేవాలయమునకుఁ బ్రాగ్భాగముననుండు గోపుర మును, నాలయములోని రంగమంటపమును గట్టించెను. పూర్వదిగ్వి జయయాత్రను వెడలి, యుదయగిరి దుర్గమును సాధించిన పిదప, నందలి కృష్ణవిగ్రహమును గొనితెచ్చి, కృష్ణస్వామి యాలయము (1513) ను గట్టించి, యందు దానిని బ్రతిష్ఠించెను. ఆ వత్సరముననే రాజభవనపుటావరణమునకు సమీపమున హజారరామాలయ మును నిర్మించెను. దీని నిర్మాణము చాలకాలము పట్టెనఁట.[2]

'కల్యాణి కలుబరిగకోటలవారు గర్వితులై కోటమీదనుండి కూతలీంగా ఆవార్తలు రాయలు విని యెదిరి తెగవారిని అడుగగా మ్లేచ్ఛలతెగవారువున్నారు. గనుక కోటమీద అందుల మగుడించమని కలబరిగికోటకు లగ్గబెట్టించి మూడుము శ్కాలు ఘడియలో కోటసాధించి...' — రాయవాచకము

1. శా. శ. 1443 లో, అనగా క్రీ. శ. 1521-22 లో, సాధించియుండ వచ్చును.

2. The Madras Christian College Magazine for December, 1886



హజారి రామస్వామి దేవాలయము, హంపి

—By Courtesy of Archaeological Dept., Madras

తన ప్రియురాలిపేర నాగలాపురమును (1520) నిర్మించెను.[1] ఇదియే యిప్పటి హాస్పేట (Hospet). శిల్పకళానైపుణ్యమును వేనోళ్ళఁ జాటుచున్న విఠోబాలయమును ప్రారంభించెను. దీని నిర్మాణ కార్యము రాయల యనంతరము విజయనగరసింహాసనాసీనులైన యచ్యుతరాయల సదాశివరాయల కాలమున సహితము జరిగెనని తెలియుచున్నది. రాయలు కటకాధిపతిని జయించినపిమ్మట విజయసౌధము (The House of Victory) ను నిర్మించెను.[2] ఉగ్రనరసింహమూర్తి విగ్రహము నొక గండశిలపైఁ (1528) జెక్కించెను.

రాయలు దైవాగారముల నిర్మాణమునకే కాక, వ్యవసాయాభివృద్ధికిని ధనమును విరివిగ వెచ్చించెను. కొఱ్ఱగల్లు (Korragal)వద్దఁ దుంగభద్రానదికి నానకట్టఁ (1521) గట్టించి, యందుండి రెండు కాలువలు ద్రవ్వించెను. అందొకటి కొఱ్ఱగా కాలువ; రెండవది బసవన్న కాలువ. అవి యిప్పటికిని జాల నుపయోగముగనున్నవి. నాగలాపురమునకు సమీపమున నొక గొప్పతటాకమును (1520) ద్రవ్వించెను. ఈ తటాకనిర్మాణమునఁ బోర్చుగీస్ ఇంజినియ[3] రొకఁడు రాయలకెంతయుఁ దోడ్పడినట్లు తెలియుచున్నది.[4]

పై వివరించినవన్నియు రాజధానీనగరమున రాయలొనరించిన పనులు. ఇఁకఁ దన రాజ్యమునఁ జేసిన పనులను వివరించెదను.

కాళహస్తీశు నియాలయమున శతస్తంభమంటపమును (1516), నొక చక్కని గోపురమును నిర్మించెను.[5] చిదంబరమునందలి దేవాలయమునకు నుత్తరగోపురమును గట్టించెను.[6] తిరుపతి దేవాలయమునకు సహస్రస్తంభమంటపమును, దాని కెదురుగ

1. Forgotten Empire, Page 163
(కాని, రాయలు తన తల్లియగు 'నాగాంబ' పేర దీనిని గట్టించినట్లు తెలియుచున్నది) Forgotten Empire, Page 263
2. Forgotten Empire, Page 263
3. Joao de la Ponte (Portuguese Engineer).
4. Forgotten Empire, Page 162
5. No. 74 of Epigraphical Collections of 1903
6. Nos, 174, 175 of Epigraphical Collections of 1892

నున్న తటాకమును, గర్భాలయమును, వినాయకుని రథమును, బదునొకండంతస్తుల గోపురమును నిర్మించెను.[1] శ్రీశైలమున బ్రహ్మ రథోత్సవమార్గమున కిరువైపుల మంటపములను గట్టించెను.[2] అరుణాచలేశ్వరుని దేవాలయమునకు సహస్ర స్తంభమంటపమును, బదునొకండంతస్తుల గోపురమును గట్టించి, యొకతటాకమును ద్రవ్వించెను.[3]

**దానశాసనములు**

శా. శ. 1432 - విజయనగరము (బళ్లారి), నిడుముక్కల (కృష్ణ), పాలెము (కర్నూలు), బళ్లారి; 1433 - కాంచీపురము (చెంగల్పట్టు); 1434 - బళ్లారి, 1435 - బళ్ళారి; 1436 -విజయనగరము (బళ్ళారి), సంకలపురము (బళ్ళారి); 1437 - కాంచి (చెంగల్పట్టు), ఉగరగోల్ (బెల్గాము); 1438 - నెల్లూరు, అమరావతి (కృష్ణ); 1439 - విజయనగరము (బళ్ళారి); తిరువణ్ణామల (దక్షిణార్కాడు); మేడూరు (కృష్ణ), కాంచి (చెంగల్పట్టు); అహోబలము (కర్నూలు); శ్రీశైలము (కర్నూలు); కొవ్వూరు (కృష్ణ); 1440 - ఎరుమెట్టపాల్యము (చెంగల్పట్టు); 1441 - బెజవాడ (కృష్ణ); మఱియొక బెజవాడ శాసనము; పట్లవీడు (కృష్ణ); చేజెర్ల (కృష్ణ); బాపట్ల (కృష్ణ); శ్రీకాకుళము (కృష్ణ); మఱియొక బాపట్ల శాసనము; కాకాని (కృష్ణ); కొండకావూరు (కృష్ణ); దుర్గి (కృష్ణ); తిరుప్పడిర్కురు (చెంగల్పట్టు); కాంచి (చెంగల్పట్టు); 1442 - కలువాయి (నెల్లూరు); 1443 - అన్నియ్యూర్ (దక్షిణార్కాడు); పల్ని (మధుర); విజయనగరము (బళ్ళారి); మంగళగిరి (కృష్ణ); 1444 - గార్లదిన్నె (నెల్లూరు); వల్లభాపురము (బళ్ళారి); కందుకూరు (నెల్లూరు); అనంతసాగరము (నెల్లూరు); 1445 - శివమొగ్గ (మైసూర్); 1446 - ఈంగలపాడు (నెల్లూరు); 1447 - కొండవీడు (కృష్ణ); కత్తెరగండ్ల (కడప); 1450 - గుడిహాళ్ళి (బళ్ళారి); 1452-

1. A. S. R. 1908-1909
2. No. 74 of Epigraphical Collections of 1903
3. (i) No. 574 of Epigraphical Collections of 1902
   (ii) No 641 of ,, ,, of 1919

కాంచి (చెంగల్పట్టు); పాలెము (కర్నూలు), - విజయనగరము (బళ్ళారి); కాంచి మఱియొక శాసనము; 1453 - తిరువణ్ణామలై (దక్షిణార్కాడు); సింగరాయకొండ (నెల్లూరు); సంకలపురము (బళ్ళారి); పొట్నూరు (విశాఖపట్టణము); సింహాచలము (విశాఖపట్టణము); ఉండవిల్లి (కృష్ణ)*

రాజధాని వర్ణన

1520 వ సంవత్సరమున ఫిగరిడో యను పోర్చుగీసు రాయబారి విజయనగరమునకు వచ్చెను. అతనివెంట పెయిస్ అనువాఁడును వచ్చెను. ఇతఁడు విజయనగరమునఁ దాను జూచిన యంశములను వ్రాసెను. అందుండి యీ క్రింది యంశములు వ్రాయఁబడుచున్నవి.

† 'ఆ రాజ్యమునకు విజయనగరము రాజధాని. అందు రాజెపుడు నివసించుచుండును. నగరమున కాఱుమైళ్ళ కీవలనే యడ్డముగాఁ గొండల వరుస గలదు. దానిలోనుండి మార్గములు గలవు. వానికే ద్వారములని పేరు. ఆ ద్వారములగుండఁబోవలయునే కాని, నగరములోనికిఁ బోవుటకు వేఱు మార్గములు లేవు. ఈ కొండల వరుస డెబ్బదిరెండు మైళ్ళ పొడవుగలిగి, యీ మహానగరమును జుట్టియున్నది. ఈ పర్వత పంక్తికి లోపలనంటి చుట్టుకొనియున్న యితర పంక్తు లనేకములు గలవు. ఈ పంక్తులలో నెచ్చటనైన సమభూమి

---

* 'కృష్ణరాయ శాసనముల సంగ్రహ మాంగ్లేయ భాషలో Mr. Robert Sewell దొరవలన Lists of Antiquities అను గ్రంథములో వివరింపఁబడినది. అందులోఁ జెక్కులు Oriental Govt. Manuscripts Library అనుదానిలో నిలువచేయఁబడినవి. కావున పై రెంటి సహాయమునను కృష్ణరాయల దాన శాసనము లేయే దేశములలో వ్యాపించియున్నవో తెల్పితిని.'

—కవిజీవితములు, పుటలు 502, 503.

సూచన:—ఇందు సూచింపఁబడిన కృష్ణా జిల్లాలోని ప్రదేశములు కొన్ని ప్రకృతము గుంటూరు జిల్లాలో నున్నవి.

† (i) మహమ్మదీయ మహా యుగము, ఆ. ప్ర. పుటలు 429-435.

(ii) Forgotten Empire, Pages 237-290

యున్నయెడల నచట బలాఢ్యమగు గోడ కట్టఁబడియున్నది. ఈ రీతిగాఁ గొండలన్నియు మూసివేయఁబడియున్నవి. జనులు నడుచుటకు బాటలేర్పఱుపఁబడి యా బాట లీ ద్వారముల గుండఁ బోవును. ఈ ద్వారములకడఁ జిన్న గుహాలు గలవు. అందుఁ గూర్చుండి రక్షకభటులు ద్వారములను రక్షించుచుందురు. ఈ యావరణములోపల వరి మొదలగు ధాన్యములు పండునట్టి బయళ్లును, నిమ్మలు నారింజలు పనసలు మామిళ్లు మొదలగు ఫలవృక్షములతో నున్న తోఁటలును గల సారవంతములయిన భూములు గలవు. ఈ కొండల వరుసలకు మధ్యమున జలాశయములు పెక్కులు గలవు. వాని యాధారములవలననే పై నుదాహరించిన భూములు సాగుబడి చేయఁబడుచున్నవి ...గోవా నగరమునుండి వచ్చిన బాట యొకటి మొదటి కొండవరుసలోఁ గల ద్వారములలో నొక ద్వారముగుండ నగరములోఁ బ్రవేశించుచున్నది. పడమటి ప్రక్కనిదియే ప్రధానమైన ద్వారమగుటచేత గోడలచేతను, బురుజులచేతను సురక్షితమై యొప్పెడు పట్టణమొకటి (నాగలాపురము - Hospet) రాజులచే మొదటి పంక్తిలోపలఁ గట్టఁబడినది. ఈద్వారమునకుండు తలుపులును, బురుజులును మిక్కిలి బలాఢ్యములయినవి. ఇతర నగరములలోని గోడలవంటివిగాక, యీ గోడలు పాలగచ్చు చేయఁబడి, వేఱచ్చటను గానరానట్టివిగా నున్నవి. లోపల మిద్దెటిండ్ల వలె బల్లపఱుపుగానున్న కప్పులుగల సొగసయిన కట్టడములచే నిరుపార్శ్వములయం దలంకరింపఁబడి వీథుల పంక్తులు రమ్యముగా నున్నవి.

'నాగలాపురమునుండి విజయనగరమునకు నొక వీథి పోవుచున్నది. ఆ వీధికి నిరుప్రక్కలను ఇండ్లవరుసలు చక్కఁగాఁ దీర్చియున్నవి. బాటసారులకు నీడనిచ్చుటకై రెండు ప్రక్కలను వృక్షములు నాటింపఁబడియున్నవి. ఈ వీథిలో సమస్త వస్తువులను విక్రయించు నంగడులు గలవు. ఈ వీధిలో రాజు సుందరమైన యనంతశయన దేవాలయమును గట్టించెను. ప్రభువులును, సేనానులును గట్టించిన దేవళ్లములుగూడఁగలవు. ఈ నగరము చుట్టును బరువు

గల పెద్ద ఱాళ్లతోఁ గట్టఁబడిన గోడగలదు. అది మిక్కిలి బలాఢ్య మైనదిగాని ప్రస్తుతము కొన్ని చోట్ల శిథిలమైయున్నది. అందు సురక్షితములైయున్న దుర్గములు గలవు. ఈ గోడకుఁ బ్రక్కను, నచ్చటచ్చటఁ బల్లపు ప్రదేశములందు నీటిచే నింపఁబడిన కందకములు గలవు. దానికి వేఱుగా నట్టిదే మఱియొక గోడగలదు. మనుష్యుని ఱొమ్ముఁ దాఁకునంత యెత్తుగలిగి, మొనలు తేలియున్న ఱాళ్ళు పాతఁబడియున్నవి. ఈ గోడ కొండలకు మధ్యనున్న పల్లపు ప్రదేశములం దెత్తుగాఁ బెట్టఁబడి, కొండలవఱకు వ్యాపించి యున్నది. ఈ గోడ మొదలుకొని నగరముప్రవేశించుటకు మధ్యమున నెక్కువ దూరము గలదుగనుక, నా ప్రదేశములందు వరిపొలములును, తోఁటలును, దొడ్లును, నీటి కాలువలును గలవు. ఈ గోడయొక్క మొదటి పంక్తిగుండ నీరు ప్రవహించుచున్నయది. ఏళ్ళు పాఱు చుండుటవలనఁ జెఱువులు జల పూర్ణములైయున్నవి. ఇచట ఫల వృక్షములతోఁగూడిన తోఁటలును, ఒక చిన్న తాళ్ల గుంపును, అనేక గృహంబులును గలవు. నగరముయొక్క మొదటి ద్వారము కడకు వచ్చుటకుముందు మీరొక నీటి కాల్వను దాఁటి, మలుపుతిరి గిన బలాఢ్యమగు నొక ఱాతి గోడయొద్దకు వచ్చెదరు. ఈ ద్వార మున కిరుప్రక్కలనుండు రెండు బురుజులును దానిని గాపాడుచున్నవి. ఆ ద్వారము మిక్కిలి సొగసయినట్టియు, పెద్దదగునట్టిదియు నై యున్నది. ద్వారమును దాఁటి, లోపలకుఁ బోఁగానే రెండు చిన్న దేవళములు గానిపించును. ఒక దేవాలయపు ప్రాకారము లోపల వృక్షములును, మఱియొక దేవాలయపు ప్రాకారములో పల నిండ్లును గలవు. ఈ మొదటిద్వారమునఁగల కుడ్యము నగరము నంతను జుట్టివచ్చుచున్నది. మఱికొంత దూరము పోయినతోడనే మఱియొక ద్వారమును, గోడయుఁ గానిపించును. ఈ గోడయు నగరమునంతయును జుట్టివచ్చుచున్నది. ఇచటనుండి రాజభవనాం తఃపురమువఱకుఁగల మధ్యభూమియందు వీథులును, ఇండ్ల వరుస లును, సేనానులయొక్కయుఁ, బ్రభువులయొక్కయు నందములగు

మందిరములును గలవు. చూచుటకు వినోదకరములగు విగ్రహము లతో నలంకరింపఁబడిన యిండ్ల వరుసలు మనోజ్ఞములై యొప్పుచు న్నవి. ముఖ్యమయిన దగునట్టి పెద్దవీధిగుండ వెళ్ళునపుడు రాయల యంతఃపుర భవనమున కెదుటనున్న గొప్ప మైదానమునకుఁ గొని పోవు ద్వారముగల ప్రధానమైనట్టి మార్గమొకటి కలదు. దీని కెదు రుగా మఱియొక మార్గము నగరముయొక్క రెండవ భాగమునకుఁ బోవుచున్నది. నగర మధ్యమున నుండి మిక్కిలి యుపయోగము గలదియగుటచేత నా మైదానముగుండ సరకులు మొదలగువాని నెక్కించుకొని బండ్లు నడపఁబడుచుండును. లిస్బను (Lisbon) నగర దుర్గము (పోర్చుగల్ దేశపు రాజధాని) ఎంత స్థలమాక్రమించు కొనెనో, యంతకంటె నెక్కువ స్థల మాక్రమించుకొని రాయల మందిరము బలాఢ్యమై సురక్షితమైయున్న ప్రాకారముగలిగియున్నది.

'ఇంకను గొంతదనుక నడచి యావలిద్వారముకడకుఁ బోయిన, దానితో సంబంధించిన యిరుపార్శ్వముల రెండు దేవళములు గలవు. ఈ రెంటిలో నొకదాని ద్వారముకడఁ బ్రతి దినమును గొఱ్ఱెలను బెక్కింటిని జంపుచుందురు. ఈ దేవళములకు దాపునఁ జిత్తరువులు చెక్కఁబడినట్టియు, విగ్రహములతో నలంకరింపఁబడిన ట్టియు జయసూచకమయిన రథ మొకటి గలదు. సంవత్సరమున కొకసారి దేవతోత్సవమునాఁడు నగర వీథులగుండ రథము నూరే గింతురు. అది మిక్కిలి పెద్దదగుటవలన మూలలఁ దిరుగనేరదు. ఇంకను ముందు నడువ, విశాలతయు సొగసునుగలదై, యిరు పార్శ్వ ములందు సుందరములగు గృహముల వరుసలను గలిగియున్నదై, నే నిదివఱకు పై నుదాహరించి వర్ణించిన వీథులంబోలిన యొక వీథి గలదు. ఆ వీథులలోని గృహములు భాగ్యవంతులకు నివాసము లయి యొప్పుచున్నవి. ఈ వీధిలో వణిజులు పెక్కండ్రు నివసించు చున్నారు. ఇందు పెక్కురకముల కెంపులు, వజ్రములు, నీలములు, పచ్చలు, ముత్యములు మొదలగు రత్నములును, వస్త్రములును, ఇంకను బ్రపంచములో దొరకునట్టి ప్రతివస్తువును విక్రయింపఁబడు

చుండును. ప్రతిసాయంకాలము నొక సంత జరుగును. అచట సామాన్యములయిన గుఱ్ఱములు, గుఱ్ఱపుతట్టులు మొదలగు జంతువులుమాత్రమే కాక, దబ్బపండ్లు, నిమ్మపండ్లు, నారింజపండ్లు, ద్రాక్షపండ్లు మొదలగు ఫలవర్గములు విక్రయింపఁబడుచుండును.

'ఆ వీధి కొనయందు మరల నొక ద్వారమును, గోడయును గానిపించును. ఆ ద్వారములోనుండి పోయినయెడల నావల నొక వీథి గానిపించును. అచట కర్మకరులు (పంచాణులు) పెక్కండ్రు నివసించుచున్నారు. వార లనేక వస్తువులను విక్రయించెదరు. ఇచట రెండు చిన్న దేవళములు గలవు. ప్రతివీథియందును దేవాలయములు గలవుగాని, ప్రధానములయినవియు, గొప్పవియునగు దేవాలయములు నగరమునకు వెలుపలిప్రక్కనే కలవు.

'వజ్రములు మొదలగు నమూల్యమణులయొక్కయు, నితర వస్తువులయొక్కయు వర్తకము విరివిగా జరుగుచుండుటచేత నా మహానగరమున నన్నిజాతుల మనుష్యులును గలరు. ఈ నగర విస్తీర్ణతను గుఱించి నేను వ్రాయను. ఏలన, నయ్యది యొకప్రదేశమునుండి చూచుటకుఁ గానరాదు. నేనొక కొండనెక్కి, యెక్కువ భాగమును జూడఁగలిగితినిగాని, పెక్కు కొండలపంక్తులకు మధ్యమున నగరమంతయు నిమిడియుండుటచేతఁ గొంతభాగము గానుపింపలేదు. అచటినుండి చూడఁగా, నాకుఁ గనుపట్టినభాగము రోమకపురి (Rome, the Capital of Italy in Europe) యంత పెద్దదిగా నుండి, చూపునకు మిక్కిలి సుందరముగాఁ గానుపించినది. దాని లోపలఁ జెట్లగుంపు లనేకములు గలవు. ఇండ్లకుఁ జేరిన తోఁటలలో నీళ్ల కాలువలును, నచటచటఁ జెఱువులును గలవు. రాజు తన యంతఃపురమందిరమునకు సమీపమునఁ దాళ్లవనమును, నానావిధ ఫలవృక్షములతోఁ గూడిన తోఁపులను గలిగియుండెను. తురుష్కుల నివాసభూమికి దిగువ నొక చిన్ననదియును, మామిడితోఁటలు, పోఁకతోఁటలు, పనసతోఁటలు, జామితోఁటలు, నిమ్మతోఁటలు, నారింజతోఁటలు మొదలగునవి దట్టముగానుండి పెరుఁగుచు,

మహారణ్యమువలెఁ గానిపించుచున్నవి. తెల్లద్రాక్షతోఁటలు విశేషముగాఁ గలవు. నగరములోనికి వచ్చు నీరంతయు మొదటిప్రాకారమునకు వెలుపలనున్న, పయి నే నుదాహరించిన, చెఱువులనుండి తేఁబడుచున్నది. ఈ నగరములోని జనసంఖ్య లెక్కించుట కలవిగానిదిగా నుండుటచేతను, నే నుదాహరించినఁ గల్పితముగాను, నతిశయోక్తిగాను నుండుననుభీతిచేతను నుదాహరింప మానినాఁడను.

'ఇయ్యది (విజయనగరము) ప్రపంచములో సమస్త వస్తు సముదాయముచేతను నిండియున్న మంచినగరముగానున్నది. గోదుమలు, వడ్లు, అనుములు, పెసలు, కందులు, ఉలవలు మొదలగు ధాన్యములును, ప్రజలకాహారమై యీ దేశములో ఫలించు నితర ధాన్యములును సమృద్ధిగాఁ జేర్పఁబడి, మిక్కిలిచౌకగా విక్రయింపఁబడుచున్నవి. ఇతర ధాన్యములవలె గోదుమలు మూరులచేఁ దక్కఁ దదితరులచే నంతగా భుజింపఁబడుచుండలేదు. అందువలనఁ దక్కువగానుండును. తప్పించుకొనిపోవుటకు వీలులేనంత దట్టముగా బరువులు వేయఁబడిన యెడ్లు వీథులలోను బాజాఱులలోను లెక్కింప శక్యముగాక క్రిక్కిఱిసియుండును.

'ఉత్తరమున నగరప్రాకారములకు వెలుపల సుందరతమంబులగు మూఁడు గొప్ప దేవళములు గలవు. అందొకటి విఠలస్వామియాలయము. ఆనెగొందిపురమున కెదురుగాఁ గట్టఁబడియున్నది. రెండవది హంపిదేవాలయమని ప్రసిద్ధిఁగాంచిన విరూపాక్షాలయము. యాత్రికులచే నిది మిక్కిలి మహిమగలిగినదిగాఁజూడఁబడుచున్నది. ఈ దేవాలయములోఁ దూర్పుగానున్న ముఖద్వారమున కెదురుగా మిక్కిలి సుందరమై, యింపుగాఁ గట్టఁబడిన యిండ్లను, వసారాలునుగలిగి, రమ్యమైనట్టి వీథియొకటి కలదు.

'ప్రధాన పర్వదినము రాఁ దటస్థించిన కాలమున రాయలీ క్రొత్త నగరమునుండి (నాగలాపురము) విజయనగరమునకు వచ్చి, యయ్యది రాజ్యమునకంతకు రాజధానిగావున, నచట సమావే



హంపీ విజయనగరములోని విఠ్ఠలస్వామి దేవాలయాంతర్భాగము

*—By Courtesy of Archaeological Dept., Madras.*

శమై, యెల్లరతోఁగలసి, యాచార విధుల ననుసరించి, విందులు మొదలగు వినోదములను జరిగించును. ఈ యుత్సవ దినములకు రాజ్యములోనుండెడు నాటకస్త్రియలెల్లరను రప్పించెదరు. మఱియు, రాజులను, మహాప్రభువులను, సేనానులను వారల రాణువలతోడను, పరివారముతోడను రప్పించెదరు. యుద్ధముచేయుటకై పంపఁబడినట్టియు, రాజ్యములో దూరముగా నున్నట్టియు, ఉత్కలరాజ్యముయొక్కయు, బీజపురరాజ్యముయొక్కయు సరిహద్దులకడనున్నట్టియు సేనానులు మాత్రము రప్పింపఁబడరు. ఆ యుత్సవములలోఁ జేరిన నవరాత్రోత్సవములు (దశరా పండుగ) నేనా నగరమున నుండినపుడు రాజభవనమున మిక్కిలి వైభవముతో జరుపఁబడినవి. రాజ భవన మీతీరుననున్నది. రాజభవనమునకు నే నిదివఱకుఁ బై నుదాహరించిన బయలునకుఁ బోవుటకై ద్వారమొకటి తెఱువఁబడియున్నది. ఈ ద్వారముపై నితర గోపురములకువలెనే వసారాలు గలిగి కొంచెమెత్తుగల గోపురము గలదు.'

సామ్రాజ్య విస్తీర్ణము: వైభవము

విస్తీర్ణము—కృష్ణానదికి దక్షిణ భాగమునఁగల హిందూదేశమంతటికిని రాయ లేకచ్ఛత్రాధిపత్యము వహించి యుండెను, మఱియుఁ, దూర్పున కటకమువఱకును, వాయవ్య భాగమున విజాపురము మున్నగు పట్టణములవఱకునుగల భూభాగమంతయు రాయల పరిపాలనమున నుండెను.

సైన్యము—ఈ రాజునకుఁ బది లక్షల సైన్యము గలదనియు, నందు 35 వేల యశ్వదళమును, 1000 గజములును గలవనియు 'పెయిస్' వ్రాసియున్నాఁడు. ఈ సేనలకన్నిటికిని రాయలే వేతనము లిచ్చుచుండెను. అవసరము గలిగినప్పు డిరువది లక్షలసైన్యములనైనను బ్రోగుచేయఁగల శక్తిగలవాఁడు రాయలు. ఎక్కువ యాదాయముగల రాజులు సేనానాయకులై, రాయలకు లోఁబడి కప్పములు చెల్లించుచుండిరి. వారు రాజు నియమించు ప్రకారము కాల్బలమును, గుఱ్ఱపుదళమును, సామజములను బోషించుచు,

రాజునకుఁ బన్నులు గట్టుచుండిరి. తమ క్రిందనుండు సైనికులకు సేనాధిపతులే జీతము లిచ్చుచుండిరి.

వైభవము—విజయనగరము 900 మైళ్ళ సముద్ర తీరమును, 200 రేవు పట్టణములను గలిగియుండెను. సంవత్సరపు టాదాయము 240 కోట్ల రూపాయలు. 25 గురు రాజప్రతినిధులును, 200 రాష్ట్ర పాలకులును నుండిరి. అప్పటి రాజభవనములలో నుండెడి బంగారు తూఁగు టుయ్యేలలు, స్వర్ణ భూషణములు, బంగారు గాబులు, సువర్ణ పాత్రలు, వెండి సామగ్రి, స్వర్ణనిర్మితమై రత్నస్థగితమైన సింహాసనము[1], ఛత్రచామరములు మొదలగువానిని 'రజాక్' మొదలయిన విదేశ బాటసారులు ప్రత్యక్షముగఁజూచి వర్ణించిరి. ఇందుఁ బ్రత్యేకముగ రత్నపు సరకులమ్మెడి వీధి గలదనియు, దానినే 'రత్నాలబజా' రని వ్యవహరింతురనియు, నందుఁ గెంపులు, మణులు, ముత్యాలు, పగడాలు మొదలగువానిని రాసులుగఁ బోసి బాహాటముగ నమ్మెడివారనియు 'పెయిస్' వ్రాసియున్నాఁడు.

రాయల కుటుంబము

(i) భార్యలు :

1. '......కృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁ గూర్చు దేవేరులుగాఁ'[2]

2. 'తిరుమల దేవీవల్లభ'[3]

3. 'శ్రీ వేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ
జీవితనాయక కవితా
ప్రావీణ్యఫణీశ కృష్ణరాయ మహీశా,'[4]

---

1. ఇప్పుడిది మైసూరు మహారాజులకడనున్నది.
2. మనుచరిత్రము, పీఠి. ప. 33
3. పారిజాతాపహరణము, ద్వి. ఆ. ప. 104
4. పారిజాతాపహరణము, చ. ఆ. ప. 1

4. 'ఆవిభునవంతరంబ ధ
రావలయముఁ బూని తీవు రహిమైఁ దిరుమ
లేవియును నన్నపూర్ణా
దేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుగాన్.' [1]

మనుచరిత్రపారిజాతాపహరణ గ్రంథములలోని పైపంక్తులను బట్టి చూడఁ, గృష్ణదేవరాయలకుఁ దిరుమలదేవి, చిన్నాదేవి యను నిరువురు భార్యలుండినట్లు తెలియుచున్నది. ఆ గ్రంథముల తరువాత రాయలు రచించిన యాముక్తమాల్యదయందలి పద్యమును బరిశీలించినను భార్య లిరువురనియే స్పష్టమగుచున్నది. కాని, యాముక్తగ్రంథమునందుఁ జిన్నాదేవికి మాఱుగ నన్నపూర్ణాదేవి యని వ్రాయఁబడియున్నది. ఆమెకు సహజగుణమైయొప్పెడి యన్నదానమువలన రాయ లామెకు నన్నపూర్ణాదేవి యను నామాంతర మిడియుండనోపును. పొట్నూరుకడఁ బాతించిన స్తంభముమీఁదఁ జెక్కించిన శాసనమును బట్టి చూచినను రాయల భార్యల పేరులు చిన్నాదేవీ తిరుమలదేవులనియే తెలియుచున్నది. [2]

తిరుమలదేవి శ్రీరంగపట్టణాధీశ్వరుని తనయ. [3]

చిన్నమదేవి ఆభిజాత్యమునుగూర్చియు, నామె వివాహకథాసరణినిఁ గూర్చియుఁ బలువురు పలు తెఱఁగులఁ జెప్పుచున్నారు.

చిన్నాదేవి యొక వేశ్యాంగనయనియుఁ, గృష్ణరాయలు రాజగుటకుఁ బూర్వమే యామెను బ్రేమించి, 'నేను రాజ నగుదునేని, నిన్ను వివాహమాడి, పట్టపురాణినిఁ జేయుదు' నని వాగ్దానముచేసెననియుఁ, దాను రాజు కాఁగానే యామెను వివాహమాడెననియుఁ గొందఱు వ్రాసియున్నారు. కాని, యీ విషయము

1. ఆముక్తమాల్యద

2. Col. Mackenzie Collections - నెం. 11 శాసనము శా. శ. 1438 సం. (ధాత) సింహాచలము — "తమ రాణీలు తిరుమలదేవమ్మగారి చేతను పతకము ౧ కి వరహాలు ౫౦౦. తమ చిన్నాదేవమ్మగారిచేత సమర్పించిన పతకము ౧ కి గా ౫౦౦"

3. ఉత్కలదేశాధీశుని కూఁతురని కొంద ఱందురుగాని, యందులకుఁ దగిన యాధారములు లేవు.

విశ్వసనీయముకాదు. సుక్షత్త్రియవంశసంజాతుఁడైన కృష్ణరాయలేమి - యొక వేశ్యాంగనను వివాహమాడి పట్టపురాణిగఁ జేసికొనుటయేమి! తా వివాహమాడవలెనన్న శశినుదాసించుశుభాస్యములుగల క్షత్త్రియకాంత లెందఱు లేరు? రాయ లొక వేశ్యను ప్రేమించినఁ ప్రేమించియుండుఁగాక! ఆ యువతిని స్వకులధర్మానుసారముగ వివాహమాడి, యామెను బట్టమహిషిగఁ జేసెనని నమ్ముట మాత్రము వెఱ్ఱితనము. రాయలయెడ నిజముగ నిట్టి కళంకమున్నచో నాతని దుహితల నేల నరపతివంశజులగు నార్వీటివారు వివాహమాడి యుందురు?[1]

తన తల్లియగు నాగాంబ పేరఁ గట్టించిన నాగలాపురమును జరిత్రకారులు కొందఱు రాయలు తన యుంపుడుకత్తె పేరఁ గట్టించె ననిరి.[2] పుణ్యస్థలముల కేగినపుడెల్ల రాయలు దన తల్లిదండ్రుల పేర దానములు చేసినట్లు చూపుట కెన్నియేని నిదర్శనములు గలవు. ఒకటిరెంటి నిం దుదాహరించెద —

(i) 'తమ తండ్రి నరసారాయణింగారికిన్ని తమ తల్లి నాగాదేవమ్మకున్ను పుణ్యముగాను అమరేశ్వరదేవుని నైవేద్యమహాపూజలకు ధారాపూర్వకముగాను సమర్పించిన పెద్దమద్దూరి గ్రామమొకటి...'

నెం. 1 శాస. శా. శ. 1437 యువ సం. ధరణికోట 3

(ii) 'సింహాద్రినాథుని దర్శించి తమ తల్లి నాగాదేవమ్మగారికిన్ని తమ తండ్రి నరసారాయణిగారికిన్ని పుణ్యమునకు గాను దేవునకు సమర్పించిన కంఠమాల ౧కి ముత్యాలు 61...' నెం. 11 శాస. శా. శ. 1438 ధాత సం. సింహాచలము 3

తల్లిదండ్రులయెడ నింతటి భక్తిప్రపత్తులుగల రాయలు జనని యగు నాగాంబ పేర నొకపట్టణ మేల కట్టించియుండరాదు? అది యెట్లు సత్యదూరమగును?

"మహాపురుషుల కిట్టి లేనిపోని కళంకములఁ గట్టిపెట్టుట మానవస్వభావము."

1. (i) Queyroz, Vol. I. BK 2. Page 383 (ii) హిందేశానంత పురము క్షైఫీయతు
2. Forgotten Empire, Page 163
3. Col. Mackenzie Collections

ఇఁకఁ జిన్నాదేవి నిజవృత్తాంతమును గూర్చి యించుక వ్రాయుదును. చిన్నాదేవి యుత్కళాధీశుఁడగు ప్రతాపరుద్రగజపతి కూఁతురు. పూర్వదిగ్విజయానంతరము రాయలకును, గజపతికిని జరిగిన సంధికి ఫలముగ గజపతి తన ముద్దులపట్టిని రాయల కొసఁగి వివాహమొనర్చెనని పూర్వదిగ్విజయయాత్రాసందర్భమున వ్రాసియుంటిని. ఈ విషయమును స్థిరీకరించు గద్యపద్యపాదములను సహితము కృష్ణరాయవిజయము, రాయవాచకము, ఉత్కళేతిహాసము మున్నగు గ్రంథములనుండి క్రోడీకరించియుంటిని. కావున, రాయలు గజపతికూఁతును వివాహమాడెనను విషయము సంశయాస్పదము కాదు.

ఈ సంధికార్యము సంతోషముఁగూర్పమి, గజపతి భార్య, మాయోపాయమున రాయలను హతమొనర్చి, పగఁబాపుకొనఁ దలఁచి, వివాహానంతర మొక పసిండియడిదముఁ జేయించి, దానిని జిన్నాదేవి యొడ్డాణమున భద్రపఱచి, 'దీనిసాయమున నీ మగనిఁ దుదముట్టింపు' మని కూఁతునకు దుర్బోధ మొనర్చి పంపెను. పాప మా యువతి తల్లి యానతినిఁ బాలింపఁ దలఁచి, తనకుఁ గలుగఁబోవు నరిష్టమును గుర్తింపక, యొకనాఁడు దాఁ బెనిమిటితో సరసాలాపములాడుచు మెల్లగ నాయొడ్డాణమును సడలించెను. వెంటనే, యందు గుప్తపఱుపఁబడిన యాయుధము తళతళ మెరయుచు శ్రీని పాదములకడఁ బడ, నాతఁ డాయువతిశీలమును శంకించి, యామెకుఁ బ్రవాసశిక్ష విధించెను. అట్టిచేఁతకుఁ దన్నుఁ జంపక, విడిచిపుచ్చిన భర్తృదయారసమున కెంతయు సంతసించి, యామె విజయనగరమును వీడి చని, కర్నూలుమండలములోని నల్లమల కాంతారప్రదేశమున నివాస మేర్పఱచుకొని, * వరదరాజమ్మ

* టైలరుదొర వ్రాసిన యనాలిసెస్ (Analysis) అను గ్రంథములో నిట్లు వ్రాయఁబడియున్నది:

"The Gajapati King's daughter named Ruchi Devi felt disposed to remain near Stambam (Cumbam) and The Rayar directed to do so, while he returned to Vijayanagaram

యను నామాంతరమున మెలఁగుచు, ననేకధర్మకార్యములాచరించు చుండెను. అందుఁ బేర్కొనఁదగినది తటాకనిర్మాణము. దీనిని గూర్చిన యొక వింతకథ గలదు. ప్రవాహమునకు నిలువఁజాలక తటాకపుఁ గట్ట పెక్కుమారులు తెగుచుండెనఁట. అంత వరదరాజమ్మ గంగాదేవినిఁ బ్రార్థింప, నాయమ నరబలిని గోరెనఁట. 'ఇది యెట్లు ఘటిల్లునా?' యని రాజపత్ని కుములుచుండ, నొక ముసలి గొల్లత యటకరుగుదెంచి, యయాచితముగఁ దన కుమారులగు 'చిన్నకంబఁడు', 'పెద్దకంబఁడు' ననువారల గంగాదేవికి సమర్పించెనఁట. నాఁటినుండియుఁ దటాక మా బాలుర జ్ఞాపకార్థము 'కంబము చెఱు' వన వెలసెనని చెప్పుదురు.[1]

వరదరాజమ్మకు తుక్కాంబ,[2] లక్ష్మీదేవమ్మ,[3] అన్నపూర్ణ,[4] సుభద్రమ్మ,[5] రుచీదేవి[6] యను నామాంతరము లుండినట్లు తెలియుచున్నది.

వరదరాజమ్మ తన యవివేకమున కెంతయు వగచి, రాయలు తనయెడఁ జూపిన కరుణకెంతయు మెచ్చి యమ్మహనీయునిదయకుఁ బాత్రురాలుగా నెంచి, 'తుక్కాపంచరత్నము' లను పేర నయిదు శ్లోకములను రచించి రాయల కంపెనఁట. అంత నా యుదారహృదయుఁ డామె తప్పులను క్షమించి, యర్ధాంగిగఁ గైకొనెనఁట.

(ii) సంతానము

రాయలకుఁ దిరుమలదేవివలన నొకకూఁతురును, చిన్నాదేవి వలన నొక కూఁతురును గలిగిరని తెలియుచున్నది. కాని, దీనికిఁ బ్రతిబంధకముగ క్వెరోజ్ (Queyroz) రాయల కొక్క కూఁతురు

1. ఈ కథా విషయములు కవి జీవితములనుండి గ్రహింపఁబడినవి.
చూ - పుటలు, 546-558

2. కృష్ణరాయ విజయము
3. విజయనగర సామ్రాజ్యపు (కడితము)
4. ఆముక్త మాల్యద
5. నాదిండ్లగోపమంత్రి ("భద్రాం సుభద్రామివపాండవేయః")
6. టైలరు దొర ప్రాచీన యనాలిసిస్ (Analysis)

మాత్రమే కలదని వ్రాసియున్నాఁడు.[1] ఇది విశ్వసనీయముకాదు. ఏలన, తిరుమలదేవి కూఁతురగు తిరుమలాంబికను ఆరవీటి శ్రీరంగరాయల పెద్ద కుమారుఁడు రామరాయలు వివాహమాడెననియు,[2] చిన్నాదేవి కూఁతును రామరాయల సోదరుఁడు తిరుమల దేవరాయలు పరిణయమాడెననియుఁ దెలియుచున్నది.[3] కావున నిద్దఱు కుమార్తెలుండిరనుట నిజము.

పైఁ జెప్పిన యిరువురు తనయలుఁ గాక, రాయల కిద్దఱు కుమారులుండిరి. వీరు రాయల కేరాణులయందు జనించినవారో తెలియదు. జ్యేష్ఠ కుమారుని పేరు తిరుమలయ్య దేవమహారాయలు. శాసనములందుమాత్ర మీతని పేరు వీరప్రతాప తిరుమల దేవరాయ మహారాయలని పేర్కొనఁబడియున్నది.[4] రెండవ కుమారుని పేరు తెలియదు. రాయలు మరణించునాఁటి కా బిడ్డనికిఁ బదునెనిమిది నెలల ప్రాయమని మాత్రము న్యూనిజ్ వ్రాసియున్నాఁడు.[5]

చరమదశ

తన యనంతరము, సింహాసనమున కెక్కడ పోరాటము గలుగునోయని, రాయ లాఱేండ్ల యీడుగల తన పెద్ద కుమారుఁడైన తిరుమలయ్య దేవ మహారాయలకుఁ బట్టముఁగట్టి, తాను మహాప్రధానియై రాజ్య కార్యముల నిర్వహించుచు, నంతదనుక మహా ప్రధానిగనున్న తిమ్మరుసును బ్రధాన రాజకీయ విషయముల యం దుపదేశికునిగ నుంచుకొనెను. ఈ పట్టాభిషేక సందర్భమున రాజధానీనగరమగు విజయనగరమున నెనిమిది నెలలవఱకు నుత్సవములు సాగెనని న్యూనిజ్ వ్రాసియున్నాఁడు.[6] పాపము! పట్టాభిషేక మహోత్సవము లింకను సాగుచుండఁగనే, యా రాజకుమారుఁడు మరణించెను. ఈ బాలరాజు క్రీ. శ. 1524–వ వత్సర

1. Fernao De Queyroz - Conquest of Ceylon, Vol. 1, Bk. 2, P. 383
2. Queyroz, Vol. 1, Bk. 2, Page 383
3. హంందే అనంతపురము కైఫీయతు
4. Ep. Carn. Vol. IX, Magadi, Nos. 6 and 83; Ep. Coll. No. 139 of 95; No. 683 of 1923; No. 181 of 1913; Nos. 115, 116 & 117 of 1918
5. Forgotten Empire - Nuniz, Page 367
6. Forgotten Empire - Nuniz, Page 359

మున దానములు చేసినట్లు కొన్ని శాసనములు గన్పట్టుచున్నవి.[1] కావున, తిరుమలయ్యదేవమహారాయల పట్టాభిషేకమును, మరణమును 1524-వ వత్సరముననే జరిగియుండవలెనని తోఁచుచున్నది.

తిమ్మరుసు కుమారుఁడు తన తనయునకు మందుపెట్టించి చంపెనని రాయలు విశ్వసించి, తిమ్మరుసును, నాతని కుమారులను, నాతని తమ్ముఁడైన గోవిందరాజును చెఱయందుంచెను.[2] కొంత కాలమైన పిదపఁ దిమ్మరుసు కుమారుఁడు చెఱనుండి తప్పించుకొని పోయి, పర్వతప్రాంతములఁ జేరి, సైనికులఁ గూర్చుకొని రాయలపై దండెత్తి రాఁ దలఁచుచుండెను. ఆ విషయము రాయలు దెలిసికొని, యాతనిఁ బట్టితేరఁ దన సేనానాయకునిఁ బంపెను. అతఁడు రాజునాజ్ఞఁ దలఁదాల్చి, తిమ్మరుసు కుమారునిఁ బట్టి తెచ్చెను. కృష్ణరాయలు కోపోద్దీపితుఁడై తిమ్మరుసును, నాతని కొడుకులను, గోవిందరాజును వధ్యస్థానమునకు రప్పించి, వారి గ్రుడ్లు పెఱికించి, చెఱయందుంచెను.[3]

పుత్త్రమరణశోకమువలన రాయలు వ్యాధిగ్రస్తుఁడై, జీవితాశవిడిచిపెట్టెను. తన రెండవకుమారుఁడు పసిపాపఁడగుటవలనఁ, దాఁ జనిపోవుటకు ముందుఁ, దన పట్టాభిషేకసమయమునఁ జంద్రగిరిదుర్గమునఁ జెఱయందుంచఁబడిన తన యనుజులలో నచ్యుతదేవరాయలు రాజ్యమునకుఁ దగినవాఁడని భావించి, యాతనిఁ జెఱ విడిపించి, రప్పించి, రాజునుజేయవలసినదిగ నొక మరణశాసనము వ్రాసి,[4] తన యల్లుఁడగు రామరాయలకు రాజ్యమునప్పగించి 'యచ్యుతరాయలకుఁ బట్టముఁ గట్టి, రాజ్యమును బూజ్యముగఁ బాలింపు' మని నుడివెను.[5]

భి

ఏ మహనీయుని ధర్మపరిపాలనమున హైందవధర్మరక్షణః గావింపఁబడెనో, ఏ పూతచరిత్రుని పరిపాలనమున విజయనగ

1. Ep. Carn· Vol. Ix, Magadi, Nos. 6 and 83; Ep. Coll, No· 139 1895; No· 683 of 1923; No. 181 of 1913; Nos. 115; 116 & 117 of 1918
2. Forgotten Empire - Nuniz, Page 360
3. Ibid, Pages 360-361
4. Ibid, Page 367
5. Queyroz, - Conquest of Ceylon, Vol. 1 Bk. 2, Page 383

సామ్రాజ్యలక్ష్మి దిగంతవిశ్రాంతకీర్తినార్జించెనో, యట్టి శ్రీకృష్ణదేవ రాయలు క్రీ. శ. 1529-వ వత్సరమున దివంగతుఁడయ్యెను. [1]

# అచ్యుతదేవరాయలు

ఒకవంకఁ గుమారుని మరణమును, వేఱొకవైపుఁ దన్నుఁ దండ్రివోలెఁ గాపాడిన తిమ్మరుసునకుఁ గలిగిన దుర్బుద్ధియుఁ దన్ను బాధించుచుండఁ, దన కించుక యూఱట గలుగుటకుఁ గాఁబోలుఁ, దన గౌరవమునకుఁ బాత్రుఁడై, మాండలికులలో నొక్కరుఁడగు సాళువనాయకుని క్రీ. శ. 1527 ప్రాంతమున రప్పించి, రాయ లాతనికి మహాప్రధానిపట్టముఁ గట్టెను. ఆ సమయమున సాళువనాయకుఁడు తిరువడిసీమను [2] పాలించుచుండినట్లు తెలియుచున్నది. సాళువ నాయకునకుఁ జెల్లప్పయనియుఁ, జెల్లప్ప వీరనరసింహరాయనాయకుఁడనియు, వీరనరసింహరాయనాయకుఁడనియు నామాంతరములున్నట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. ఈతఁడు తటువక్కైన్నాంభట్టరుకుమారుఁడు. అగస్త్యసగోత్రుఁడు. బోధాయన సూత్రుఁడు.

చంద్రగిరిదుర్గమునుండి యచ్యుతదేవరాయలు వచ్చి విజయనగరమునఁ బట్టాభిషిక్తుఁడగువఱకును, రాజ్యము సంపూర్ణముగ నళియ రామరాయలకు వశముగాకుండునట్లు సాళువనాయకుఁడు వేయికన్నులఁ గనిపెట్టుచు మంత్రిత్వమును జరపుచుండెను. [3] అచ్యుతరాయలు రాజ్యాధిపతియగునేని, దమకంత పలుకుబడియుండదని తలఁచి, తిరుమలదేవీ చిన్నాదేవులు తమ పుత్త్రునికిఁ బ్రతినిధిఁ గావించి, రామరాయల కళియపట్టముఁ గట్టఁ బ్రయత్నించిరి. [4] రామరాయలు కృష్ణరాయల యాజ్ఞను, దన బంధుత్వమును బుర

1. No. 525 of Epigraphical Collections for 1926
2. Arch. Sur. Rep , 1908-09, Page 184. Fn. 7
3. Forgotten Empire - Nuniz, Page 367
4. Sources of Vijayanagar History, Pages 178-181, నడిమిదొడ్డి పాళెగాండ్ల కైఫీయతు, Loc. Rec. Vol. 39, Page 16

స్కరించుకొని, రాయల రెండవకుమారునికిఁ దాను ప్రతినిధియై, రాజ్యపాలనము సాగించుచుండెను.[1]

మరణశాసనముననుసరించి యచ్యుతదేవరాయలును, బంధుత్వమును బురస్కరించుకొని రామరాయలును విజయనగరసామ్రాజ్య సింహాసన మధిష్ఠింప నువ్విళు లూరుచుండిరి.

శత్రురాజుల విజృంభణము

రాజధానీనగరపరిస్థితు లిట్లొడుదొడుకుగా నున్నసమయమున శాత్రవులు విజృంభించి, విజయనగరసామ్రాజ్యమును గబళింప నుంకించిరి. అట్టివారిలో మొదటివాఁడు సవాదుఁడనఁబొప్పు విజాపురసుల్తాను.[2] మన కవులు తమ గ్రంథములయం దీతనినే 'సవాయి' నామమున వ్యవహరించిరి. రెండవయతఁడు కళింగాధీశుఁడగు ప్రతాపరుద్రగజపతి. మూఁడవయతఁడు గోలకొండరాజధానిగ తెలుంగాణమును బాలించుచుండిన సుల్తాను ఖులీకుతుబ్ షా.

రాజ్యాభిషేకము

సామ్రాజ్యపరిస్థితుల ననుసరించియుఁ, గృష్ణరాయల మరణశాసనమునుబట్టియు, బందీకృతుఁడుగనున్న యచ్యుతదేవరాయలు చంద్రగిరిదుర్గమునుండి విముక్తుఁడై, యచ్చటికి సమీపముననున్న తిరుపతికిఁ బోయి, వేంకటేశ్వరుని సన్నిధినిఁ బట్టాభిషిక్తుఁడై,[3] విజయనగరాధిపతినని ప్రకటించుకొనెను. అటనుండి కదలి, విజయనగరమునకుఁ బోవుచు, మార్గమధ్యమునఁ గాళహస్తికిఁ జని, యందలి యీశ్వరునిసన్నిధానమున విరోధిసంవత్సర కార్తికమాస బహుళపంచమీ తిథికి సరియగు 1529 అక్టోబరు 21–వ తేదీని మరలఁ బట్టాభిషిక్తుఁడయ్యెను.[4] అటనుండి పయనమై, విజయనగరమునకరిగి, 1529–వ వత్సరము నవంబరు 20–వ తేదిని మరలఁ

1. Brigg's Ferishta. Vol. III, Page 381
2. ఇస్మైల్ ఆదిల్ షా
3. Sources of Vijayanagar History, Page 158
అచ్యు. తృ. ఆ. శ్లో. 23
4. Ep. Coll., Nos 157, 173 and 182 of 1924

బట్టాభిషిక్తుఁడయ్యెను.[1] ఆసమయముననే యచ్యుతదేవరాయల కుమారుఁడగు పిన్న వేంకటాద్రికి యౌవరాజ్యపట్టముఁ గట్టిరి.[2]

పట్టాభిషేకసమయమున నచ్యుతదేవరాయలు గాంచీపుర వరదరాజస్వామికిని, ఏకామ్రనాథస్వామికినిఁ గొన్ని గ్రామములు దానమొసఁగి, సువర్ణ మేరుదానమును సహితము చేసి, యీ దాన శాసనములందుఁ దాను గృష్ణదేవరాయల యాజ్ఞానుసారము రాజ యినట్లు వ్రాయించుకొనెను.[3]

## దండయాత్రలు

### (i) గజపతిని నోడించుట:

అచ్యుతదేవరాయలు సింహాసనాసీనుఁడయినవెంటనే ప్రతాప రుద్రగజపతిని నెదుర్కొనవలసివచ్చెను. ఈ దండయాత్రాసంద ర్భమునఁ గొండవీటిరాజ్యమును బాలించుచున్న అప్పరసయ్యయు, సలకము పెదతిరుమలయ్యదేవమహారాయలును, విట్ఠలదేవరాయ లును నచ్యుతదేవరాయలకుఁ దోడ్పడియుందురు. రాయలు గజప తిని నోడించి 'ఒడ్యరాజ్య'మున విజయస్తంభమునాటినట్లు శాసన ములవలనఁ దెలియుచున్నది.[4] కటకదేశవిజయానంతరము, కొండ వీటి రాజ్యమునకు సలకము పెదతిరుమలయ్యదేవమహారాయ లధి పతి యయ్యెను.[5]

అచ్యుత దేవరాయలు దండయాత్రయందున్నతఱి, రామ రాయలు విజయనగరమున నెక్కువ పలుకుబడి సంపాదించుకొని, తన పేరిట కవుళ్ళ నిచ్చుచుండెను. ఈ కారణమున నచ్యుతరాయల స్థితి క్రమముగా విషమమయ్యెను. రాయలిది గ్రహించి, రామరాయ

1. Sources of *Vijayanagar* History, Page 158
అచ్యు. తృ. ఆ. శ్లో. 24
2. కృష్ణదేవరాయల ద్వితీయకుమారుని విషయ మేమైనదియుఁ దెలియదు.
3. Ep. Carn., Vol. IX, Dod-Ballapur, No. 20
4. Arch. Sur. Rep. 1908-09, fn. 4; Ep. Coll., No. 253 of 1906
5. Ep. Coll. No. 544 of 1909

లకుఁ దగిన యధికార మొసఁగిన నే కాని, తనకు విజయనగర రాజ్య సింహాసనము స్థిరపడదని తలఁచి, సాళువనాయకుని ప్రధానామాత్య పదవినుండి తొలఁగించి, యా స్థానమును రామరాయల కొసఁగెను.

(ii) సాళువనాయకునితోఁ బోరుట:

సాళువనాయకుఁడు దనకుఁ గలిగిన పరాభవమును సహింపక, చోళ దేశమున కేఁగి, దానికి నధిపతియై, యచ్యుతరాయలపైఁ దిరుగఁ బాటొనరించి, స్వాతంత్ర్యమును బ్రకటించెను. అచ్యుతరాయలు నాగమనాయకుని సైన్యముతోఁ నంప, నాతఁడు వోయి, సాళువనాయకుని నోడించి, చోళమండలము నాక్రమించెను. అంతఁ జేయునది లేక, సాళువనాయకుఁడు చేరరాజ్యాధిపతిని శరణు సొచ్చెను.[1]

(iii) చేర దేశముపై దాడి:

మన కథ జరుగు కాలమునఁ జేరదేశాధిపతి భూతలవీర (శ్రీ) యుదయమార్తాండవర్మ.[2] ఈతఁడు విజయనగరసామ్రాజ్యమునకుఁ జేరిన సామంతరాజు. రాయలు మరణించినది మొద లీతఁడు విజయనగర సంస్థానమునకుఁ జెల్లింపవలసిన కప్పముఁ గట్టుట మానెను. ఉదయమార్తాండవర్మ తనకుఁ జేరువ రాజ్యమైన పాండ్య మండలమును గబళింప యత్నించుచుండెను. ఈతనికి సహాయులుగ సాళువనాయకుఁడును, రామనాథమండలమునందలి కొంతభాగమును బాలించుచుండిన తుంబిచ్చినాయకుఁడును నిలిచిరి. అచ్యుతరాయల కాలమునఁ దిరునల్వేలి మండలమును జటిలవర్మయను కులశేఖర పాండ్యుఁడు[3]ను, మారవర్మయను సుందరపాండ్య దేవుఁడును, మారవర్మయను పరాక్రమపాండ్య దేవుఁడును బాలించుచుండిరి. ఉదయమార్తాండవర్మ సాళువనాయకునియుఁ, దుంబిచ్చినాయకునియు సాయము గొని, పాండ్యులపై దాడివెడలి, వారి రాజ్యమును గబళించెను. కులశేఖరపాండ్యుఁడు రాజ్యమును గోలుపోయి, విజయ

1. Sources of Vijayanagar History, Page 58; అచ్యు. స. 4, శ్లో. 56.

2. The Aravidu Dynasty of Vijayanagar, Page 114

3. ఈతనికి శ్రీ వల్లభ పాండ్యుఁడను నామాంతరము గలదు.

నగర సామ్రాజ్యమునకుఁ దాను సామంతుఁడగుకతన, రాజధాని నగరమునకుఁ జని, యచ్యుతరాయలతో మొఱపెట్టుకొనెను. కప్పము గట్టకపోవుటచేతను, సాళువనాయకునకు శరణమొసఁగుటచేతను, గులశేఖరపాండ్యుని రాజ్యమును గబళించుటచేతను నచ్యుతదేవ రాయ లుదయమార్తాండవర్మపైఁ గినిసి, సలకము పెదతిరుమలయ్య దేవమహారాయలును, గొటికము నాగమనాయకుఁడును,[1] దిరుమలరాజపల్లవరాయరును,[2] రామరాజు విట్ఠలదేవరాయలును[3] దండనాథులుగనుండ క్రీ. శ. 1531 వ వత్సరమున దక్షిణదేశ దిగ్విజయమునకై బయలుదేఱెను. రాజనాథ డిండిమకవిరచితమైన అచ్యుతరాయాభ్యుదయ మను కావ్యమున నీ దండయాత్ర విపులముగ వర్ణితమైనది.

అచ్యుతదేవరాయలు విజయనగరమును వీడి, మునుముందుగఁ జంద్రగిరికిఁబోయి, యటఁ గొంత సైన్యమును నిలిపి, కాళహస్తి, కాంచీపురము, తిరువణ్ణామలై క్షేత్రములను దర్శించి, శ్రీరంగమునకుఁ బోయి, యటఁ గొన్నివాసరము లుండెను.

రాయల యాజ్ఞానుసారము బావమఱఁదియగు పెదతిరుమలయ్య దేవమహారాయలు సైన్యములతో దక్షిణాభిముఖుఁడై పోయి, చేరదేశాధిపతియగు నుదయమార్తాండవర్మను జయించి, యనర్ఘ కానుకలుగొని, సాళువనాయకుని బంధించి, తామ్రపర్ణి నదీతీరమున విజయ స్తంభమునాటించి, చేర చోళభూపతులను వెంటఁగొని, శ్రీరంగమున కరుదెంచెను.[4]

ఈ దండయాత్రాసందర్భముననే యచ్యుతదేవరాయలు సింహాళము[5] (ఈజమ్), తెంబులై, ఇరాడయర్నాయర్, కంబ

---

1. Ep. Ind. Vol IX, Page 330
2. List of Inscriptions of the Pudukkota State, No. 752, Page 119
3. Ep. Coll., No. 401 of 1918
4. Sources of Vijayanagar History, PP. 158-160; అచ్యు. స. 5, 6, 7. Ep. Coll. Ncs 40 of 1897; 222 of 1924

లం [1], యాజ్ఞాణము [1], జాఫ్నా [1] లనుగూడ జయించినట్లు తెలియుచున్నది.

(iv) బాణరాజులను జయించుట :

మహాబలివంశజుఁడై రామనాథప్రాంతముల నాక్రమించుకొని పాలించుచుండిన సుందరత్తోళుఁడై యార్ మావలివాణాదిరాయరు విజయనగరసామ్రాజ్యముపైఁ దిరుగుబాటొనరింప, రాయల యాజ్ఞానుసారము విశ్వనాధనాయకుఁడా బాణరాజును జయించెను. [2] విశ్వనాథనాయకుఁ డనిన నచ్యుతదేవరాయల కెక్కుడు గౌరవము.

దక్షిణదేశ దిగ్విజయయాత్రానంతర మచ్యుతదేవరాయలు బందీకృతుఁడుగనున్న చేరభూపతిని శిక్షించి, సామంతునిఁ గావించినట్లు తెలియుచున్నది. సాళువనాయక తుంబిచ్చినాయకులకు విధించిన శిక్ష యెట్టిదియో తెలియదు. పాండ్యరాజ్యమునకు శ్రీవల్లభపాండ్యుని నభిషేకింప, నాతఁడు కృతజ్ఞతాసూచకముగఁ దన కూఁతును రాయల కొసఁగి వివాహ మొనర్చెను. [3]

(v) విజాపురరాజ్యముపై దండెత్తుట :

దక్షిణదేశ వ్యవహారములన్నియుఁ జక్కఁబడినపిదప, నచ్యుతదేవరాయలు దన సైన్యములను నడిపించుకొని విజాపుర రాజ్యము మీఁదికిఁ బోయి రాయచూరుదుర్గమును ముట్టడించెను. [4] ఆదిల్షా యా వార్త విని, యపారసైన్యముతో వచ్చెను. ఉభయులకును ఘోరయుద్ధము జరిగెను. యవనాధిపతి యోడి పాఱిపోయెను. ఈ విజయమువలన మరల రాయచూరు విజయనగరసామ్రాజ్యమునకుఁ జేరెను. ఇది 1534 ప్రాంతమున జరిగియుండును.

(vi) గోలకొండ సుల్తానును జయించుట :

కొండవీటిని బాలించుచుండిన సలకము పెదతిరుమలయ్యో

1 List of Inscriptions of the Pudukkota State, No. 743, P.117
2. Ep. Ind., Vol. XVI, Page 287
3. Ep. Coll., Nos. 49 & 50 of 1900
4. Sources of Vijayanagar History, P. 160; అచ్యు. సర 11

దేవమహారాయలు అచ్యుతరాయలవెంట దక్షిణదేశ దిగ్విజయ యాత్రకై వెడలెనని ప్రస్తావించియుంటిని. ఈ సమాచారమును గోలకొండ సుల్తాను ఖులీకుతుబ్ షా తెలిసికొని. విజయనగరసామ్రాజ్యమునకుఁ జేరిన కొండపల్లి, కొండవీటిదుర్గములను ముట్టడించి, వానిని లోఁబఱచుకొనెను. ఇది జరిగినవెంటనే యచ్యుతదేవరాయలు అయ్యపరుసయ్య, రామయభాస్కరుఁడు. మల్లనాయని చినబొమ్మనాయఁడు, తిమ్మానాయఁడు మొదలగు దండనాథులను దనకు బాసటగాఁ గొనిపోయి, ఖులీకుతుబ్ షాను నోడించి, యా దుర్గములను గైవసము చేసికొనెను.

రాజధాని పరిస్థితులు

అచ్యుతదేవరాయలు గజపతులతోడను, మహమ్మదీయులతోడను బోరుచుండిన సమయమున రాజ్యమున సమభాగియై వ్యవహరించుచుండిన యళియరామరాయలు రాజ్యాధికారమునంతయు హస్తగతమొనర్చుకొని, విజయనగరసామ్రాజ్య సింహాసనమును సహితమధిష్ఠింపఁ బ్రయత్నించెను. అదికారణముగ నాతఁ డచ్యుతదేవరాయలను, నాతని బంధువులను గొంత నిర్బంధముననునిచి, తానె స్వయముగఁ బరిపాలనము సాగించెను.[1] ఈ తలఁపు వలదని జ్ఞాతులాతని మందలించి, యెదిరించిరి.[2] దీనికిఁ దోడుగ రామరాయల చేఁతలు గొంతవఱకుఁ బ్రజలలో నసంతృప్తినిఁ గలిగించినవి. సామంత రాజులకుఁ గూడ నసూయ జనించెను. రామరాయ లీ విషమ పరిస్థితులను గమనించి, యటనుండుట పాడిగాదని తలఁచి, సోదరులగు తిరుమలవేంకటాద్రులను వెంటఁగొని, విజయనగరమును వీడి, గుత్తి పెనుగొండదుర్గములకుఁ బోయెను.[3] పిదపఁ గొంతకాలము

1. (i) Brigg's Ferishta, Vol, III, Page 381
   (ii) తాడిపత్రి కైఫీయతు, Loc. Rec., Vol, XII, Page 213
2. (i) Brigg's Ferishta, Vol· III, Page 381
   (ii) తాడిపత్రి కైఫీయతు, Loc. Rec., Vol, XII, Page 213
3. (i) Brigg's Ferishta, Vol. III, page 82. (ii) Sources of Vijayanagar History, PP. 179-180 (iii) నడిమిదొడ్డి పాళెగాండ్ల కైఫీయతు, Loc· Rec. Vol, XXXIX, Page 16

నకు నచ్యుతదేవరాయలకును, రామరాయలకును సంధి కుదుర, రాజ్యమును నచ్యుతరాయలకు వశపఱచి, రామరాయలు తన [1] జాగీరునకు మరలిపోయి, తన సంస్థానమునం దాను స్వతంత్రుం డయ్యెను. [2]

రాజ్యపాలనావిధానము

అచ్యుతదేవరాయల పరిపాలనాకాలమున సలకరాజవంశము రాజకీయవిషయములం బ్రాధాన్యము వహించియుండెను. 'పెదతిరుమలయ్యదేవమహారాయలు కర్ణధారుఁడయి విజయనగర రాజ్యనౌకను నడపించుచుండెను; తమ్ముఁడగు చినతిరుమలదేవమహారాయ లుదయగిరి, చంద్రగిరి మొదలగుదుర్గముల కధిపతియై, రాజ్యరక్షణమున నప్రమత్తుఁడయ్యెను. బయకారరామప్పయ్య, రామయమంత్రి బాచరుసయ్య, అయ్యపరుసయ్య, భూతనాథుని రామాభట్లయ్య మొదలగువారు దుర్గాధిపతులుగనుండి, పేరును బెంపును గన్న మంత్రివరులుగ నుండిరి. కృష్ణప్పనాయకుఁడు, మల్లప్పనాయకుఁడు, బయ్యాపనాయకుఁడు, చిన్నపనాయకుఁడు సాహిణి నాయకులుగానుండిరి. వీరమరసపల్లవరాయరు, శొక్కణార్ పల్లవ రాయరు, భోగయదేవచోడమహారాయలు, చెన్నమరాజు బాల భూపతిచోడుఁడు, జగతాపికంచిరాజు రంగయదేవచోడమహారాయలు, సుందరత్తోళుడైయార్ మావలివాణాదిరాయరు, మట్లి అవుబళరాయమహారాయలును, పల్లవ, చోళ, బాణవంశజు లనేకులు అచ్యుతరాయలకు సామంతులుగనుండిరి.

'విజయనగరసామ్రాజ్యమంతయుం బరిపాలనసౌకర్యము నిమిత్త మిట్టి సామంతరాజ్యములక్రింద విభజింపఁబడెను. ఇట్టి సామంతులు రెండువందల కెక్కువమంది యుండిరి. వారికిం గల భూముల ననుసరించియు, రాఁబడినిబట్టియు వారు రాయసంస్థానమునకు యుద్ధమునకు సిద్ధముగనుంచి పోషింపవలసిన రాణువను, ప్రతి

1. ప్రళయకావేరి (పులికాట్) రాజధానిగనుండును - Correa, Vol. VI. Page 280

2. Brigg's Ferishta. Vol. III, Page 83

మాసమును జెల్లింపవలసిన కప్పమును రాయలు నిర్ణయించువాఁడు. ఈ నిర్ణయమునకు వ్యతిరేకముగ వారు ప్రవర్తించినయెడల రాయలు వారిని శిక్షించి, వారి యాస్తిని వశపఱచుకొనువాఁడు.' †

మతము : దానములు

అచ్యుతదేవరాయలు వైష్ణవమతావలంబకుఁడు. వైష్ణవ క్షేత్రముల కీతఁ డొనర్చిన దానము లసంఖ్యాకములు. శైవక్షేత్రములకు సహిత మనేక దానములొనర్చెను. షోడశమహాదానములు గావించి, కీర్తిఁగాంచినవాఁడు. ఈతని సువర్ణ మేరుదానమును, ఆనంద నిధి దానమును శాసనములందు బహువిధముల వర్ణితములైనవి. తన పట్టమహిషియైన వరదాంబికతోడను, కుమారుఁడగు చినవేంకటపతి రాయలతోడను ననేకసారులు మౌక్తిక తులాభారములు తూఁగెను.

సాహిత్యపోషణము

కవిపండితగోష్ఠియన్న నచ్యుతదేవరాయల కమితమక్కువ. రాజనాథడిండిముఁడు రాయల యాస్థానకవి. ఇమ్మహాకవి యచ్యుత దేవరాయల దిగ్విజయయాత్రల నభివర్ణించుచు సంస్కృతమున నచ్యుతరాయాభ్యుదయ మను కావ్యమును రచించెను. మఱియు భాగవతచంపువును రచించి, యా గ్రంథమును రాయల కంకిత మొసఁగెను. వరదాంబికాపరిణయ మను సంస్కృతకావ్యమును రచించిన తిరుమలాంబకూడ నీ రాయల యాస్థానమందుండెను. సంస్కృతకవులే కాక, యాంధ్రకవులుగూడ నీతని సభయందుఁ బెక్కురుండిరి. వారిలోఁ బేర్కొనఁదగినవాఁడు చింతలపూడి యెల్లయకవి. ఈతఁడు కృష్ణదేవరాయలకాలమునుండియు విజయనగరాస్థానమును గనిపెట్టుకొనియుండినట్లు తోఁచుచున్నది. ఈతనిగ్రంథములు రాధామాధవమును, తారకబ్రహ్మరాజీయమును.

---

† Forgotten Empire, Nuniz, Page 389

ఈ విషయములు మల్లంపల్లి సోమశేఖరశర్మగారి 'అచ్యుతదేవరాయలు' అను వ్యాసమునుండి గైకొనఁబడినవి. చూ - ఆం. వి. సర్వ. పుట 344

కట్టడములు

అచ్యుత దేవరాయ లెన్నియో గుళ్లను, గోపురములను గట్టించెనఁట. వానిలోఁ బేర్కొనఁదగినది విజయనగరమునందలి యచ్యుత దేవాలయము. దీనిని 1539-వ సంవత్సరమున నచ్యుత దేవ రాయలు గట్టించిన ట్లాయాలయ ముఖద్వారమునందలి శాసనము వలనఁ దెలియుచున్నది. ఈ రాయలకాలమునఁ గూడ విఠోబా లయ నిర్మాణ కార్యక్రమము కొంత జరిగెనందురు.

అచ్యుత దేవరాయలు క్రీ. శ. 1542-వ వత్సరమునఁ దన భౌతిక శరీరమును జాలించినట్లు తోఁచుచున్నది.[1] ఏలయన, నీతని కడపటి శాసనము శా. శ. 1463-వ వత్సరములోనిదిగాఁ గన్పట్టు చున్నది.[2]

# సదాశివరాయలు

అచ్యుత దేవరాయల పరిపాలనా కాలమున సలకరాజవంశము రాజకీయముగఁ బ్రాధాన్యము వహించియుండెనని తెలిపియుంటిని. కర్ణధారుఁడయి, విజయనగర రాజ్య నౌకను నడపించుచున్న సలకము పెద తిరుమలయ్య దేవమహారాయ లచ్యుతరాయల మరణా నంతర మాతని కుమారుఁడైన చినవేంకటపతిరాయలను సింహాసన ముననుంచి, తాన రాజ్యపాలనము నెఱపుచుండెను.

అచ్యుత దేవరాయలు దివంగతుఁడయ్యెనను వార్త వినఁగానే, రామరాయలు ప్రళయకావేరి[3] నుండి బయలుదేఱి విజయనగరము నకు వచ్చెను.

రామరాయలు రాజధానీ నగరమునకు వచ్చినవెంటనే యందలి మంత్రులలో రెండు కక్షలు పుట్టెను. అందొకటి తిరుమలయ్య దేవమహారాయలది; రెండవది రామరాయలది. రానురాను

1. Correa, Vol. IV, PP. 247-249, 276-282
2. No. 21, Epigraphical Collections of 1900
3. Correa, Vol. VI, P. 280-Quoted in Father Heras' Aravidu Dynasty of Vijayanagar, Page 25



అచ్యుతరాయ దేవాలయములోపలి ఒక దృశ్యము, హంపీ.

*—By Courtesy of Archaeological Dept., Madras.*

తిరుమలయ్య దేవమహారాయల కక్ష ప్రబలెను. ఆ బలమునఁ దాను బాలరాజును జంపి, రాజయ్యెను. ఈ దుష్కృత్యమునకు సరదారు లెల్లరుఁ దిరుగఁబడి, రామరాయల పక్షము వహించిరి. తిరుమలయ్య దేవమహారాయలు భయమంది, గత్యంతరము లేక, యాదిల్షాకు సంకితుఁడనయ్యెదనని వార్తనంపి, యాతని రావించి, విజయనగర రాజ్య సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. అంత రామరాయలు కార్యము చెడెనని భావించి, తిరుమలయ్య దేవమహారాయలకడకుఁ జని, 'నీవు నవాబును నెట్టులైనఁ బంపివేసినచో, మేమందఱము నీకు లోఁబడి యుండెద'మని వాగ్దాన మొనర్చెను. తిమ్మరాజా మాటలు నమ్మి నవాబునకుఁ గొంత ధనమిచ్చి, విజాపురమునకుఁ బంపివైచెను. నవాబు విజయనగరమును విడిచిపోయిన వెంటనే రామరాయలును, సరదారులును దిరుమలయ్య దేవమహారాయలపైఁ దిరుగుబాటొనరించిరి. శత్రు మధ్యమున బ్రదుకుట కష్టతరమని యెంచి, తిమ్మరాజు రాజభవనమున కపాట నష్టముఁ గలిగించి, యాత్మహత్య గావించుకొనెను.

రామరాయ లంత నచ్యుతదేవరాయల సోదరపుత్త్రుఁడైన సదాశివరాయలను సింహాసనమెక్కించి, తాఁ రాజ్యపాలనము జరుప మొదలిడెను.

ఇటనుండియుఁ దుళువ వంశము నామమాత్రావశిష్టమై, యారవీటి (నరపతి) వంశము రేకెత్తఁ దొడఁగెను.

# ఆర్వీటి (నరపతి) వంశము

పాలకులు

| | | |
|---|---|---|
| (అళియ రామరాజు | క్రీ. శ. | 1541 - 1565) |
| తిరుమల దేవరాయలు | ,, | 1569 - 1572 |
| శ్రీరంగ దేవరాయలు | ,, | 1572 - 1585 |
| వేంకటపతి దేవరాయలు | ,, | 1585 - 1614 |
| శ్రీరంగ రాయలు (చిక్క రాయలు) | ,, | 1614 — |
| రామ దేవరాయలు | ,, | 1614 — |
| పెద్ద వేంకటపతి రాయలు (గోపాలరాజు) | ,, | — 1642 |
| (ఆఱవ) శ్రీరంగ రాయలు | ,, | 1642 - 1678 |
| వేంకటపతి రాయలు | ,, | 1678 - 1680 |

## రామరాజు

శ్రీకృష్ణదేవరాయలతరువాత విజయనగరసామ్రాజ్యవైభవ విజృంభణములకుఁ బట్టుఁగొమ్మయై విలసిల్లిన రామరాయని వంశక్రమ మిట వివరించెదను.

రామరాజు ఆరవీటివంశమునకుఁ జేరినవాఁడు. అనంతపుర మండలమునకుఁ జేరిన తాడిపత్రితాలూకాయందలి యెల్లనూరు నొద్దఁ జిత్రావతీనదీతీరముననున్న పాడుపడినపల్లెయే యప్పటి యారవీడు. ఈతని పూర్వు లార్వీటినిఁ బాలించినకారణమున నీతనికి 'ఆర్వీటి - రామరా' జను పేరుగలిగెను. తుళువవంశాంబుధిసోముఁ డగు కృష్ణరాయల కీతఁ డల్లుఁడగుటచే 'అళియ - రామరా' జని వ్యవహరింపఁబడెను. మొదటినుండియు నీతని వంశజులకుఁ బధాతి

# ఆరవీటివంశావళి

చంద్రుఁడు
|
తాతపిన్నమరాజు
|
సోమదేవుఁడు
|
రాఘవదేవరాజు
|
పిన్నశౌరి
|
బుక్కరాజు (General of Saluva Narasimha)
|
రామరాజు (one of the two brothers)
|
శ్రీరంగరాజు
(one of the three brothers)
|
- కోనరాజు
- తిమ్మరాజు
- (అళియ) రామరాజు
- తిరుమలదేవరాజు
- వెంకటాద్రి

Section. 1

The Kings of Vijayanagar.

తిరుమల దేవరాజు (1)

(Brother of Aliya Rama Raya)




Section. 2

The Kings of Kurnool.

వేంకటాద్రి

(Brother of Aliya Rama Raya)



సైన్య మధికముగా నుండుటవలన నితని గోత్రజులు 'నరపతు'* లనఁ బరఁగిరి.

రామరాజు చంద్రవంశోత్పన్నుఁడు. ఈతనివంశమునకు మూలపురుషుఁడు తాతపిన్నమరాజు. పిన్నమరాజునకు 'అరిభీకరుఁ' డను బిరుదము గలదు. ఈతని కొడుకు సోమదేవుఁడు. సోమదేవుఁడు తండ్రిని మించినవాఁడు. ఈతఁ డొక్కదినమున నేడుకోటలు ముట్టడించి, జయించిన వీరుఁడు.† ఈతని పుత్త్రుఁడు రాఘవేంద్రుఁడు. రాఘవేంద్రునకుఁ బిన్నశౌరి యుద్భవించెను. పిన్నశౌరి కుమారుఁడు బుక్కరాజు. కృష్ణదేవరాయల పట్టాభిషేకసమయమున సభ నలంకరించినరాజులలో మేటి యీతఁడు. ఈతనికి రామరాజు జనించెను. రామరాజునకుఁ దిమ్మరాజు, కొండరాజు, శ్రీరంగరాజు నను మువ్వురు కొడుకులు గలిగిరి. ఆ మువ్వురలోఁ గడపటివాఁడగు శ్రీరంగరాజు గుణగణములను గూర్చి వసుచరిత్ర మిట్లు నుడువుచున్నది.

'క్షోణీవిశ్రుత నిత్యదాననిధియై సొంపొందు శ్రీరంగరా
ట్ప్రాణింబాయని సత్కృపాణి యదనం బ్రత్యర్థి దానైకపా
రీణం బాటరుదే తదీయకరతాదృక్ఖడ్గ విద్ధాహిత
శ్రేణుల్ మున్నగఁ గర్ణఖేచర వితీర్ణప్రౌఢి వాటింపఁగన్.'

— వసు. ప్ర. ఆ. ప. ౩౮

శ్రీరంగరాజు ధర్మపత్ని తిరుమలాంబ. ఆ దంపతులకు కోనరాజు, తిమ్మరాజు, రామరాజు, తిరుమలదేవరాజు, వేంకటాద్రి యను నైదుగురు కొడుకులు గలిగిరి. వారిలోఁ దృతీయుఁడే యళియరామరాజు. ఈతనికిఁ గోదండరాముఁ డను నామాంతరము గలదు. కోనరాజు పరాక్రమవంతుఁడై శత్రువులఁ దునుమాడిన మేటియని క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

* కళింగరాజులకు గజబలము తక్కినబలములకంటె నధికముగా నుండినందున వారికి 'గజపతు' లను బిరుదమువచ్చినది. గుల్బర్గరాజుల కశ్వబల మధికముగా నుండినందున వారికి 'అశ్వపతు' లను సంజ్ఞ కలిగెను. కర్ణాటరాజులకు నరబలమే యధికముగా నుండుటచే 'నరపతు' లను పేరు వచ్చినది.

† Epigraphia Indica, Vol. IV, Page 272

'శ్రీరంగాధిపు కోనభూవిభుని కీర్తి స్వచ్ఛతుండాంక తే
జో రాజద్ద్విజరాజు తీవ్రగతిచే నూర్యాతిగుండై నభం
బారోహించి పవిత్రమాసించుచు నహీనారాతులం జించి త
త్సారాహర్నిశగుప్తవాసవసుధన్ సాధించుఁజిత్రంబుగన్.'

— వసు. ప్ర. ఆ. ప. 39

ద్వితీయుఁడగు తిమ్మరాజుసహిత మహార్యపరాక్రముఁడు.

'ధాత్రీశ్వరులుగాని ధాత్రీశ్వరులు గారు
పురుడు వాగనుభూతి భూతిగతుల
మానవేంద్రులుగాని మానవేంద్రులుగారు
పోల్కిన యా భోగ భోగకళల
రాజహంసులు గాని రాజహంసులుగారు
సరి సత్కళాసార సారరుచుల
నరపుంగవులుగాని నరపుంగవులు గారు
తరమెన్న వరధర్మ ధర్మభృతుల
జగతి నీ మేటికని నృపుల్వాఁగడ నెగడె
నే బిరుదు రాయరాహుతాహితవధూభు
జంగ బిరుదాంకపుంఖిత సమరవిజయ
సాహళుఁడు తిమ్మవిభుఁడాజిదోహళుండు.— వసు. ప్ర. ఆ. ప. 41

ఇఁక రామరాజుయొక్కయుఁ, దిరుమల వేంకటాద్రులయొక్కయుఁ బరాక్రమాదిగుణవిశేషము కథాసరణిని దెల్లమగును.

ఉద్యోగము

తొలుత రామరాజు గోలకొండనవాబగు కుతుబ్ షా సైన్యమున నొక యుద్యోగిగా నుండెను. ఒక సమయమున నా నవాబు విజయనగరపుఁ బొలిమేరపై దాడివెడలి, యందుఁ గొంత భూమి నాక్రమించుకొని, రామరాజు నా భూముల కధినాథునిగఁ జేసెను. రామరాజు పాలనము మూఁడు వత్సరములైనను సాగకమునుపే విజాపురసుల్తానగు నాదిల్షా సైన్యసమేతుఁడై వచ్చి, రామరాజు పాలించెడి భూములపైఁబడి వానిని గొల్లలాడెను. రామరాజు శక్తికొలఁది శత్రువు నెదిరించి, విఫలుఁడై, తన నాథుఁడగు గోల

ొండ సుల్తానునొద్దకేఁగి, వృత్తాంతమంతయు విని చెను. ఆ మాట
కు సుల్తా నాగ్రహించి, రామరాజు పిఱికిపందయని యెంచి, పేరో
గమున నాతనిఁ బరిభవించెను. రామరాజు పరిభవానలసంతప్త
మానసుఁడై గోలకొండను విడిచి, విద్యానగరమునకువచ్చి, కృష్ణరా
యుల నాశ్రయించెను. అది మొదలాతఁడు తన బుద్ధివైశద్యమున
రాయల మెప్పించి, యాతని ప్రియతనూజాతను బరిణయమాడెను.

కుటుంబము

రామరాజునకు నలువురు భార్యలు. ప్రథమ భార్య తిరుమ
లాంబ. ఈమె శ్రీ కృష్ణదేవరాయల తనూభవ.† ద్వితీయ భార్య
అప్పలాంబ. ఈమె జిల్లెళ్ల పెద్దనందిరాజు పుత్రిక. తృతీయ
చతుర్థ భార్యలు కొండమాంబా లక్ష్మాంబలు. వీరు పోచిరాజు
తిమ్మరాజు కూఁతులు. తిరుమలాంబయందుఁ గృష్ణరాజు, పెద్ద
తిమ్మరాజు నను కొడుకు లుదయించిరి. పెద్ద తిమ్మరాజు, అహమ్మద్
నగర సుల్తాన్ నిజాంషా నెదిరించి జయించిన వీరుఁడని కడప మండ
లములోని బొల్లవరమునందలి శాసనము తెలుపుచున్నది. అప్పలాంబ
నిస్సంతు. కొండమాంబకుఁ గొండరాజు, చిన్న తిమ్మరాజు నను
కొడుకులు పుట్టిరి. కొండరాజు ఆనెగొంది రాజ్యమున కధిపతిగా
నుండెను. చిన్న తిమ్మరాజు రాయచూరుకోట కధికారిగనుండెను.
లక్ష్మాంబకు శ్రీరంగరా జుద్భవించెను.

రామరాజున కిరువురు తనయలున్నట్లు ప్రతీతి. వారి పేరు
వెచ్చుటను గానరావు. అందొక కూఁతును జ్యోతమరాజును, మఱి
యొక కూఁతును బస్వంతరాజును బరిణయమాడినట్లు వినికిడి గలదు.

రామరాజు ప్రభుత్వము

రామరాజు సదాశివరాయలను పేరునకుమాత్రము రాజుగఁ
జేసి, తాన రాజ్యపాలనము చేయుచుండెనని వ్రాసియుంటిని. పరా

† ఈమెకు మోహనాంగియను నామాంతరము గలదు. తిరుమలాంబ యనునది
గార్హ్యనామమగుటచే శ్రీ కృష్ణదేవరాయ లీమెకిడిన ముద్దు పేరిది. ఈమె మారీచీ
పరిణయ మను శృంగార ప్రబంధమును రచించిన కవయిత్రి.

క్రమోపేతులగు ననుజులును, దనుజులును దనకు సహాయులైయుండ, రామరాయ లిరువదియైదు వత్సరములు విజయనగర సామ్రాజ్యమును బూజ్యముగఁ బాలించి, విజాపురాది నవాబులకుఁ బ్రక్కలోని బల్లెమైయొప్పెను. ఈతఁడు సమయానుకూలముగ నొక నవాబును జేరఁదీసి, మిగిలినవారిని సాధించెడివాఁడు. ఈ విషయమును దెలుపు కథాభాగములనుగూర్చి వ్రాయుటకు ముందప్పటి తురుష్కనవాబులను గూర్చియు, వారి రాజ్యములను గూర్చియు వ్రాయుట సమంజసము.

విజయనగర సామ్రాజ్య వినాశమునకుఁ గారణభూతమైన బహమనీ రాజ్యము క్రీ. శ. 1347-వ వత్సరమున స్థాపింపఁబడెను. దానిని హసన్‌గంగూ అల్లా ఉద్దీన్ షాహ (1347-1358), మహమ్మద్ షాహ (1358-1375), ముజాహిద్ షాహ (1375-1378), మహమూదు షాహ (1378-1397), ఫిరోజ్ షాహ (1397-1422), అహమ్మద్ షా హావల్లి (1422-1435), అల్లాఉద్దీన్ షాహ (1435-1457), హుమాయూన్ షాహ (1457-1463), రెండవమహమ్మద్ షాహ (1463-1482), మహమ్మూద్ షాహ (1482-1518) అనువారు పాలించిరి. అందుఁ గడపటివాఁడగు మహమ్మూద్ షాహ కాలమున బహమనీ రాజ్యము వినాశమునొందెనని చెప్పవచ్చును. ఈతఁడు వ్యసనాసక్తుఁడగుటచే నీతని నెవ్వరును లక్ష్యపెట్టరైరి. ఈతని పరిపాలనా కాలముననే, బహమనీ రాజ్యము విచ్ఛిన్నమై, యందుండి యైదు రాజ్యము లేర్పడినవి. ఆ యైదింటఁ బ్రధానమైనవి నాలుగు— మొదటిది - ఆదిల్ శాహి యనఁబడు విజాపుర రాజ్యము. దీనికి ఇబ్రాహింఆదిల్ శాహ సుల్తానుగా నుండెను. ఆంధ్రకవులు తమ ప్రబంధములం దీతనిని 'సవాయి' లేక 'సపాదుఁ'డని వ్యవహరించిరి. విజాపుర సుల్తానునకును, విజయనగరాధీశులకును గృష్ణాతుంగభద్రానదీమధ్యప్రదేశములనుగూర్చి యెడతెగని పోరాటములు జరుగుచుండెను. వారి కలహములకుఁ గారణమైనవి రాచూరు, ముదిగల్లుదుర్గములు. రెండవది - నిజాంశాహియనఁబడు అహ

మ్మదు నగర రాజ్యము. దీనికి బుర్హాన్ నిజాంశాహ పాలకుఁడుగా నుండెను. మూఁడవది-కుతుబ్ శాహియనఁబడు గోలకొండ రాజ్యము. జమ్షీద్ కుతుబ్ శాహ దీనికధిపతి. నాల్గవది-బరీద్ శాహియనఁబడు బేదర్ రాజ్యము. ఇందలి బీదర్ దుర్గమునకు 'బెడందకోట' యని పేరు. దీని పాలకుఁడు అలీబరీద్.

ఈ తురుష్క ప్రభువులలో నైకమత్యము లేక, యనువైన తఱి నొండొరులు గయ్యాలాడుచు, నొకరి రాజ్యములోని భాగములను మఱియొకరు లాగుకొనుచుండిరి. అవసరమునుబట్టి విజయనగర రాజుల సహాయమును సహితము కోరుచుండిరి. కోరినవారికి విజయనగర సామ్రాజ్యాధీశులు తోడ్పడి, వారివలన లాభమును బొందుచుండిరి. శ్రీకృష్ణదేవరాయలు పాంచభౌతిక దేహముతో నున్నంత కాల మొక్క తురుష్క ప్రభువైనను దలయెత్తలేక పోయెను. కాని, వీరైనచోఁ గృష్ణాతుంగభద్రానదుల మధ్య ప్రదేశములను గబళింప వారు గాచియుండిరి.

ఆదిల్ శాహతో విరోధము

క్రీ. శ. 1543-వ వత్సరమున నహమ్మదాబాదు సుల్తానగు బురహాన్ నిజాంశాహ రామరాజుతోడను, గోలకొండ సుల్తానగు జమ్షీద్ కుతుబ్ శాహతోడను మైత్రి సలిపి, విజాపురనవాబగు నాదిల్ శాహమీఁదికి యుద్ధమునకుఁ బోయెను. రామరాజు తన సోదరుఁడైన వేంకటాద్రిని విజాపురరాజ్యమునకుఁ జేరిన రాచూరు, ముదిగల్లు దుర్గములను, గృష్ణాతుంగభద్రానదీమధ్యస్థితాంతర్వేదిని సాధించుటకుఁ బంపెను. ఒక వైపున నహమ్మదు నగరసుల్తాను, మఱియొక వైపున గోలకొండ సుల్తాను, వేఱొక వైపున విజయనగర రాజును జేరి, విజాపుర రాజ్యము నరికట్టిరి. ముప్పూరు రాజులేకమై, తన రాజ్యమును గబళింపనుండుటఁ జూచి, విజాపురసుల్తాను భీతిల్లి, యహమ్మదు నగర నవాబునకు షోలాపూరు జిల్లాప్రాంతముల

నొసఁగి, యతనితో సంధిఁ జేసికొనెను. పిమ్మట నాతఁడు రామ రాజుతో సంధిఁ గావించుకొనెను.[1]

క్రీ. శ. 1544-వ వత్సరమున బురహాన్ నిజాంశాహా, రామ రాయల ప్రోత్సాహమున, మరల, నాదిల్‌శాహాపైకి దండు వెడలెను. కాని, యాతఁడు పరాభూతుఁడై నిజరాజధానికిఁ దిరిగివచ్చెను.

క్రీ. శ. 1547-వ వత్సరమున విజయనగరాధీశుఁడైన సదా శివరాయలకును, బోర్చుగీసువారికిని సంధిజరిగెను. సంధిపత్త్రిము లందు సదాశివరాయల వ్రాలున్నను, బోర్చుగీసువారితో నిజ ముగా సంధిఁగావించినవాఁడు రామరాయలే. ఇందలి యంశము లన్నియు విజయనగరరాజునకును, బోర్చుగీసువారికిని ననుకూల ములై, విజాపురసుల్తానునకు నెక్కువనష్టముఁ గలిగించునవిగా నుండెను.

తురుష్క రాజ్యభాగములనుండి పాఱివచ్చిన ముసల్మాను లకు రామరా జభయ మొసఁగి, యాశ్రయమిచ్చుటయే కాక, వారికి వాసయోగ్యమైన వీథినిఁ గట్టించి, దానికి 'తుర్కీ మోహల్లా' (తురకల వీథి) యని పేరుపెట్టి, దైవారాధనకొక మసీదు గట్టించెను.

గోలకొండనవాబగు జమ్‌షీద్ కుతుబ్‌శాహ తమ్ముఁడు ఇబ్రాహిం. అన్నదమ్ము లిరువురకును బోరాటము గలుగ, నిబ్రాహిం భయపడి, విజయనగరమునకుఁ బాఱివచ్చి, రామరాజు శరణుచొచ్చెను. రామరాయ లాతనిఁ జేరఁదీసి యాతనికొక జాగీరొసఁగి కాపాడెను. జమ్‌షీద్ కుతుబ్‌శాహ చనిపోయినపిదప, ఇబ్రహిం 'ఇబ్రహింకుతుబ్‌శాహ' యను బిరుదుతో 1550-వ వత్సరమున గోలకొండరాజ్యసింహాసన మధిష్ఠించెను.[2]

---

1. Forgotten Empire, Page 184
2. Ibid, Page 189

**ఆదిల్ శాహతో మరలఁ బోరుట**

రామరాజు ఆదిల్షాకు మిత్రుఁడగుటచేఁ, దన రాయబారులు గొందఱు విజాపురమున నుండిరి. ఆ సమయమున నిజాం శాహ రామరాజున కనేకామూల్యమణులను, ప్రశస్తనిస్తుల వస్తు నివహమును గానుకలుగాఁ బంప, నాతఁ డంగీకరించెను. ఆదిల్షా యీ విషయమును దెలిసి, పేర్చినయాగ్రహమునఁ, దన యాస్థానముననున్న విజయనగరరాయబారుల నవమానపఱచెను. రామరాయల కీ విషయము తెలియఁగనే, యాగ్రహోదగ్రుఁడై, నిజాంశాహను నాదిల్ శాహతోఁ బోరుసలుపఁ బురికొలిపెను. అంత నిజాంశాహ, రామరాయలసాహాయ్యముగొని, యాదిల్ శాహ స్వాధీనముననున్న కల్యాణిదుర్గమును స్వాధీనపఱచుకొనెను. అదికారణముగ నాదిల్షా నిజాముపై దాడివెడలి, యాతనిదుర్గము నొకదానిని వశపఱచుకొనెను. పిమ్మట, క్రీ. శ. 1551-వ వత్సరమున రామరాజు నిజాంశాహలు కలిసి రాయచూరుదుర్గమును ముట్టడించి, ముదిగల్లుదుర్గమును నాశమొనర్చి, కృష్ణాతుంగభద్రానదీమధ్యస్థితాంతర్వేదిని జయించిరి. [1] ఈ యుద్ధమున రామరాయల నాల్గవకుమారుఁడగు చిన్నతిమ్మరాజు తన యద్వితీయ పరాక్రమమును జూపినట్లును, దరువాతఁ దాన యాదుర్గమున కధిపతియైనట్లును 'రామరాజీయము' లోని క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

> 'నారద వింటె చిత్రమిది నారకవాసులు గాక దేవతా
> వారిజగంధులం గలిసిరత్తురు నన్గొలువంగ ధేనుసం
> హారులు మ్లేచ్ఛులన్న వినుమా సురవల్లభ యాజిభూమి రా
> చూరిపురీశు తిమ్మవిభునుగ్రికదానిని మ్రగ్గఁగాఁజుమా.'

**నిజాంశాహతో వైరము**

అహమ్మదునగరరాజ్యాధిపతియగు బురహాన్ నిజాంశాహ 1553-వ వత్సరమున గతించెను. ఆతని యనంతర మాతని తనయుఁ

1. Forgotten Empire, Pages 189-190

డగు హుస్సేన్ నిజాంశాహ రాజ్యమునకు వచ్చెను. కొంతకాలము వఱకీతఁడును, విజాపురసుల్తానును మిత్రులుగానుండిరి. కాని, విజాపురసుల్తాను రామరాజుతో స్నేహించి, నిజామునిమీఁదికి దాడి వెడలి, షోలాపురమునొద్దఁ బరాభూతుఁడయ్యెను.[1]

ఈ సమయమునందే, విజాపురనవాబుకడ సరదారుగానుండిన సైఫ్అయిన్ ఉల్ముల్క తిరుగఁబడి, తననవాబును నోడించెను. నవాబు చేయునది లేక, రాజధానీనగరమునకుఁ బాఱిపోయి, రామరాజుసాహాయ్యమును గోరి, యాతనికి నేడులక్షల పరడావులు బహుమతిగా నిచ్చెను. అందులకు రామరాజెంతయుహృష్టుఁడై, రాజద్రోహిని శిక్షించి, నవాబును రక్షించుటకుఁ దన తమ్ముఁడైన వేంకటాద్రినిఁ బంపెను. సరదారుఁడు వేంకటాద్రిని నోడింప యత్నించెనుగాని, తుదకాతఁడు విఫలుఁడయ్యెను. విఫలుఁడగుటయే కాక, వేంకటాద్రిచేఁ దఱుమఁబడి, నైజాము రాజ్యమును జేరి యందు మరణించెను.

విజాపురనవాబగు నిబ్రాహింఆదిల్శాహ 1557–వ వత్సరమునఁ గాలధర్మమునొందెను. అతని యనంతర మాతని పుత్త్రుఁడగు నాలీఆదిల్శాహ నవాబయ్యెను. ఈతఁడుగూడఁ దన తండ్రివలె రామరాజుతో సంగాతము నెఱపె, తనతండ్రికాలమున విరోధుల వలన నపహృతములైన రాజ్యభాగములను మరల సంపాదింప నిశ్చయించెను. ఇట్టిసమయమున రామరాజు పుత్త్రులలో నొక్కరుఁడు మరణించెను. అది యెంతయుఁ దగినసమయమని యెంచి, యాలీయాదిల్శాహ విజయనగరమునకుఁ జని, పుత్త్రశోకవ్యాకులితచిత్తుఁడైయున్న రామరాజును నుపశమనవాక్యములనోదార్చి 'యేనెల్ల వేళల నీయాజ్ఞకు బద్ధుఁడనై యుందును. నాతండ్రికాలమున విరోధులచేఁ గైకొనఁబడిన రాజ్యభాగములనెల్ల నీ దయాతిరేకమున సంపాదించి, విజాపుర రాజ్యలక్ష్మి చలింపకుండనుండునట్లు

1. Forgotten Empire, Page 190

గావింపఁ దలంచితిని. ఇటనుండి నన్నుఁ బుత్త్రునివలెఁ బ్రేమింపుము. నీవు నాకుఁ బితృతుల్యుఁడ' వని పలికెను. ఆ మాటలకు రామరాజు సంతసించి, యాతనిఁ దన నగరమున మూఁడు దివసము లుంచుకొని, గౌరవించి, పంపెను. అదిమొదలు నుండియు రామ రాజును, నాదిల్ శాహయు నొకరినొకరు పితృపుత్త్రులవరుసను బిలిచికొనుచుండిరి.

ఆదిల్ శాహ విజాపురముచేరిన వెంటనే మీ వశముననున్న మా కల్యాణి, షోలాపురదుర్గములను మాకు స్వాధీనపఱుపవలయు నని యహమ్మదునగరసుల్తానునకు వర్తమానమంపెను. నిజాంశాహ యా వార్తావహుని నగౌరవించి, యాదిల్ శాహకుఁ గర్ణకఠోరమగు సందేశమంపెను. ఆ సందేశమును వినఁగానే యాదిల్ శాహ దండ తాడితభుజంగమువోలె మండిపడి, రామరాజు సాహాయ్యమును బడసి, యహమ్మదునగరరాజ్యముపైకి దాడివెడలెను. ఈ యుద్ధమున రామరాజు అహమ్మదునగరము మొదలు దౌలతాబాదు వఱకును, బొరండె మొదలు ఖిబర్ వఱకును గల ప్రదేశమంతయుఁ బాడుచేసెను. పాడుచేయుటయేకాక, తురుష్కస్త్రీలను నవమానపఱచి, మసీదులను బడఁగొట్టి, ఖురాణ్ గ్రంథమును జించివైచెను. ఇట్టి చెట్టచేఁతయే హిందువులకుఁ దరువాతఁ గలిగిన పరాభవము నకు బీజారోపణమయ్యెను. ఇదియంతయు జరిగినతరువాత, నిజాం శాహ గత్యంతరములేక, రామరాజుతో సంధిఁ గావించుకొని కల్యాణికోటను వశపఱచెను.[1] క్రింది పద్యములు సహితమీ విషయమును స్థిరపఱచుచున్నవి.

'హరిశౌర్యుఁడగు తిర్మలాధీశ్వరుండుఁద  
దవరజుండగు వేంకటాద్రిరాజు  
భుజయుగంబుగ బలస్ఫురణతోఁ గరిహరి  
వరవీరభటులతో దొరలతోడఁ  
దనయాజ్ఞమీఱినఁ గినుక నిజాముపై  
దండెత్తితఱిమి యుద్దండవృత్తి

1. Forgotten Empire, Pages 194-196

నతఁడేలు చున్నట్టి యాముదానగరంబు
 నాలె త్తి మఱి యాముదాలు వేసి
సేతుకాశిమధ్య భూతలనుతజయ
శ్రీవరించి వేడ్క చేఁ జెలంగు
రామమూర్తియైన రామరాజేంద్రుఁడు
సాంద్రవిభవజితసురేంద్రుఁ డెలమి.'

— నరపతివిజయము, ప. 822

'విశ్వామిత్రునిఁ గొల్చి రాముఁ డతఁడుర్విం జెందెఁ గళ్యాణము
న్విశ్వామిత్రులఁ గొల్వ రాముఁ డితఁడుర్విం జెందెఁ గళ్యాణముల్
శశ్వత్కీర్తులు రామలయ్యిరువురున్ సాధించు కళ్యాణలా
ఖైశ్వర్యంబులు ధర్మనిర్మథనధర్మాలంబనవ్యక్తముల్.'

— వసుచరిత్రము, ప్ర. ఆ. ప. 247

నిజాంశాహా యొసఁగిన కల్యాణికోటను రామరాజు ఆదిల్ శాహాకొసఁగెను. కల్యాణిదుర్గ మన్యాయముగ శత్రుహస్తగతమైన దని నిజాంశాహా చింతించి, గోలకొండనవాబగు నిబ్రాహింకుతుబ్ శాహాతో స్నేహించి, యాతనిసహాయమునఁ గల్యాణిదుర్గమును మరల సాధింపఁజనెను. ఈ వార్త వినుటయెతడవుగా, నాదిల్ శాహాయు, రామరాజును నసంఖ్యాకసైన్యములతో నరిగి, నిజాంశాహాను, గుతుబ్ శాహాను రణరంగమున డీకొనిరి. కుతుబ్ శాహా భయకంపితుఁడై రామరాజును జేరెను. నిజాంశాహా నిజరాజధానికిఁ బాఱిపోయెను. అంత రామరాజును. ఆదిల్ శాహాయుఁ గలిసి, యహమ్మద్‌నగరమును ముట్టడించిరి. ఈ యుద్ధమునందును హిందువులు మహమ్మదీయుల ననేకవిధములఁ భంగపఱచిరని ఫెరిస్తా వ్రాఁతలవలనఁ దెలియుచున్నది. ఇట్టి చేఁతలు విరోధియైన నిజాము నకే కాక మిత్రుఁడైన విజాపురనవాబునకును హిందువులయెడ ద్వేషము గలిగించినవి. అంత నిజాంశాహా శరణువేఁడ, రామరాజు, అహమ్మద్‌నగర మాతని కొసఁగెను.[1] గోలకొండనవాబు ఘనపురమును, పానగల్లును రామరాజున కొసఁగెను.[2] ఈ యుద్ధము

1. Forgotten Empire, Pages 197-198
2. జీర్ణ విజయనగరచరిత్రము, పుట 210

లందు రామరాజు సోదరులగు తిరుమలవేంకటాద్రులును, దనయులగు తిమ్మరాజాదులును జూపిన పరాక్రమము వసుచరిత్రాది గ్రంథములందుఁ జక్కఁగా వర్ణింపఁబడినది.

'అతఁడు నృపమాత్రుఁడై యరయఁగ సపాద
కుతుపసాహి నిజామాది కుతలపతులఁ
జెండె దోర్గర్వఖర్వితాఖండలుండు-
రణజయవిహారి - తిరుమలరాయశౌరి.'

— నరపతి. ప. 235

'కడిమిన్ వేంకటరాయశౌరి నెదురంగా లేక యత్యాహితం
బడరన్ గౌతమిదాఁటువేళ నిజకాంతాశ్రుప్రవాహోత్థిఁగా
ల్నడ దప్పన్ జితుఁడై నిజాముఁ డుడుపాలంబంబునన్ దాఁటి యొ
క్కఁడఁగన్నన్ భజియించు నయ్యుడుపరేఖన్నామ మోహంబునన్'

— వసు. ప్ర. ఆ. ప. 52

'ధ్యేయుఁడు రామరాజ పెదతిమ్మవిభుండని వాజిదోలలోఁ
బాయని భీతిచేత మొనభగ్నముగా యవనుల్ దొలంగ నా
చాయ నిజాముఁడడ్డుపడ సామజయూథముఁ ద్రుంచెఁ జూపఱుల్
వాయుజుఁడంచు నెంచఁగ నవార్యసముజ్జ్వల బాహుశౌర్యుఁడై'

— నరపతి. ప. 300

'మావులు నేనుఁగుల్ భటసమాజము పీనుఁగుపెంటఁగాఁగ గం
గావతినుండి కృష్ణదనుకం బొనరించి నిజాముఁ ద్రోలి రా
మావనినాథు కొండవిభుఁ డాహవకేళిఁ జరించెఁ జూచియా
దేవతలెల్ల నీఘనుఁడు దేవవరాత్మజుఁడంచు నెంచఁగా'

నరపతి. ప. 303

తురుష్కప్రభువుల నవమానించుట

ఎడతెగక కలుగుచుండిన జయాతిశయమున రామరాజు గర్వోద్రిక్తుఁడై మైమఱచి, నవాబులను వారి రాయబారులను నిర్లక్ష్యభావమునఁ జూచుచు నవమానించుచుండెను. అంతియకాక, యహమ్మద్ నగర విజాపుర రాజ్యములనుండి కొన్ని భాగములను గైకొనెను. గోలకొండ రాజ్యములోని ఘనపుర, పానగల్లుదుర్గములను స్వాధీనపఱచుకొనెను. అంతటితోఁ దృప్తినొందక, సమ

యమునుబట్టి తురుష్క రాజ్యముల నన్నిటినిఁ గబళింపవేచియుం డెను. దాన నవాబు లెల్లరుఁ గ్రోధానలసంతప్తమానమానసులై, విజయనగర రాజ్యశల్యమును బెకిలివేయ నిర్ణయించిరి.

నవాబుల సమ్మేళనము

మొట్టమొదట నవాబుల యైకమత్యమును గాంక్షించినవాఁడు విజాపుర సుల్తానగు నాదిల్ శాహ. తాను స్వయముగ రామ రాజు నెదిరింపఁ దలఁచెను గాని, యది తనచేతఁ గానిపనియని తెలిసి, తోడి నవాబుల సాయమును గోరుట లెస్సయని నిశ్చయించెను. నిశ్చయించుటయే తడవుగా, నాతఁడొక రాయబారిని గోల్కొండ నవాబగు కుతుబ్ శాహయొద్దకుఁ బంపి, యాతనికిఁ దన యభిప్రాయ మును దెలిపెను. కుతుబ్ శాహ యందులకు సమ్మతించి, యహ మ్మద్‌నగర నవాబైన నిజాంశాహకును, నాదిల్ శాహకును మైత్రి సలుపఁ దాను మధ్యవర్తియై, నిజాంశాహకడకుఁ దత్కార్యార్థమై ము స్తఫఖానును రాయబారిగఁ బంపెను. అంత నా రాయబారి యహమ్మద్ నగరనవాబుకడ కరిగి, చెప్పవలసిన మాటల నత్యంత నైపుణి వెలయ నుడివెను. నిజాంశాహ యా పలుకులయందలి సత్య మును గ్రహించి, యామాత్యులతో మంతనములాడి, యాదిల్ శాహతోఁ దనకుఁ గల వైరము మాని, యాతనితో మైత్రిసలుప సమ్మతించెను. సమ్మతించుటయె కాక, విజయనగర సామ్రాజ్య విధ్వంసమునకై తోడ్పడ బద్ధకంకణుఁడయ్యెను. అంతియ కాక, తన ముద్దులపట్టియగు చాందుబీబిని నాదిల్ శాహకొసఁగి పరిణయము గావించి, షోలాపురమును గానుకగా నొసఁగెను. అందులకుఁ బ్రతి ఫలముగా నాదిల్ శాహ తన సోదరియగు ఫాలాబీబిని నిజాంశాహ పెద్ద కొమారుఁడైన ముర్తిజా కొసఁగి వివాహము గావించెను.[1] ఇట్లుభయులకు సంబంధ బాంధవ్యములు సహిత మేర్పడినవి.

ఇవ్విధమున విజయనగర సామ్రాజ్యవినాశమునకై తురుష్క ప్రభువులగు నిజాంశాహ, ఆదిల్ శాహ, కుతుబ్ శాహ, బరీదు

1. Forgotten Empire, Pages 198-199

శాహాయు నేకీభవించి రణారంభమునకుఁ గారణమూరయుచుండిరి. బరీదుశాహా యే కారణమునఁ బై మువ్వురు నవాబులతోఁ జేరెనో తెలియదు. ఫెరిస్తా మొదలగు చరిత్రకారు లెవ్వరు నీ విషయమును గూర్చి వ్రాయరైరి.

నవాబుల యుద్ధ ప్రయత్నము

రామరాజుతో మొదటఁ గయ్యమునకు దిగినవాఁ డాదిల్ శాహా. తన రాజ్యమునుండి కైకొనిన భాగములను దనకిచ్చివేయ వలయునని యాదిల్ శాహా రామరాజునకొక రాయబారితో సందేశ మంపెను. రామరాయలు తన వాడుక చొప్పున నా రాయబారిని నవమానించి, తన సభాస్థలినుండి తఱుమఁగొట్టించెను. అది కారణముగఁ దురుష్క ప్రభువులు రామరాయలపై దాడి వెడల సన్నద్ధులైరి. అంత నలువురు నవాబులును దమతమ బలములతో విజాపుర బాహ్య ప్రదేశమున విడిసిరి. వీరి సైన్యమునఁ బదివేల గుఱ్ఱపు దళమును, మూఁడువేల కాల్బలమును నున్నట్లు పోర్చుగీసువారి వ్రాఁతలవలనఁ దెలియుచున్నది. వైరివర్గపు బలములఁ బెక్కురు వీరులు గలరు. అందు గోలకొండ ముస్తఫఖానుఁ డొకఁడు. ఇతని పేరు కమాలుద్దీన్. 'హుసేన్ ముస్తఫ' యనునది యాతని బిరుదు. మౌలానా ఇనాయతుల్లా యహమద్ నగరసైన్యమున కధిపతి. కిష్వార్ ఖాన్ విజాపుర సేనాధికారి. నవాబుల సైన్యమునఁ జేరు గాంచిన మహారాష్ట్ర వీరులును గొందఱుండినట్లు తెలియుచున్నది. వారిలోఁ బేర్కొనఁదగినవారు యశ్వంతరావు, భోజమల్లునాయకుఁడు, దేవనాయకుఁడు, విశ్వాసరావు, కోళే రావు. వీరందఱును విజాపురమునుండి క్రీ.శ. 1564-వ సంవత్సరము డిసెంబరు నెల 25-వ తేది సోమవారమునాఁడు బయలుదేఱి, * తమ సైన్యములను దక్షిణ దిక్కునకు నడిపించిరి. కతిపయప్రయాణములలోఁ గృష్ణానది కుత్తరమున ద్రోణనదియొడ్డున నున్న తాళికోట దుర్గమును జేరిరి. ఇది కృష్ణా ద్రోణానదుల సంగమస్థానమునకుఁ బదునాఱు మైళ్ళ దూరమున

* 20th Jamada'l awwal Hijra 972, Firishtah (Scott) 1,295; Briggs III 413

నున్నది. తాళికోట యాదిల్‌శాహా రాజ్యములోనిది గావున నాతని యాతిథ్యముఁ గొనుచు మహమ్మదీయ సైనికులు యుద్ధమున కుఁ దగిన వ్యూహముల నేర్పఱచుకొనుచుండిరి.

రామరాయల సమర సన్నాహము

ఈ యుదంతమును రామరాజు విని, తన వైపున సహితము సమరసన్నాహముఁ గావింప సమకట్టి, కృష్ణానదీ దక్షిణ తీరము మొదలు సింహళద్వీపమువఱకుఁగల [1] తన సామంతరాజులనుండి సైన్యములఁ బ్రోగుచేయఁదొడఁగెను. మధురాపురాధీశ్వరుఁడగు కృష్ణప్పనాయకుఁడు తా రాఁజాలమికి వగచి, తన మంత్రియగు నరియ నాథ మొదలియారును సైన్యముతో విజయనగరమున కంపెను.[2] ఆ బలముతోఁ గర్ణాటక దేశాధిపతియగు బసవరాజును వచ్చినట్లు పుదుక్కోటలోని పాండ్య శాసనమువలనఁ దెలియుచున్నది.[3] సామ్రాజ్యములోని నానా ప్రాంతములనుండి వచ్చిచేరిన బలమును, రాజధానీ నగరమునందలి బలమును గలిసి డెబ్బదివేల గుఱ్ఱపుదళ మును, దొంబదివేల కాల్బలము నని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు.[4] గుఱ్ఱపుదళ మొక లక్షయు, గాల్బలము మూఁడు లక్షలని గోల కొండ చరిత్రకారుఁ డొకఁడు వివరించియున్నాఁడు.[5] అశ్వబలము లక్షయుఁ, గాల్బల మాఱులక్షలు నని కౌటో సూచించియున్నాఁడు.[6]

పిమ్మట రామరాజు శుద్ధాంతమున కేఁగి, తన సతీమణుల ననునయించి, వారి కమూల్యాభరణములొసఁగి, యటనుండి తల్లి కడకుఁబోయి, యుద్ధవృత్తాంతమామెకుఁ దెలిపి, యామెవలన నాశీ ర్వాదములంది నగరున కేఁగెను. అట నించుక విశ్రాంతిఁ గైకొనఁ దలఁచి యించుక విశ్రమింప, నాతని కొక తూఁగుపట్టెను. ఆ సమ

1. Ferishta III, Page 413
2. Mrtyunjaya MSS, Taylor, O. H. MSS, II, Page 115 Prof. Satyanatha Aiyar (History of the Nayaks, Page 68) thinks that Ariyanatha arrived at Vijayanagara a little late.
3. T. A S., I, Page 84, VV· 161-164
4. Ibid, Page 247
5. Ibid, Page 413
6. Couto, VIII, Page 89

యమున నెవ్వరో వచ్చి, తన చెవిపోఁగుల లాగుకొని, సింహాసనము నుండి క్రిందికి ద్రోచినట్లు కలఁగని, వెంటనే మేల్కాంచి, యా స్వప్న భావమును దెలిసికొన జ్యోతిషికుల రావించి, వారి కా వృత్తాంతమును దెలిపెను. వారించుక యోజించి భయము లేదనియు, శత్రువులు నిర్జింపఁబడుదురనియు వాక్రుచ్చిరి. అందులకు రాజెంతయు హృష్టుఁడై, యా జోస్యుల కనుగరల నొసఁగి యంపెను.

యుద్ధ సంభారములన్నియు సిద్ధమైనవి. ఇఁక రామరాజు సకల సేనాసమూహముతో రాజధానీ నగరము వీడి, శత్రుసైన్యాభిముఖముగ నడచుటయే మిగిలియున్న పని. రామరాజున కప్పుడు డెబ్బది వత్సరముల వయస్సని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు.[1] ఎనుబది వత్సరముల ప్రాయమని బురానిమసిర్ తన కైఫీయతునందుఁ దెలిపి యున్నాఁడు.[2] తొంబదియేండ్ల యీడని పోర్చుగీసువారి వ్రాఁతలు సూచించుచున్నవి.[3] వ్యాపారార్థమై తఱచుగ విజయ నగరముతో రాకపోకలు జరుపుచుండిన పోర్చుగీసువారి వ్రాఁతలే విశ్వసనీయములని వక్కాణింపవలసియున్నది.

అంత రా మ రా జు తురుష్క బలములను గృష్ణానదిని దాఁటి రానీయకుండులాగున నరికట్టనెంచి, యిరువదివేల గుఱ్ఱపు దళమును, నైదువందల యేనుఁగులను, లక్ష కాల్బలమును నొసఁగి తిరుమలరాజు నంపెను. అతనివెంట నంతియ బలముతో వేంకటాద్రియుఁ బయనమాయెను. పిమ్మట, మిగిలిన బలముతో రామ రాజును దమ్ములఁ జేరఁబోయెను.[4]

తురుష్క సేనలు తాళికోట విడిచి, కృష్ణానది కుత్తరమున నున్న విజయనగర రాజ్యపుఁ బొలిమేరలఁ బడి నాశముసేయ నారంభించినవి.[5] తిరుమల వేంకటాద్రు లిరువురును గృష్ణానదీదక్షిణ

1. Ferishta III, Page 129
2. Burhan-i-Maasir, Ind. Ant., L, P. 146
3. Couto, III Page 90
4. Ferishta, III. Page 127
5. Couto, VIII, Page 89

తీరమున నందందు శతఘ్నులనిలిపి, [1] ముసల్మానులు నదిను త్తరించి రాకుండునట్లు గనిపెట్టియుండిరి. అంత నవాబులు నదినిదాఁటు ననువు గానక, మాయోపాయమునఁ గృష్ణానదీదక్షిణతీరమును జేర నెంచి, తమసేనలను వాహినీతీరమున నడుపఁజొచ్చిరి. తురుష్క సేనలు ముందునకు సాగిపోవుచున్నవని తలఁచి, తిరుమలవేంకటా ద్రులు తమ దళములనుసహితము దక్షిణతీరమున నడిపింపఁజొచ్చిరి. ఇట్లుభయసైన్యములును నెడతెగక, మూఁడుదినములు నదీతీరముల నడచినవి. నాల్గవదినమున, హిందూసైన్యము లేమఱియున్నతఱిఁ, దటాలునఁ దురుష్కప్రభువులు తమ వాహినుల నదిని దాఁటించిరి. కృష్ణానదీదక్షిణతీరమును జేరినవారిలో మొదటివాఁడు అహమ్మద్ నగరసుల్తాను హుసేన్ నిజాంశాహా.

తాళికోటయుద్ధము: 1565

పిదప నిరువాఁగులును డీకొనినచోటు కృష్ణానదికిఁ గొన్ని మైళ్ల దూరమునఁ గల 'రక్షస్', 'తంగడిగి' యను గ్రామముల మధ్యప్రదేశము. [2] నవీనచారిత్రకపరిశోధకు లీ యుద్ధమునకు 'రక్షస్, తగ్గి' యని పేరిడిరి. రామరాజు ముందుగ రణవీరులని పేరొందిన రాచవీటియోధవర్గమును శత్రువుల పరిస్థితులను గనుఁగొని రమ్మని పంప, [3] వారేఁగుచుండ, మహమ్మదీయయోధవరులు గొందఱెదు రైరి. అంత నుభయులకును బోరుజరిగెను. తుదకు రాచవీటివారే జయమందిరి; మహమ్మదీయులు పాఱిపోయిరి. [4]

రామరాజు తనశిబిరమున భుజించుచుండ, శత్రుసైన్యములు దమపైఁ బడవచ్చుచున్నవనువార్త వినవచ్చెను. అతఁడు వెంటనే లేచి, దవ్వులనున్న పరిపంథిసైనికుల కోలాహలముఁ గాంచి, లేని బలముఁ దెచ్చుకొని, యశ్వమధిష్ఠించి, తనబలములను యుద్ధమున కాయత్తపఱచెను. [5] దక్షిణపార్శ్వమునఁ దిరుమలుఁడును, నెడమ

1. Ferishta, I. C. Page 127
2. The Destruction of Vijayanagara, I C., Page 176
3. Couto, VIII, Page 90
4. Chandorkar, The Destruction of Vijayanagara I; C. Page 177
5. Couto, I. C.

వైపున వేంకటాద్రియుఁ దమతమ బలములతో నిలిచియుండ, రామ
రాజు మధ్యభాగమున నిలిచి, రెండువేల యేనుఁగులను, వేయి
శతఘ్నులను శత్రుసైన్యముల కభిముఖముగ నిలిపి, యుద్ధమునకుఁ
బ్రోత్సహించెను. [1] నవాబులును దమతమ వ్యూహములు పన్ని సిద్ధ
పడిరి. విజాపురనవాబు వేంకటాద్రిని, గోలకొండబీదరునవాబులు
తిరుమలుని నెదిర్చిరి. రామరాజును ఢీకొన హుసన్ నిజాంశాహ సంసి
ద్ధుఁడయ్యెను.

విరోధిసంరంభమును గాంచి తిరుమల వేంకటాద్రులు
'మేము శత్రువుల ఢీకొందుము. మీరు వయస్సుచెల్లినవారు. యుద్ధము
సేయవలదు. వెనుక నిలిచియుండుఁ' డని రామరాజును వేఁడు
కొనిరి. కాని, యాతఁడు, 'బొందిలోఁ బ్రాణమున్నంతవఱకుఁ బరి
పంథులఁ బరిమార్చుకతప్ప' దని నుడివి, సింహాసనపుఁ బాలకీనెక్క
నుంకించెను. అప్తులుగొంద ఱాతనితో గుఱ్ఱము నెక్కి యుద్ధము
సేయుట లెస్సయనిరి. వారిమాటల నాతఁడు పెడచెవినిఁ బెట్టెను.

మొదట శత్రుబలమును దాఁకినవాఁడు వేంకటాద్రి. [2] ఈతఁ
డద్వితీయపరాక్రమవంతుఁడు. శత్రుసైన్యములమార్గ్యని యనతి
కాలముననే వారినిఁ జించిచెండాడెను. ఆదిల్ శాహ, వేంకటాద్రి
దెబ్బకుఁ దాళఁజాలక, రణరంగము వీడిపఱచెనని మహమ్మదీయేతి
హాసికుఁడైన బురానిమసిర్ వ్రాసియున్నాఁడు. [3] తిరుమలుఁడున్
నాతని తనయుఁడైన రఘునాథుఁడును గోలకొండబీదరసుల..ని
నిరోధించి, లెక్కకుమిాఱినసైనికుల మట్టుపెట్టిరి. గోలకొండ..శాహ
సహిత మా యుద్ధతీవ్రతకుఁ దాళఁజాలక పాఱిపోయిన..న్నది. [5]
మసిర్ వ్రాఁతవలనఁ దెలియుచున్నది. [4] చివరకు ... నకుఁ జను
గన్నుపోయెను; [5] రఘునాథుఁడు మరణించెను. ...క మదకరి
...రుగిడెను. వాహ

1. The Burhan-i-Ma'ssir, I. C., Page 193
2. Couto, VIII, Page 91
3. Burhan-i-Mas'sir, I C., Page 193
4. Burhan-i-Mas'sir, I C.; Page 193 ...e 212
5. Purchas X, Page 93

...Page 92

ఈ విషాదోదంతమును రామరాజు విని, క్రోధతామ్రేక్షణుఁడై, పాలకి నవరోహించి, యశ్వారూఢుఁడై, శత్రుసైన్యముల నుఱుమాడనేఁగెను. ఆ వృద్ధవీరుని తేజఃపుంజముల యెదుట నిల్వఁజాలక, నవాబులును, వారి సైన్యములును యథాయథలై దిక్కులకుఁ బాఱిపోయిరి. ఈ సమయమున రాచవీటివీరులు సూపిన పరాక్రమ మనిర్వచనీయము. ఇంతయైనను వైరివర్గము తమ ప్రయత్నమును మానినది కాదు. ఆదిల్‌శాహా, చెదరిన సైన్యమును బ్రోగుచేసికొని, మరల రామరాజుపై యుద్ధమునకు వచ్చెను.[1] ఇరువురకును బోరు ఘోరముగ జరిగెను. విజాపురసుల్తా నించుక యలయికఁ జెంద, నహమ్మద్‌నగరసుల్తాను, ఆదిల్‌శాహానుగలిసికొని పోరు సాగించెను. ఉభయపక్షములవారును బోరుచుండ, మహమ్మదీయపక్షమునకుఁ జేరిన యిఖ్లాస్‌ఖాన్ రూమిఖానులు వెనుకభాగమున రచించియుంచిన శతఘ్నులఁ బ్రేల్చిరి. వాని తాఁకుచేఁ రామరాజుసైన్యములోఁ గొంత నశించి, తక్కుంగలయది చెదరి పఱతెంచెను.[2] అంత హుసన్‌నిజాంశాహా తనకుఁ గలిగిన జయమునకు సంతసించి, తోడివారలఁ జేరఁబిలిచి, విరోధిసేనల కభిముఖముగఁ దన శిబిరమును నిర్మింప నాజ్ఞాపించి శత్రువిధ్వంసమునుగువఱకును నెక్కినగుఱ్ఱమును దిగనని శపథము చేసెను.

రామరాజా శపథము విని, కోపోద్దీపితమానసుఁడై, శత్రు
జయ...ప కెపటఁ దనకొక సింహాసనము రచించునదిగఁ దనపరివారమున
...యొసఁగెను. వారంత నత్యంతరామణీయకమైన యొక గద్ది
...ర్మించిరి. రామరాయ లశ్వమును దిగి, గద్దియనెక్కి, తన
దమపైఁ ...రునాణెములను రాసులుగఁ బోయించి, నాఁటి యుద్ధ
లేచి, దవ్వ...ియని పరాక్రమమునఁ బోరు యోధులను బహూక
బలముఁ దెచ్చు...మ్యెను. ఆ ప్రయత్నమును గాంచి, చెదరిపోయిన
శాయ త్తపఱచెను.
...రల రామరాయలచెంత కరుగుదెంచి, తమ

1. Ferishta, I. C.
2. The Destruction...es 91-2
3. Couto, VIII, Page...92
4. Chandorkar, The ...
5. Couto, I. C.

యద్వితీయపరాక్రమమును ప్రకటించి, పరిపంథి చతురాసమూహాముల నోడించినవి. విజాపురము, గోలకొండనవాబు లీకం దమకు జయముకలుగదని నమ్మి, పాఱిపోవుటకు సంసిద్ధులైరని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు.[1] అహమ్మద్‌నగరనవాబు తన సింహాసనమును దనసైన్యమునకుఁ గేంద్రస్థానముగఁ జేసెను. హైందవ సైనికులు ముందటిభాగమునకు వచ్చునెడల, వారిని హతమొనర్ప రూమీ ఖానుఁడు తాను రచించియుంచిన శతఘ్నులను రాగినాణెములతో నించెను. ఆ ఫిరంగులు ప్రేలినప్పుడు వాని ముఖముల చెంతనున్న యేనూఱుహైందవులు నశించిరి. ఆ శబ్దమునకు భయపడి, విజయనగరసైనికులలోఁ బెక్కురు చెదరిపోయిరి. అంత విజాపురసైన్యాధ్యక్షుఁడగు కిష్వార్ ఖాన్ లేరి యైనువేల గుఱ్ఱపు రౌతులతో శత్రువాహినీమధ్యమునఁ జొరఁబడ, మిగిలినవారును జెల్లచెదరైరి.[2] ఈ సమయమున, విజయనగరపక్షమువహించి పోరుచున్న మహమ్మదీయ దళవాయి లిరువురు తటాలునఁ దమసైన్యములతో ముందునకు నడచి, శత్రుసైన్యములఁ జేరిరని పోర్చుగీసు చరిత్రకారుఁడైన ఆన్‌క్వేటిల్ డూపెరన్ వ్రాసిన వ్రాఁతలవలనఁ దెలియుచున్నది.[3] ఈ మహమ్మదీయదండనాయకుల పేరు తెల్పుటను గానరావు. కాని, యందొకఁడు రామరాయల యనుచరుఁడైన అయినుల్ ముల్క్ (Ain - ul - Mulk) అయియుండవచ్చునని హీరాస్ పండితుని యభిప్రాయము.[4] దీనికనుగుణముగ నీ మహమ్మదీయ నాయకుని ప్రోత్సాహమున సదాశివరాయలు బేవినహళ్ళిగ్రామమును బ్రాహ్మణుల కీనాముగ నిచ్చినట్లొక శాసనమువలనఁ దెలియుచున్నది.[5] రామరాజునకు గాయముతగులఁ[6], పల్లకినెక్కి శిబిరమునకుఁ జనుచుండ, నహమ్మద్ నగరసైన్యమధ్యమునుండి యొక మదకరి యత్యంతరభసమున రామరాయల దిక్కునకుఁ బరుగిడెను. వాహ

1. Ferishta, III, Page 129
2. Ibid, Page 248
3. Anquetil du Perron, I. C., Page 166
4. The Aravidu Dynasty of Vijayanagar, Page 212
5. Ep. Ind., XIV, page 231, VV. 64-68
6. Basatin us Salatin, I. C.; Couto, VIII, Page 92

కులు భయమంది, పల్లకినిదింపి, పాఱిపోయిరి. [1] రామరాజు పాలకి దిగఁబోవుచుండ నా మత్తకరీంద్ర మాతనిని దొండమునఁ బట్టుకొనెను. [2] అంత శత్రుసైనికులు రామరాజును గొంపోయి, చెలాబి రూమీఖానున కొప్పగించిరి. [3] ఆ మహమ్మదీయవీరుఁడు చేఁజిక్కిన రాజును దన నిశితకరవాలమున కెఱసేయనుంకింప, హైందవ సైన్యాధ్యక్షుఁడగు దళపతిరాయ్ చంపవలదని వారించి, దివాౝ బరీమునొద్దకుఁ గొనిపోవునదిగ సూచించెను. [4] రూమీఖానుఁడంత రామరాజును హుసౝ నిజాంశాహ కడకుఁ గొంపోయెను. [5] నవాబు తన కరవాలమున రామరాయల శిరము ఖండించి, 'నేఁటికి నా కసి తీఱినది; దేవుఁడు నన్నేమిచేసినను జేయని' య్మని నుడివినట్లు కౌటో వ్రాసియున్నాఁడు. [6] ఈ విషాదాంశము నొక్కొక్కరొక్కొకవిధమున వర్ణించిరి. రామరాజు శిరమును నవాబు గుఱ్ఱపుఁ గాళ్ల క్రిందఁ బడవేసి త్రొక్కించిరని ఇబౝ అజీజ్ వ్రాసియున్నాఁడు. [7] తలను గడ్డితో నింపిరని మఱియొకరు సూచించియున్నారు. [8] విజయనగరపువారి కీతని చావును దెలుపుటకో యన నాతని తలనొక పొడుగైన బల్లెమునకు గ్రుచ్చి చూపునట్లు అహమ్మద్‌నగర నవాబాజ్ఞాపించెనని ఫెరిస్తా తెలిపియున్నాఁడు. [9] రామరాజు తెగినను వార్త వినఁగనే, భీతచేతస్కులై పరుగిడుచున్న హైందవసైనికుల వెంబడించి, నిజాంశాహ వారిని ఖండించెనని బురానిమసిర్ తెలుపుచున్నది. అట్లు హతమైన హిందువులసంఖ్య యొక లక్షయఁట. [10]

యుద్ధభూమిని వేంకటాద్రియుఁ దనయన్నయగు రామరాజుతోఁ బ్రాణములు విడిచినటు లిటలీదేశపుఁ బాంథుఁడైన ఫ్రెడ

1. Ferishta III, Page 129
2. Ibid, Page 249
3. Ferishta, III, Page 130
4. Burhan-i-Ma'ssir, I. C.
5. Ferishta, III, Page 130
6. Couto, l. C.
7. Burhan - i - Ma'ssir, I. C.
8. P. P. P. Ap. A.
9. Ferishta, III, Page 130
10. Ibid., Page 130

రిక్ వ్రాసెను. [1] పోర్చుగీసువారి వ్రాఁతయు నీ విషయమును బల పఱచుచున్నది. [2] ఒకానొకదుర్గమునకుఁ బాఱిపోయినట్లు ఫెరిస్తా వ్రాసియున్నాఁడు. [3] 1567-వ వత్సర ప్రాంతమునఁ జెక్కఁబడిన కృష్ణాపుర తామ్రశాసనమును జూడ వేంకటాద్రి బ్రదికియున్నట్లు తెలియుచున్నది. [4]

యుద్ధానంతరమున నవాబులు తమ మిగిలిన సైన్యములతోఁ బదిదివసములు రణరంగమున నిలిచి, విశ్రాంతిఁ గైకొనిరి. [5]

రామరా జస్తమించినతోడనే, విజయనగరసంపద మహమ్మదీయుల హస్తగతమయ్యెను. చతురంగబలములును, రత్నవజ్ర వైడూర్యాదులును సుల్తానుల వశమైనవి. రామరాయలు రణభూమికిఁ గొనితెచ్చిన సంభారములవెల దాదాపు 1,23,57,411 పణములని మహారాష్ట్రచరిత్రకారుఁడగు ఛందోర్కర్ వ్రాఁతలవలనఁ దెలియుచున్నది. [6] రామరాజు ధరించెడు నమూల్యరత్నాలహార మొకటి యహమ్మద్ నగరమునకుఁ గొంపోఁబడెను.

'తాళికోట యుద్ధ' మనియు, 'రక్షస్‌తగ్గియుద్ధ' మనియు వ్యవహరింపఁబడు నీ ఘోరసంగ్రామము క్రీ. శ. 1565-వ వత్సరము జనవరి 25-వ తేది జరిగెను. [7]

**తిరుమలుని తిరుపతి ప్రయాణము**

విజయనగర సామ్రాజ్యప్రచండభాస్కరుఁడు రామరా జస్తమించెనను వార్త రాజధానీనగరమున వినఁబడఁగనే యందలి జనులెల్లరు భయకంపితులై, శత్రుధాటికిఁ దాళఁజాలక, యెందేని యేఁగి, తలదాఁచుకొన యత్నించిరి. ఆహవరంగమునుండి మరలి వచ్చిన తిరుమలరాయఁ డవరోధజనమును, సదాశివరాయలను,

1. Purchas, X, Page 93
2. Couto, VIII, Page 91
3. Ferishta, III, Page 131
4. Ep. Ind., IX, Page 330
5. Ferishta, III, Page 414
6. The Destruction of Vijayanagara, I. C., Page 172
7. Ibid. Page 414

హతశేషసైన్యమును, మంత్రివర్గమును, ధనరాసులను, సింహాసనమును [1] వెంటఁగొని తిరుపతికిఁ బోయెనని కౌటో వ్రాసియున్నాఁడు.[2] తిరుమలరాయలు నగరువిడిచినక్షణముననే ధనవంతులును, వారి వెంట బీదలును విజయనగరము వీడిచనిరి. సకలకళా శోభితమై విలసిల్లిన విజయనగర మాసమయమున విజనమై, ప్రేతభూమివలెఁ గన్పట్టెను. చుట్టుఁబట్టుల నరణ్యప్రాంతములఁ బొట్టపోసికొను నిషాద వర్గ మంతఁ బురముఁజొచ్చి, వస్తుజాతమును గొల్లగొనెను.[3]

సుల్తానులు విజయనగరము చేరుట

అట, సమరాంగణమున విశ్రమించియున్న నవాబులు మేల్కాంచి, ససైన్యులై, పటహభేరీభాంకారంబులు చెలంగ, విజయధ్వానములు మిన్నుముట్ట, విజయనగరపు దిక్కునకు నడువఁ జొచ్చిరి. కతిపయప్రయాణములలో వా రానెగొందినిఁ జేరి, యట నిలిచిరి. కొందఱుసైనికులుమాత్రము తుంగభద్రానదిని దాఁటి, విజయనగరముఁ బ్రవేశించిరి.[4] అంత, నవాబులును నానెగొందిని వీడి, ఋశ్యమూకపర్వతప్రాంతమునఁ దుంగభద్రాస్రవంతి కడ్డముగ రామరాజుచే వినిర్మింపఁబడిన వారధిమీఁదుగ నదిని దాఁటి, మహోన్నత గోపురాలంకృతమైన యచ్యుతరాయదేవాలయము వైపునకునడచి, యటనుండి కోదండరామాలయపార్శ్వభాగమునఁ జని, చివరకు మతంగపర్వతపు టడుగుభాగముననున్న మహానంది కడఁజేరిరి. అటనుండి జేతలగు సుల్తానుల విజయోత్సవ మారంభ మయ్యెను. మహమ్మదీయులు పంపాపతీదేవాలయ ప్రాంతభాగమున కరుగక, గణేశాలయముల ముందఱి భాగమునఁ జని, కృష్ణస్వామి యాలయమును దాఁటి, మహోన్నతమైన నృసింహశిలావిగ్రహము నతిక్రమించి, తుదకు రాజప్రాసాదావరణముఁ జేరిరి.

---

1. Couto, VIII, PP. 92-3
2. Correa, IV, Page 282
3. Couto I. C.
4. Ferishta III, Page 131

విజయనగర విధ్వంసము

సుల్తాను చతుష్టయము విజయనగరమున నాలు నెలలుండి నట్లు తెలియుచున్నది.[1] ఆ సమయమున మహమ్మదీయ సైనికులు ధనాశచే నగరమునందలి గృహములను త్రవ్వి[2]. యపారధన మార్జించిరి. కోడిగ్రుడ్డు పరిమాణముగల వజ్రమొకటి యాదిల్ శాహకు దొరకెననియు, దాని నాతఁడు తన పట్టపు గుఱ్ఱపుఁ దలతురా యికి దిమ్మగా నలంకరించెననియుఁ బోర్చుగీసు చరిత్రకారుఁడు కౌటో వ్రాసియున్నాఁడు.[3] ఫెరిస్తా వ్రాఁత ననుసరించి, మహమ్మ దీయులొనర్చిన యత్యాచారములను స్యూయల్ చరిత్రకారుఁ డిట్లు వ్రాసియున్నాఁడు.[4]

"The enemy had come to destroy, and they carried out their object relentlessly. They slaughtered the people without mercy, broke down the temples and palaces, and wreaked such savage vengeance on the abode of the kings, that, with the exception of a few great stone-built temples and walls, nothing now remains but a heap of ruins to mark the spot where once the stately buildings stood. They demolished the statues, and even succeeded in breaking the limbs of the huge Narasimha monolith. Nothing seemed to escape them. They broke up the pavilions standing on the huge platform from which the kings used to watch the festivals, and overthrew all the carved work. They lit huge fires in the magnificently decorated buildings forming the temple of Vitthalaswami near the river, and smashed its exquisite stone sculptures. With fire and sword, with crowbars and axes, they carried on day after day their work of destruction. Never perhaps in the history of the world has such havoc been wrought, and wrought so suddenly, on so splendid a city; teeming with a wealthy, and industrious population in the full plenitude of prosperity one day, and on the next seized, pillaged, and reduced to ruins, amid scenes of savage massacre and horrors beggaring description."

మహమ్మదీయ సైనికులు గుళ్ళగోపురములను, సౌధములను బడఁగొట్టిన గుఱుతు లిప్పటికిని గానవచ్చుచున్నవి. ఆ పట్టణమున నేఁటికిని భిన్నమై నిలిచియున్న నృసింహ శిలా విగ్రహమే యిందు లకుఁ బ్రబలసాక్ష్యము. దేవాలయములు సహితము విగ్రహశూన్య ములై చూపట్టుచున్నవి.

కాని, చరిత్రకారులు వ్రాసినంతటి నాశ మా పట్టణమునకుఁ

1, Couto VIII, Page 93
2. Purchas X, Page 93
3. Couto VIII, Page 93
4. Forgotten Empire, Pages 207-8

గలిగెనా యనుట విచారింపఁదగిన యంశము. మూలముట్టుగ నా నగరమును బాడుసేయుటయే సుల్తానుల యుద్దేశమగుచో, వారేల గణేశ విగ్రహములను, జాతినందిని, నతి సుందరమగు పంపాపతి గోపురమును భిన్న మొనర్పక విడిచియుందురు? ఏల అంతఃపురావరణ భవనాదులును, గజశాలయుఁ జెక్కు చెదరక యుండును? కావున, విజయనగర విధ్వంసకారకులు మహమ్మదీయులు మాత్రమే కారనుట నిర్వివాదాంశము. దీనికనుగుణముగ, నిటలీదేశపుఁ బాంథుఁడగు సీసర్ ఫ్రెడరిక్ తాళికోట యుద్ధానంతరము విజయనగరమున నేడు నెలలు బసచేసినట్లును, నందలి భవనములలోఁ జాలమట్టునకుఁ జెక్కు చెదరకుండినట్లును వ్రాసియున్నాఁడు.

## తిరుమలదేవరాయలు

తాళికోట యుద్ధమువలన రాజధాని నగరమగు విజయనగరము నశించెనేకాని, సామ్రాజ్యమంతరింప లేదు.

చంద్రగిరినున్న వేంకటాద్రి, తన యన్నయైన తిరుమలరాయలతో సంప్రతించి, తమ సోదరుఁడు రామరాజు నవాబులకడఁ గైకొనినరాజ్యభాగములను మరల వారి కిచ్చునట్లు రాయబారమంపెను. [1] నవాబులు విజయనగరమున నాఱునెలలుండి, సైన్య సమేతులై, పట్టణమును విడిచి, రాయచూరు మొగమై చనినట్లు తెలియుచున్నది. నవాబులు విజయనగరమును విడిచిపోవుటకుఁ గల కారణమునుగూర్చి చరిత్రకారులు భిన్నాభిప్రాయులై యున్నారు. తమరాజధానీనగరములకుఁ గడుదవ్వుననున్న విజయనగరమును జక్కఁబెట్టుకొనఁజాలక వెడలిపోయిరని ఫ్రెడరిక్ వ్రాసి యున్నాఁడు. [2] తమలోఁ దమకుఁ గలిగిన కలహకారణమున విజయనగరము విడిచి చనిరని మఱికొందఱి యభిప్రాయము. [3]

---

1. Ferishta III, Page 131
2. Purchas X, Page 94
3. (a) Ferishta III, PP. 414-5
   (b) Burhan-i-Ma'sair I, C., Page 194
   (c) Basatin-us-Salatin PP. 109-10

**తిరుమలుని నగరప్రవేశము**

ఈ సమాచారము తెలియఁగనే, తిరుపతినుండి తిరుమల దేవరాజు పయనమైవచ్చి, విజయనగరముప్రవేశించెను.[1] ప్రవేశించినదిమొదలు, మహమ్మదీయులు మరల దిగిరాకుండ నడ్డుకట్ట సాహసించెను. సాహసించుటయేకాక, రాజధాని కోలుపోయిన పూర్వపుఔన్నత్యమును మరల నిలుపఁదివిరెను; కాని విఫలుఁడయ్యెను.

**[2] నవాబులు తిరుమలునిసాయముఁ గోరుట**

హాసన్ నిజాంశాహ విజయనగరమునుండి చనిన కొలఁది దినములకే పరలోకగతుఁడయ్యెను. ఆతని కొడుకు మూర్ధజానిజాం శాహ పిన్నవాఁడగుటవలన నాతని తల్లియే రాజ్యపాలనము జరుపుచుండెను. మూర్ధజా తనదుశ్చర్యచే జనులకుఁ బ్రీతిపాత్రుఁడుగాకుండెను. 1565-వ వత్సరాంతమునఁ గిష్వార్ ఖాన్ అహమ్మద్ నగరముపై దాడివెడలఁ దలఁచి, విజాపురసుల్తాను సాయముఁ గోరెను. ఈ విషయమును విని గోలకొండ, బీదరునవాబులు అహమ్మద్ నగరనవాబునకు సాయపడ నడుముఁగట్టిరి.[3]

మూర్ధజానిజాంశాహ విజాపురనవాబుపై దాడివెడల నిశ్చయించి, గోలకొండనవాబునకు వర్తమాన మంపెను. ఆ సమయముననే గోలకొండనవాబు విజాపురరాజ్యమును విధ్వంసముసేయ నెంచి, యహమ్మద్ నగరనవాబునకును వర్తమాన మంపెను. దాన నిరువురును గలిసి, కృష్ణానదీతీరమున కేఁగి, తిరుమలరాయల సాహాయ్య మభ్యర్థించుచు నాతని కొక లేఖనంపిరి.

తన యన్నయగు రామరాయలనుండి యాదిల్ శాహ కైకొనినరాజ్యభాగములను మరలసంపాదించుట కిదియ తగినసమయ మని తిరుమలరాయలు యోజించెను. విజాపురసుల్తాను దాడి

1. Anquetil du Perron I, C., Page 166
2. The Aravidu Dynasty of Vijayanagara, PP. 231-3
3 Anonymous Chronicler, Ferishta III, PP 416-18

వెడలినప్పుడు విజయనగరాధీశునకుఁ దా మొనర్చిన సాహాయ్యము నకుఁ బ్రతిఫలముగ రెండులక్షల పణములను దనకుఁ జెల్లింపవలయు నని యహమ్మదనగరరాజ్ఞి తనకు సందేశ మంపెను. ఈ వార్తకుఁ దిరుమలుఁ డెంతయు నాశ్చర్యపడి, గోలకొండసుల్తానున కా విషయమును దెలియఁజేసెను. ఇబ్రాహింకుతుబ్ శాహ, వెంటనే, యీ తరుణమునఁ దిరుమలరాయలను ధనమడుగరాదని యహమ్మదనగరరాజ్ఞిగారికి వర్తమాన మంపెను. కాని, యామె యాతనిమాటలు పెడచెవినిఁబెట్టి, తిరుమలుని మఱింత యొత్తిడిపఱ చెను. తిరుమలరాయ లంతఁ గోపించి, ధన మొసఁగుటకు నిరాక రించుటయే కాక, శత్రుమండలిపై దాడివెడలెను. కార్యమిట్లు పరిణమించునని యిబ్రాహింకుతుబ్ శాహ కలలోనైనఁ దలంపఁ డయ్యె. ఆతఁడు హైందవ సేనాబలమునకు భయపడి, విజయనగర మునకుఁ దిరిగిపోవునదిగఁ దిరుమలరాయలను బ్రార్థించుచు, నాత నికి రాయబార మంపి, తాను నిజరాజధానికి మరలి చనెను. తిరుమల రాయలును గుతుబ్ శాహప్రార్థన మంగీకరించి, విజయనగరము నకుఁ బోయెను. [1]

తిరుమల దేవరాయలు తన వెంటఁ బిలిచికొనిపోయిన సదా శివరాయలను దిరుపతియందుఁ జెఱలోనుంచి, రామరాయలవలెఁ దానును రాజ్యపాలనముసాగించెను. [2] ఈ విషయమును 'చిక్కదేవ రాయవంశావళి' సహితము సూచించుచున్నది. [3]

సదాశివరాయలు చక్రవర్తిగనున్నను, దిరుమలుఁడు దన పేరిట దానములుచేసినట్లు కడపజిల్లాలోని కందుకూరునందలి శిలా శాసనము (1567) వలనఁ దెలియుచున్నది. [4] కాని, సదాశివ రాయల పేరిట సహితము కొన్ని దానశాసనములు గలవు. కర్నూలు

1. (a) Ferishta III, PP. 418-20.
(b) Sources of Vijayanagara History, Page 238
(c) Basatin - us - Salatin PP. 113-4
2. Purchas X, Page ?7.
3. Sources of Vijayanagara History, Page 302
4. Sewell I. Page 132

మండలములోని యహోబలమునందలి శిలాశాసన (1567) మిందు లకు దృష్టాంతము. [1]

**తిరుమలుఁడు రాజధానిని మార్చుట**

తిరుమలరాజు విజయనగరమునఁ జాలకాలముండినట్లగపడదు. విజయనగరనాశనానంతర మాతఁడు రెండువత్సరములు మాత్ర మట వసించి, [2] యామీఁదఁ బెనుగొండకుఁ బోయి, దానిని రాజధానిగఁ జేసికొనెను. [3] విజయనగరమున నాలునెలల కాలము వసించిన ఫ్రెడరిక్ సహిత మీ విషయమును గూర్చి వ్రాసియున్నాఁడు. [4]

హైందవ సామ్రాజ్యమునకు నూతనరాజధానియగు పెనుగొండ యనంతపురమండలమున దక్షిణభాగముననున్నది. అందలి యుత్తుంగశిఖరాలంకృతమైన పర్వతపు టెత్తు మూఁడువేల యడుగులు. దాని పైభాగమున శత్రువులకభేద్యమైన కోట గలదు. ఈ దుర్గమునకు శంకుస్థాపన మొనర్చినవాఁడు క్రియాశక్తియొడయరు. [5] ఈతఁడు కర్ణాటకరాజ్యమందలి బేలూరిరాజుల వంశకర్త. ఇందలి కోటకొత్తళములు బుక్కరాయలకాలమునఁ గట్టఁబడినవి. తరువాత, ననంతరసయొడయరను మంత్రిసత్తముఁడీ కోటగోడలను, వాకిండ్లను విస్తరింపఁజేసెననువిషయ మీ దుర్గపు టుత్తరమహా ద్వారపు ఱాతిగోడయందుఁ జెక్కఁబడియున్నది. ఇది వేసవికాలమున శ్రీకృష్ణదేవరాయలకు విశ్రాంతిస్థానముగా నుండెను. [6] దీని మహాత్మ్యమును జాటునీగేయమును దిలకింపుఁడు.

[7] 'చనినవాళుల తెనుఁగుకత్తులు
సానవెట్టినబండ
యీ పెనుగొండకొండ.

1. Sewell 1, Page 101
2. The Aravidu Dynasty of Vijayanagara, Page 236
3. (a) Anquetil du Perron l. C. Page 166
   (b) Sources of Vijayanagara History, Page 302
4. The Aravidu Dynasty of Vijayanagara, Page 235
5. The Mackenzie Collection, Page 345
6. Anantapur Gazetteer, Page 191
7. ఇయ్యది శ్రీమాన్ రాళ్లపల్లి - అనంతకృష్ణశర్మ విరచితము

రంధ్రములబ్రహరించు శత్రుల
రక్తధారల త్రావి త్రేచిన
ఆంధ్రకన్నడరాజ్యలక్ష్ముల
కతితినీలపుదండ
యీపెనుగొండకొండ.

తెలుపుతెలుగని బిరుదునడకల
విజయనగరపు రాచకొడుకులు
పొరలబోయగ కరుడుగట్టిన
పచ్చినెత్తురుకండ
యీపెనుగొండకొండ.

తిరుమలేంద్రుని కీర్తితేనెలు
బెరసిదించిన కాపుకవనపు
నిరుపమ ద్రాక్షారసంబులు
నిండితొలికెడికండ
యీపెనుగొండకొండ.'

ఈ సామ్రాజ్యమునకుఁ బెనుగొండ రాజధానియైన పిదప, విజయనగరము సంపూర్ణముగ విజాపురసుల్తానునకుఁ జేరిపోయెను.[1] 1584-వ వత్సరమున ఫిలిప్పొ సస్సెత్తి (Filippo Sassetti) యను నాతఁడు విజయనగరమున కేఁగినప్పుడు మహమ్మదీయ ప్రతినిధి దానిని బాలించుచుండెనని వ్రాసియున్నాఁడు.[2] అమీఁదఁ గొంత కాలమున కది పూర్తిగ నశించెనని ఫెరిస్తా వ్రాఁతలవలనఁ దెలియుచున్నది.[3]

తిరుమలరాజు విజయనగరమువిడిచి, పెనుగొండకుఁ బోయెనను వార్త వినఁగనే, యాదిల్‌శాహ చంకలెగురవైచి, యాదవాని దుర్గమును 1568-వ వత్సరమునఁ బట్టుకొని, దానికిఁ బ్రతినిధిగా, మాలిక్‌రహిమాన్‌ఖానుని నియమించెను.[4] కృష్ణదేవరాయలకాలము నుండియు విజయనగరరాజులకుఁ జేరియుండిన యుక్కల దేశము సహిత మన్యాక్రాంతమయ్యెను.[5] రాజధానీనగరమును, మఱి

1. Orme, Historical Fragments, P. 61
2. Gubernatis Storia dei Viaggiatori P. 202
3. Ferishta III, P. 131
4. Cf. Sewell I, P. 103
5. Ibid, P. 423-6

కొన్ని ప్రదేశములుఁ బోయినను, విజయనగరసామ్రాజ్యసౌభాగ్యమున కెట్టిలోటును గలుగలేదు. వలసినంత ద్రవ్యమును, బలమును, విశాలరాజ్యమును, జతురంగబలములును నింకను సామ్రాజ్యమునకు మిగిలియుండెను. [1]

1568-వ వత్సరమున సదాశివరాయలు సామ్రాజ్యదక్షిణ భాగమునఁ గల సామంతులకడఁ గప్పముఁ గొని బయలుదేఱెను. ఆ సమయముననే సదాశివరాయలు కావేరీతీరమునఁ గృష్ణాపురమును శ్రీవేంకటేశ్వరస్వామికి దానమొసఁగెను. [2] ఆ సంచారమునందే యాఁతడు మరణించెను. సింహాసనాపేక్షచేఁ దిరుమలరాయలు సదాశివరాయలను దుదముట్టించెనని స్యూయల్ చరిత్రకారుని యభిప్రాయము.[3] కృష్ణశాస్త్రిగారి యభిప్రాయము సహితము దీని కనుగుణముగనున్నది. [4] కొందఱు తిరుమలరాయల కొడుకులలో నొక్కరుఁడు చంపెనందురు. [5] మఱికొందఱు, తిరుమలుని కడపటికుమారుఁడు వేంకటపతిదేవరాజు కడతేర్చెనందురు. [6] ఏదియెటులున్నను నాతనిమరణమునకుఁ దిరుమలరాయలు కారణభూతుఁడనిమాత్రము చెప్పకతప్పదు.

**తిరుమలుని పట్టాభిషేకము**

సదాశివరాయలు చనిపోవునప్పటికిఁ దిరుమలరాయలకుఁ దొంబది వత్సరముల ప్రాయము. అంతటి వృద్ధత్వమున నీతని పట్టాభిషేకము పెనుగొండ [7] యందు 1569-వ వత్సరమున జరిగినట్లు ఉదయగిరిశాసనమువలనఁ దెలియుచున్నది. [8] ఈ తఁడు చక్రవర్తినిఁ దుదముట్టించి రాజయ్యెననువదంతిచేఁ బ్రజలు తమ యసమ్మతినిఁ బ్రకటించిరి. సామంతులలో సహితము పెక్కురు తిరుగఁ

1. M. H. S. *J.*, Mon. Xav. I, Page 62
2. Ibid., P. 341, *VV.* 70-96 and 102-4
3. Sewell, P. 212
4. The Third *Vijayanagara* Dynasty I, C., Page 179
5. Purchas X, P. 97
6. Anquetil du Perron I, C., P. 166
7. Taylor O. H. MSS. II, P. 98
8. Butterworth, III, P. 1328-9

బడినట్లు తెలియుచున్నది.[1] ఈ సార్వభౌమునకు 'మహారాజాధిరాజ',[2] 'వీరప్రతాప తిరుమలదేవమహారాయ'[3] యను బిరుద నామములు గలవు.

కుటుంబము

తిరుమలరాయలు శ్రీకృష్ణదేవరాయల ద్వితీయ పుత్రికయైన వెంగళాంబను వివాహమాడెనని స్థలాంతరమున వ్రాసియుంటిని. ఆమెవలన రఘునాథరాజు, శ్రీరంగరాజు, రామరాజు, వేంకటపతి దేవరాజు నను నలుగురు కొడుకులు గలిగిరి.[4] వీరిలో జ్యేష్ఠుఁడు రఘునాథరాజు తాళికోటయుద్ధమున మరణించెనని తెలిపియుంటిని. తిరుమలరాయలకు 'చెన్నమదేవి' యను ద్వితీయభార్య సహిత ముండినట్లు తెలియుచున్నది.[5] పట్టాభిషేక సమయమున భర్తతో సింహాసన మలంకరించిన రాణి యీమెయే. పట్టపురాణియగు వెంగళాంబ యుండఁ జెన్నమదేవి యేల సింహాసన మలంకరించెనను సంశయము చదువరులకుఁ దోఁపకపోదు. నాఁటికిఁ దిరుమలరాయలకుఁ దొంబదియేఁడుల ప్రాయమగుటవలన వెంగళాంబ మరణించియుండ నోపును. ఆకారణమున ద్వితీయభార్యకే పట్టాభిషేకమహోత్సవ భాగ్య మబ్బియుండవచ్చును.

రాజ్యభాగములు

తిరుమలరాయలు రాజ్యమునకువచ్చినతోడనే, పరిపాలనా సౌకర్యముకొఱకు సామ్రాజ్యమును మూఁడుభాగములుగా విభజించి, ముప్వురుకొడుకులను నా భాగములకుఁ బ్రతినిధులనుగా నియమించెను.

(i) ఆంధ్రమండలము—ఇందు సామ్రాజ్యపు టుత్తర భాగములన్నియుఁ జేరియుండెను. తిరుమలరాయల ద్వితీయకుమా

1. Anquetil du Perron I. C , P. 166
2. Ep. Carn., XII, Mi. 10
3. 497 of 1905
4. (a) Ep. Ind. III, P. 252 V. 18
   (b) Ibid., P. 213
5. Ep Carn., XII, Tm, I

రుఁడు శ్రీరంగరాయలు దీనికిఁ బ్రతినిధిగానుండెను. మొదట నీభాగమునకు నుదయగిరి రాజధాని. శ్రీరంగరాయలు, తాను యువరాజైన (1569) పిదపఁ, బెనుగొండను రాజధానిగఁ జేసికొని,[1] యటవసించుచు నాంధ్రమండలమును బాలించుచుండెనని చిక్కదేవరాయవంశావళి తెలుపుచున్నది.

(ii) కర్ణాటకమండలము—ఇందుఁ గావేరినది మొదలు అరేబియాసముద్రమువఱకుఁ గల భాగములన్నియుఁ జేరియుండెను. తృతీయకుమారుఁడగు రామరాజు దీనికిఁ బ్రతినిధి. ఈ భాగమునకు శ్రీరంగపట్టణము రాజధాని.[2] తాళికోటయుద్ధమునకు ముందు రామరాజు పెనుగొండదుర్గపాలకుఁడుగా నుండెను.[3] కర్ణాటకమండలమున కీతఁడు ప్రతినిధియైన పిదప, నాయకులలోఁ బెక్కండ్రు తిరుగుబాటొనరించిరి. ఆకారణమున రాజ్యపాలనము కష్టముగానుండెను. పెనుగొండయందలి 'సత్యబోధరాయలస్వామి' వారి మఠమును రామరాజు కట్టించినట్లందలి యొక కన్నడశాసనము తెలుపుచున్నది.[4] ఈతని ధర్మపత్ని నరసింగమ్మ; కొడుకులు తిరుమలరాజు, శ్రీరంగరాజు.

(iii) తమిళమండలము—ఇందు తుండీర (జింజి), చోళ, పాండ్యరాజ్యములు చేరియుండెను. నాల్గవకుమారుఁడు వేంకటపతిదేవరాజు దీనికిఁ బ్రతినిధి. చంద్రగిరి రాజధాని.

తిరుమల దేవరాయ లీవిధమున రాజ్యమంతయుఁ దన మువ్వురుకొడుకుల యధీనమొనర్చి, మహమ్మదీయులు తనరాజ్యము పైకి రాకుండునట్లు దాను గాపాడుచుండెను. అట్లయ్యు, మహమ్మదీయు లెన్నియోసారులు విజయనగరసామ్రాజ్యమును గబళింపనుంకించిరి. ఒకతూరి, తిరుమలరాయలమంత్రి చెన్నప్పనాయఁడు

1. Sources of Vijayanagara History P. 302
2. Sources of Vijayanagara History P. 217
3. The Third Vijayanagara Dynasty I. C., P. 183
4. Sewell I, P. 120

పెనుగొండపైకి దండెత్తివచ్చిన మహమ్మదీయుల నోడించినట్లు అందలి యొకశాసనము తెలుపుచున్నది.[1]

**మతము: దానములు**

తిరుమలుఁడు వైష్ణవమతావలంబకుఁడు. ఈతఁడు కాంచీపురము, శ్రీరంగము, శేషాచలము మొదలగు క్షేత్రములందు దేవాలయములు గట్టించెను.[2] ఉదయగిరియందలి యాంజనేయాలయమునకు దానము (1569) చేసెను.[3] పెనగలూరి బ్రాహ్మణులకుఁ గొన్ని గ్రామములు సర్వమాన్యములుగా నొసఁగెను.[4]

**సాహిత్యపోషణము**

ఈతఁ డాంధ్రభాషాప్రియుఁడు. అష్టదిగ్గజములలో నొక్కరుఁడని వ్యవహరింపఁబడుచున్న భట్టుమూర్తి రామరాయల కాలముననేకాక, యీతనికాలమున సహిత మాస్థానకవిగానుండెను. రామరాజభూషణ (భట్టుమూర్తి) కవికృతమగు వసుచరిత్రమున కీతఁడు కృతిభర్త. తాను గవియై, 'భోజుఁ' డను బిరుదమునందినట్లు కృష్ణాపురశాసనమువలనఁ దెలియుచున్నది.[5] గీతగోవిందమునకు 'శ్రుతిరంజని' యను వ్యాఖ్యానమును సంస్కృతమున నీతఁడు రచించెనందురు.[6] కొందఱు 'శ్రుతిరంజని' కర్త లక్ష్మణసూరియనియుఁ, దిరుమలుఁడు దానిపోషకుఁడనియుఁ జెప్పుచున్నారు.[7]

తిరుమలదేవరాయలు తన తొంబదిరెండవయేఁట, 1572-వ వత్సరమునఁ బరలోకగతుఁడయ్యెను.[8]

# శ్రీరంగ దేవరాయలు

తిరుమల దేవరాయల యనంతర మాతని ద్వితీయపుత్త్రుఁడు

1. 341 of 1901
2. Ep, Carn., VII, Sh 83
3. Butterworth III, P. 1328
4. Ep. Ind. XVI, P. 257 VV. 44-52
5. Ep. Ind. IX; Page 338, V. 92
6. The Aravidu Dynasty of Vijayanagara, Page 516
7. Hultzsch, Reports on Sanscrit MSS., III, Page VIII
8. Taylor I. C.

శ్రీరంగదేవరాయలు రాజ్యమునకు వచ్చెను. శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీరంగరాయదేవమహారాయలవారి పట్టాభిషేకము 1572-వ వత్సరమునఁ బెనుగొండయందు జరిగెను.[1] అమ్మహోత్సవకాలమున నీతఁడు బీదల కనేకదానములు చేసెను.[2]

శ్రీరంగదేవరాయలకుఁ దిరుమలదేవి, కృష్ణాంబ యను నిరువురు భార్యలు గలరు.[3] పుత్త్రిసంతానము లేదు. ఇరువురు కొమార్తెలుమాత్ర ముండిరి. అందొకరిని దిమ్మరాజును.[4] మఱియొకరిని జగదేవరాయఁడును బరిణయమాడిరి.

శ్రీరంగదేవరాయలు సింహాసనాసీనుఁడైన పిదపఁ, దనరాజధానిని బెనుగొండనుండి చంద్రగిరికిమార్చెనని యనంతపురము జిల్లా గజెట్టునందు వ్రాయఁబడియున్నది.[5] కాని, 1573వ[6] వత్సరము మొదలు 1576-వ [7] వత్సరమువఱకుఁ గల శాసనములను బరికించి చూడ శ్రీరంగదేవరాయలు పెనుగొండయందేయుండి, సామ్రాజ్యమును బాలించుచుండినట్లు స్పష్టమగుచున్నది. దీనికనుగుణముగ నీతఁడు చనిపోవు (1585) వఱకును బెనుగొండయందే యుండి రాజ్యపాలనము జరుపుచుండెనని మఱియొకచోటఁ గనఁబడు చున్నది.[8] కావున, రాజధానిని జంద్రగిరికి మార్చెననుమాట యసత్యమని తోఁచుచున్నది.

మంత్రులు

పెమ్మసాని పెద్దతిమ్మరాజు, మేగోటితిమ్మానాయఁడు, తిమ్మయమంత్రియు శ్రీరంగదేవరాయలకు మంత్రులుగా నుండిరి. వీరిలోఁ దిమ్మయమంత్రి రాజకీయవ్యవహారములను జక్కఁబెట్టుచుండె ననియు,

1. Butterworth I, Page 46 V. 23
2. Ep. Ind., XVI, Page 319 VV 29-30
3. Ep. Carn., XII, CK, 39
4. Ferishta III, Page 448
5. Anantapur Gazetteer, Page 21
6. Ep. Carn., XII, CK. 39
7. Ibid., U. 31
8. Ibid., P. 622

నీతఁడు శ్రీరంగదేవరాయలవలన గజతురగస్యందనాదులను బహుమతులుగాఁ గొనెననియు 'చారుచంద్రోదయ' మను గ్రంథము నుడువుచున్నది.[1]

1572-వ వత్సరమున నీతనికడ నోబళరాజు సర్వసేనాధ్యక్షుఁడుగ నుండెను.[2] 1581-వ వత్సరమున వెంకటప్పనాయఁడా స్థానమున నియమింపఁబడెను. రాయల యాస్థానమున రాయసము వెంకటపతి ప్రసిద్ధి జెందిన రాజకీయోద్యోగిగా నుండినట్లు 'లక్ష్మీవిలాస' మను గ్రంథమువలనఁ దెలియుచున్నది.

**సామంతులయొత్తిడి**

సదాశివరాయల కాలమునుండియు నీ సామ్రాజ్యమునకు సామంతులవలనఁ గలుగుచున్నయొత్తిడి యీ చక్రవర్తి కాలమున మఱింత యెక్కువయ్యెను. ఆకారణమున నీతఁడు రాజ్యాధిపతియైన పిదప, నాలుగు సంవత్సరములకాలము రాజ్యమున శాంతిలేక యుండెను. ఆమీఁద నెట్టులో శ్రీరంగదేవరాయలు తిరుగుఁబాటుల నడఁచి, రాజ్యపాలనము సాగించెను.

**తురుష్కులతోడి పోరాటములు**

సామంతుల తిరుగుఁబాటు లిటులుండ, సామ్రాజ్యపుటుత్తరభాగమున మహమ్మదీయులదాపిడి మరల నారంభమయ్యెను.

(i) 1575-వ వత్సరమున విజాపురసుల్తాను ఆలీఆదిల్‌షా, చంద్రగిరిగుత్తిదుర్గశిథిలభాగములను బాగుచేయించి, శత్రుభయము లేకుండఁ జేసికొని, కేరళదేశముపై దాడివెడలెను. ఆతఁ డందలి నాయకులను జయించి, యా రాజ్యభాగములను బాలింప నొక ప్రతినిధిని నియమించి, పెనుగొండవైపునకుఁ బయనమాయెను. శ్రీరంగదేవరాయ లాసమయమునఁ గార్యాంతరమునఁ జంద్రగిరికిఁ బోవుచు, నాదిల్‌షా తనరాజధానీనగరముపై దండెత్తివచ్చుచు

1. Sources of Vijayanagar History, Page 241
2. Rangacharya, II, Pages 979-630

న్నాఁడను వార్త విని, పెనుగొండకు మరలెను. తాను రాజధానిని జేరఁగనే, యొంటరిగ, విజాపురసుల్తానుతోఁ బోరలేనని తెలిసికొని, గోలకొండసుల్తాను ఇబ్రాహింకుతుబ్ షా సాయముఁ గోర నిశ్చయించి, యనర్ఘ కానుకలతో నాతనికడకొక రాయబారి నంపెను. ఆ రాయబారి గొనితెచ్చిన సందేశమునువిని, కుతుబ్ షా విజాపురసుల్తానుపైఁ దనకుఁ గల కసిఁదీర్చుకొనుట కిది మంచియదనని యెంచి, యాదిల్ షారాజ్యపుఁ బొలిమేరభాగములను ముట్టడింప షామహమ్మద్ అంజు అను సేనాధిపతినిఁ గొంతసైన్యముతో నంపి, తాను సైన్యసమేతుఁడై పెనుగొండదిక్కునకు నడువసమకట్టెను. మహమ్మద్ అంజు ప్రభునాజ్ఞ శిరమునఁదాల్చి, విజాపుర రాజ్యభాగములను గొన్నిటి నాక్రమించుకొని, సైన్యముతోనేఁగి. పెనుగొండకుఁ జనుచున్న తనయేలికను గలిసికొనెను. శ్రీరంగదేవరాయలు కుతుబ్ షా రాకను విని, యెదురేఁగి, యాతనిని సగౌరవముగఁ దోడితెచ్చెను. ఆదిల్ షా, గోలకొండనవాబు శ్రీరంగదేవరాయలకు సహాయుఁడుగ వచ్చెననువార్తవిని, యిఁకఁ దనయాటలు సాగవని నమ్మి, పెనుగొండవిడిచి, విజాపురమునకుఁ బోయెను. [1] ఆమీఁద గోలకొండసుల్తాను మరలి, నిజరాజధానికిఁ జనెను.

నాఁటినుండియు గోలకొండ, విజయనగరరాజుల మైత్రి యభివృద్ధియయ్యెను. దానికనుగుణముగ, గోలకొండసుల్తాను రాయబారి నంపి, శ్రీరంగదేవరాయలను దనరాజధానికిఁ బిలిపించుకొని, యాతనితో సంధి చేసికొనెను.

(ii) 1576-వ వత్సరమున విజాపురసుల్తాను విజయనగర రాజ్యభాగములను గబళింప మరల బయలుదేఱెను. శ్రీరంగదేవ రాయ లావార్త విని, శత్రువు నెదిరింప సైన్యసమేతుఁడై పోయెను. ఇరువాఁగులకును బోరు ఘోరముగజరిగెను. తుదకు, శ్రీరంగదేవ రాయలు మహమ్మదీయుల చేఁజిక్కెను; హైందవసైన్యము నశిం

1 Ferishta III, Page 435

చెను. ఈ విజయమువలనఁ బెనుగొండకు నుత్తరభాగమునఁ గల విజయనగర సామ్రాజ్యభాగములన్నియు విజాపురరాజ్యమునకుఁ జేరిపోయెను.

విజయనగరరాజులకు సామంతుఁడుగనున్న మలకప్ప నాయఁడు శ్రీరంగదేవరాయల యపజయవార్త విని, యిఁకఁ దనకు మహమ్మదీయులవలని బాధతప్పదని తలఁచి, యాదిల్‌శాహకు నంకితుఁడయ్యెను. అందులకు సుల్తాను సంతసించి, విజయనగరరాజు లాతనికొసఁగియుండిన బుక్కపట్టణము, అనంతసాగరము మొదలగుగ్రామములను మరల నాతనికిచ్చి, 'పాదుషావజీర్' అను బిరుద మొసఁగి గౌరవించెను.[1]

(iii) శ్రీరంగదేవరాయలు చెఱనుండి విముక్తుఁడైన పిదప, విజాపురసుల్తాను, షుజాఅత్ ఖాన్, చోటాఖాన్, ముర్తుజా ఖాన్, నర్ ఖాన్ అను నలుగురు సేనానాయకులను సైన్యములతోఁ బెనుగొండను ముట్టడింప మఱియొకతూరి పంపెను. ఆసమయమున నడుముఁగట్టి నిలిచి, పెనుగొండదుర్గము మహమ్మదీయులహస్తగతము గాకుండఁ గాపాడిన వీరుఁడు జగదేవరాయఁడు. ఈ యుద్ధమున నవాబుసేనానాయకులలో షుజాఅత్ ఖాన్ మరణించెను. చోటాఖాన్ పట్టుఁబడెను. మిగిలిన యిరువురును నోడిపోయిరి. ఆకారణమున విజాపురసైన్యము ముట్టడివిడిచి, మరలిపోయెను.

(iv) గోలకొండసుల్తాన్, ఇబ్రాహింకుతుబ్ షా, శ్రీరంగదేవరాయలతోఁ జేసికొనిన సంధినిఁ బాటింపక, మలకప్పనాయనితోఁ జేరి, విజయనగరరాజ్యమునకుఁ జేరియుండిన యహోబల మండలముఁ గైకొననేఁగెనని యచ్చటిశిలాశాసనము (1584-5) తెలుపుచున్నది. ఆసమయమున నహోబలమున నర్చకుఁడుగానున్న శఠగోపస్వామి శ్రీరంగరాయలకడకుఁ జని, మహమ్మదీయులు దండెత్తివచ్చినవృత్తాంతముఁ దెలిపి, యా యాలయప్రదేశ

1. Cf. Brown. The wars of the Rajas, Page 6

మెట్టులైన మహమ్మదీయులహస్తగతము గాకుండఁ గాపాడవలయు నని మొఱపెట్టుకొనెను. హైందవచక్రవర్తి వెంటనే విరోధిని మార్కొనఁగ సన్నద్ధుఁడయ్యెను. శఠగోపస్వామి యాచక్రవర్తి ప్రయత్నమునుగాంచి, 'మీ రచ్చటి కేఁగవలదు. నేనొకస్వప్నముఁ గంటిని. అందుఁ గొండరాజు వెంకటరాజును, గొండరాజు తిరుమల రాజును మహమ్మదీయులఁ బాఱఁదోలుటకుఁ జాలినవారని యహోబల నృసింహస్వామి యానతిచ్చె' నని నుడివెను. ఆమాటలకు రాయ లాశ్చర్యపడి, యా యిరువురు సేనానాయకులను బిలిపించి, వారిని బహూకరించి, విరోధిని నెదుర్కొనఁ బంపెను. అంత నా యిరువురుఁ బ్రభునాజ్ఞఁ దలఁదాల్చి, సైన్యములఁ గొని, శఠగోపస్వామి వెంటరా, నహోబలమున కేఁగి విరోధులను జయించి, యా దేవాలయములకుఁ గల భూమిని సంపాదించి యొసఁగిరి. [1] ఈ విషయము 'లక్ష్మీవిలాస' మను గ్రంథమునఁ జక్కఁగా వర్ణింపఁబడియున్నది. [2]

(v) 1579_వ వత్సరమున గోలకొండనవాబు తనసేనాని యగు హైదర్ ఉల్ ముల్క్‌ను నుదయగిరి రాజ్యభాగములను గైకొన నంప, నాతఁడు సైన్యములతోనేఁగి, వినుకొండ, కొచ్చెర్లకోట, కంభము దుర్గములను బట్టుకొని కందుకూరి (Kandbir) దుర్గమును గబళింప యత్నించెను. ఆ సమయమునఁ గందితిమ్మన్న, ముద్దన చిన్నప్ప, కస్తూరిరంగప్ప యను మువ్వురును గలిసి, ముప్పదివేల సైన్యములఁ బ్రోగుచేసికొని, నవాబుసైన్యముల నెదిర్చి, యపజయ మందిరి. మహమ్మదీయులు విరోధులను గుఱ్ఱముకొండవఱకుఁ దఱిమి, యా కోటను సహితము స్వాధీనపఱచుకొనిరి. ఆ సమయముననే బెల్లముకొండ మొదలగుదుర్గములు సహితము మహమ్మదీయుల వశమైనవి. అంత హైదర్ఉల్ముల్క్ తనసైన్యములను మరలఁ గందుకూరివైపునకు నడిపించి, మఱికొంతసైన్యమును బంపు నదిగ గోలకొండసుల్తానునకుఁ గబురంపెను. కుతుబ్ షా వెంటనే,

1. Sources of Vijayanagar History, Pages 233-4
2. Ibid., Page 230

అమిర్ షా మిర్ అను సేనానాయకుని సైన్యములతోఁ బంపెను. ఈ సేనానాయకు లిరువురును దమబలములతో నా దుర్గద్వారములను బగులఁగొట్టఁ బ్రయత్నించి, విఫలులై, తుదకు నేనుఁగులను బురి కొల్పి, తలుపులనుద్రోయించి, లోపలఁ బ్రవేశించి, కాపూరి తిమ్మ రాజును జెఱగొనిరి. [1]

ఈ యుద్ధమున విజయనగరసామ్రాజ్యమునకుఁ జేరియుండిన యాంధ్రమండలములన్నియు మహమ్మదీయుల వశమైనవి. పెనుగొం డకు నుత్తరమునఁ గల రాజ్యభాగమంతయు విజాపురనవాబు వశ మయ్యెను. ఉదయగిరిమండలము గోలకొండసుల్తాను స్వాధీన మయ్యెను. ఇఁక విజయనగర రాజులకు నాంధ్రమండలములలో మిగిలి యున్న భాగ మహోబలమునకుఁ జుట్టుఁబట్టులనున్న ప్రదేశము మాత్రమే.

**మతము: దానములు**

శ్రీరంగదేవరాయలు పరమవిష్ణుభక్తుఁడు. ఎట్టికష్టసమయ మునను హరిభజనము విడిచినవాఁడు కాఁడు. తాను సింహాసనము నకు రాక మున్నె, శ్రీరంగరాయపురమునందలి గోపీనాథస్వామి యాలయమునకు దానముచేసెనని 1572-వ వత్సరపుశాసనము తెలుపుచున్నది. [2] తాను జక్రవర్తియైన పిదప, నెన్నియోదాన ములు చేసెను. [3] 1577-వ వత్సరమున మొగల్లూరియందుఁ జెన్న కేశవస్వామి విగ్రహమును బ్రతిష్ఠించి, యా యాలయమునకు దానమొసఁగెను. [4] 1580-వ వత్సరమునఁ బెనుగొండయం దొక యాలయముఁ గట్టించి, యందుఁ గేశవస్వామినిఁ బ్రతిష్ఠించెను. [5]

**సాహిత్యపోషణము**

ఈతఁడు కవిజనపోషకుఁడు. 'లక్ష్మీవిలాస' గ్రంథకర్తయగు

1. Ferishta III, Pages 436-8
2. Rangacharya I, Pages 762, 130-B
3. Ep. Carn., IV, Ch. 23
4. Rangacharya II, Pages 1143, 688
5. Sewell II, Page 120

రాయసము వెంకటపతి యీతని యాస్థానకవి. ఇతని మంత్రియైన రాయసము అహోబలపతి 'కువలయవిలాస' మను నాటకమును సంస్కృతమున రచించెను. ఇతని ప్రేరణమున 'భట్టకలంక' కవి 'సారత్రయ' మను గ్రంథము వ్రాసెను. [1]

విష్ణుభక్తాగ్రేసరుఁడగు శ్రీరంగదేవరాయలు 1585-వ వత్సరమున వైకుంఠముఁ జేరెను.

## వేంకటపతి దేవరాయలు

శ్రీరంగదేవరాయల యనంతరము విజయనగరసామ్రాజ్య సింహాసనాసీనుఁడైనవాఁడు రామరాజా, వేంకటపతి దేవరాజా యను విషయము సంశయాస్పదమైనది.

కొందఱుచరిత్రకారులు శ్రీరంగదేవరాయల తరువాత సింహాసనమునకు వచ్చినవాఁడు రామరాజని వ్రాసియున్నారు. దీని కనుగుణముగఁ గర్నూలుమండలములోని శ్రీశైలమునందలి మల్లికార్జున స్వామి యాలయమునం దొకశాసనమున, 'విజయనగరసామ్రాజ్యాధిపతియైన వీరతిరుమలయ్య దేవమహారాయలవారి తనయుఁడగు వీరప్రతాప రామరాజయ్యదేవమహారాయలవారి పరిపాలనాకాలమున' అని వ్రాయఁబడియున్నది. [2] మఱియు, వేంకటపతిదేవరాయలు 1590-వ వత్సరమునఁ గుంభకోణమున వ్రాయించిన దానశాసనమునందు సహితము తనయన్నయగు తిరుమలదేవరాయలు, లేక శ్రీదేవరాయలు కొంతకాలము విజయనగర సామ్రాజ్యమును బాలించినట్లు వ్రాయఁబడియున్నది. [3] ఈ శాసనమువలన రామరాజునకుఁ దిరుమలదేవరాయలనియు, శ్రీదేవరాయలనియు నామాంతరము లున్నట్లు తెలియుచున్నది. రామరాయ లెంతకాలము పరిపాలన చేసినదియుఁ దెలుపుటకుఁ దగినయాధారములు లేవు. ఆతని యనంతర మాతని తనయులగు తిరుమలరాజునకుఁగాని, రంగరాజు

1. Narasimhachar, The Karnataka Country, Q. J. M. S., Page 256
2. 43 of 1915
3. Sewell II, Page 3; 252, note 4

నకుఁగాని పట్టముఁ గట్టక, యాతని తమ్ముఁడగు వేంకటపతిదేవ రాజే రాజ్యార్హుఁడని ప్రకటించి, ప్రజ లాతనికే పట్టముఁ గట్టిరి.

పట్టాభిషేకము

తండ్రియగు తిరుమలదేవరాయల కాలమునుండియు వేంకట పతిదేవరాజు చంద్రగిరిని రాజధానిగఁ జేసికొని, తమిళమండలమును బాలించుచుండెనని వ్రాసియుంటిని. ఆ కారణమునఁ శ్రీమద్రాజాధి రాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ వీరవేంకటపతి దేవమహారా యల [1] వారి పట్టాభిషేకము చంద్రగిరియందే (1585) జరిగెను. [2] అమ్మహోత్సవ కార్యమునకుఁ బురోహితుఁడు రాజవంశగురుఁడగు తాతాచార్యుఁడు.

వర్ణనము

వేంకటపతి దేవరాయలు స్ఫురద్రూపి. కపోలకాంతి చంద్రుని వెలుఁగునకుఁ బోల్పఁదగియుండెను. సౌందర్యము మన్మథుని ధిక్కరించుచుండెను. [3] చామనచాయగలవాఁడు. విశాలమైన నేత్రములు. పొడుగరియుఁ, బొట్టియుఁగాక సామాన్యమైన యెత్తు గలవాఁడు. అంగములు స్ఫుటములై, యుక్తపరిమాణముగలవి. అందముగ నుడుపులు ధరించువాఁడు. రాజ ఠీవితోఁ జేరిన సులభ ప్రవర్తనముగలవాఁడు. [4]

మంత్రులు

గురుఁడగు తాతాచార్యుఁడు, మట్ల అనంతుఁడు, తరిగొప్పుల దత్తమంత్రి, తమ్మయమంత్రి, పెమ్మసాని పెద్దతిమ్మరాజును వేంకట పతిదేవరాయల మంత్రులు. వీరిలో మట్ల యనంతుఁడు రాజకీయ వ్యవహారములయందు రాయల కెంతయుఁ దోడ్పడుచుండెనని సిద్ధ వటమునందలి (1605) శాసనమువలనఁ దెలియుచున్నది. తమ్మయ

1. Butterworth I, Page 264
2. (a) Ep. Ind. XVI. Page 319, VV. 31-35
   (b) Anquetil du Perron I. C., Page 166
3. Ep. Ind., XII, Page 187, VV. 27-39
4. Fr. Du Jarric; I Page 662

మంత్రియుఁ, బెమ్మసాని పెద్దతిమ్మరాజును శ్రీరంగదేవరాయలకాల మునుండియు విజయనగరసంస్థానమున మంత్రులుగా నుండిరి.

గొబ్బూరి ఓబరాజు సర్వసైన్యాధ్యక్షుఁడు.[1] ఇతఁడు చక్రవర్తికి బావయును,[2] మామయును[3] నయినట్లు తెలియుచున్నది.

రాజధానిమార్పుట

వేంకటపతిదేవరాయలు సింహాసనమునకు వచ్చిన పిదప నేడువత్సరములకాలము పెనుగొండనే రాజధానిగ నుంచుకొని సామ్రాజ్యమును పాలించెను. 1592-వ వత్సరమునఁ జంద్రగిరినిఁ దన రాజధానిగఁ జేసికొనెనని స్యూయల్ చరిత్రకారుని వ్రాఁతవలనఁ దెలియుచున్నది.[4]

పురాతనకాలమునుండియుఁ జంద్రగిరి యాదవవంశజులకు వాసభూమిగా నుండెను. క్రీ. శ. 1000-వ వత్సర ప్రాంతమున యాదవరాజైన యిమ్మడి నరసింహరాజు చంద్రగిరినిఁ గట్టించిన ట్లొక తాళపత్రి గ్రంథమువలనఁ దెలియుచున్నది. ఇందలి దుర్గమును విజయనగరరాజులలో నొక్కరుఁడగు సాళువనరసింహరాయలు గట్టించి, దానిని ధనాగారముగాఁ జేసికొనిన ట్లొక యైతిహ్యముగలదు.[5] ఆదుర్గమునందలి మహోన్నతసుందరభవనమును కృష్ణదేవరాయలు గట్టించె నందురు.

తుళువవంశమున శ్రీకృష్ణదేవరాయఁ డెంతటి విఖ్యాతివంతుఁడో, యార్వీటివంశమున వేంకటపతిదేవరాయఁ డంతటి ప్రసిద్ధుఁడు. ఇతనిపరిపాలనారంభకాలమునాఁటికి విజయనగర సామ్రాజ్య భాగములు గొన్ని మహమ్మదీయుల హస్తగతములై యున్నను, రాజ్య మింకను విస్తారముగ నుండెను.

1. Fr. Du. Jarric I, Pages 188-9
2. Sewell, Page 223
3. (a) Krishnaswami Aiyangar, O. C., Page 243
   (b) Du Jarric, I, Page 654
4. Sewell, I, Page 150
5. Caldwell, History of Tinnevelly, Page 48

సదాశివరాయల నంతమొందించినది వేంకటపతిదేవరాజని కొంద అభిప్రాయపడిరని స్థలాంతరమున వ్రాసియుంటిని. హంతకుఁడు చక్రవర్తియయ్యెననెడి కారణమునఁ దంజాపురి, మధుర, జింజి పట్టణములను పాలించుచుండిన సామంతనాయకులు తిరుగుఁబాటొనరించిరి.[1] ఒకవంక సామంతనాయకులయు, మఱియొకవంక మహమ్మదీయులయు దాడి సామ్రాజ్యమున కెక్కువయ్యెను.

మహమ్మదీయులతోడి కలహములు

1. గోలకొండ : (i) గోలకొండనవాబు మహమ్మద్ ఖులి కుతుబ్ షా విజయనగరసామ్రాజ్యపు టుత్తరపొలిమేర దాఁటి, పెనుగొండను సమీపించి, కోటబయట దండువిడిసెను. వేంకటపతిదేవరాయ లీ సమాచారము విని, మంత్రియైన గోవిందతిమ్మరాజును, దళవాయి పాపయ్యశ్రేష్ఠిని సంధిరాయబారము జరుపు నెపమున నవాబుకడకుఁ బంపెను. వారు రాయబారము జరుపుచు మూఁడుదినములు కాలవిలంబనము చేసిరి. ఈలోపల రాయలు నవాబుతోడి కయ్యమునకు వలయు యుద్ధసంభారములను సిద్ధపఱచుకొనెను. జగదేవరాయఁడును ముప్పదివేల సైన్యములతోఁ గోటఁ బ్రవేశించి, రాయలబలముతోఁ గలిసికొనెను.[2] విజయనగరసామ్రాజ్యమునకు లోఁబడిన తంజాపురీపాలకుఁడగు నచ్యుతనాయకుఁడు సహితము తన పదునాఱేండ్ల కుమారుఁడగు రఘునాథనాయకునిఁ దగినసైన్యములతోఁ బెనుగొండకుఁ బంపెను.[3] ఈలోపల నవాబు తెచ్చిన యాహారపదార్థములలోఁ జాలభాగమయిపోయినవి. దానికిఁ దోడుగఁ గృష్ణానదియు మించి ప్రవహించుచున్నదను వార్త నవాబునకు వినవచ్చెను. ఇఁక యుద్ధముసేయుట పాడిగాదని తలఁచి, సుల్తాను సైన్యములతో వెనుకకుమరల,[4] రాయలసైన్యము తురుష్కవాహినులఁ బెన్నానదివఱకును దఱుముకొనిపోవ, నచ్చట

1. Anquetil du Perron I. C., Page 166
2. Ferishta I. C.
3. Sources of Vijayanagara History, Page 285
4. Ferishta I. C.

నుభయులకును యుద్ధముజరిగెను. ఈ రణమున మహామ్మదీయులు పెక్కండ్రు హతులైరి.[1] హిందువులకు జయముగలిగెను.

(ii) కొంతకాలము గడచినపిదప మరల గోలకొండ నవాబు తనసేనానాయకుఁడగు ముర్తుజాఖానును విజయనగరరాజ్యమునకుఁ జేరిన కరప (Karapa) పట్టణమును బట్టుకొన నంపెను. అతఁడు సైన్యములతోఁ గదలిపోయి, పట్టణమును బట్టుకొని, యందలి దేవాలయములను నాశమొనర్చెను. వేంకటపతిదేవరాయ లీ వార్త విని, వెంటనే, యిరువురు సేనానాయకులను బదివేల గుఱ్ఱపుదళముతో శత్రువును డీకొనఁబంపెను. ఆలోపల, గోలకొండనుండి రుస్తుంఖాను అయిదువేల గుఱ్ఱపుదళముతో వచ్చి, ముర్తుజాఖానుతోఁ జేరెను. ఉభయపక్షములవారికిని భయంకర యుద్ధము మూఁడుమాసములు జరిగెను. ఎంతకాలము రణమొనర్చినను, జయకాంత యెవ్వరిని వరింపదయ్యెను. రుస్తుంఖాను మాయోపాయమున శత్రువును జయింపనెంచి, యొకనాఁడు దనకు సమీపమున వానచేఁ దడిసియున్న రేగడిమంటి నేలను దనసైన్యములతోఁ బోయినిలిచెను. ఆ సమయమున హైందవసైనికు లొక యెఱ్ఱయెద్దును జిత్రవర్ణములతో నలంకరించి, మహామ్మదీయసైనికులవైపునకుఁ దోలిరి. రుస్తుంఖా నా వింతపశువును జూచి, భయమంది, తనగుఱ్ఱమును బరుగెత్తించెను. ఆకారణమునఁ దురుష్కసైన్యము చెల్లాచెదరయ్యెను. ఆయవకాశమును బురస్కరించుకొని హైందవసైనికులు మహామ్మదీయసేనలపైఁ బడి, యనేకులనాశమొందించిరి. ముర్తుజాఖా నెట్టులో తప్పించుకొనిపోయెను. పిఱికిపందయై రణరంగమునుండి పాఱివచ్చిన రుస్తుంఖానును గోలకొండనవాబు తనరాష్ట్రమునుండి వెడలఁగొట్టెను.[2]

2. విజాపురము: విజయనగరరాజుల కత్యంతశత్రువైన రెండవ ఇబ్రాహింఆదిల్‌షా సైన్యసమేతుఁడై పెనుగొండను ముట్ట

1. Ferishta I C., Page 243
2. Ferishta III, Pages 455-9

డింపనేఁగెను. అంత, వేంకటపతిదేవరాయ లేడులక్షలకాల్బల మును, నలువదివేల గుఱ్ఱపుదళమును, నైదువందల యేనుఁగులను సిద్ధపఱచి, [1] విజాపురసుల్తాను కోటను సమీపింపఁగనే, రాయలు దనసైన్యములను మట్ల యనంతుని స్వాధీనపఱచి, యపారధనమును, నమూల్యవస్తుజాతమును గైకొని, చంద్రగిరికిఁ బోయెను. నవాబు మూఁడుమాసములవఱకుఁ గోటను ముట్టడించి, యది తనకు స్వాధీన మగువఱకును ముట్టడి విడువరాదని నిశ్చయించుకొనెను. మట్ల యనంతుఁడు నవాబు దృఢనిశ్చయమును గమనించి, సుల్తానువైపున నున్న హండేనాయకునకు (Handiatum Naik) నిరువదినాలుగు లక్షలరూప్యములను, నైదేనుఁగులను లంచమిచ్చి, నవాబునకు సాహాయ్యముచేయకుండులాగున నాతని వేఁడుకొనెను. హండే నాయకుఁడంత నవాబును విడిచిపోవ, నాతఁడు చేయునదిలేక విజా పురమునకు మరలిపోయెను. [2]

నాయకుల తిరుగుఁబాటులు

1. మధుర: వేంకటపతిదేవరాయలు తమిళమండలమునకు రాజప్రతినిధిగానుండిన కాలమునుండియు నీతనికిని, మధురాధి నాథుఁడగు వీరపనాయకునకును సరిపోక యుండెను. వల్లప్రాకార (Vallaprakara) యుద్ధమునందు వీరపనాయకుఁ డోడిపోవుటయే దీనికిఁ గారణము. [3] వీరపనాయకుని యనంతరము విశ్వప్పనాయకుఁడు రాజ్యమునకు వచ్చి, కొలఁదికాలముమాత్రమే పరిపాలించెను. ఆమీఁదఁ గృష్ణప్పనాయకుఁడు రాజయ్యెను.

(i) ఈతఁడు మొదట విజయనగరరాజున కనుకూలుఁడుగ నుండి, చివరకు, 1599-వ వత్సరమున విజయనగరసామ్రాజ్యము నకుఁ జెల్లింపవలసిన కప్పముఁ గట్టక, సార్వభౌముని ధిక్కరించెను. వేంకటపతి దేవరాయ లంత మంత్రియు, సేనానియునగు మట్ల యనం

1. Du Jarric, I, Page 653
2. Ferishta, III, Page 141
3. Cf. Ch, XIII, No. 4

తునితోడ మధురపై దాడివెడలెను. కృష్ణప్పనాయకుఁడు విజయనగరసైన్యములతోఁ బోరలేక, రాయలకు లోఁబడి, యెక్కువ కప్పముఁ [1] జెల్లింపనొడఁబడెను.

(ii) మధురపరిపాలకులలో నొక్కరుఁడగు ముత్తువీరప్పనాయకుఁడు విజయనగరసామ్రాజ్యశృంఖలములను వదలించుకొనఁదలఁచి, కప్పముఁ గట్టమాని, 1610-వ వత్సరమున సార్వభౌమునిపైఁ దిరుగఁబడెను. అప్పటికి వేంకటపతిదేవరాయలు మిగుల వృద్ధుఁడు. అదికారణముగ, మట్ల యనంతుఁడే సైన్యమునుగొని, మధురపై దాడివెడలి, వీరప్పనాయకుని నోడించి యెక్కువ కప్పము గట్టునట్లు చేసెను.

2. జింజి: (i) ఈ సార్వభౌముని కాలమునఁ గృష్ణప్పనాయకుఁడు తుండీర (జింజి) మండలమును బాలించుచుండెను. [2] ఈతఁడును మధురనాయకునివలె స్వాతంత్ర్యాభిలాషచేఁ గప్పముఁ గట్టమానెను. ఆకారణమున రాయలు తన సైన్యములకుఁ గాళహస్తిపురాధీశ్వరుఁడైన యంకభూపాలుని సోదరుఁడగు వేంకటరాజును దళవాయిగఁ జేసి, కృష్ణప్పనాయకుని నెదిరింపఁ బంపెను. ఆతఁడు జింజినాయకుని యుద్ధమునఁనోడించి, [3] చెఱఁగొని, పెనుగొండయందుంచెను. [4] అమీఁద సార్వభౌముని యాజ్ఞానుబద్ధుఁడై, వేంకటరాజు జింజిదుర్గమును బాలించుచు, నటనొక చెఱువును త్రవ్వించి, దానికిఁ దనతండ్రి పేరిట 'చెన్నసాగర' మని పేరిడెను. [5]

తంజాపురీనాథుఁడగు రఘునాథనాయకుఁడు 'గోలకొండ నవాబు సైన్యమునోడించి, కృష్ణప్పనాయకుని విడుదలచేయుఁ'డని వేంకటపతిదేవరాయలఁ బ్రార్థించెను. రాయ లందులకు సమ్మతించి, కృష్ణప్పను జెఱనుండి విడిపించెను. అంతఁ దుండీరమండలాధి

1. Twelve millions of gold coins
2. Sources of Vijayanagara History, Page 285
3. Sources of Vijayanagara History, Page 308
4. Cf. Ibid., Page 272 note
5. Ibid., Page 308

పతియగు కృష్ణప్పనాయకుఁడు సభార్యుఁడై రఘునాథుని పాదము లకు మ్రొక్కి, తనకూఁతు నాతని కిచ్చి పరిణయముచేసి,[1] తన కృతజ్ఞతను జూపెను.

(ii) మరలఁ గొంత కాలమునకుఁ గృష్ణప్పనాయకుఁడు తనరాజ్య మభివృద్ధిచేసికొని, గర్వించి, విజయనగరసార్వభౌమునకుఁ గప్పముఁ గట్ట మానెను. అది కారణముగ రాయ లాతనిపై దాడి వెడల నుంకించులోపల, నెవ్వరో మందు పెట్టుటచే, నాతనికిఁ బిచ్చి పట్టెను. పిచ్చివానితోఁ బోరుట రాజధర్మము కాదని, రాయ లప్పటి కాప్రయత్నము విరమించుకొనెను. కొంత కాలమునకుఁ గృష్ణప్ప నాయకునికిఁ బిచ్చికుదిరి విజయనగరచక్రవర్తికిఁ గప్పము గట్టక తిరుగఁబడెను. ఆ నాయకుని గర్వమును రాయలు సహింప నోపక, యాతనిరాజ్యమును విధ్వంసముగావింపఁ దనసేనాధిపతి యగు వెలు గోటి యాచమనాయని సైన్యములతోఁ (1608) బంపెను. యాచమ నాయఁడు చని, జింజిదుర్గమును ముట్టడించెను. కృష్ణప్పనాయకుఁ డంతఁ గోటనుండి వెలువడి, రాయలసైన్యములను డీకొని, యోడి పోయి, బంధితుఁడయ్యెను.

అప్పుడు వెల్లూరియందున్న వేంకటపతిదేవరాయల కీవిష యము తెలియఁగాఁ, దాను బంధుమిత్రాదులతో బయలుదేఱి, జింజిదుర్గమునకుఁ బోయెను. చెఱనున్న కృష్ణప్పనాయకుఁడు భార్యా సహితముగఁ జని, రాయలపాదములకు మ్రొక్కి, యపారధనమును[2] గప్పముగా నీయ నంగీకరించెను. రాయలంత వెల్లూరికి మరలి పోయెను.

కృష్ణప్పనాయకుఁడు దనకుఁ గలిగిన నష్టమునకుఁ జింతించి, రాజ్యపాలన మొల్లక, శ్రీరంగమునకుఁ బోయెను. అంత నాతని మిత్రులగు మధుర, తంజాపురినాయకు లీ విషయమును విని, కృష్ణప్ప

1. Ibid, Page 286
2. 600,000 Cruzados

నాయకుని కడ కేఁగి, యపారధన మొసఁగి, యాతనిని జింజికిఁ బంపివైచిరి.

† లింగమనాయని తిరుగుఁబాటు

1603–వ వత్సరమున లింగమనాయఁడు రాయవేలూరును బాలించుచుండెను. ఆతఁడు విజయనగర రాజులకు సామంతుఁడు. ఏకారణముననో యాతఁడు సార్వభౌముని ధిక్కరించి, స్వతంత్రరీతిఁ బ్రవర్తింపఁజొచ్చెను. వేంకటపతిదేవుఁడు లింగమనాయని దుర్వర్తనమును సహింపనోపక, దళవాయి చెన్నమనాయని వేలూరికోటను ముట్టడింపఁ బంపెను. అతఁ డపారసైన్యములతో నేఁగి, కోటను రెండు నెలలకాలము ముట్టడించెను గాని, స్వాధీనము కాకపోయెను. చెన్నమనాయని సైనికులలో నిరువురు వీరులు లింగమనాయని బంధువు లుండిరి. వారు కోటలోనికిఁ బోయి, లింగమనాయనికి నతులనర్పింప, నాతఁడు వారిని సత్కరించి, కోట వెలుపలిదనుక సాగనంపవచ్చెను. ఆ సమయమునఁ జెన్నమనాయని సైన్యములు లింగమనాయనిఁ జెఱపట్టినవి. వేంకటపతి దేవరాయలు వెంటనే యీ విషయమును జారులవలన వినీ, రాణివాసముతో వేలూరికిఁ బయనమైపోయి, లింగమనాయని భవనమున నెలదినములుండెను. ఆమీఁద రాయ లమూల్యపదార్థములను గానుకలుగాఁ గొని, లింగమనాయని బంధించి, చంద్రగిరికిఁ గొనిపోయెను.

పోర్చుగీసువారిని నాదరించుట

ఈ చక్రవర్తి పరిపాలనా కాలమునఁ బోర్చుగీసువారికిని, నింగ్లీషువారికిని, డచ్చివారికిని హైందవసామ్రాజ్యమున విరివిగ వాణిజ్యమునసలుపుటకవకాశము గలిగెను. అందు ముఖ్యముగఁ బోర్చుగీసువారు రాయలమన్ననకుఁ బాత్రులై, మొదటఁ బులికట్టు (Pulicat) ను సంపాదించిరి.

1597–వ వత్సరమున నికోలస్ పిమెంట (Fr. Nicholas Pimenta)

† Fr. De Coutinho's letter

యను పోర్చుగీసు క్రైస్తవమతాచార్యుఁడు మైలాపురమునందలి సెంట్ థోం (St. Thome) నకు వచ్చెను. ఆ సమయమున వేంకటపతి దేవరాయలు చంద్రగిరిని రాజధానిఁగఁ జేసికొని, హైందవ సామ్రాజ్యమును బాలించుచుండెను. చంద్రగిరియందు దొక క్రైస్తవమఠ మును నిర్మింపఁ దలఁచి, పిమెంట, కాంచీపురమునందున్న రాయల మామయగు నోబరాయనితో రాయబారముజరిపెను. ఓబరా యఁడు పోర్చుగీసు క్రైస్తవులయెడ నభిమానముగలవాఁడగుట వలన వారికి సాయముచేయనెంచి, వారిపనికై తాను చంద్రగిరికిఁ బోవుచున్నవార్త ముందుగఁ బోర్చుగీసుమతాచార్యునకుఁ దెలిపి, తాను బయనమై రాజధానీనగరమునకుఁ బోయెను. అంతఁ దమ మతాచార్యునిపరమునఁ బోర్చుగీసు క్రైస్తవులును జంద్రగిరికిఁ బోయి, యోబరాయని సత్కారములనందిరి. క్రైస్తవరాయబా రులరాకకు నోబరాయఁడు సంతసించి, తమసామ్రాజ్యమున వారి కనుకూలమగుప్రదేశములందుఁ గ్రైస్తవదేవాలయములు నిర్మించు కొనుటకు సమ్మతించి, వారినిఁ బిలిచికొనిపోయి, చక్రవర్తిదర్శనము చేయించెను. ఆసమయమునఁ గ్రైస్తవరాయబారులు రాయల కనర్ఘకానుకల నర్పించిరి. సార్వభౌముఁడును వారి నుచితరీతిని సత్క రించి, వారు తనరాజ్యమున నుండుటకు సమ్మతించి, దినవెచ్చము నకై వారికి రెండుగ్రామముల నినాముగా నొసఁగెను. అంత వారొక క్రైస్తవదేవాలయమును జంద్రగిరియందుఁ గట్టిరి. వీరిమూలమునఁ బోర్చుగీసు దేశపు రాజుతో వేంకటపతిదేవునకు స్నేహముగలిగెను. ఆస్నేహము నానాఁటికిఁ బ్రబలమై, వారిరువురకు నుత్తరప్రత్యుత్తర ములు సహితము జరుగ మొదలిడెను.

వేంకటపతి దేవరాయలు తన రాజధానిని జంద్రగిరినుండి వేలూరికి 1606–వ వత్సరమున మార్చినపిదపఁ, జంద్రగిరియందున్న రుబినో (Fr. Rubino) యను మతాచార్యుఁడును, వెల్లూరియందున్న కౌటిన్హో (Fr. Coutinho) యను మతాచార్యుఁడును ననేక కానుకలను గొనిపోయి, వేంకటపతిదేవరాయలకు సమర్పించి

యాతని మన్ననలనంది, రాజసౌధపార్శ్వభాగమున నొక యింటిని, గ్రైస్తవదేవాలయమును వేలూరియందుఁ గట్టుకొన నాజ్ఞఁబొందిరి.

**డచ్చివారిని దేవనపట్నమునుండి తఱిమివేయుట**

డచ్చివారు దేవనపట్నమున నొకకోటను గట్టుకొనుటకు జింజిదుర్గాధిపతియగు కృష్ణప్పనాయకునికడ 1608-వ వత్సరమున నుత్తరువుపొందిరి. వారు కోటను గట్టనేర్పఱచుకొనినచోట నొక పురాతనదుర్గము కలదు.[1] వెంటనే, వారు దుర్గనిర్మాణకార్యమున కుఁ బూనిరి. వేంకటపతిదేవరాయ లీవిషయము విని, డచ్చి వారినిఁ దనరాష్ట్రమునుండి వెంటనే తఱిమివేయవలయునని జింజి నాయకునికొక జాబు వ్రాసెను. కాని, యాతఁడా యుత్తరముకు సరకుగొనఁడయ్యెను. ఈలోపలఁ బోర్చుగీసుమతాచార్యుఁడు నికో లస్ లెవంటో (Fr. Nicolas Levanto) 1609-వ వత్సరమున డచ్చివా రిని దేవనపట్నమునుండి వెడలఁగొట్టవలసినదిగా నొక యుత్తరు వును జింజినాయకునకు వేంకటపతిదేవునివలనఁ గైకొని, స్వయ ముగాఁ బోయి, దానిని గృష్ణప్పనాయకునికొసఁగెను. ఆతఁడు మతాచార్యుని నుచితరీతిని సత్కరించెనుగాని, యెన్నిదినములున్నను దగిన జవాబు చెప్పఁడయ్యెను. రాయలు జింజినాయకుని యాలస్య మును, ప్రవర్తనమును సహింపనోపక, తత్క్షణమే, మతాచార్యుని యాదేశానుసారము డచ్చివారినిఁ దనరాష్ట్రమునుండి తఱిమివేయ వలసినదిగ మూఁడవసారి కఠినమైన యుత్తరువుఁ బంపెను. కడపటి యుత్తరువును జూచినవెంటనే, కృష్ణప్పనాయకుఁడు లెవంటోను బిలువనంపి, విజయనగరసామ్రాజ్యసార్వభౌముని యాజ్ఞను శిరసా వహించెదననియు, డచ్చివారు గట్టుచున్న కోటను బోర్చుగీసువారి కిచ్చెదననియు నుడివి, యావిధమున సెంట్‌థోంలోనున్న మతా చార్యునకు లేఖవ్రాసి, యాతనికొసఁగి, డచ్చివారినిఁ దఱిమివైచెను.

పోర్చుగీసువారు వేంకటపతిదేవరాయల యాస్థానమును విడిచి

---

1. Rea, Monumental Remains, Page 13

పోయినతరువాత, డచ్చివారు రాయల యనుగ్రహమును సంపాదించి, తమకుఁ గావలసిన భవనములను బులికట్టునందుఁ గట్టుకొనిరి.

సెంట్ థోమును బట్టుకొనుట

విజయనగరసామ్రాజ్యచక్రవర్తికిని, పోర్చుగీసువారికిని గల స్నేహబంధము 1611-వ వత్సరముతోఁ దెగిపోయెను.

వేంకటపతిదేవరాయలు సెంట్‌థోంనందున్న పోర్చుగీసు క్రైస్తవులను నెక్కువ మొత్తముఁ జెల్లింపవలయునని యాజ్ఞాపించెను. వారంతద్రవ్యము నీయఁజాలక, రాయల యానతిని ధిక్కరించిరి. ఆకారణమున నుభయులకును యుద్ధము జరిగెను. అందు నుభయపక్షములందును బెక్కంద్రు హతులైరి. తొమ్మిది మాసము లీపోరాటము జరిగెను. పోర్చుగీసు వారంత భయమంది వేంకటపతిదేవునితో సంధిఁ జేసికొనిరి. కాని, వారీయవలసిన మొత్తముఁ జెల్లింపనికారణమున హైందవసైనికులు వారినిఁ జెరపట్టి, సెంట్‌థోమును స్వాధీనపఱచుకొనిరి. రెండునెలలైన పిదపఁ, బోర్చుగీసువారు వేంకటపతిదేవరాయలకు 401 పెగోడాలు చెల్లింప సమ్మతించి చెఱనుండి విముక్తులైరి.

ఆంగ్లేయులకు రాయబారమంపుట

వేంకటపతిదేవరాయలవలన డచ్చివారు కౌలుపుచ్చుకొని, పులికట్టునందు వర్తకస్థాన మేర్పఱచుకొని, వ్యాపారము సాగించుచుండిరి. ఆ సమయమున మచిలీపట్టణమున నివాసమేర్పఱచుకొని వ్యాపారముచేయుచున్న యాంగ్లేయులు సహితము పులికట్టునందొక వర్తకస్థానము నిర్మించుకొనఁ దలఁచి, యచ్చటికిఁ బయనమైపోయిరి. వారచ్చటిరాజప్రతినిధిచే ననాదరింపఁబడి, మచిలీపట్టణమునకు మరలివచ్చిరి. ఆంగ్లేయులు పులికట్టునకు వచ్చిపోయినవార్త వేంకటపతిదేవరాయలు విని, వారితో వర్తకము సాగించఁ దలఁచి, వారికిఁ బులికట్టునందొక వర్తకస్థానమీయఁబడుననియు, నందు వారు కోరినట్టులు భవననిర్మాణము చేసికొన

వచ్చుననియుఁ దెలుపుచు, మచిలీపట్టణమునకు రాయబారులఁ బంపెను. రాయబారులు దెచ్చినసందేశమునకు నాంగ్లేయులు సంతసించి, చక్రవర్తిదర్శనమునకుఁ బోవ సమకట్టులోపల, వేంకటపతి దేవరాయలు మరణించెననువార్త వినవచ్చెను. ఆకారణమున వారప్పటికిఁ జంద్రగిరిప్రయాణము విరమించుకొనిరి.

సాహిత్యపోషణము

ఆర్వీటివంశమున సాహిత్యమునుపోషించినవారిలో వేంకటపతిదేవరాయ లగ్రగణ్యుఁడు. ఈతఁడు విద్యాసాగరుఁడు.[1] వేదాంతవేది. కవిజనపోషకుఁడు.

ద్వైతమతసిద్ధాంతములయం దారితేరిన సుధీంద్రాచార్యులనీతఁ డెక్కువ గౌరవించుచుండెను. తాతాచార్యుఁ డీతని యాస్థానమునఁ బేరుఁగన్న వేదాంతపండితుఁడు. ఈ పండితుఁడు 'సాత్త్విక బ్రహ్మవిద్యావిలాసము'ను,'పాండురంగమాహాత్మ్యము'నురచించెను.

వేంకటపతిదేవుని కొలువునందుఁ బెక్కం డ్రాంధ్రకవులుండిరి. చెన్నమరాజు, తెనాలి రామకృష్ణకవి, మట్ల యనంతుఁడు, తరిగొప్పులమల్లనయు వారిలోఁ బేర్కొ నఁదగినవారు. చెన్నమరాజును దళవాయి పెమ్మసాని తిమ్మరాజు మిక్కిలి గౌరవించుచుండెను. రామకృష్ణకవి శ్రీకృష్ణదేవరాయల కాలమునుండియు విజయనగర రాజుల మన్ననకుఁ బాత్రుఁడైనవాఁడు. ఈతని సమగ్రచరిత్రము 'అష్టదిగ్గజము' లను శీర్షికయందు వ్రాయఁబడినది. మట్ల యనంతుఁడు 'కాకుత్థ్సవిజయము' ను, దరిగొప్పుల మల్లన 'చంద్రభాను చరిత్రము' ను రచించిరి. మల్లన తరిగొప్పుల దత్తమంత్రిసోదరుఁడని యాతఁడు వ్రాసిన గ్రంథమువలనఁ దెలియుచున్నది.

అయ్యలభాస్కరుడు రాయలయాజ్ఞచేఁ గన్నడభాషయందు 'రెట్ట' కవి రచించిన 'రెట్టమతశాస్త్రము' నాంధ్రీకరించెను.

వీరుగాక, యీతనిసభయందుఁ బ్రసిద్ధికెక్కిన వ్యాకరణ

1. Ep. Ind., XII, Page 186, VV. 27-39

శాస్త్రపండితు లిరువురుండిరి. అందొకఁడు 'త్రిపదద్యోతినీ' కర్త యగు నెట్టమాధవార్యుఁడు;[1] రెండవయతఁడు 'శబ్దానుశాసన' కర్తయగు బట్టలంక కవి.[2]

విజయనగరరాజులకడ శాసనములు వ్రాయుటకు వేఱుగఁ గొందఱు కవులుండినట్లు తెలియుచున్నది. వీ రెల్లప్పుడు రాజుతో డనే సంచారముచేయుచు, వలయుచోటుల శాసనములు లిఖించు చుందురు. ఆ లేఖకులలో నొకఁడు సభాపతి. ఈతఁడు సదాశివరాయలకాలమునఁ బెక్కుశాసనములు లిఖించెను.[3] అవి యిప్పుడు 'బ్రిటీష్' వస్తుప్రదర్శనశాలయందుఁ గలవు. మఱియొకఁ డితని కుమారుఁడు స్వయంభువుఁడు. ఈతఁడు పెనగలూరు,[4] నేరెడి పల్లి[5] మొదలగు ప్రదేశములందు శాసనములు వ్రాసినట్లు తెలియు చున్నది. వేంకటపతి దేవరాయలకాలమున స్వయంభువుని బంధు వగు కృష్ణకవి శాసనలేఖకుఁడుగా నుండెను. ఈతఁడు దళవాయి యగ్రహారము,[6] వెల్లంగుడి[7] మొదలగు గ్రామములందు శాసన ములు వ్రాసెను.

మతము : దానములు

వేంకటపతిదేవరాయలు విష్ణుభక్తుఁడు. తిరుపతి వేంకటే శ్వరుఁ డితని యభిమానదైవతము.

1588-వ వత్సరమునఁ జిదంబర సుందరి చిదంబరేశ్వరు నకు నిత్యనైవేద్యమునకు దానమొసఁగెను.[8] 1598-వ వత్సర మున నొక గ్రామమునకుఁ దిరుమలాంబపురమని పేరిడి, తిరుపతి నివాసులగు బ్రాహ్మణులకు దానిని దానమొసఁగెను.[9] 1603-వ

1. Hultzsch, Reports on Sanscrit MSS., I, Page VIII
2. Narasimhachar, The Karnataka Country, Q. J. M. S, X, Page 256
3. Ep. Ind., IV, Page 2
4. Ep. Ind., XVI, Page 257, V. 177-178
5. Ibid., XI, Page 329
6. Ibid., XII, Page 1[illegible]7 V. 200
7. Ibid., XVI, Page 329
8. 385 of 1913
9. Catalogue of Copper-Plate Grants in the Govt Museum, Madras, Page 54

వత్సరమునఁ దిండివనమునందలి నేత్రగాంధ్రకుఁ బన్నువిధించి, యా ధనమును నచ్చటి దేవాలయమునకు వినియోగింప నియమిం చెను. [1] 1604-వ వత్సరమున వెంగళాంబపురమును బెక్కండ్రు బ్రాహ్మణులకు దాన మొసఁగెను. [2] 1606-వ వత్సరమునఁ దిరుపతి యందు నెలకొనియున్న వరదరాజస్వామి నిత్యనైవేద్యమునకు దానమిచ్చెను. [3] 1607-వ వత్సరమున నృసింహస్వామికి దాన మొసఁగెను. [4]

**కుటుంబము**

ఈ సార్వభౌమునకు సంసారసుఖ మబ్బినది కాదు. గృహచ్ఛి ద్రములు మెండుగానుండెను. తుదకు, వానిమూలమున, సామ్రాజ్య మునకే చేటుమూడెను.

ఈతనికి వేంకటాంబ, రాఘవాంబ, పెద్ద ఓబమాంబ, పిన్న ఓబమాంబ యను నలువురు భార్యలుండినట్లు 1586-వ వత్సరపు దానశాసనమువలనఁ దెలియుచున్నది. [5] కాని, యా సంవత్సరము ననే వ్రాయఁబడిన దళవాయి యగ్రహారపుదానశాసనముఁ జూడఁ బిన్న ఓబమాంబకు మాఱుగఁ గృష్ణమాంబ యను పేరు గనఁబడు చున్నది. [6] కావున, నావత్సరముననే, పిన్న ఓబమాంబ చనిపోయిన కారణమునఁ, గృష్ణమాంబను వివాహమాడి యుండవచ్చును. 1601-వ వత్సరమునందలి దానశాసనముఁ జూడఁ బై వివరించిన నలువురను, గొండమాంబయు వేంకటపతిదేవరాయల దేవేరులైనట్లు తేటపడుచున్నది. [7] రాఘవాంబ చాలకాలము జీవించినట్లగపడదు. రామరాజీయమునందు సహితము వేంకటాంబ, పెద్ద ఓబమాంబ, కృష్ణమాంబ, కొండమాంబా నామములే కానఁబడుచున్నవి. [8] వేంకట

1. 31 of 1905
2. Rangacharya, I, Page 461, 1146
3. M.A.D., 1920, Page 39
4. Ep. Carn., V. BI, Page 145
5. Ep. Ind., XIII, Page 231, note 7
6. Ibid.; XII, Page 186, VV 27-39
7. Ibid. IV Page 270
8. Sources of Vijayanagara History, Page 243

పతిదేవుని మరణకాలమున బ్రదికియున్న రాణులు ముగ్గురని బరదాస్ (Fr. Barradas) వ్రాఁతలవలనఁ దెలియుచున్నది.[1] అందొక రాణికి రాయలతో సమానమైన వయస్సు గలదనియు, మిగిలిన యిరువురకును ముప్పదియైదు వత్సరముల ప్రాయమనియు వ్రాసి యున్నాఁడు.

పై వివరించిన శాసనములను బరిశీలించిచూడ రాయల కార్గురు భార్యలుండినట్లు తెలియుచున్నది. ఇఁక వారినిఁగూర్చి యించుక విచారింతము. వారిలోఁ బెద్ద ఓబమాంబ జిల్లెళ్ల రంగరాజు కూఁతురు. కృష్ణమాంబ జిల్లెళ్ల కృష్ణరాజు కొమార్తె. రాఘవాంబా కొండమాంబలు గొబ్బూరి ఓబరాయని తనూజాతలు.[2] వేంకటాంబాజనకుఁ డెవరో తెలియదు. కాని, జగ్గరాయని కూఁతురైన బాయమ్మను వేంకటపతి దేవుఁడు వివాహమాడినట్లు బరదాసు వ్రాఁతలవలనఁ దెలియుచున్నది.[3] వేంకటాంబకే బాయమ్మయను నామాంతరముండవచ్చును. ప్రతి శాసనమునందును నీమె పేరు మొదటఁ గనఁబడుచున్న కారణమున నీమెయే పట్టపు రాణియై యుండనోపును.

కొండమాంబిక దుశ్చర్య

గొబ్బూరియోబరాయఁడు తన తనయను రాఘవాంబను రాయలకొసఁగి, వివాహము చేసి, వేంకటపతిదేవరాయల యాస్థానమునఁ బలుకుబడి సంపాదించెను. దర్బారు సమయమున నహితమీతఁడు చక్రవర్తితో సమానముగఁ గూర్చుండువాఁడు. ఈతని దుష్టవిచేష్టితమే మంత్రివర్గమునఁ గలఁకకు మూలమయ్యెను. రాఘవాంబ మరణానంతరము, రాయల యాస్థానమున నోబరాయని పలుకుబడి తగ్గఁజొచ్చెను. ఆతఁడది గమనించి, వెంటనే తన రెండవ కూఁతురైన కొండమాంబికను మహారాజున కిచ్చి పరిణయము చేసెను. కొండమాంబ తండ్రినిఁ బోలిన దుర్గుణములగని. అపర

1. Forgotten Empire, Page 224
2. Du Jarric I, Page 654
3. Forgotten Empire, Page 223

సత్యభామ. భర్తను వలలో వైచికొని స్వైరవిహారము సలుపు
చుండెను. రాణిని సంతోషపెట్ట, మహారాజు, తన యాప్తమిత్రు
లను సహితము దూరముచేయవలసివచ్చెను. క్రైస్తవమతాచా
ర్యులకును, జక్రవర్తికినిఁ గల స్నేహబంధ మీదేవేరివలనఁ ద్రుటిలోఁ
దెగిపోయెను. పోర్చుగీసు క్రైస్తవమతాచార్యులవలన నీమె
లోలోన లంచములు గొనుచుండెను. చక్రవర్తికిని, సామంతుల
కును భేదాభిప్రాయ ముత్పన్నమైనతఱి, నీమె మధ్యవర్తినియై, తన
యిచ్ఛచొప్పున వ్యవహారములఁ జక్కఁబెట్టుచుండెను. ఈమెకు
నోబరాయఁ డన్ని విధములఁ జేదోడై వర్తించుచుండెను. ఇరువురును
గలిసి, మహారాజును లెక్కగొనక ప్రవర్తించుచుండిరి.

### కృత్రిమ సంతానము

ఆర్గురు భార్యలలో నెవరికిని సంతానము కలుగలేదు. పట్టపు
రాణి వెంకటాంబ (బాయమ్మ) సంతానమునకై యెన్నియో వ్రతోప
వాసములు చేసెనుగాని, ప్రయోజనము లేకపోయెను. తుద కామె
దుఃఖ మిట్లుపశమిల్లెను.

'ఒక బ్రాహ్మణ యువతి రాణిగారి సంతానాపేక్షను గమ
నించి, తానొక నెలగా గర్భిణిగానున్న విషయ మామెకుఁ దెలిపి,
తాను గనినక్షణముననే తన బిడ్డను రహస్యముగా రాణివాసమున
కంపెదనని యామెతో నుడివి, రాణిగారు నెలదినములుగా గర్భ
వతిగానున్నదనువార్త ప్రభువాజ్ఞ చేఁ బ్రజలలో వ్యాపింపఁ జేయు
టకుఁ దగుప్రయత్నములు జరిపించెను. భూసురకాంతకుఁ దొమ్మిది
నెలలు నిండినవి; అదృష్టవశమున మన్మథ మొలకవంటి కొడుకుద
యించెను. మాటప్రకార మామె యా బాలుని బాయమ్మవశము
చేసెను. బాయమ్మయు నా కుఱ్ఱవానిని సొంతకొడుకువలె నల్లారు
ముద్దుగాఁ బెంచుచుండెను. రాయలు విధిలేక, యా బాలునకు
నామకరణమహోత్సవము జరిపి, 'చిక్కరాయఁ' డని పేరు
పెట్టెను. అదిమొదలుకొని యా బాలునిఁ జంద్రగిరియందే యుంచి,

పదునాలుగువత్సరముల ప్రాయము రాఁగానే, తన బావమఱఁదిని సంతోషపెట్ట నాతని తనయనిచ్చి, యీ బాలునకు వివాహము చేసెను.

రాజు మూఁడుదినములకుఁ జనిపోవుననఁగా, నీ కృత్రిమ పుత్త్రుని వదలి, తన యన్నయగు రామరాజు రెండవకుమారుని శ్రీరంగరాజును * బిలువనంపి, సామంతులసమక్షమునఁ, దనయనంతర మీతఁడు రాజ్యాధికారము స్వీకరింపవలయునని నుడివి, రాజ ముద్రికను శ్రీరంగరాజున కొసఁగఁ బోయెను. ఆతఁ డంత సార్వభౌ మునిపాదములపైఁ బడి, కన్నీరుగార్చుచు, 'నా కీ ముద్రిక వలదు; కావలసినవారి కొసఁగుఁ' డని ప్రార్థించి, మిన్నకుండెను. మరల, వేంకటపతిదేవరాయలు తనహస్తమును జాఁచి, యాతనికి ముద్రిక నీయఁబోయెను. అప్పుడును నాతఁడు వలదనెను. మూఁడవతూరి రాయలు ముద్రిక నొసఁగినప్పుడు శ్రీరంగరాజు విధిలేక, యటఁ జేరి యున్న సామంతుల ప్రోత్సాహమున దానినందికొని, మొదట శిర మునఁ దాల్చి, యామీఁద వ్రేలధరించి, కన్నీరుగార్చెను. పిమ్మట రాజచిహ్నముల నన్నిటిని నాతని కప్పగించి, తనయనంతర మాతఁడే రాజని మఱియొకతూరి ప్రకటించెను. ఆ మాటలకుఁ గొందఱు సంతసించిరి; మఱికొందఱు దుఃఖించిరి.

---

* Fr. Coutinho, in his letter of the 17th. July of same year, 1600, says:"Although the King prefers the younger brother (Ranga) who is being brought up in his very palace, nevertheless people say the elder one (Tirumala) will be the King, because he is liked by more numerous and powerful chiefs." Ranga then had only the king's predilection in his favour; while the right of birth and the esteem of the subjects were on the side of Tirumala.

"As a matter of fact, Fr. Coutinho in the same letter calls Tirumala 'the heir of this kingdom'. Again Tirumala is called 'the crown prince' by Fr. Guerreiro in 1604; and Fr. Coutinho once more calls him 'the prince' in a letter of 1608, although in the same letter he states that Venkata does not want either to name or to hear any body talk of Tirumala. Such was the hatred of the sovereign for the elder of his two nephews Thereupon prince Tirumala retired from Seringapatam, as already narrated, according to the wishes of Venkata himself."

The Aravidu Dynasty of Vijayanagara, 505.

+ "Then the king sent for his robe, valued at 200,000 cruzados, the great diamond which was in his ear, which was worth more than 600,000 cruzados, his earrings, valued at more than 200,000, and his great pearls, which are of the highest price."

A Forgotten Empire, P. 224.

ఇది జరిగిన మూఁడుదినములకు (1614 – అక్టోబరు) వేంకటపతిదేవరాయలు కాలధర్మమునొందెను.[1] అప్పటి కాతనికి నఱువదియేడు వత్సరముల వయస్సు. వెల్లూరియందలి రాయల యుద్యానవనమునందే యాతని దేహము దహన మొనర్చిరి. ఆ సమయమున నాతని ముప్పురు రాణులును భర్తతో సహగమన మొనర్చి, మోక్షసామ్రాజ్యమును బొందిరి.[2]

# శ్రీరంగరాయలు

శ్రీరంగరాయలు పరిపాలన మారంభించినతోడనే, తనకిష్టులైన సేనానాయకుల నుంచుకొని, మిగిలినవారినిఁ దన రాష్ట్రము నుండి వెడలఁగొట్టెను. సరదారులలో జగ్గారాయఁడు, తిమ్మానాయకుఁడు, మాకారాయఁడును దప్ప, మిగిలినవారెల్లరును రాజభక్తితత్పరులై యుండిరి. ఆ ముప్పురును బాయమ్మకుమారునకే పట్టముఁ గట్ట నిశ్చయించి, యందులకు వలయుప్రయత్నములు సేయుచుండిరి.

ఇది యిట్లుండ, శ్రీరంగరాయలు దనమిత్రులలో ముప్పురు దనకు నవిధేయులుగానున్న కారణమున వారినిఁ దమ పదవులనుండి తొలఁగించెను. వారిలో మొదటివాఁడు దళవాయి; రెండవయతఁడు మంత్రి; మూఁడవయాతఁడు నారపరాజు. వారు ముప్పురును నేకీభవించి, 'యిఁకమీఁద మీ యాజ్ఞకు బద్ధులమైవర్తింతు' మని నుడువుచు, మన్నింప రాజును బ్రార్థించి, రహస్యముగా జగ్గారాయనితోఁ గుట్రలుపన్ని, యాతని మేనల్లునకుఁ బట్టముఁ గట్టఁ బ్రయత్నించిరి.

---

1. "సుప్రసిద్ధుఁడగు వీరవేంకటపతిరాయలు క్రీ. 1614 ప్రాంతమున మృతి నొందెను. 1643 ప్రాంతమున శ్రీరంగరాయలు రాజ్యమునకు వచ్చి 1678 ప్రాంతమందు రాజ్యభ్రష్టుఁడై మహిసూరు దేశములో మృతి నొందెను. ఈ యిద్దఱు రాజుల నడిమి కాలమునందుఁ బహువురు రాజ్యమును గాంక్షించుటచే ఘోరమగు పోరు పుట్టి శ్రీరంగరాయలు, రామరాయలు, వేంకటపతిరాయలు నను వారు స్వల్పస్వల్ప కాలము సింహాసనమధిష్ఠించి, పదభ్రష్టులగుచువచ్చిరి."–చంపూరామాయణ పీఠిక, పు. 4. (జయంతి రామయ్య)

2. Sewell. The story of Barradas, Pages 223-4.

ఒకనాఁటి ప్రాతఃకాలమున జగ్గారాయఁడు, తిమ్మానాయకుఁడు, మాకారాయఁడును గలిసి, తాము రాజభక్తిని వెల్లడింప వచ్చుచున్నామని రాజునకుఁ గబురంపిరి. పాప మా రాజు వారి మాటలు నమ్మి, వారిని లోనికి రానిచ్చెను. ఆ సమయమున జగ్గారాయఁడు కొంతసైన్యము నూరి బయట నుంచి, యైదువేలసైనికులతోఁ గోటలోనికిఁ బోయెను. మిగిలిన యిరువురును జెఱి రెండువేల సైనికులతో దుర్గమును బ్రవేశించిరి. ఆ కోటకు రెండుగోడలు గలవు. జగ్గారాయఁడు దాని ప్రథమద్వారముకడ వేయిసైనికులను, ద్వితీయద్వారమునొద్ద వేయిసైనికులను ఉంచెను. దానికి మఱియొక ప్రక్క నున్న రెండువాకిండ్లను దళవాయి ముట్టడించెను. అప్పు డటఁ జెలరేఁగిన హాహాకారములకు భీతిల్లి, రాజు, దుర్గద్వారములను బంధింప సేవకుల నాజ్ఞాపించెను. ఆలోపల విరోధులు ద్వారములు సమీపించి, వానిని బగులఁగొట్టఁ బ్రయత్నించిరి. వారిలో, మొదట, మాకారాయఁడు వాకిలిఁబగులఁగొట్టి, లోనఁ బ్రవేశించి, రాజును బట్టి బంధించెదనని కేకలువేయుచుఁ బోయి, యాతఁడు తనకు లోఁబడి జగ్గారాయని మేనల్లునకుఁ బట్టముగట్టుచో, నాతనికిఁ గీడువాటిల్లదని రాజునకు వర్తమాన మంపెను. అంత శ్రీరంగరాయలు చేయునది లేక, భార్యాపుత్త్రి సహితముగాఁ గోటవిడిచి పోయెను.

వెంటనే జగ్గారాయఁడు తన మేనల్లునకుఁ బట్టముఁ గట్టి, శ్రీరంగరాజును గుటుంబసహితముగ బంధించి, చెఱయందుంచెను. సేనానాయకు లెల్లరును జగ్గారాయనికి లోఁబడిరి. యాచమనాయఁడుమాత్ర మా కుత్సితునకు లోఁబడక, శ్రీరంగరాజు పక్షము వహించి, కోటకుదూరమునఁ దన సైన్యముతో వసించుచుండెను. అంత జగ్గారాయఁడు, 'నీవు రాజభక్తితోఁ బ్రవర్తింపవలయును. అట్లు వర్తింపవేని, నీకు హానిగలుగు' నని యాచమనాయనికి వార్త నంపెను. నాయఁ డా వర్తమానము విని, 'కులగోత్రాదులు దెలియని బాలునియెడ నాయంతటివాఁ డెన్నఁడును రాజభక్తినిఁ

జూపఁడు. రాఁగలకీడునకు భయమందను. యుద్ధమునకు సిద్ధుఁడ' నని ప్రత్యుత్తరమంపెను. జగ్గారాయఁ డా యుత్తరము నాలించి, యాతని లోఁబఱచుకొన సర్వవిధములఁ బ్రయత్నించెను. కాని, ప్రయోజనము లేకపోయెను. ఆ మీఁద యాచమనాయఁడు జగ్గారాయని యుద్ధమునకుఁ బిలిచి, 'నీవు నన్ను రణమున గెలుచుచో, నీ మేనల్లుఁడు నిరాతంకముగా రాజ్యమును బాలింపవచ్చు' నని నుడివెను. మరల, జగ్గారాయఁ డెన్నియోవిధములఁ బ్రయత్నించియు, యాచమనాయని లోఁబఱచుకొనఁజాలఁడయ్యెను.

ఇదియిట్లుండ, యాచమనాయఁ డెవ్విధముననైనఁ జెఱనున్న శ్రీరంగరాజును దర్శింపఁ దలఁచి, యది యసాధ్యమని తెలిసికొని, యెట్టులేని నాతని కొమారులలో నొక్కనిఁ దనయధీనము చేసికొన నిశ్చయించి, యా రాజు బట్టలనుతుకు చాఁకలిని రప్పించి, 'యోరీ! నీవెట్టులేని రహస్యముగా శ్రీరంగరాయల ద్వితీయ కుమారునిఁ గొనిరావలయు. నీ వట్లు చేసితివేని నీ కపరిమిత ధన మొసఁగుదు' నని నుడివెను. ఆ మాటల కారజకుఁడు సంతసించి, 'మీ రీవిషయమును రహస్యముగానుంచుచో, నేనీపనిని సాధింతు' ననెను. అంత యాచమనాయఁడు వల్లెయని, యొక యుత్తరము వ్రాసి మడివేలునకొసఁగ, నాతఁడు దానిని గైకొని, మఱునాఁటి యుదయమున నెప్పటియట్ల మయిలబట్టలు దేరఁ జెఱసాలకేఁగి, శ్రీరంగరాయల కా యుత్తర మొసఁగి, యాతని రెండవకుమారుని మలినవస్త్రములలోఁ జుట్టి, యేరికినిఁ దెలియకుండ భద్రముగ నాతనిఁ దనయింటికిఁ గొనిపోయి, యట మూఁడుదినము లా బాలుని నుంచుకొని, నాల్గవదినమున నాతనిఁ బట్టణమునకు మూఁడుమైళ్ళదూరమున వసించుచున్న యాచమనాయని కొప్పగించెను. ఆతఁ డెంతయు హృష్టుఁడై యా బాలరాజును స్వీకరించి చాఁకలికి నపార బహుమతులొసఁగెను.

వెంటనే యా వార్త జగ్గారాయనికిఁ దెలిసి, నిజము గనుఁగొన నా బాలునికొఱకుఁ గోటయంతయు వెదికించెను. కాని,

యాతఁ డెందును గానరాఁడయ్యెను. అంత, యాచమనాయఁడు చేసినకుట్రను జగ్గారాయఁడు తెలిసికొని, యా బాలునిఁ బట్టి తేర నలుగురు సేనాధిపతులను నెనిమిదివేల సైనికులతోఁ బంపెను.

ఆ బాలుని నెట్టులైనఁ గాపాడఁదలఁచి, యాచమనాయఁడు తనకడనున్న సైనికులలో నమ్మికమైనబంట్లను నిరువదిమంది నేర్పఱచి, తనశిబిరమునుండి శ్రీరంగరాయలున్న చెఱసాలకు రహస్యముగా సొరంగముఁ ద్రవ్వించెను. అంత నాతని యనుమతిని భటులుగొంద ఱా సొరంగముఁ బ్రవేశించి, చెఱసాలలోనికిఁబోయి, యాచమనాయఁ డొసఁగిన యుత్తరమును రాజున కిచ్చిరి. ఆతఁ డెంతయు సంతసించి, భార్యాపుత్త్రులతో 'భయపడవల'దని నుడివి, సొరంగముఁ బ్రవేశింపనుండ, జగ్గారాయని సేవకులలో నొకఁడు తటాలున దానిలోఁ బడి, బిగ్గఱగా నఱచెను. ఆ సవ్వడినిఁ బట్టి మిగిలిన సేవకు లటకుఁ బోయి, నిజవృత్తాంతముఁ గనుఁగొని జగ్గారాయని కెఱిఁగించిరి. ఆతఁ డా మోసముఁ దెలిసికొని తత్క్షణమే శ్రీరంగరాజును నాలుబిడ్డలతో మఱియొకచోట బంధించెను.

తనప్రయత్నము కొనసాగలేదని చింతించి, యాచమనాయఁ డొక సేనాధిపతికి లంచమిచ్చి, సమయముఁ గనిపెట్టి, యాతఁడు చెఱసాలను రక్షించు సేవకులను జంపునట్లేర్పాటు గావించెను. ఒకనాఁడు కొలఁది సైనికులనుమాత్రమే కోటయందుంచి, మిగిలిన సైన్యముతో జగ్గారాయఁడొక సామంతుని శిక్షింపనేఁగెను. ఆ సమయమున యాచమనాయని పక్షముననున్న దళవాయి చెఱసాలను గాపాడుచున్న సేవకుల నంతమొందించి, యా దుర్గద్వారములలో మూఁడింటిని బట్టుకొని, వెంటనేవచ్చి, కోటను ముట్టడింపవలయుననువార్త యాచమనాయనికిఁ దెలియఁజేసెను. ఆ లోపల, జగ్గారాయఁడు సైన్యముతో మరలివచ్చి, నాల్గవవాకిట దుర్గముఁ బ్రవేశించి, యా సేనాధిపతిని దళముతో నంతమొందించెను.

ఈ విచిత్ర సంఘటనలనుగాంచి, జగ్గారాయఁ డిఁక శ్రీరంగ

రాజును, నాతని కుటుంబమును బ్రాణములతో నుంచరాదని నిశ్చయించి, యాతని నాలుబిడ్డలతో సంహరించి రావలసినదిగఁ దన సోదరుఁడైన చిన్న యోబలరాయని నాజ్ఞాపించెను. అంతఁ జిన్న యోబలరాయఁడు రంగరాజుకడకేఁగి, భ్రాతృనాజ్ఞను దెలిపెను. ఆ మాటలకు రాజు చింతించి, శత్రువుచేఁ జిక్కి చచ్చుటకంటె నాత్మహత్యఁ గావించుకొనుటయే యుత్తమమని భావించి, తనవారల నెల్లర ముందుగఁ దుదముట్టించి, తుదకుఁ దాను ఖడ్గమునఁ బొడిచికొని మరణించెను.

ఈ ఘోరకృత్యమునకు సరదారులెల్లరు జగ్గారాయని నిందించి, చాఁకలి గొనితెచ్చిన యా బాలరాజును గాపాడఁ దలఁచి, వారెల్లరు యాచమనాయనిపక్షము వహించిరి. యాచమనాయఁడును నిట్టి కటువుకర్జమున కాగ్రహపడి, పదివేలసైనికులతో యుద్ధసన్నద్ధుఁడై, 'నీవు శ్రీరంగరాయలఁ జంపించినను నాతనివంశ మింకను నిర్వంశము గాలేదు. నీవు నీ సైన్యములతో వచ్చి, నన్నును, నా బాలరాజును జంపుము. ఆ మీఁద నీ మేనల్లుఁడు నిరాతంకముగా రాజ్యముఁ బాలింపఁగలఁ' డని జగ్గారాయనికి సందేశమంపెను. ఈవార్త వినియు, జగ్గారాయఁడు కొంతకాలము యుద్ధమునకుఁ బూనకయుండి, యామీఁద విధిలేక పోరునకు దిగెను. కొంతకాల ముభయులకును ఘోరయుద్ధము జరిగెను. చివరకు జగ్గారాయనిబలము తగ్గెను. అంత యాచమనాయఁడు శత్రుశిబిరములఁ జొచ్చి, యందలి రాజచిహ్నములఁ గొనితెచ్చి, శ్రీరంగరాయల ద్వితీయపుత్త్రుఁడైన రామదేవరాయల కొసఁగి, యాతఁడే రాజని ప్రకటించెను.[1]

ఆమీఁద జగ్గారాయఁడు తన సైనికులతో నడవులకుఁ బాఱిపోయి, రెండువత్సరములకాల మంతటంతటఁ బోరాటములు సాగించెనుగాని, ప్రయోజనము లేకపోయెను.

---

1. Sewell. The Story of Barradas, PP. 224-229.

## ామ దేవరాయలు

ఈతఁడు యాచమనాయని సాహాయ్యమున విజయనగర
ామ్రాజ్య సింహాసనమధిష్ఠించి, రాజ్యమును బాలింపఁదొడఁగెను.

రామదేవరాయలు పోచిరాజు రామరాజు కూఁతురగు
బమాంబను, గొబ్బూరి యతిరాజు కొమార్తెయగు కొండమాం
కు వివాహమాడెను. [1]

ఈతఁడు 1614-వ వత్సరమున రాజ్యమునకువచ్చి యెంత
లము పరిపాలించినదియుఁ దెలుపుటకుఁ దగిన యాధారములు
ు.

## పెద్ద) వేంకటపతి రాయలు

రామదేవరాయల యనంతరము సింహాసనమునకు వచ్చిన
ఁడు వేంకటపతిరాయలు. ఈతఁ డెప్పుడు రాజ్యమునకు వచ్చిన
ుఁ దెలియదుగాని, యీ చక్రవర్తి 1642-వ వత్సరమువఱకు
జ్యమును బాలించినట్లుమాత్రము స్పష్టమగుచున్నది. ఈతనికిఁ
్క వేంకటపతిరాజనియు, గోపాలరాజనియు నామాంతరములు
ు. ఈతఁడు రామదేవరాయల తనయుఁడై యుండనోపును.

ఈ గోపాలరాజు (పెద్ద వేంకటపతిరాజు) అళియరామ
జు సోదరుఁడైన వేంకటాద్రి మనుమఁడగు గోపాలరాజని
ందఱు భ్రమపడుచున్నారు. ఇది పొరపాటు. అళియరామరాజు
దరుఁడైన తిరుమలదేవరాయల సంతతివారు పెనుగొండ, చంద్ర
, వేలూరు పట్టణములను రాజధానులుగఁ జేసికొని, విజయనగర
ామ్రాజ్యమును బాలించిరి. అళియరామరాజు మఱియొక సోద
డు వేంకటాద్రి సంతతివారు కందనోలు (కర్నూలు) రాజ్యమున
పతులైరి. గోపాలరా జీవంశములోని కడపటివాఁడు. ఈతఁడు

1. నరపతివిజయము, ప. 257

కందనోలును బాలించు సమయమున విజాపురసుల్తాను దండెత్తివచ్చి, గోపాలరాజును నోడించెననియు, నంత నాతఁడు కోటను వీడి పాఱి పోయెననియుఁ దెలియుచున్నది. [1] కావున నీ గోపాలరాజు వేఱు పురుషుఁడు.

ఈతనికి సంతానములేని కారణమున నళియరామరాజు మునిమనుమఁడైన శ్రీరంగరాజును [2] దత్తు తీసికొనెను. ఈతఁడు చరిత్రకారులవలన 'ఆఱవ శ్రీరంగరాయ'లని వ్యవహరింపఁబడుచున్నాఁడు.

1639-వ వత్సరమున, మార్చి నెలలో, ఈస్టు ఇండియా కంపెనీవారి యేజంటుగానున్న 'ఫ్రాన్సిస్ డే' యను నాతనికిఁ జెన్నపట్టణమునఁ గోటను గట్టుకొనుటకు నైదు మైళ్ళ పొడవు, నొకమైలు వెడల్పుగల భూభాగమును వేంకటపతిరాయల యనుమతిచే నాతని సామంతుఁడైన దామర్ల వేంకటనాయకుఁడు రెండు వత్సరముల కాలము కౌలున కిచ్చెను.

సాళ్వతిమ్మనృపాలుఁడు, వెలుగోటి వేంకటవిభుఁడు, చెంజి (జింజి) వరదేంద్రుఁడును నీ వేంకటపతిరాయల సమకాలీనులైనట్లు తెలియుచున్నది. [3] ఈతఁడు 1642-వ వత్సరమున స్వర్గస్థుఁడయ్యెను.

---

1. Ferishta, III, P. 141 It was probably not long after this event that Abdul Wahab, was deputed by the Bijapur Sultan, with a powerful army to take the fort of Karnul. He invested the town, which was then governed by the last of its Hindu rulers, Gopala Raja, a grandson of Rama Raya, the Regent of Sadasiva. This chief stoutly defended the town, which was strongly fortified. He was assisted, it is said, by a force sent by his relation the Emperor Venkata. Gopala Raja, however, was eventually forced to yield; and he is said to have fled from the town through the northern gateway of the fort, still known as 'Gopala Daruwaza,' Gopala's palace, even in its present ruinous state, shows to this day its ancient beauty and richness. Cf. M. E. R., 1915-16, P. 44, Para 26.

Vide, The Aravidu Dynasty of Vijayanagara, P. 337

2. చిన్న వేంకటపతిరాజు మూఁడవ (కడపటి) కొమారుఁడు

3. చంపూరామాయణము, ప్ర. ఆ. ప. 31

# శ్రీరంగరాయలు (ఆఱవ)

పెద్ద వేంకటపతిరాయల యనంతర మాతని దత్తపుత్త్రుఁడు శ్రీరంగరాయలు సింహాసనాసీనుఁడయ్యెను. ఈతఁడు కవిజనపోష కుఁడు. దానగుణవిశ్రుతుఁడు. వితతప్రతాపశాలి. సుందరాకారుఁడు.

ఈతఁడు, రాజ్యమునకు వచ్చినతోడనే, విజయనగర సామ్రా జ్యమును బూర్వపు ఔన్నత్యమునకుఁ దీసికొని రాఁదలఁచి, గోలకొండ నవాబుతోఁ జేరి తనకు ద్రోహము చేయుచున్న దామర్ల వేంకట నాయకుని నధికారమునుండి తొలఁగించెను. పులికట్టు, తిరుపతి ప్రాంతములవఱకు వచ్చిన గోలకొండ సేనలను వెనుకకుఁ దఱుమఁ గొట్టెను.[1] అమీఁద ఈస్టు ఇండియా కంపెనీవారు, తమకుఁ గాలూసఁగిన వేంకటనాయకుఁడు పదభ్రష్టుఁడగుటవలనను, జక్రవర్తి యైన వేంకటపతిరాయలు మరణించుటవలనను భయమంది, శ్రీరంగ రాయలను దర్శించి, మరల నీతనివలనఁ గ్రొత్తకౌలు సంపాదించిరి.

ఈతఁడు గొబ్బూరి వెంగళరాజు కూఁతురగు పాపమాంబను, బోచిరాజు వెంగరాజు తనయయగు రాఘవాంబను, బోచిరాజు వెం కటరాజు కొమార్తెయగు వెంగమాంబను వివాహమాడినట్లు తెలియు చున్నది.[2]

శ్రీరంగరాయలు ముప్పదియాఱు వత్సరములు రాజ్యముఁ బాలించి, 1678-వ వత్సర ప్రాంతమున రాజ్యభ్రష్టుఁడై, చని, మహిసూరు దేశములో మృతినొందెను.

# వేంకటపతి రాయలు

శ్రీరంగరాయల యనంతరము వేంకటపతిరాయలు నామ మాత్రావశిష్టమైయున్న విజయనగరరాజ్య సింహాసనమధిష్ఠించి,

1. నరపతి విజయము, ప. 360

2. నరపతి విజయము, ప. 362-3

రెండు వత్సరముల కాలము మాత్రము పాలించినట్లు కొన్ని శాసనములవలనఁ దెలియుచున్నది.[1]

ఈ వేంకటపతిరాయలు శ్రీరంగరాయల తనయుఁడై యుండ నోపును. ఈతఁ డే భార్యయందు జనించినవాఁడో తెలియదు.

ఆదర్శప్రాయమైయొప్పిన విజయనగరసామ్రాజ్యము శ్రీరంగ రాయల మరణానంతరము ప్రాభవమై భవాదులను, ధనకనకవస్తు వాహనాదులను సంపూర్ణముగఁ గోలుపోయి, మహారాష్ట్ర రాజ్యమున లీనమై పోయినది.

ఆహా! కాలమహిమ!

1. Sewell, Lists of Antiquities, Vol. II.

# ఆర్వీటి (నరపతి) వంశము

## (ఆనెగొంది)

### Rulers

| | క్రీ. శ. |
|---|---|
| కొండరాజు | |
| రామరాజు | |
| శ్రీరంగరాజు | |
| పెద్ద వేంకటపతిరాజు | |
| చిన్న వేంకటపతిరాజు | |
| వీర వేంకటపతిరాజు | |
| కోదండరామరాజు (రంగరాజు) | |
| పెద్దవేంకటరాజు (రంగరాజు) | |
| తిరుమలరాజు | ,, |
| రామరాజు | |
| గోపాలరాజు | |
| వీర వేంకటపతిరాజు | |

### Pensioners

| | | |
|---|---|---|
| తిరుమల దేవరాజు | | 1756 - |
| | (Pension) | 1801 - |
| వీర వేంకటపతిరాజు | | 1824 - |
| తిరుమల దేవరాజు | | 1831 - |
| వేంకటరామరాజు | | 1866 - |
| కృష్ణదేవరాయలు | | 1871 - |
| పెద్దనరసింహరాజు | | 1872 - |
| శ్రీరంగదేవరాయలు | | 1902 - |
| కుప్పమ్మరాణి | | 1918 |

## Section 3. Rulers



Section 3. (Continued)

* కోదండరామరాజు (రంగరాజు)
  - పెద్ద వేంకటరాజు (8) (రంగరాజు)
    - రామరాజు
      - వెంకమ్మ
      - చిన్నరాజు
        - పెద్దదాసరాజు
        - చిన్నదాసరాజు
          - వీర వేంకటపతిరాజు (12) (Son of Gopala, adopted by Chinna Dasa)
      - రామరాజు
    - తిరుమలరాజు (9)
      - రామరాజు (10)
      - గోపాలరాజు (11)
        - వీర వేంకటపతిరాజు (Adopted by Chinna Dasa)
  - చిన్న వేంకటరాజు
  - కోదండరామరాజు
  - వేంకటరాజు



Pensioners
వీర వేంకటపతిరాజు
(Son of Gopala, adopted by Chinna Dasa)
తిరుమలదేవరాజు (p. 1)
చెల్లమ్మ
నరసింహరాజు
వీరవేంకటపతిరాజు (p. 2)
పెద్దపంపాపతిరాజు
చిన్నపంపాపతిరాజు
* శేషమ్మ
రంగపతిరాజు
కుమారరాఘవరాజు
సదాశివరాజు
కోదండరామరాజు
కుప్పమ్మ
(M. Krishna of the elder line
పంపాపతిరాజు
(adopted by Kuppamma)
కుమారరాఘవరాజు
రామకృమ్మ
సదాశివరాజు
నరసింగమ్మ
కోదండరామరాజు

Pensioners (Continued)






# ఆనెగొంది రాజులు

(ఆర్వీటి - నరపతి - వంశము)

విజయనగర సామ్రాజ్యపతనానంతరము వేలూరుప్రాంతము నుండి యానెగొందికి వచ్చి, రాజ్యమును సంపాదించిన యార్వీటి వంశజు డెవ్వఁడని పెక్కండ్రు సంశయపడుచున్నారు. చారిత్రక దృష్టితోఁ బరిశీలించిన నట్టి సందేహమునకుఁ జోటుండదు.

ఆర్వీటి శ్రీరంగరాజునకుఁ దిరుమలాంబయందుఁ గోనరాజు, తిమ్మరాజు, అళియరామరాజు, తిరుమలదేవరాజు, వేంకటాద్రి యను నైదుగురు కొడుకులు పుట్టిరనియు, వారిలో రామరాయ, తిరుమలదేవరాయ, వేంకటాద్రుల వంశములుమాత్ర మభివృద్ధి నొంది, వేఱు వేఱు ప్రదేశములకుఁ బాలకులై రనియు స్థలాంతరమున వ్రాసియుంటిని. తిరుమలదేవరాయలు పెనుగొండయందుఁ బ్రతినిధి గానుండెను వేంకటాద్రి కర్నూలు రాజ్యమునకుఁ బ్రభువయ్యెను. అళియరామరాజు విజయనగర సంస్థానమున శ్రీకృష్ణదేవరాయల ప్రాపు సంపాదించి, యాతనికి నల్లుఁడై, ప్రళయకావేరి మొదలగు ప్రదేశముల కధినాథుఁడై, యచ్యుతరాయ సదాశివరాయల కాలమున వారిని బేరునకుమాత్రము రాజులుగనిలిపి, తానె సామ్రాజ్యమును బాలించెను. 1565- వ వత్సరమునఁ దాళికోట యుద్ధమున రామరాయలు మరణించిన పిదప, నాతని సోదరుఁడును, పెనుగొండ ప్రతినిధియునైన తిరుమలదేవరాయఁడు విజయనగరరాజ్య సింహాసన మధిష్ఠించెను. రామరాజు సంతతివారు మొదటినుండియుఁ దుంగభద్రానదీతీరస్థప్రదేశముల కధినాథులై, విజయనగరసింహాసనమునకు లోఁబడి, పాలనము సాగించుచుండిరి. దీనికి దృష్టాంతముగ రామరాజుతనయులలోఁ గొండరాజానెగొందిని,[1] జిన్న తిమ్మరాజు రాయచూరిని[2] బాలించినట్లు నరపతివిజయము తెలుపుచున్నది.

---

1. నరపతివిజయము, ప. 305
2. నరపతివిజయము, ప. 310

వీరు, తమ వంశజులు విజయనగరసామ్రాజ్యాధీశ్వరులై యుండినంతకాలము స్వతంత్రులై వర్తించిరి. ఆమీఁద, మహమ్మదీయులకును, మహారాష్ట్రులకును లోఁబడి, రాజ్యమునుగోలుపోయి, చివర కానెగొందిసంస్థానమును మాత్రము సంపాదించుకొనిరి. ఇది మొన్న మొన్నటివఱకు నిజామురాష్ట్రమునకుఁ జేరియుండెను.

### కొండరాజు

అళియరామరాజు తృతీయభార్యయగు కొండమాంబయందు జనించిన యిరువురు పుత్త్రులలో మొదటివాఁడు కొండరాజు. ఆనెగొందినిఁ బాలించిన యార్వీటివంశజులలోఁ బ్రథముఁడీతఁడే. ఈతఁడు నిజాముసేనలను గంగావతినుండి కృష్ణానదివఱకును బాఱఁదోలి కీర్తిఁగన్నవాఁడు.[1] సూరపరాజు కూఁతురగు తిరుమలాంబను వివాహమయ్యెను. ఆమెవలన రామరాజుదయించెను.

### రామరాజు

కొండరాజు మరణించిన పిదప, నాతని తనయుఁడగు రామరాజు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు హరిభక్తిపరుఁడు. సుగుణాకరుఁడు. దానకర్ణుఁడు. గొబ్బూరి యోబరాజు కూఁతురగు నరసింగమ్మను, సూరపరాజు ఓబరాజు తనయయగు నోబమాంబను, బోచిరాజు చెన్నరాజు పుత్రికయగు జానకమ్మను బరిణయమయ్యెను.

### శ్రీరంగరాజు

రామరాజునకు సంతానము లేని కారణమున నాతని యనంతర మాతని పినతండ్రియగు శ్రీరంగరాజు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు వీరాగ్రణి. రిపులఁబొరిగొని, వారి సంపదలఁ జూఱలాడినవాఁడు. దానలోలుఁడు. ఆశ్రితవజ్రపంజరుఁడు. ధర్మమార్గతత్పరుఁడు. ఈతఁడు పోచిరాజు రఘునాథరాజు తనయయగు లక్ష్మాంబను బరిణయమయ్యెను. ఈమెవలనఁ బెద వేంకటపతి, చిన వేంకటపతియను కుమారులు గలిగిరి

1. నరపతివిజయము, ప. 303

పెద్ద వేంకటపతిరాజు

శ్రీ రంగరాయల యనంతరము పెద్ద వేంకటపతి రాజయ్యెను. ఈతఁ డరిభీకరుఁడు. కరుణానిధి. జనులకు సౌఖ్యములఁ జేకూర్చిన ఘనుఁడు. ఈతఁడు గొబ్బూరి యోబరాజు తనయను బంగారమ్మను వివాహమాడెను.

చిన్న వేంకటపతిరాజు

పెద్దవేంకటపతికి సంతానములేని కారణమున నాతని యనంతరము చిన్నవేంకటపతి రాజయ్యెను. ఈతఁడు సాత్త్వికగుణగణ ప్రధానుఁడు. అందాలవాఁడు. దానపరుఁడు. జిల్లేళ్ల నారపరాజు తనయ వెంగళాంబను నుద్వాహమయ్యెను. ఈమెవలన వీరవేంకటపతిరాజు, తిరుమలరాజు, శ్రీరంగరాజు నను ముప్వురు తనయులుదయించిరి.

ఈతఁ డొకనాఁడు తుంగభద్రానదీతీరస్థ విరూపాక్షస్వామిని సేవించి చనుచు, మార్గ మధ్యమున నొక్కయెడ నించుక విశ్రమించెను. అంత దివ్యభూషణములు, దివ్యమాల్యములు, దివ్యగంధములు, దివ్యవస్త్రములును దాల్చి, కోదండపాణియైన రామభద్రుఁ డాతనికి సాక్షాత్కరించి, తాను శ్రీరామభద్రుఁడని యెఱిఁగించెను. అంత నా చిన్న వేంకటపతి నిటలతటాగ్ర సంఘటితహస్తకమలుండై నమస్కరించి, కనకపీఠమున నా స్వామి నాసీనుఁ గావించి, యాగమోక్త విధానమున నా క్రమమూర్తినిఁ బూజించి, యిట్లు స్తుతించెను.

చక్రబంధము—

'భవ్యాకోస్థలసూతినందన రమాభావేందుసారంగకా
క్రవ్యాదప్రహరప్రవీణ నయరక్షాగణ్యనామాంకితా
దివ్యాండప్రచయప్రభావనరథా దీనస్పృహాకంటకా
కావ్యారంభహితక్రమావిదిత నాకారి శ్రితానందకా.'

— నర. ష. ౩౩౬

నాగబంధము—

'పరమదయాకరా రవిజభంజనబోధవిహారభాసురా
కరధృతచాపనీరజజకంజసుర ప్రకరాశనాంబుజా
మరధరణీజహీరశరమార విపక్షపయోదసారకీ
ర్తిరమశతావిహారధరధీర వసుప్రజధూతపావకా.'

— నర. ప. 337

ఈ స్తుతివాక్యములకుఁ గోదండరాముఁ డెంతయు సంత సించి, 'నీ కుమారుఁడగు వీర వేంకటపతికి మదంశమున నగ్రసుతుఁ డుద్భవిల్లు' నని యానతిచ్చి, తిరోహితుఁడయ్యెను.

అంతఁ జిన వేంకటపతి మేల్కాంచి, తాఁ గలఁగన్న విషయ ము తన బంధువులకు వినిచి, వారల సంతసపఱచి, చక్రతీర్థము కడ నున్న కోదండరామాలయమునకు గోపురప్రాకారాములఁ గట్టించి, కోదండరాముని యనుగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను.[1]

(వీర) వేంకటపతిరాజు

చిన్న వేంకటపతి యనంతర మాతని జ్యేష్ఠతనయుఁడగు వీర వేంకటపతి రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు 'విరోధిరాజమద కుంజరసింహకిశోరమూర్తి.' హరిభక్తిపరుఁడు. ధర్మవేది. ఈతఁ డానెగొంది రాజ్యమునే కాక, యార్వీటిని సహితము పాలించినట్లు తెలియుచున్నది.[2]

ఈతఁడు సూరపరాజు కృష్ణరాజు పుత్రికయగు నప్పలాం బను, బోచిరాజు రఘునాథరాజు తనయలగు వేంగమాంబా కోనే రమ్మలను వివాహమాడెను. ఆ ముగ్వురలోఁ బతిమన్నన కెక్కినది యప్పలాంబ. ఈమెకు రామరాజు, తిమ్మరాజు, వేంకటాద్రియను ముగ్వురు తనయులు గలిగిరి. వీరిలో ద్వితీయుఁడు తిమ్మరాజు విరూపాక్షాలయ ప్రాగ్ద్వార గోపురమును గట్టించి,[3] రామభద్రుని

1. నరపతివిజయము, ప. 333 - 349
2. నరపతివిజయము, ప. 369
3. నరపతివిజయము, ప. 394

కథను ద్విపదరూపమున రచించి, దానిని విరూపాక్షస్వామి కంకిత మొనర్చి,[1] తుంగభద్రానదీతలమునఁ గ్రముకముఖభూజములు, మల్లికా ప్రభృతిలతావళులుఁ గల యుద్యానమును వేసి, యందు శ్రీరంగధామునిఁ బ్రతిష్ఠించినట్లు[2] తెలియుచున్నది.

**(కోదండ) రామరాజు**

వీరవేంకటపతి తరువాత రాజ్యమునకు వచ్చినవాఁడు రామ రాజు. ఈతఁడు కోదండ రామునియంశమునఁ బుట్టినవాఁడు. ఈత నికిఁ గోదండరామరాజనియు, రంగరాజనియు నామాంతరములు గలవు. రామునిఁ బోలిన సుగుణాభిరాముఁడు. ఆర్యసన్నుతుఁడు. అనృతమాడనివాఁడు. జూటూరియుద్ధమున శత్రువుల జయించి,[3] కీర్తికాంతనువరించెను. మహిసూరు దళవాయి కుమారయ్య హోసకో, కడఁ గోదండరామరాజును యుద్ధమునకుఁ జీరెను. రామరాజు, కాసరకోటతిమ్మయ్య, సబినీసుకృష్ణయ్య, మట్టి వేంకటపతిరాజును వెంటఁగొని, కయ్యమునకు దిగి, శత్రువుల జయించెను.[4]

రామరాజు పోచిరాజు కృష్ణరాజు తనయ నాంచారమ్మను, జిల్లేళ్లతిర్నాధరాజు కూఁతురగు వేంకమాంబను, సూరపరాజు ఓబ రాజు పుత్రికయగు నుగ్గను దేవినిఁ, బోచిరాజు అచ్చిరాజు కొమా ర్తయగు రాగమాంబను, జిల్లేళ్ల తిరువేంగళనాథుని తనుజాతలగు నుగ్గమాంబా నాంచారమ్మలను, వరదరాజు అప్పలరాజు కుమారిక యగు తిరువేంగళాంబను నుద్వాహమయ్యెను. వీరిలో నుగ్గమదేవి యందుఁ బెదవేంకటరాజును, నాంచారమ్మవలనఁ జినవేంకటకోదండ రామరాజులును, రాగమాంబయందు వేంకటపతియుఁ గలిగిరి.

కోదండరామరాజు వెంకయ్యకృతమగు 'నరపతివిజయ' మను నామాంతరము గల[5] 'రామరాజీయము' నకుఁ గృతిభర్త.

---

1. నరపతివిజయము, ప. 395
2. నరపతివిజయము, ప. 396
3-4 నరపతివిజయము, ప. 430

5. This work (Rama Rajiyamu) is edited by Gustav Oppert, Ph.D., of. of Sanscrit ComParative Philology, Presidency College, Madras.

పెద్ద వేంకటరాజు

కోదండరామరాజు మరణించిన పిదప, నాతని జ్యేష్ఠపుత్త్రుఁడు పెద్దవేంకటరాజు సింహాసన మలంకరించెను. ఈతనికి రంగరాజని నామాంతరము గలదు.

తాళికోట యుద్ధానంతర మళియరామరాజు సంతతికి సంపూర్ణముగ దక్కిపోయిన యానెగొంది ప్రాంతభూములీ రంగరాజు (పెద్ద వేంకటరాజు) మరణకాలమునాఁటికి మహారాష్ట్రుల హస్తగతములైనవి. ఈతనికిఁ దిమ్మాంబ (తిమ్మాజమ్మ) యను సతీమణివలన రామరాజు, తిరుమలరాజును జనించిరి.

తిరుమలరాజు

రంగరాజు రాజ్యమును బోఁగొట్టుకొని చనిపోయిన పిమ్మట, నాతని ధర్మపత్ని తిమ్మాజమ్మ తన కుమారులను వకీలు వేంకటకృష్ణప్పతో శ్రీ శివాజి మహారాజుకడకు రాయబార మంపెను. ఆతఁడా మాటలు విని, సంతసించి, దయాళువై, క్రీ. శ. 1657-వ వత్సరమునకు సరియగు శాలివాహనశక 1579, హేవిళంబి సంవత్సర వైశాఖశుద్ధ ద్వాదశి దివసమున—

సంస్థాన విద్యానగర్ ఆనిగుంది

| | |
|---|---|
| గంగావతి ప: | హొసూర్ సమత |
| కంపలి సమత | వడ ,, |
| కామలాపూర్ సమత | వరోజి ,, |
| తకలకోట ప: | హణరావి అంతాపుర |
| | సిరెకోల సమత ప: లను |

సర్వహక్కులతో నాచంద్రతారార్క మనుభవించులాగున రజతఫలకము * న శాసనము వ్రాయించి, తిరుమల రాజునకుఁ బ్రసాదించెను.

* ఈ శాసనము మహారాష్ట్ర భాషలో వ్రాయఁబడి, నరపతి (ఆనెగొంది) సంస్థానాధీశ్వరులకడనున్నది.

**రామరాజు**

తిరుమలరాజు పరిపాలనా కాలముననే రామరాజు గతించెను. తిరుమలరాజు ననంతర మాతని పెద్దకొమారుఁడైన రామరాజు పాలకుఁడయ్యెను.

**గోపాలరాజు**

రామరాజు సంతానహీనుఁడై మరణించుటవలన నాతని సోదరుఁడు గోపాలరాజు రాజ్యమునకు వచ్చెను. ఈతనికి వీరవేంకటపతియను కుమారుఁడు గలఁడు. తిరుమలరాజు జ్యేష్ఠభ్రాతయగు రామరాజు మనుమఁడైన చిన్నదాసరాజీ వీరవేంకటపతిని దత్తుతీసికొనెను.

**వీరవేంకటపతిరాజు**

గోపాలరాజు పిదప, వీరవేంకటపతి సంస్థానాధీశ్వరుఁడయ్యెను. ఈతనికిఁ దిరుమలదేవరాజను కొడుకును, చెల్లమ్మయను కూఁతురును గలరు. తిరుమలదేవరా నరసింగమ్మను వివాహమయ్యెను. చెల్లమ్మ రంగపతిరాజు కుమారుఁడగు దళవాయి - కుమారరాఘవరాజునకు ధర్మపత్ని యయ్యెను.

# తిరుమల దేవరాజు*

మొదటినుండియు నొడుదొడుకులేక సాగిన యానెగొంది రాజ్యము రంగరాజు (పెద్ద వేంకటరాజు) కాలమున విచ్ఛిన్నమయ్యెను. విచ్ఛిన్నమైనదానిని రంగరాజు కుమారుఁడు తిరుమలరాజు 1657-వ వత్సరమున శ్రీశివాజీమహారాజువలన నార్జించెను. ఆర్జించిన రాజ్య మన్యాక్రాంతము గాకుండ 1786-వఱకు నాధ్వీటి వంశజులకు నిలిచియుండెను.

వీరవేంకటపతిరాజు 1756-వ వత్సరమున మరణించెను.

---

* ఇందలి విషయములు నరపతిసంస్థానాధీశ్వరులొసఁగిన 'తిరుమలదేవరాయచరిత్రము' (Chronicle of Tirumala Deva Raju) నుండి యుద్ధృతములు.

పిదప, నాతని తనయుఁడు తిరుమల దేవరాజు రాజ్యమునకు వచ్చి, యానెగొంది, గంగావతి, కంపిలి, కుల్‌కోట, బసరూర్, హోసూరు,* మొదలగు ప్రాంతములకు నధిపతియయ్యెను. ఈ భాగములనుండి యీతనికి సంవత్సరమున కైదులక్షల రూప్యములు వచ్చుచుండెను.

1782–వ వత్సరమున హైదరాలీ చనిపోయిన పిదప, నాతని తనయుఁడు టిప్పుసుల్తాను మహిసూరు రాజ్యమున కధిపతియయ్యెను. ఆమీఁద నాతఁడు మలబారు, కొడగు, మహిసూరునకుఁ జుట్టును గల మఱికొన్ని దేశములను జయించెను.

1786–వ వత్సరమున నాతఁ డానెగొందిపై దాడివెడలి, తిరుమలదేవరాజును బదభ్రష్టునిఁ గావించి, యా రాజ్యమును బాలింప 'బకర్‌గంగ్' అనునాతని నియమించెను. పిమ్మటఁ దిరుమలదేవరాజు 1790, నవంబరు 17–వ తేది బకర్‌గంగ్ నోడించి, సంస్థానమును స్వాధీనపఱచుకొనెను.

1789–వ వత్సరమున టిప్పుసుల్తాను తిరువాన్కూరురాజ్యముపై దండయాత్ర సాగించెను. ఆ దేశపురాజాంగ్లేయులకు మిత్రుఁడును, సహాయుఁడునునై యుండెను. ఆ కారణమున నాతఁడు వెంటనే, తనకు టిప్పువలనఁ గలుగుచున్న బాధలను దొలఁగింపవలయునని యాంగ్లేయులను వేఁడకొనెను. ఆ కాలమున గవర్నరుజనరలుగా నుండిన కారన్‌వాలీ సాతనికి సాయపడెదనని మాట యిచ్చి, టిప్పుతో యుద్ధముసేయుటకుఁ దనకు సాయపడవలయునని నైజామునకును, మహారాష్ట్రులకును నుత్తరములువ్రాసి పంపెను. అందులకు వారిరువురును దమ సమ్మతినిఁ దెలుపుచుఁ బ్రత్యుత్తరములు వ్రాసిరి. అంతఁ గారన్‌వాలీసు స్వయముగా సేనాధిపత్యము వహించి, పెద్దసైన్యముతోఁ బోయి, 1792–వ వత్సరమున బెంగుళూరు ముట్టడించెను. ఆ సమయమున మాటప్రకారము నైజా

---

* రజతఫలకమునందుఁ బేర్కొనఁబడిన ప్రదేశములకును, వీనికిని గొంత భేదము గన్పట్టుచున్నది.

మును, మహారాష్ట్రులును నాంగ్లేయులకుఁ దోడ్పడిరి. కారన్‌వాలీసు ప్రభు హాప్రాంతమునందలి కోటలను బెక్కింటిని స్వాధీనపఱచుకొని, శ్రీరంగపట్టణము చేరెను. టిప్పుసైనికు లోడిపోయి నగరముఁ బ్రవేశించిరి. అంత గత్యంతరము లేక, టిప్పుసుల్తాను, సంధిచేసికొనుటకు సమ్మతింపుఁడని యాంగ్లేయులఁ బ్రార్థించెను.

ఆ సమయమున (16 మార్చి, 1792) టిప్పుసుల్తానుతో నాంగ్లేయులకును, వారి మిత్రమండలికిని శ్రీరంగపట్టణమునొద్ద సంధి జరిగెను. ఆ సంధిషరతుల ననుసరించి, టిప్పు, తన రాజ్యములో సగము విడిచిపెట్టుటకును, యుద్ధవ్యయము (3,000,000 పౌ.) నచ్చుకొనుటకును, దానిలో సగము వెంటనే చెల్లించుటకును, మిగిలిన మొత్తము చెల్లించువఱకును దన కుమారులలో నిద్దఱ నాంగ్లేయులయొద్దఁ గుదువగా నుంచుటకును సమ్మతించెను.

ఆ సంధిప్రకారము టిప్పు విడిచిపెట్టిన దేశముల నాంగ్లేయులతో సమముగా నైజామును, మహారాష్ట్రులును బంచుకొనిరి.

ఈ సంధిషరతుల ననుసరించి, యానెగొందిరాజ్యము టిప్పుసుల్తానునకుఁ జేరవలసినట్లేర్పడెను. ఆకారణమున టిప్పు తన సేనాని యగు కమల్‌ఉద్దీన్ అనునాతనిసైన్యముతో నానెగొందిని స్వాధీనపఱచుకొన 1793-వ వత్సరమునఁ బంపెను. కమల్‌ఉద్దీన్ వచ్చుచున్నాఁడను వార్త విని, తిరుమలదేవరాజు శత్రువును డీకొన సైన్యసమేతుఁడై, యెదురేఁగెను. ఉభయపక్షములవారికిని హాస్పేట (Hospet) కు రెండుమైళ్లదూరమునఁ గల యనంతశయనాలయము * కడ ఘోరయుద్ధము జరిగెను. విజయనగర సామ్రాజ్య కీర్తి ప్రతిష్ఠలు నిలుపుకొనుటకై తిరుమలదేవరాజు తన శక్తి కొలఁదిఁ బోరి, యోడిపోయెను. ఇందు నశించిన క్షత్రియుల సంఖ్య యనల్పము. ఈ యుద్ధమునుగూర్చి యా ప్రాంతవాసు లిప్పటికినిఁ దలపోయుచుందురు.

---

* దీనిని శ్రీకృష్ణదేవరాయలు కట్టించెను.

తిరుమలదేవరా జపజయముఁ బొందినపిదప, నాలుగేండ్ల వఱకును మిత్రమండలిసాహాయ్యమునకై నిరీక్షించెనుగాని, ప్రయోజనము లేకపోయెను. అంత నాతఁడు ధైర్యమవలంబించి, తనకుఁ గావలసిన ప్రజలను బ్రోగుచేసికొని, 1797-వ వత్సరమునఁ దన శత్రువుపై దాడివెడలెను. ఆకాలమున రాజకీయవాతావరణమునఁ గల మార్పువలనఁ దిరుమలరాజునకు జయముగలిగెను; మరల రాజ్యము ప్రాప్తించెను.

1798-వ వత్సరమున వెల్లస్లీప్రభువు గవర్నరు జనరలుగ వచ్చెను. రాఁగానే, యాతఁడు నైజామును వశపఱచుకొని, యాతనిని కంపెనీవారికి సామంతునిగఁ జేసెను. ఆమీఁద, 1799-వ వత్సరమున టిప్పుసుల్తానుతో యుద్ధమారంభించి, యాతని సైన్యములను 'మాలవెల్లి' యను చోట నోడించెను. అప్పుడు టిప్పు మరణించెను; శ్రీరంగపట్టణము స్వాధీనమయ్యెను.

ఈ యుద్ధపుపరతఁల ననుసరించి, తిరుమలదేవరాజు తన రాజ్యము నాంగ్లేయులవశము చేయవలసివచ్చెను. తన పాలనముననున్న కంపిలినగరమును గైకొన జనరలు హారిస్, మైసూరు దివానుగానుండిన పూర్ణయ్యయు నొక సైన్యమును సుబ్బారావు మోతీ వెంటఁ బంపిరి. ఆంగ్లేయసైనికులు శిరాకోలము సమీపించుసరికి, తిరుమలదేవరాజు వారినాదరింపఁ దనవారి నటకుఁ బంపెను. ఆనెగొందిరాజు తమయెడఁ జూపిన యాదరమునకు నాంగ్లేయులెంతయు సంతసించి, తాము గైకొన్న రాజ్యమునుండి యా రాజునకుఁ దుంగాభద్రానదికి నుత్తరపుదిక్కునఁ గల యానెగొంది గంగావతులను, దక్షిణభాగమునఁ గల కంపిలి, కమలాపురము మొదలగు ప్రదేశములను బ్రసాదించిరి. ఆతఁ డింకను రాజ్యమునకై యాంగ్లేయుల నొత్తడింప, వా రాతనికి సంవత్సరమునకు 15,000 వరహాలరాబడిగల జాగీరు నిచ్చిరి. తిరుమలదేవరా జంతటితోఁ దృప్తినొందక, తన సంస్థానమును సమగ్రముగ నొసఁగవలయునని కోరెను. ఆతని వేఁడికో లంగీకరింపఁబడువఱకును నాతనికిఁ గొంత

మొత్తమిచ్చుచుండవలయునని తీర్మానించి, నెలకు 1000 వరహాల వంతున 1799 అక్టోబరు మొదలు 1800 మార్చివఱకును నొసఁగిరి.

ఆ లోపల నాంగ్లేయులు, తామార్జించిన టిప్పుసుల్తాను రాజ్యములో మలబారు, కనరాజిల్లాలను దాముంచుకొని, దత్త మండల మనఁబరఁగు కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురము జిల్లాలను నైజామున కిచ్చిరి. ఆ కారణమున బళ్లారిజిల్లాలోని యానెగొందిరాజ్యము నైజామునకుఁ జేరిపోయెను.

అంత నాంగ్లేయులు తిరుమలదేవరాజును దనసంస్థానపు హక్కులను స్థిరపఱచుకొన, సుబ్బారావు మోతీవెంట, గుత్తిలో నున్న నైజాము ప్రతినిధియగు మీర్ ఆలమ్‌కడకుఁ బంపిరి. మీర్ ఆలమ్ ఆంగ్లేయులు వ్రాసియంపిన యుత్తరమును జదువుకొని, తిరుమలదేవరాజుతో సంప్రతించి, 'నేనొసఁగు జాగీరుతోఁ దృప్తిపడుదు వేని, యుత్తరువు నిప్పుడే యిచ్చెద' నని నుడివెను. దానికిఁ దిరుమలదేవరాజు సమ్మతింపక, 'నా సంస్థానమంతయు నాకుఁ గావలయు' నని ప్రత్యుత్తర మిచ్చెను. ఆ మాటలకు మీర్ ఆలమ్, 'నీకు సంస్థానమునంతయు నొసఁగఁ గల యధికారము నాకు లేదు. నీ విషయమును గూర్చి మా ప్రభువునకు వ్రాయుదును.' అని నుడివి, యాతనిఁ బంపివైచెను. ఆమీఁద నాతఁడు తిరుమలదేవరాజునకు నెలకు 1500 రూప్యము * లిచ్చునట్లుగఁ దమ మామల్‌దారగు మీర్ అహమ్మదునకు నుత్తరువుఁ బంపెను. ఆ యుత్తరువు ననుసరించి, తిరుమలదేవరా జాయుపకార ధనమును 1800, ఏప్రిల్ మొదలు నవంబరువఱకును నైజాము దొరతనమువారివలనఁ బొందెను.

1800-వ వత్సరమున నైజామునకును, నాంగ్లేయులకును జరిగిన యొడంబడిక ననుసరించి, తుంగభద్రానదికి దక్షిణభాగమున

* త్రోసివేతలుపోను చేతికి వచ్చుచుండిన మొత్తము రూ. 1377-8-4 మాత్రము.

నానెగొంది సంస్థానమునకుఁ జేరిన ప్రదేశములన్నియు నాంగ్లేయుల వశమయ్యెను, ఆ కారణమున నాఁటినుండియు, నైజాముప్రభుత్వము వారొసఁగుచుండిన యుపకార ధనమును దిరుమలరాజునకు నాంగ్లేయు లిచ్చుచుండిరి. ప్రకృతము నరపతి (ఆనెగొంది) సంస్థానమునకుఁ జేరిన ప్రదేశమంతయుఁ దిరుమల దేవరాజునకు నైజాము ప్రభుత్వమువారిచే, 1801–1824 మధ్యభాగమున మనువృత్తి (Madad-Mash-Maintenance) గా నొసఁగఁబడెను.

ఈతఁడు 1824–వ వత్సరమునఁ గాలధర్మము నొందెను.

**వీరవేంకటపతిరాజు**

తిరుమలదేవరాజునకు నరసింగమ్మవలన నరసింహరాజు, వీరవేంకటపతిరాజు నను నిరువురు కొడుకులు గలిగిరి. నరసింహరాజునకుఁ గేశవమ్మ యను కూఁతురు గలదు. ఈతఁడు, తండ్రి చనిపోకమున్నే కాలధర్మమునొందిన కారణమునఁ, దిరుమలదేవరాజు మరణించిన పిదప, నాతని ద్వితీయపుత్త్రుఁడు వీరవేంకటపతిరాజు సంస్థానాధీశ్వరుఁడయ్యెను. ఈతఁడు 1824 మొదలు 1831 వఱకు సంస్థానమును బాలించెను. ఆంగ్లేయులవలన నుపకార ధనముఁ బొందినవారిలో నీతఁడు రెండవవాఁడు. అవివాహితుఁడుగ నీతఁడు 1831–వ వత్సరమున మరణించుటవలన సంస్థానము తన యన్న వంశమునకుఁ జేరిపోయెను.

**తిరుమలదేవరాజు**

నరసింహరాజు కూఁతురగు కేశవమ్మకుఁ దిరుమలదేవరాజను కుమారుఁడును, లక్ష్మీదేవమ్మ యను కూఁతురును గలిగిరి. వీరవేంకటపతి యనంతరము తిరుమలదేవరాజు 1831–వ వత్సరమున సంస్థానమునకు వచ్చెను. ఉపకారధనముఁ బొందినవారిలో నీతఁడు మూఁడవవాఁడు. ఈతనికి వెంకమ్మ, నరసింగమ్మ, లక్ష్మీదేవమ్మ, శంకరమ్మ యని నలుగురు భార్యలు. వారిలో వెంకమ్మవలన వేంకటరామరాజును, నరసింగమ్మవలన వెంకమ్మయు, లక్ష్మీదేవమ్మ

వలనఁ గృష్ణదేవరాయలును, శంకరమ్మవలనఁ గృష్ణమ్మయుఁ గలిగిరి. ఈతఁడు 1866-వ వత్సరమునఁ గాలధర్మము నొందెను.

వేంకటరామరాజు

తిరుమలదేవరాజు మరణించిన పిదప, నాతని జ్యేష్ఠతనయుఁడు వేంకటరామరాజు 1866-వ వత్సరమున సింహాసనమలంకరించెను. ఉపకారధనముఁ బొందినవారిలో నీతఁడు నాల్గవవాఁడు. 1871 లో మృతినొందెను.

కృష్ణదేవరాయలు

వేంకటరామరాజు పుత్త్రసంతానములేక మరణించుటవలన నాతని తమ్ముఁడు కృష్ణదేవరాయలు 1871-వ వత్సరమున నానెగొంది సంస్థానరత్నసింహాసనాధ్యాసియయ్యెను. ఉపకారధనముఁ బొందినవారిలో నీతఁడైదవవాఁడు.

ఈతఁడు కుమారరాఘవరాజు కొమార్తెయైన కుప్పమ్మను, ఒబళపతిరాజు తనయయగు ఇజ్జమ్మను బరిణయమయి, సంతానము లేక, 1872-వ వత్సరమున జీవయాత్రఁ జాలించెను.

బ్రిటిషుప్రభుత్వమువా రీసంస్థానాధీశ్వరుల కిచ్చుచుండిన యుపకారధనమును గృష్ణదేవరాయలు చనిపోయిన పిమ్మట, నీతని మేనత్తకొమారుఁడైన పెద్దనరసింహరాజున కొసఁగిరి. పెద్దనరసింహరాజు 1883-వ వత్సరమున మరణించెను. నాఁటినుండియు నాంగ్లేయు లీసంస్థానమున కొసఁగుచుండిన యుపకారధనమిచ్చుట మానివైచి, కృష్ణదేవరాయల భార్యలగు కుప్పమ్మ యిజ్జమ్మల మనువృత్తికి మాసమునకుఁ జెటి యేఁబది రూప్యములు మాత్ర మిచ్చుచుండిరి.

కృష్ణదేవరాయలు మరణించినది మొదలాతని జ్యేష్ఠభార్యయగు కుప్పమ్మ పట్టమునకు వచ్చువఱకును నరపతిసంస్థానాధిపత్యము నైజాము ప్రభుత్వమువారి చేతులలో నుండెను.

## కుప్పమ్మరాణి

కుప్పమ్మ 1886–వ వత్సరమునఁ (1305 హిజ్‌రి, 21 రబి ఉస్సాని) బట్టమునకు వచ్చెను. వచ్చిన వెంటనే, దూరదృష్టిగల యిల్లాలగుటవలన, సంస్థానమన్యాక్రాంతముగాకుండఁ జేయవలయు నని సంకల్పించి, తన సోదరుఁడైన పంపాపతిరాజును సర్వజిత్తు సంవత్సర ఫాల్గున బహుళ సప్తమి భానువాసరమున దత్తుతీసి కొనెను.

ఈమె సకలసద్గుణసంపన్న. తాలిమిని భూదేవి. దానమున నన్నపూర్ణ. దయామతి. ఆడితప్పని యిల్లాలు. పరోపకారబుద్ధిగల తల్లి. ప్రజలను బిడ్డలవలెఁ గాపాడుమాత. దైవభక్తితత్పరురాలు. అనుదినము ప్రాతఃకాలమున లేచినతోడనే కాల్యకృత్యముల నిర్వర్తించుకొని, స్వయముగఁ బుష్పహారములుగూర్చి, శ్రీ వేంకటాచల పతికి సమర్పించి, యా దివ్యమంగళ విగ్రహునిఁ గనులారఁ గాంచి యానందించును. ఇంతటి వృద్ధత్వమున సహిత మీ తల్లి భగవత్సేవ నత్యంత ప్రీతితోఁ జలుపుట యాశ్చర్యము!

ఈమె రాజ్యమునకు వచ్చినతోడనే, పరిపాలనా విధానమును సంస్కరించెను. సంస్థానము చిన్నదైనను, రాఁబడి కొంచెమైనను, స్వలాభము నపేక్షింపక, ప్రజలక్షేమమునకై పాటుపడునది యీ దొడ్డయిల్లాలు. ఈమె కాలముననే యీ సంస్థానమువారు నైజాము ప్రభుత్వమువారికి సంవత్సరమునకుఁ బదివేల రూప్యములు పేష్కష్ చెల్లించులాగున నేర్పడినది.

### శ్రీరంగదేవరాయలు

కుప్పమ్మరాణిగారి యనుమతిని నామె దత్తపుత్త్రుఁడైన పంపాపతిరాజు 'శ్రీరంగదేవరాయ' లను నామమున 1902–వ వత్సరమున నానెగొంది సింహాసన మలంకరించెను.

ఈతఁడు సోదరినిఁ బోలిన సద్గుణసంపన్నుఁడు. మితభాషి.

సాధుశీలుఁడు. దయామయుఁడు. యాచకులపాలిటి కల్పతరువు. ఆంధ్రభాషాభిమాని. 1915-వ వత్సరమున బళ్ళారిలో జరిగిన యాంధ్రసాహిత్య పరిషత్తున కధ్యక్షతవహించి, యాంధ్రుల మన్ననకుఁ బాత్రుఁడైనవాఁడు. విజయనగరసామ్రాజ్య శిథిలభాగముల దర్శించి, యందలి చారిత్రకవిషయములఁ బరిశోధింప నేతెంచెడి చరిత్రకారులఁ బ్రీతితో నాదరించి, చేయూఁతయొసఁగిన మహానీయుఁడు. 1911, డిసెంబరు 12-వ తేది ఢిల్లీపట్టణమున జరిగిన శ్రీ పంచమజార్జి సార్వభౌముని పట్టాభిషేక మహోత్సవమునకేఁగి, మన్ననలందినవాఁడు.

శ్రీరంగదేవరాయలు రాజ్యమునకువచ్చిన పిదపఁ, దనకు రావలసిన యుపకారధనమును గూర్చి బ్రిటిషుప్రభుత్వమువారితో వ్యవహారము జరుప, మొదట వారొసఁగుచుండిన మొత్తమునుండి చాలభాగము తగ్గించి, నెల కైదువందల రూప్యములుమాత్ర మిచ్చునట్లుత్తరువును 1902-వ వత్సరమున నొసఁగిరి.

శ్రీరంగదేవరాయలు 1918-వ వత్సరమునఁ దనభౌతికదేహమును జాలించెను.

నాఁటినుండియుఁ గుప్పమ్మరాణి మరల సంస్థానాధిపత్యము వహించి పాలించెను. ఆమెకు మాసమున కైదువందల యేఁబది రూప్యము లుపకారధనము బ్రిటిషుప్రభుత్వము వారివలన వచ్చుచుండెను.

శ్రీరంగదేవరాయల ధర్మపత్ని నరసింగమ్మ. ఆమెకు శాంతకృష్ణమ్మ, తిరుమలకొండమ్మయను కొమార్తెలును, శ్రీకృష్ణదేవరాయలు, తిరుమలదేవరాయలు, వీరవేంకటదేవరాయలునను కొడుకులునుగలిగిరి. శాంతకృష్ణమ్మ మాలవరాజురామరాజును వివాహమై తిమ్మప్పయరాజను తనయునిఁగాంచెను. తిరుమలకొండమ్మ వేంకటసింహాద్రిజగపతిరాజును బరిణయమై వేంకటసూర్యనారాయణ జగ

పతిరాజ వర్మను గనెను. శ్రీకృష్ణదేవరాయల యర్ధాంగి లాల్‌కుమారీ బాయి; ఈమెకు సంతానము లేదు. తిరుమల దేవరాయల సతి రాజేంద్రకుమారీబాయి. ఈమెకు రామదేవరాయాలు, హరిహర దేవరాయలు నను నిరువురు కొడుకులు. వీర వేంకట దేవరాయల పత్ని లక్ష్మీదేవమ్మ. ఈమెకు అచ్యుత దేవరాయలు, శ్రీరంగ దేవరాయలు, నరసింహ దేవరాయలు, రఘు దేవరాయలు నను నలుగురు కొడుకులు.

శ్రీకృష్ణ దేవరాయలు

ఈతఁడు శ్రీ పంచమజార్జి చక్రవర్తి పట్టాభిషేకమహోత్సవ దినమున జనించుటఁ జేసి యీతనికి 'దర్బార్' శ్రీకృష్ణదేవరాయలను వ్యవహార నామము గలిగెను. కుప్పమ్మరాణి మరణించిన పిదప, శ్రీకృష్ణదేవరాయ లానెగొంది సింహాసన మలంకరించెను. ఈతఁ డుదారహృదయుఁడు, ఆంధ్రకర్ణాటక భాషాభిమాని. పండితాదరణ పరుఁడు. రాజ్యకార్య నిర్వహణ దక్షుఁడు.

1949-వ వత్సరమున నానెగొంది యందలి ప్రభుత్వ కార్య స్థానములన్నియు నెత్తివేయఁబడెను.